# అంకితము

రాజమార్గాలలో మేళతాళాలతో సాగిపోవుట ప్రతిపౌరుని జన్మహక్కని స్థాపించుటకు 25 ఏండ్లనాడు నెల్లూరు హిందువులు పైకెగసి, పోలీసు తుపాకిగుండుతో శాంతించినాడు. మదరాసు హైకోర్టు ఈ హక్కును ప్రసాదించినా, ఏటేటా 144 శిక్షణతో, నసఎత్తిన వుత్సాహం కమలిపొయ్యేది.

1941 శరన్నవరాత్రోత్సవాలు వచ్చినవి।

ప్రభుత్వం మొదట ఆశలజూపి, చివరకు కాదన్నది. వూర్లో అల్లరులు రేగినవి — కాల్పులు జరిగినవి.

కన్య నరసమ్మ తరుణ జీవనపుష్పం కాల్చివేయబడింది.

హిందూజాతివన వసంతలక్ష్మికి నరసమ్మ నిరపరాధరుధిరం దోహదమైంది.

కార్యోత్సాహి - త్యాగి - నిర్భయవిహారి

పైడా సుబ్బరామయ్య

హిందూమధుమాస వనానికి చక్కటి తోటమాలియై, తీర్చి, పునర్వికసన శక్తినిగూర్చి, హిందూజాతి విస్మృత నిద్రిత పౌరుషాన్ని రేకెత్తించినాడు

రక్తరుతువు ప్రారంభమైంది - త్యాగయజ్ఞాగ్నిలో కాగి, తేజోమూర్తులైన సింహపురహిందువులు అఖిలహిందూజాతి అభినందనాక్షతలకు పాత్రీకరింపబడినారు.

వైశ్యకులంలో బుట్టిన సుబ్బారామయ్య - వీరగుణానికి విజయ నాయకత్వానికి స్మారక చిహ్నమైనాడు.

హిందూజాతి వున్నంతవరకు - మన సంస్కృతి నిలచియున్నంతవరకు - వీరచరితలకు స్థానమున్నంతవరకు అనంతహిందూవ్యోమమండలంలో యీయన ఒక దీప్తతారగా ప్రకాశింపగలడు.

ఇది—అట్టి సుబ్బరామయ్యకీర్తికి కర్పూర నీరాంజనము।

—ఆయన త్యాగమండిత భ్రుకుటికి వీరకుంకుమ।

—అనువాదకుడు.

This book HINDU-PAD-PADSHAHI. in Telugu is a free-translation of the English book of the same name by Swatantrya Veer V. D. Savarkar. We are very much indebted to Sri Savarkar Ji for granting us the necessary permission to bring out the Telugu version.

Our thanks are due to the translator Sri. Marupuru Kothandarama Reddy Garu for rendering the spirited English original into such emotional and high standard Telugu, and to Sri. Parasarm Jethanand Ji but for whose encouragement it would have been impossiblo for us to bring out this book.

Perambur

2-5-1945

Editors

# విషయసూచిక

## ప్రథమఖండము

### చరిత్ర యథార్థ రూపావలోకనము



# సావర్కార్ జీవిత లేశము

విప్లవబ్రహ్మ - కర్మయోగి - బారిష్టర్ వినాయక దామోదర సావర్‌కర్ 28-5-1883 నాడు భాగూరునందు చిత్‌పవన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినాడు. తేజోనిధికి వయస్సు కారణం కాదన్నట్లు, 10 వ ఏటనే మతకలహాలలో పాల్గొని, తోడిబాలురతో ఒక మసీదును ముట్టడించి స్వాధీనం చేసుకొన్నాడు. అదిమొదలు మాతృదేశాన్ని పూజించి, తనవధ్యశిలను తన తలమీద బెట్టుకొని సదా మోస్తుండినాడు. మొదట తాను హిందువని గర్వించినాడు. వివాహితుడు. ఇప్పుడు ఒక కుమారుడు ఒక కూతురు గలరు.

కార్యవ్యగ్రమైన యీయన పుత్సాహశక్తి అగ్నిపర్వత జృంభణ సన్నిభము. పూనా ఫెర్‌గూసన్ కళాశాలలో మకుటహీన మహానాయకుడు. అభినవ భారతీ సమితి చేత, శివాజీ గణపతి ఉత్సవాలు జరిపించినాడు. 1905 విదేశ వస్త్ర

బహిష్కరణ లేవదీసి, లోకమాన్యతిలకు మన్ననల బొందినాడు; గాంధీజీకిముందే విదేశవస్తు దహనకాంతిలో దేశాన్ని వెలుగొందజేసినాడు. ఒక ప్లేగు ఉద్యోగిని హత్యజేసిన ఛప్‌హేకరు - త్యాగి, దేశభక్తుడని చాట ప్రభుత్వదృష్టిని రోష కషాయకాంతిగ జేసినాడు.

ఈ కవి - వక్త తనగీతాలలో పూర్వీకుల వీరస్మృతిని కొనియాడి తన "విహారి" పత్రికద్వారా మోడుల చిగిరింప జేసినాడు. 1906 లో శ్యాంజి కృష్ణ వర్మ సహాయంతో బారిష్టరు పరీక్షకు ఇంగ్లండు చేరినాడు. అచట తరుణభారతానికి నాయకుడు. 1857 శిపాయి కలహవర్థంతిని దొరలుచేయగా, వీరి బృందము వారు బలిదాతలని చాటి ఆలజడిని గూర్చినారు.

లండనులో ఒక విజయదశమినాడు - "స్వరాజ్యంవస్తే సావర్‌కర్‌మూలాన రావాల" అని గాంధీజీచేత ప్రశంస నొందినాడు. 1909 లో కర్జన్ విల్లీని చంపిన మదనలాల్ డింగ్రా చర్యను ఖండించే సభలో, అసహాయ ఏకాకిగా స్వతంత్ర వాణితో ధిక్కరించి, న్యాయసూత్రాల ప్రవచించి, సురేంద్రనాథ బెనర్జీ ఆదరాన్ని బడసి, టైమ్సు - మ్యాన్‌చెష్టర్ గార్డియన్ పత్రికలచే కీర్తింపబడినాడు.

అస్వస్థతకై, ప్యారీ నగరంలో క్యామసతీమణి ఆశ్రయంలో సేదదీర్చు కొంటూ, మిత్రులువద్దన్నను లండన్‌చేరి నాసిక - కలెక్టరు జాన్‌సన్ హత్యను ప్రోద్బలపరచినాడని 13-3-1910 లో అరెస్టు చేయబడి హిందూదేశానికి పంప బడినాడు.

ఫరాసు దక్షిణతీర పట్టణం - మార్సేలు నౌకాశ్రయంలో రహస్యంగా స్టీమరునుండి దూకి, యీది, ఫరాసు గడ్డచేరి, మరల బంధింపబడి, హేగు అంత ర్జాతీయ న్యాయస్థానాల పునాదుల పుర్రూత లూగించినాడు. 15-10-1910 బొంబా యిలో 50 ఏండ్ల ద్వీపాంతరవాస శిక్ష విధింపబడి, అండమాను దీవులకు పంపబడినాడు.

అచట, మృత్యుసన్నిధిలో వుండిగూడ, హిందువులను ఇస్లాంలోకి కలుపు కొనుచుండిన తోడి నిర్బంధితుల నిరోధించి వారిచేత చావుదెబ్బలు తిన్నాడు.

కవిత్వంవ్రాసి, విడుదల కానున్నవారికి కంఠోపాటంగాచెప్పి, తన సందేశాల మన దేశానికి అందజేసేవాడు.

1924 లో సోదరుడు గణేశునితో మనదేశానికి కొనిరాబడి, రత్నగిరిలో ప్రవాసముంచబడినాడు. అచట హరిజనసేవకై పతితపావన సర్వ హిందూదేవాలయాన్ని నిర్మింపజేసినాడు. భాషాసేవకు కడంగి, మహారాష్ట్రభాషలో అన్యదేశ్య పదాలు వుండరాదని తీవ్ర పరిశ్రమజేసి, టీని - శుష్క హరిత్తృణ కషాయ దుగ్ధ మిశ్రిత సశర్కర వుష్ణోదక పానీయం - అని పిలిచి నవ్యపంథాలద్రొక్కినాడు. వీరు సంస్కరించిన లిపే యిప్పుడు మహారాష్ట్రంలో వాడుకలోవున్నది. 'ఉషాఃప' '1857 స్వాతంత్ర్యయుద్ధము' మొదలైన గ్రంథాలు వ్రాసినారు.

1937 లో విడుదలై హిందూ మహాసభాధ్యక్షుడైనాడు. అదిమొదలు హిందూమహాసభ బలయుతమై జిన్నాకు ప్రతిఘోష అయింది.

28-5-1943 లో షష్టిపూర్తి మహోత్సవం.

సావర్కర్

# తొలినుడి

గతము అనుక్షణము మనకు దూరతమై మహావేగంతో వెనుకకు పోవు చున్నప్పటికిన్ని, రాజవాడె అనుయాయులైన కొందరు మహారాష్ట్ర విద్వద్బృంద అజేయకార్యదీక్షవల్ల మహారాష్ట్ర హిందూసామ్రాజ్య చరిత్రపై ఒకక్రొత్త కాంతి వెల్లువ ప్రవహించినది. దీనివల్ల విజాతీయ పాండిత్యమనే కాంతిహీన, ఛిన్నాభిన్న సులోచనాలతో వేరు గత్యంతరము లేనందున చూచి తృప్తిపడుచుండిన వారి కంటె నేడు మనము ఆ ఘనతర మహారాష్ట్ర ఉద్యమ విస్పష్ట విలక్షణాంశాలను ప్రస్ఫుటంగా కనుగొన గలుగుచున్నాము. అయితే, మహారాష్ట్రపండితులు యిటీవల సేకరించిన పత్రాలు, లేఖలు, గీతాలు మొదలైన శాశ్వత విషయపరిశోధనలు ఒక్క మహారాష్ట్ర భాషయందుమాత్రమే వుండుటచేతను, న్యాయమూర్తి రానడే గారి ప్రయత్నంవినా, యితరత్రా యీ వినూత్న విషయదృష్టితో మహారాష్ట్ర చరిత్రను మహారాష్ట్రేతరులకు తెలియజేయు ప్రయత్నముగా నైనను జరుగక పోయినందున, విదేశీయులసంగతి అటుండనిచ్చి, భారతీయులకే, యీ మహారాష్ట్ర ఉద్యమాన్ని ఉజ్జీవింపజేసిన క్షాత్రధర్మాలు, యావద్భారత ప్రజానీక విపులచరిత్ర మార్గానికి యిది కలుగజేసిన ఫలప్రదమైన ప్రాబల్యము మలినమై వింతయై రూప వైకల్యంతో కాన్పిస్తున్నవి. ఈ నూతన దృక్పథముతో యీ చరిత్రను విపులముగా, ప్రజ్ఞాపూర్ణముగా వ్రాసిన సర్వతోముఖ గ్రంథము యింతవరకు లేనందున, ముమ్ముందు రాబొయ్యే విపులచరిత్రకు ప్రాతిపదికంగా, మార్గదర్శికంగా కేవల చారిత్రకరేఖా మాత్రమైన ఒక చిన్న పుస్తకాన్ని వ్రాయాలని చాలాకాలంగా మేము ఆశిస్తుండినాము. యీ ఉద్యమము ప్రసాదింపవచ్చిన ఉజ్జ్వల సందేశాన్ని, అది పరిపాలింపవచ్చిన మహత్తర ఆదర్శాన్ని యీ చిన్నపుస్తకం మహారాష్ట్రేతరులకు ఎరుకపరచగలదని మా విశ్వాసము. 1910 లో శిక్కుల చరిత్రనువ్రాసి

పూర్తిచేయగానే ఇంగ్లీషులో మహారాష్ట్ర చరిత్రను వ్రాయను ప్రారంభించినాము. కాని, విప్లవ సమర తీవ్రఘాతాలవల్ల యీ వ్రాతకు పురిటిదోషముకొట్టిపోయింది.

అప్పుడే, ఆసన్న ఘనతరక్లిష్ట ధర్మాలు, అండమానుదీవుల విజనగుహాంతరాలలో, మృత్యువుధ్వాంతములతోడి భయదయుద్ధానికి మమ్ము ఉన్ముఖులజేసినవి. దీనితో బ్రతికి బయటబడి మేము యీ ప్రేమమయసేవలో పాల్గొనగలమను ఆశే ఎగురగొట్టివేయబడింది.

చివరకు, మాకు స్వాతంత్ర్యమును ప్రసాదించుటకు భగవానునికి అనుగ్రహము గలిగి, మరల లేఖినిని ఎత్తివ్రాయుటకు శక్తిని యిచ్చినారు. అందువల్లనే నేడు, 17, 18 శతాబ్దములలో ధైర్యసాహసోపేతంగాపోరి, మన హిందూజాతి గౌరవ ప్రతిష్ఠలను నెలకొల్పి, మనజాతి గళిత స్వాతంత్ర్యమును మరల మనకు ఒసంగిన తేజోమూర్తులైన మన ప్రపితామహుల ఘనతరాదర్శములకు యీపాటి వినయపూర్ణప్రేమ కానుకను అర్పింప గలుగుచున్నాము.

రాజపుత్ర - సిక్కు - మరాఠ - మద్రాసు సమరాలు కేవలము స్థానిక రాష్ట్రీయ ఉద్యమాలైనా, వీటి ఫలితాలు సర్వహిందూజాతి సమష్టిచరిత్రపై వాటి ఆధిక్యతను తప్పకా ప్రతిబింబింపజేస్తవి. ఒకశాఖ సాధించిన కార్యము, సంపూర్ణ జాతియొక్క నిగూఢ శక్తిసామర్థ్యములను ప్రకటించితీరుతుంది. ఈ కారణమే కాదు - ప్రస్తుతము చర్చనీయాంశమైన మహారాష్ట్రోద్యమము, ఉద్దేశపూర్వకముగాను, విస్పష్టంగాను, స్థానికోద్యమ సీమాంతముల దాటుటచేత అది అఖిల హిందూ ఉద్యమ గురుత్వమునకు అర్హమై, తదనుగుణ్యమైన ఆధిక్యవిచారణలకు పాత్రమౌతున్నది. నిజానికి, అఖండ హిందూదృష్టితో దీన్ని చూస్తేనేతప్ప దీని ప్రాముఖ్యమును బొత్తిగా మనము గుర్తించలేము. కాబట్టి ముఖ్యంగా మహారాష్ట్రేతరులకే ఉద్దేశింపబడిన యీ విమర్శక గ్రంథమును వ్రాయుటలో మా ముఖ్యోద్దేశము:—హిందూచరిత్రానుగుణ్యముగా యీ మహారాష్ట్ర ఉద్యమ విలువను నిర్ణయించి తెలియపరచుటే; కాబట్టి యీ పుస్తకము మహారాష్ట్ర హిందూ సామ్రాజ్య కథను కూలంకషముగా వర్ణించుటకు పూనుకొనలేదు కాని, దాన్ని

ప్రేరేచి సజీవంగాచేసిన ఉదాత్త ఆదర్శాల, ఆ ధర్మాలమాత్రం పేర్కొనగలదు. అయినప్పటికిన్నీ, రెండవభాగంలో నెలకొల్పబడిన సిద్ధాంతాలను రుజువుచేయుటకు అత్యవసరమని మాకుతోచిన - పరస్పర సంబంధముగల విషయాలను జతపరచి, మహారాష్ట్ర చరిత్రను తెంపులేనివిధంలో సూక్ష్మంగా మొదటిభాగంలో వర్ణించివున్నాము. మహారాష్ట్రేతరులకు శివాజీ జీవితాంశాలు బాగా తెలిసియున్నవి. ఆటుతర్వాత రాజారాం మరణంమొదలు సాహూ పునరాగమనంవరకు గల మహారాష్ట్ర గాథాంశాల సందేశమును - వాటి అంతర్గత నైతికశోభను రానడేగారి "మహారాష్ట్రాధికార విజృంభణము" అనే పుస్తకము లోకులకు వెదజల్లియున్నది. ఇక మేము ఆ భాగాలను స్థాలీపులీకంగా తడవి, తర్వాత చరిత్రనే ప్రధానంగా వర్ణించినాము.

మన హిందూసామ్రాజ్య ప్రాభవ పతనాలగాథ హిందూజాతికి ఒసంగనున్న మహోజ్జ్వల సందేశము యీ పుస్తకం ప్రతిపుటలో సజీవతేజంలో వెలుగుతున్నది. కాబట్టి దానిని మన హిందూ సోదరులకు ప్రత్యేకముగ ఎత్తిచూపవలసిన అవసరములేదు.

ఇక మహమ్మదీయ పాఠకులకు మాత్రం మా ఆశయాన్ని విశదీకరించుటకు ఒకమాట చెప్పవలసివున్నది. తాను వర్ణింపదలచుకొనిన కార్యాల నెరవేర్చిన పాత్రలయొక్క భావాల, ఉద్దేశాల, చేష్టల, ఉద్రేకాలను మాత్రమే సాధ్యమైనంతవరకు చిత్రించుటే చరిత్రకారుని మొదటిపని. తాత్కాలికంగా, ఇంతకుముందే తనకేర్పడిన పాత అభిప్రాయాల, విరాగవిద్వేషాలనే గాకుండా, గతచరిత్రా ఫలితాలు వర్తమాన ఆశయాలపై ఎట్టి సంఘర్షణల కలిగించునో అన్నభయాన్ని గూడ విడనాడితేనేగాని, చరిత్రకథనము యథార్థముగా—రమ్యంగా నెరవేరజాలదు. ఇది చేయునప్పుడు గత సన్నివేశాలను. వాటి ఉద్దేశాలను, ఘనపరచుటో-క్రిందుపరచుటో అనృతపరచుటో కాని మార్గాన నడిపింప యత్నించవలసివుంటుంది. ఉదాహరణానికి:-మహమ్మదు జీవితాన్ని వ్రాయునతడు—ఆ అరబ్బీధీశాలి విగ్రహారాధనపై గావించిన నిష్ఠుర దాడిని, అవిశ్వాసకుల భయవిహ్వలుల జేసిన దారుణ

దండన వాక్యాలను మెత్తనపరచి, ముస్లిం మతేతరుల భావసరణిలో సమన్వయింప జేసి ఆత్మతృప్తిని గూర్చుకోదలచినచో అట్టి కథకుడు నిజధర్మమును నెరవేర్చిన వాడు కాజాలడు. కథకుడు ఎక్కుడు సహనమును వహించవలెను. ఇక వ్రాయ దలచుకొన్న జీవితగాథయొక్క సమన్వయపరుచరాని సమస్తసంఘటనలను యథా మాతృకంగా వర్ణించిన తర్వాత, న్యాయంగా చేయగలిగితే, ఆత్మారాధన— వాక్స్వాతంత్ర్యములు, హేతువాదములకు, సరిపోయిన ఒక నీతిని అందుండి ఎత్తిచూపవచ్చును. అతడు అట్టి కార్యమును నెరవేర్పజాలనిచో మహమ్మదు జీవితము వ్రాయుపనినే విరమించుకొనుట శ్రేయము. ఈ బాధ్యత సత్యవాదియైన మహమ్మదు జీవితకర్తపై ఎట్లు వున్నదో అట్లే, మహమ్మదు ప్రవచనములను పూర్తిగానో కొద్దిగానో విశ్వసింపని పాఠకునిపైగూడ దానికి అనుగుణమైనబాధ్యత వున్నది. ఏ మహమ్మదో—బాబరో—ఔరంగజేబో మొదలైన పూర్వీకుల చరిత్రల వ్రాయవలసిన, నిన్నటి చరిత్రకారుడు వ్రాయసకాని ధర్మానుగుణ్యంగా వారి వారి ఆశయాల—చర్యలయొక్క వివిధ నిష్ఠురసరళ ఆవేశాలను యథాస్థితంగానో లేక సహానుభూతితో మహోన్నతంగానో వర్ణించినయెడల అట్టి చరిత్రకారుడు నేటి నిజవీర ధర్మంలో కొరవడజాలడని పాఠకులు గుర్తెరుంగవలెను. అంతే కాకుండా అతడు తన స్వదేశీయులపట్ల, యితర మతవిశ్వాసకులపట్ల, యితర జాతులపట్ల గొప్ప సుహృద్భావముగూడ కలిగియుండవచ్చును. మహమ్మదీయ ప్రభుతతో, హిందూజాతి ఇహమో—పరమో, చావో—బ్రతుకో అన్న దారుణ సమరాలు సలిపిన ఆనాటి హిందూ చరిత్రను వ్రాయునప్పుడు, వారి ఉదాత్తచర్య లను దేశకాలానుగుణ్యంగా వాటి కారణాలను వర్ణించుటలో మేము ఎన్నడుగాని మా ధర్మాన్ని అనృతపరచి కళంకితము చేయలేదు. నాటి చారిత్రక పాత్రల భావోద్రేకాలను వారివారి స్వవచనాలలోనే వివరించి, మా శక్తికొలది చరిత్ర కారుని ధర్మాన్ని నెరవేర్చినాము. ఈ చారిత్రక విమర్శనము పూర్వమహమ్మ దీయులు చేసిన చర్యలపై భూరి శక్తియుత అధిక్షేపణము. ఇది ఉచితమని గూడ మా అభిప్రాయము. ఈ కారణముచేతనే వారి సంతతివారైన నేటి దేశీయ మహ

మ్మదీయ పారకులు—నేటి మహమ్మదీయ సోదరులపైన, మహమ్మదీయ జాతిపైన మాకు విరాగమును ఆరోపింపక చదువుదురుగాక ! గతస్పర్ధలు సమరాలను ఏరి తెచ్చిపెట్టుకొని యిప్పుడు మరల వాటిని సాగించుట ఆత్మవినాశకారే కాకుండా హాస్యాస్పదముకూడాను. పూర్వం—కొన్నివందల ఏండ్లనాడు శివాజీ అఫ్జుల్‌ఖానుల ఆలింగనము మరణపు పిడికిలి అయినది కాబట్టి నేడుగూడ ఉన్నట్లుండి హిందూ మహమ్మదీయులు ఆలింగన మిషతో మృత్యుబంధంలో చిక్కొనవలెననుట అవివేకము.

దేవునిపేర నైతేనేమి, పుణ్యమాతృభూమిపేర నైతేనేమి? మనిషి మనిషిని—జాతి జాతిని వేరుచేసిన పాత విద్వేషాల వివాదాల, హత్యల అత్యాచారాల మరల నేడు రేకెత్తించి కల్లోలపరచుటకు సహాయకారులైన సాకులను వెదకుటకు మాత్రమే మనము చరిత్రను చదువక దీనికి భిన్నమైన ఫలితము కోరేదానిని చదువవలసివున్నది. చరిత్రపరిత, ఆ విద్వేష వివాదాల బీజకారణాల కనుగొని, ఆహత్యా ఋతువును, స్పర్ధకాండను తొలగించగలిగిన విధానాన్ని వెదకి, సర్వ మానవులు సర్వభూతజనకుడు ఆ సర్వేశ్వరుని పుత్రులని సర్వజనీన భూమాత వక్షాన లాలింపబడిన శిశువులని, తోడిమానవునికి మరియొక మానవుడు సన్నిహితుడు అగునట్లు చేయవలసివున్నది. సర్వమానవజాతిని ఒకే ప్రపంచముగా కరచుకొని పోవునట్లు చేయవలసివున్నది.

అయితే, చరమ లక్ష్యమైన యీ ఆశయొక్క దుర్నిరీక్షతేజము మనల అంధులజేసి, మానవులు—సంఘాలు ఒకపెద్ద సాంఘిక సంస్థగా స్థిరపడుటకుముందు. సృష్టిదారుణ శాసనప్రకారం — యుద్ధమనే కమ్మరిడాకలిమీద త్యాగము—స్పర్ధ అనెడి సమ్మెటపోటులు వల్లనే జాతులు అతుకుకొనిపోగలవు అన్న సత్వర ప్రత్యక్ష ఘనతర సత్యాన్ని గుర్తెరుగకుండరాదు. ఈ భయంకర పరీక్షకు నిలువగలిగిన జాతులే శారీరక—నైతిక అర్హతనుపొంది, యీ ప్రపంచములో మనగలిగియుంటవి. కాబట్టి ఐక్యతను స్థాపించేదానికి ముందు ఒకప్రత్యేక జాతీయ, సాంఘిక మానవసంస్థ ఉనికినిగూడ మన్నింపవలెను. మహమ్మదీయులు

అధికారంతో సాగించిన భీభత్ససమరాలలో హిందువులు ఇట్టి దారుణ పరీక్షనే ఎదుర్కొనవలసివచ్చినది. బానిస—యజమానులమధ్య గౌరవప్రదమైన ఐక్యత వుండజాలదు. తమజాతికి తమదేశానికి చేసిన అత్యాచారాలకు ప్రతీకారముచేయను హిందూజాతి విజృంభించి నిజబాహుశక్తిని ప్రకటించలేకపోయియుండినచో, మహమ్మదీయులు శాంతి మిత్రహస్తాన్ని చాచివుండినప్పటికీగూడ దానిగ్రహించుట అనుచిత అపకీర్తి చర్యయై యుండును గాని అది మిత్రత్వము కాజాలదు. సమత్వముపెంచే ఆవేశము, విశ్వాసము, అకళంకతలతో హిందువులు ఆహస్తాన్ని సగర్వంగా అప్పుడు గ్రహించియుండజాలరు. హిందువులు తమదేవత, తమదేశముల పేర తమ విరోధులతో నెరపిన ఆ ప్రచండదారుణయుద్ధాలే, కలహించుకొనుచుండిన ఆ రెండు మహాశక్తులమధ్య ఒక గౌరవప్రదమైన ఐక్యతకు దారిచూపినవి. కాబట్టే మేముప్రాసిన 1857 నాటి జాతీయవిప్లవచరిత్రలో—హిందూ హరిభక్తసేనానివహము విజయోత్సాహంతో ఢిల్లీనగరము ప్రవేశించిన ఆ దినమే, ముస్లిం సింహపీఠము—కిరీటము—ధ్వజము తునియలై ధూళిలో దొర్లి భావుసాహెబు, విశ్వాసరావుల పాదతలమున చేరిన 1761 సంవత్సరపు ఆదినమే హిందూ మహమ్మదీయుల మధ్య గౌరవప్రదమైన సఖ్యతకు అవకాశము కలిగినది" అని అన్నాము. ఎందుకంటే—హిందువులు తమ స్వాతంత్ర్యమును తిరుగ పొందిన ఆనాడే, యీ ప్రపంచములో గౌరవప్రదంగా తోడిజాతులతో నివసించుటకు అవసరమైన శారీరక శక్తినిగూడ హిందూజాతి వెల్లడించినది. విజయివిజయించినారు. అప్పుడు అతడు కాంక్షించిన, నిజదేశీయుడుగా—హితుడుగా గౌరవప్రదంగా ఆలింగనము చేసికొని యుండవచ్చును. ఈ దృష్టితోచూస్తే, మహారాష్ట్రులచరిత్ర హిందూ మహమ్మదీయులమధ్య యథార్థమైన, గౌరవప్రదమైన సఖ్యతకు అవరోధము కల్పించేదానికి బదులు, నిష్కాపట్యమైన శాశ్వత ఐక్యతకు, యితరమార్గాలకంటె ఎక్కువ సహాయకారి అగుచున్నది. కాబట్టి హిందూ మహమ్మదీయ దేశారాధకుల దృష్టికి దీనిని కొనివచ్చుటకు అత్యంతము తగివున్నది. ఇది అటు మృషాధిక్యుల డంబవాదాన్ని తప్పక ఉపశమింపజేస్తుంది. ఇటు ఆత్మ అవిశ్వాసకుల విశ్వాసమును ప్రకోపింపజేస్తుంది.

ఇందు వర్ణింపబడిన—ఒకజాతి తన న్యాయయుత మానవహక్కులను రక్షించుకొనుటకు సాయుధపాణియై విజృంభించిన గభీరదృశ్య కథనము, మానవ స్వేచ్ఛ జాతీయస్వాతంత్ర్యముల పక్షమువహించిన ఒక ఉద్యమగాథ. శివాజీ, బాజీరావు, భావుసాహెబు, జంకోజీ, నానా, మాధవ్‌జీ సింధియా, రామదాసు, మోరోపంతు మొదలగాగల వీరసింహుల—రాజకీయవేత్తల—రాజ్యనిర్మాతల — యోధుల—కవుల—గాయకుల కార్యక్షేత్రాని దింపిన ఒక కార్యచరణ వర్ణనము అన్యసాధారణ పాఠకునికిగూడ తీరని ఆసక్తిని కలిగించకపోవు.

షిర్‌గోన్ — వినాయకరావు దామోదర సావర్కర్

15 ఫిబ్రవరి 1925

# అనువాదకుని మాట

సావర్కర్‌గారి యీ జీవపుస్తకం తెలుగువారి కిందజేయడం నాకు అత్యంతం నచ్చినసేవ.

మహారాష్ట్రి దేశీయుడు తనదేశగౌరవానికి వర్మతేజాన్నిగూర్చి దానిద్వారా అఖిలహిందూజాతి గౌరవానికి సానలుదీర్చినాడు. మేలే! మొదట శివాజీ ఉద్యమాన్ని లేవదీసిన లోకమాన్యతిలకు హిందూసభ నాయకులు మహారాష్ట్రులే కావడంవల్ల మహారాష్ట్రవీరులే హిందుధర్మ రక్షకులైనారు—ఇతరహిందూ మహాపురుషులు విస్మృతిని జెందినారు.

దక్షిణాపథంలో మొదటి తురుష్క వుప్పెనకు చెలియలికట్ట అయినది ఓరుగంటి కాకతీయులు—

ఆతర్వాత హిందూ ధర్మరక్షణకు—హిందూ సంస్కృతిరక్షణకు అవతారపురుషునివలె జన్మించిన విద్యారణ్యులవారు—వారు స్థాపించిన విజయనగర సామ్రాజ్యము—దానిని పెంచిన తెనుగుకండ కృష్ణాంశసంభూతులు కృష్ణరాయలు తురుష్కధాటిని అరికట్టి వింధ్యకావలకు తిరుగగొట్టి దక్షిణదేశాన్ని రక్షించినారు. వీరులేకున్న దక్షిణదేశం మరియొక పెషావర్ పరగణా అయియుండును. దీనితర్వాత ఒక శతాబ్దమునకు మహారాష్ట్రి విజృంభణము—విజయనగరముతోవన పునహా నడచింది. ఈ విషయాన్ని లోకమాన్య తిలకు మహాశయులు—పూర్వం మదరాసు నగరంలో విద్యారణ్యులు—రామదాసుగా, రాయలు—శివాజిగా, తిమ్మరసు—బాజీరావుగా ధర్మగ్లాని జరిగిన ఆ తరుణంలో మరల అవతరించినారేమో! ఈ ఆదిమజ్యోతులు ఆంధ్రులు కాబట్టి పొగబట్టి పోలేదుకదా.

సావర్కర్ పుణ్యాన—రాయప్రోలు సుబ్బరావు చావలేదన్న ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్రను, నవ్యదృక్పథంతో వెలయించి, లోకానికి చాటుదురుగాక.

ఈపుణ్యసేవకు యీ అనువాదం పెద్దలను పురికొల్పగలిగితే కృతకృత్యుడ.

నెల్లూరు
16 ఏప్రిల్ 1945

మరుపూరు కోదండరామరెడ్డి

# హిందూ–పద్–పాదషాహి

## 1. నూత్న శకము

"స్వధర్మరాజ్య వృద్ధికరణే
తుంహి సుపుత్ర నిర్మాణ ఆహా."

**శాహాజి శివాజికి వ్రాసిన లేఖ.**

శివాజి జననమొందినది 1627 సంవత్సరంలో. ఆ జన్మకారణంగా, ఆ సంవత్సరం ఒక నూతన శకానికి ఆదియగుట దైవనిర్దిష్టము. శివాజి పుట్టుటకుముందు, వందలాది వీరపురుషులు, మహమ్మదీయ శత్రుచమూ ధాటిని నిరోధించుటకు, హిందూజాతి గౌరవాన్ని రక్షించుటకు పోరి, ఆత్మార్పణము గావించియున్నారు. సాహసోపేతంగా పోరి పరాభూతులై యుద్ధభూమిలో మరణించిన పూర్వ ఆత్మబలిదాతలు - వీరులవలెనే పోరిన శివాజి జయలక్ష్మిని గ్రహింప నిర్దిష్టుడైనాడు. శివాజీ సృజించిన విజయ తరంగము పోను పోను బలవత్తరమై, తన శిరముపై హిందూకేతన మును వహించి కీర్తినుండి కీర్తికి, జయమునుండి జయమునకు ఒక నూరేండ్లుపాటు గొనిపోయినది. మహమ్మదు గజనీ సాయుధబలాన్ని అనుగమించిన మహమ్మదీయ వుప్పెన, నిర్నిరోధ శక్తితో పొంగి ప్రవ హించి సమస్త హిందూస్థానాన్ని ముంచివేసింది. అందుండి తల పైకెత్తిన వారిలో శివాజి ప్రథముడు. లేచి ఆయన నిష్ఠుర మహారాష్ట్రవాణితో— "ఇంతే—ఇకముందుకు సాగనీయను" అని పలికినాడు. 1627 సంవత్సర

మునకు ముందు, శివాజి రాజకీయరంగంలో ప్రత్యక్షమగునంతవరకు, ఆహిమాద్రి సాగరపర్యంత భూమిలో, మహమ్మదీయ బలాన్ని హిందువులు ఎదిరించినచోట్లనంతా హిందూవులు తప్పక పరాభూతులగుచుండినారు. ఒకప్పుడు నాయకుని మరణమో—పలాయనమో, మరియొకప్పుడు ఒక మంత్రి—ఒకసేనాని విఘాతుక చర్యయో, ఎట్లనో ప్రధాన యుద్ధాలన్నీ హిందూ పతాక వినాశనకారులే అగుచుండినవి. ఈ వాక్య విషాద సత్యాన్ని, దాహిర్ గతి—జయపాలుని యుద్ధాలు—అనంగపాలుని స్థైర్యము, పృథ్వీరాజు పతనము, కళింగార్ సిక్రి—దేవగిరి—తాళికోట దుర్దినాలు రుజువుచేయగలవు. కాని శివాజి, శాపగ్రస్తమైన హిందూ జన విధిని, సారూపకంగానో అన్నట్లు స్వహస్తాలతో గ్రహించి, పరాముఖాన్ని మాన్పించి, సుదృఢంగా నిలిపి, మునుపటివలెనే విరోధి నిరోధనక్రియకు మోటించినాడు. అదిమొదలు హిందూ జండా మహమ్మదీయ చంద్రపంకకు తలవొగ్గలేదు.

1627 సంవత్సరమాది, ఆసింధు సింధు పర్యంతము మహమ్మదీయులు ఎంత అధిక సంఖ్యాకులైనను, అల్లాహో అక్బర్ నినాదాలు ఎంత సంకులములైనను, హిందూ భుజబలము మహమ్మదీయులను తాకినప్పుడెల్ల హిందువులు గెలిచియే తీరినారు—మహమ్మదీయులు ధూళిని నాకియే తీరినారు. నిజంగా దేవుడే జయించినాడు కాని, ఈమారు గెలిచినది హిందూదేవుడు. 1627 సంవత్సరం మొదలు విగ్రహభంజకులవైపు నిష్ఠురంగా పెడముఖముబెట్టి విగ్రహారాధకులైన హిందువుల పక్షమునే వహించినాడు దేవుడు. దీనికి తార్కాణము—సింహగడ స్వాధీనము, పవనఖండ రక్షణము; మహమ్మదీయులను పలుమారు ప్రతిచోట ఓడించిన గోవిందసింగు—బందా బహదూర్—ఛత్రసాలుడు—బాజీరావు—నానాసాహెబ్—భావుసాహెబ్—మల్హారరావు—పరశురామపంత్—

రణజిత్ సింగ్—మొదలుగాగల అసంఖ్యాక మహారాష్ట్ర, రసపుత్ర, సిక్కు సేనలు. హిందూ రాజకీయ సౌభాగ్యంలో జరిగిన విజయలక్ష్మి శోభితమైన యీ ప్రధాన మార్పుకు కారణము—శివాజి, వారి ఆధ్యాత్మిక గురుదేవుడు శ్రీ రామదాసులవారు హిందుజాతి మ్రోల నెలకొల్పిన మహోన్నత ఆధ్యాత్మిక జాతీయాదర్శమున్ను, యుద్ధతంత్రములో వారు ప్రవేశపెట్టిన వినూత్న వ్యూహవిధానము, నవ్య ఆయుధసంపత్తియు, మహారాష్ట్ర యుద్ధవిధానము, ఆనాడు హిందువులు అవలంబించుచుండిన యుద్ధశాస్త్రమునకు ఒక అనుబంధమైనట్లే, మహారాష్ట్ర ధర్మముగూడ, మరణోన్ముఖమైన హిందూ సంఘ జాతీయ జీవనశక్తికి నూతన చైతన్యశక్తిని ప్రసాదించింది.

హిందూ స్వాతంత్ర్య యుద్ధనాయకులకు అంతటి విశ్వాసము—అంతటి వీరసత్వము ఒసంగి ప్రేరేపించింది, హిందూ–పద్–పాదషాహి–అను స్వతంత్ర హిందూసామ్రాజ్య సంస్థాపనాదర్శము. మహమ్మదీయ శక్తిని మహారాష్ట్ర ఆయుధశక్తి మించునట్లు చేసిన ఆ యుద్ధవిధానములే చివరకు హిందూ భ్రుకుటిని విజయకుంకుమాంకితము జేసినది—'గోరిల్లా' అను విధ్వంసక మాయాయుద్ధమే!

ఈ ఉదాత్త ఆదర్శజ్ఞానము—ఎట్లు తరతరములవారి ప్రయత్నాల చైతన్య పూర్ణముగ చేసినదో, ఎట్లు పలుముఖవ్యాప్తమై, దూరస్థమైన వారి చర్యలకు ఆదర్శ ఐక్యత–వాంఛాసన్నిహితల ఒసంగినదో, ఎట్లు ఋషులకు వీరపురుషులకు ఉచితమైన వారి ప్రయత్నము స్వధర్మ స్వదేశ రక్షణయత్నమన్న భావమును పొడమజేసిందో, ఎట్లు క్రమేణా మహారాష్ట్రులను ఢిల్లీ దుర్గ ద్వారాలకు—సింధునదీ తటాలకు—రామ సేతువుకు, విజయ శంఖారావంతో నడిపించినదో, మన భాగ్యలక్ష్మి అస్తమించి—మన పతాకము చింపివేయబడి తుదకు మన శత్రుకోటి విజృంభించిన విషాదాంశాల

వర్ణించు జానపదాలకు మారు, ప్రతి హిందుజనని మహోన్నత విజయ శ్రుతులలో సగర్వముగ తమ బిడ్డలకు జోలపాటగా పాడలిగిన ఒక జాతీయ ఉత్కృష్ట యితిహాస గౌరవస్థితికి వారి సాహసచర్యా గాథను ఎట్లు గొనిపోయినదో మేము అభివర్ణింపగలము.

శివాజి 1627 సంవత్సరమున జననమొందినాడు. వయస్సు వచ్చే కొంది యీ బాలుడు హిందూజాతి రాజకీయ దాస్యాన్ని గురించి చాల పరితాపపడే వాడని పురాణ చరిత్రరచయితలు చెపుతున్నారు. తన దేవగణ పుణ్యాలయాలు విదేశీయ మ్లేచ్ఛపాదాహతిని ధూళిలోపడి ద్రొర్లుటను, పురాతన మహిమా విభూతి అపవిత్రీకరింపబడి—అవమానింపబడుటను శివాజి జర్జరిత వక్షము వీక్షించింది. వీరమాత, జిజాబాయి—మన హిందూ జాతి కీర్తి ప్రతిష్ఠలతోను శ్రీ కృష్ణ, శ్రీ రామ, అర్జున, భీమ, అభిమన్యు, హరిశ్చంద్రాది పురుషుల తేజోమయ జీవితాలతోను ఆయన తరుణ శక్తిని పెంచి పోషించినది. ఇంతేకాదు—ఆయన పీల్చుకొనిన వాతావరణమే గొప్ప ఆశలు—ఆసక్తులతో నిండియుండినది. ఎవరి పూర్వులు దేవతలు దేవదూతలతో ముఖాముఖి మాట్లాడిరో, ఎవరిని శ్రీ కృష్ణభగవానుడు ఎన్నడుగాని పరిత్యజించనని వాగ్దానము చేసిరో, అట్టి హిందూప్రపంచాన్ని సముద్ధరింపను ఒక దివ్యరక్షకుడు అవతరింపనున్నాడని సర్వ హిందూ ప్రజ నిరీక్షించుచుండినది. ఆ యువకుని కుటుంబ సంప్రదాయము, తన కుటుంబమే అట్టి జాతీయ పరిత్రాణునికి ఉయ్యేలతొట్టి కానున్నదని నమ్మకము పుట్టించింది. ఇదంతా ఆయన రాకను నిర్దేశించినదని చెప్పసాధ్యమా? ఆయనే నిర్దిష్ట నిజప్రజారక్షకుడా? ఆయనరూపేణా భగవానుడు హిందూలోక సంగ్రహ సముద్ధరణలు జరుపనున్నారా? ఇది ఎట్లున్నను ఒకటిమాత్రం నిజం: ఆయన ధర్మముమాత్రం ప్రస్ఫుటము. ఆయనమాత్రము ఒక తృప్తిబానిన విశ్రామజీవనంతో తృప్తిపడునంతటి

క్షుద్రానికి లొంగిపోడు. తనజాతి సింహపీఠాన్ని భగ్నంచేసి, తన దేవతా పూజా వితర్దుల తునియలుజేసి కాలదన్నిన మ్లేచ్ఛాధికారి ఇచ్చరికాలకు, గిలిగింతలకు ఉప్పొంగి తలవంచే సామంతుడు ఎన్నడూ కానేరడు. అవసరమైతే, తన పూర్వికుల దహితాస్తులకొరకు—పవిత్ర దేవాలయాల కొరకు సర్వము త్యజించి, విపుల భయద శత్రువాహినుల ప్రతిఘటించి రణక్షేత్రంలో వీర మరణమును బొందగలడు; లేదా—మృత్యుంజయుడై విజయుడు కావలెనని నిర్దిష్టుడైనచో, అప్పుడు విక్రమాదిత్య శాలివాహనులవలె అశేష హిందూప్రజ తరతరములుగా వాంఛించిన మధురస్వప్నాల సారూపము, హిందూ కులగురువులు మహర్షుల దీర్ఘతపస్సుల లక్ష్యము అయిన మహత్తర తేజోమయ హిందూ సామ్రాజ్యానికి ఇప్పుడు శంకుస్థాపనము చేయగలడు.

---

# 2. హిందవీ స్వరాజ్

## శివాజీ లేఖ

యువకశక్తి విప్లవ పతాకాన్ని ఎత్తింది. 1645 లో శివాజీ ఒక తోడిరాజుకు, విజపూరు నవాబుపట్ల తాను అవిశ్వాసాన్ని చూపినాడన్న అపహారును తీవ్రంగా ఖండిస్తూ, తమ విశ్వాసము, ఏ షాకో, ఏ నవాబుకోగాక దేవునికి మాత్రమే అర్పింపబడినదన్న విషయము ఆయనకు జ్ఞప్తికిదెస్తూ ఆచరణీయ ఉదాత్త నీతిసూత్రాల ప్రవచనిస్తూ ఒక జాబు వ్రాసినాడు. తన్ను పెంచి పెద్దజేసిన దాదాజీ ఖండదేవుని మ్రోల తన అనుచరులతోగూడ సహ్యాద్రి శిఖరాలపైన—దైవసమక్షంలో కడపటి నెత్తురు

బొట్టువరకు పోరి, "హిందవీ స్వరాజ్యము"ను—హిందూస్థానములో "హిందూ—పద్—పాదషాహీ"ని నెలకొల్ప ప్రమాణముచేసి, ప్రతిజ్ఞా కంకణమును ధరించలేదా? "దేవుడు మన పక్షమున ఉన్నాడు—ఆయన జయించియే తీరును!"

శివాజి స్వలేఖినినుండి ప్రభవించిన "హిందవీ స్వరాజ్" అను యీ మాటవలె—ఒక నూరేండ్లపాటు మహారాష్ట్రుల జీవితాశయాలను, కార్యాలను ప్రేరేపించిన ఆ ఘనతరోద్యమ హృదయాన్ని అంత చక్కగా మరియొకమాట ప్రకటించలేదు. ఈ మహారాష్ట్ర విజృంభణము తన శైశవావస్థలోగూడ కేవలము సంకుచిత స్థానికోద్యమముగా గాని, వ్యక్తిగతోద్యమముగా గాని యుండలేదు. ముఖ్యంగా అది, హిందూధర్మ రక్షణ కొరకు, విజాతీయ మహమ్మదీయ అధికార నిర్మూలనము కొరకు, శక్తిమయ స్వతంత్ర హిందూ సామ్రాజ్య స్థాపనకొరకు నెరపబడిన అఖిల హిందూ ఉద్యమము.

ఈ దేశారాధన తత్పరతాప్రేరణ ఒక్క మహారాష్ట్ర నాయకునికే కలుగలేదు—తన అనుచరులు, దేశము అంతా దీనిని పంచుకొన్నది. శివాజివలెనే ప్రజానీకమంతా ఆయన దేశాభిమానము గుర్తించినది. ప్రతిచోట హిందూజాతి దాస్య విముక్తుడుగా ఆయనకు స్వాగతమిచ్చినారు.

శివాజీ విజయాల తర్వాతగూడ హిందువులు కొందరు మహమ్మదీయులపక్ష మవలంబించుటకు రెండు కారణాలు గలవు. ఒకటి—భూరిశక్తియుతుడైన మహమ్మదీయ పాదుషాపై లేవదీసిన తిరుగుబాటు ఫలప్రదము కాగలదన్న విషయాన్ని వారు నమ్మలేకపోయినారు. రెండు—నిందావమానాలకు లెక్కజేయని కొందరు స్వార్థపరులు, మహమ్మదీయ

పాలనము శాశ్వతముగ సాగుచో స్వార్థము వృద్ధిచేసుకోగలిగిన మరికొం దరు కార్యజ్ఞానంలేని బాలవు(దేకిగా కన్పించిన శివాజీ నాయకత్వము అంగీకరింపజాలక పోయిరి.

కాని, మహారాష్ట్ర దేశమునందేగాక, విశాల దక్షిణాపథంలోను— ఉత్తర హిందూస్థానములోను సమస్త హిందూ ప్రజకు ఆయన తమకై పోరవచ్చిన ఒక గొప్ప వీరుడుగా కాన్పించినాడు. తమ జాతి, తమ దేశ రాజకీయ స్వాతంత్ర్యముల సమకూర్చను అవతరించిన జాతీయ వీరపురు షుడుగ అభిషేకింపబడినాడు. ఆనాటి చరిత్ర—సంప్రదాయము—వాఙ్మ యము, శివాజి—రామదాసుల సందేశ కార్యదీక్షలపట్ల ప్రజలు చూపిన భక్తి ఆదరణలను, వారి పురుషాంతరము హిందు పవిత్రక్షేత్రాన్ని మండ లము తర్వాత మండలాన్ని—పట్టణం తర్వాత పట్టణాన్ని జయించిన వృదంతమును, దేశ అశేషజనము శివాజి నాయకత్వముక్రింద మహారాష్ట్ర వాహినుల జయయానములను చూచుటకు ఉవ్విళ్ళూరుచు గుంపులుగట్టిన ఔత్సుక్యమును, మహమ్మదీయ పతాకము బదాలు బదాలుగా చింపివేయ బడి, దానిస్థానే ఎగురగట్టబడిన పునీత మహారాష్ట్ర గైరికకేతనము విజయ గర్వంతో సలిపిన గంభీరనాట్యాన్నిచూచి ప్రజలు తన్మయులైన విష యాల వర్ణనలతో నిండియున్నవి.

ఈ విషయాన్ని స్థిరపరచుటకు, మహమ్మదీయ పాలనను భరించ లేక సావనూరు మండల హిందూ ప్రజలు శివాజీకి పంపిన లేఖను పరికిస్తాం—"విదేశీయుల క్రూరనిరంకుశపాలన క్రింద క్రుగ్గిపోతున్నాం. పవిత్ర హిందూ ధర్మము కాలిక్రింద త్రొక్కి-వేయబడుతున్నది. హిందూ ధర్మ సంరక్షకా! రమ్ము. దుష్కృత మ్లేచ్ఛరాజ్య విధ్వంసకా! రక్షింపుము. మహమ్మదీయ సేనాని యూసఫ్, అతని సేనాంగ దయాదాక్షిణ్యాలమీద బ్రతుకుతున్నాము. మేము మీపట్ల సహానుభూతి జూపి, దాస్యవిముక్తికి

మిమ్ము రహస్యముగ అర్థించినందున మా యిండ్లయందే మేము బంధింప బడియున్నాము. మా యిండ్లముందరవున్న పహరావాండ్లు అన్నపానా దుల అడ్డగించి మమ్ము మాడ్చి చంపుటకు యత్నిస్తున్నారు. హిందూ జాతి విమోచకా ! రమ్ము—యీ తమసావృతియామినులను తేజోపూర్ణ దినాలుగా మార్చివేయుము.''

మహారాష్ట్రేతర స్వమతస్థుల యీ దీనాలాపమును శివాజీ పెడచెవిని బెట్టలేదని వేరుగ చెప్పవలెనా ? హంబీరరావు—సుప్రసిద్ధ మరాఠీ సేనా పతి—సావనూరుపైదండెత్తి అనేకయుద్ధాలలోవిజపూరు సేనల పరలతల ఎత్తకుండ అణచివేసి, హిందూ ప్రజలను మహమ్మదీయ బంధాలనుండి విముక్తులజేసి, ఆ మండలంలో మ్లేచ్ఛపాలనమును తుదముట్టించినాడు.

శివాజి తన 14, 16-వ ఏటనే పునహ—సూపనగరప్రాంత భూమి యైన తన చిన్న జహగీరును చక్కదిద్ది, 12 మండలాలుగా విభాగించి, విశ్వాసపాత్రులైన వీరబృంద సహాయంతో తోరణ మొదలైన సుప్రసిద్ధ దుర్గరాజములను, సమయోచిత సాహసోపేతమైన మెరుపువంటి దాడు లతో స్వాధీనపరచుకొన్నాడు. విజపూరు సేనాపతి అఫ్‌జుల్‌ఖాను సేనలను తీవ్రముగ ఓడించి, సుస్థిర జయాన్ని పొందినతర్వాత మొగలులనుగూడ బహిరంగమున ఎదిరించినాడు. ఒకప్పుడు లొంగినను—ఒకప్పుడు మోస గించినను సదా వారికి పైచేయియై మొగలు ఉపసేనాపతులు—సేనాపతుల చాలమందిని పరాభూతులజేసి శత్రువులకు గుండెదిగులు పుట్టించినందున మొగలు సామ్రాట్టు ఔరంగజేబుగూడ కొంతకాలము విరోధము మానుట వివేక మనుకొని, కపటోపాయాలతో శివాజీని చిక్కించుకొనజూచినాడు. కాని, మాయావియైన ఆ ఔరంగజేబు పాదుషా కృత్రిమోపాయలకీ శివాజీ అందలేదు. ఆగ్రాలో అతడు పన్నిన విఘాతుక యత్నాల భగ్నముచేసి, నిరపాయంగా బంధవిముక్తిని బొంది సురక్షితంగా రాయగడము చేరి

నాడు. రాయగడమునుండి మొగలులతోడి యుద్ధమును మరల సాగించి, శివాజి సింహగడమును స్వాధీన పరచుకొన్నాడు. ఎదిరించిన పొలికలనులో నెల్ల మహమ్మదీయులను ఓడించి, చాలమంది మహారాష్ట్ర సేనాపతులు పేర్గాంచినారు. చివరకు, హిందూధర్మ సంస్థానాచార్యుడు, హిందూ నాగరికతా సంరక్షకాచార్యుడు అయిన హిందూ ఛత్రపతిగా తాను రాజ్యాభిషేకము నొందుట భద్రమని శివాజీ తలంచినాడు. విజయనగర పతనానంతరము ఏ హిందూ రాజుగాని, ఒక స్వతంత్ర పాలకుడుగా—ఛత్రపతిగా పట్టాభిషిక్తుడగుటకు సాహసించలేదు. ఈ పట్టభద్రాభిషేక సమయ శంఖారావము మహమ్మదీయ అస్త్రాధిక్య శక్తిని భిన్నముచేసింది. అది మొదలు ఏనాడుగాని యుద్ధభూమిలో హిందువుల ఎదుట మహమ్మదీయులు నిలువలేక పోయినారు.

వీటి ఫలితాలు యీ నాటక పాత్రలకే విభ్రాంతిని గొలిపినవి. హిందూ స్వాతంత్ర్య సమరానికి కులగురువు, ప్రవక్త అయిన రామదాసు తన ఒకానొక మర్మగీతంలో, తన జ్ఞానదృష్టికి సాక్షాత్కరించిన దృశ్యమే ఇపుడుబయట రూపొందినదని విజయోత్సాహంతో ఇట్లు గానముచేసినాడు- "పెనుచీకటిలో కలగన్నా—ఓం అటుచూడుడు! స్వప్నాలన్ని యధార్థాలైనవి. హిందూస్థానము మేల్కొన్నది—తన్ను తాను తెలుసుకొన్నది. మాతృదేశ విద్వేషకులు, దైవదూషకులు అందరు నిష్ఠుర బాహుదండముతో అణచివేయబడినారు. నిజంగా ఇది పుణ్యభూమి, సుక్షేత్రము. దేవుడే ఆమెకు తోడైనాడు—ఇక ఈదేశము ధన్యము! ఇక ఔరంగజేబు అధఃపతితుడు. రాజ్యభ్రష్టులు రాజ్యాభిషిక్తులుగా—రాజ్యాభిషిక్తులు రాజ్యపదవీభ్రష్టులుగా అగుచున్నారు. చేతలేమాటలకంటె బాగుగ మాట్లాడగలవు. సుఖశాంత హిందూస్థానము నిజంగా ధన్యము. నేడు ధర్మమునకు రాజధర్మము తోడైనది. బాహుబలము సత్యబలానికి దాసమైనది. హిందూ

పావనవారి ఇక మలీమసము కాజాలదు. శాస్త్రోక్త విధుల జరుపుటకు అవి యోగ్యమైనవి."

దైవ ఆశీర్వాదముతో, దైవాజ్ఞతో పోరాడుచున్నామన్న జ్ఞానము వల్లనే తాను గెలిచి నెలకొల్పిన స్వతంత్ర హిందూరాజ్యాన్ని శివాజీ, తన ఆధ్యాత్మిక రాజకీయ గురుదేవుడు శ్రీ సమర్థ రామదాసు స్వామిపాదపీఠాన అర్పింప గలిగినాడు. ఒక మహోన్నత కార్యదీక్షా జ్ఞానమువల్లనే పరల ఆ స్వామి తనప్రఖ్యాత శిష్యునికి దానిని ప్రతిదానముచేసి, ఒక ధర్మసంస్థగా, లోక సంగ్రహార్థము, మానవ సౌభాగ్యార్థము—దేవప్రీత్యర్థము పాలింపుమని ఆదేశించినాడు.

ఛత్రసాలుని విజయగాథల వర్ణించిన "ఛత్రప్రకాశ" గ్రంథకర్త మహారాష్ట్రేతరుడు, బందేలు ఖండవాసియైనప్పటికిని ఎట్లు తేజోపంతంగా వర్ణించినాడో చూడండి—జాతీయసుకవి, భూషణుడు, పుట్టుకతో మహారాష్ట్రుడు కాకపోయినను, శివాజి మొదలు బాజీరావువరకు గల మహారాష్ట్ర వీరనివహము సాగించిన విజయ యాత్రలకు వుప్పొంగి 'గర్వచేతస్కుడై సమస్త హిందూస్థానము పర్యటనముజేసి, హిందూ స్వతంత్ర యుద్ధమునకు అఖండ హిందూస్థానమును పురికొల్పి కార్యోన్ముఖుల జేసినాడు. శివాజీ విజయాల వివిధప్రాంత ప్రజలు అఖిల హిందూజాతి విజయాలుగా భావించిన విషయము మనోజ్ఞముగ గానముచేసి యున్నాడు. శివాజి లేకపోతే కాశి శిధిలమై—కళాహీనమై పోతుంది; మధుర మశీదై పోగలదని ప్రబోధించినాడు. హిందూవాణిని వేదవిద్యను రక్షింపమన్నాడు. గుణిలో గుణమును—ధరలో ధర్మమును నెలకొల్పుమన్నాడు. రసపుత్రులను—మహారాష్ట్రులను ఢిల్లీ సంపదను హరింపమన్నాడు.

హిందూధర్మము–హిందూ సామ్రాజ్యముల పేర అభ్రభేద సహ్యాద్రి శిఖరాలనుండి, మహారాష్ట్ర కాహళధ్వని వెలువరించిన ఉత్సాహ ప్రబో

ధము—సమర సంగీతము అఖిల హిందూభూమిని సజీవచేసి, కార్యక్షేత్రా నికి దింపి, మహారాష్ట్రీ యుద్ధాశయము—అభిశప్తమ్లేచ్ఛ దాశ్యమునుండి హిందూ భూమిని, హిందూప్రజను విముక్తులజేయుటదప్ప అన్యముకాదని విశ్వసింప జేసింది.

---

# 3. దేశమే శివాజీ వారసు

"దేవా, మేము చరమ సమరంలో ప్రవేశించినాము.
మా ఆశయము ధర్మమని మీకు తెలుసును.
ఇక విజయలబ్ధికి మీ తేజోమయ మార్గాన
నడిపింపుము!"

"మీ క్రోధానికి మమ్ము పాత్రీకరింపకుడు.
మేము పాటుబడు యీ పవిత్రయజ్ఞంలో,
అపాయ భీతితో కార్యపరాఙ్ముఖులజేయకుము.
ప్రాణార్పణ పాఠమును మాకు గరపుము."

శివాజి 1680 లో పరమపదించారు. శ్రీ సమర్థ రామదాసస్వామి 1681 లో కైవల్యాన్ని పొందినారు. వారు చాల సాధించినారు, ఇంకను చాల సాధింపవలసివున్నది. వారిద్దరు చనిపోయినారు గాని, వారి మరణము వారు మొలకెత్తించిన వుద్యమాన్ని మాత్రం చంపలేక పోయింది. అది సంకుచిత క్షణభిన్న వ్యక్తిగత పునాదులపై కట్టబడలేదు. దాని వేరులు జాతీయ జీవనంలోకి చాల లోతుకు పారి పాతుకొన్నవి. మహారాష్ట్రేతర

పాఠకులకు బాగ నచ్చజెప్పదలచుకొన్నది యీ ముఖ్యాంశమునే! ఇప్పటి వరకు శివాజీ—రామదాసు జీవితాలు, వారు సాధించిన కార్యాలు బయటి రాష్ట్రీలవారికి హెచ్చుతక్కువగ తెలిసియే యున్నవి. ఇక తర్వాతి మహా రాష్ట్రీ చరిత్రమాత్రము తెలియనే తెలియదు'అనవచ్చును. అథవా, తెలిసినా చాల అస్ఫుటంగా, తారుమారుగా తెలిసియున్నది. హైందవ, లేక హిందూ చరిత్ర సామాన్య పాఠకులు, హిందూ పద్ పాదషాహి స్థాపనకు, సమస్త హిందూత్వరక్షణకు కంకణముగట్టిన మహారాష్ట్రీ దేశారాధకులలో మొదటి వారు శివాజి రామదాసులే అనియు, వారితో ఆ ఉద్యమము అంతరించిన దనియు వూహిస్తారు. ఇంతేకాదు—మహారాష్ట్రీలలో సామాన్యజనం గూడ, మహారాష్ట్రీల చరిత్ర శివాజీతోడనే పుట్టి ఆయనతోడనే గిట్టినదని నమ్ముచున్నట్లున్నది. దీనికితోడు, అక్కడక్కడ చెలరేగిన దోపిడిగుంపు యొక్క స్వార్థపూర్ణ నీతిబాహ్య పోరాటములు క్లిష్టపరిస్థితులను క్లిష్ట తరముజేసి వేసినవి. ఈ రెండు వూహలును సత్యదూరములు. నిజానికి శివాజి రామదాసుల గొప్పతనం ఏమిటంటే—వారు లేవదీసిన ఉద్యమం వారి మరణానంతరంగూడ శక్తిపూర్ణంగా చాల కాలము సాగి, దేశారా ధన పరాయణులైన ప్రజ్ఞాధనులను, కార్యప్రణాళికా నిర్మాతల—సేనా పతుల—వీరుల—ఆత్మ బలిదాతల అసంఖ్యాకముగ ప్రభవింపజేసి, ఆదిమ ఉద్యమానికి తెంపులేని జీవితాన్ని గూర్చినది. ఈ వీరబృందము అదే ఆదర్శానికి ప్రచండముగ పోరి, అదే హిందూ సామ్రాజ్య స్థాపన గమ్యా నికి నడచి, శివాజి డేగచూపులకే మిరుమిట్లు కొలుపునట్లు విజయాల గడించి మెరసిపోయింది. శివాజి హిందూ సామ్రాజ్యాభిషిక్తుడైన నాడు ఆయన ఏలుబడిక్రింద ఒక్క రాష్ట్రీమైనా లేకపోయినా అది ఒక గొప్ప కార్యసాఫల్యమే! కాని, ఆయన పుత్రుడు సంభాజీ—రఘోబదాదా నాయ కత్వముక్రింద లాహోరు ప్రవేశించిన ఆనాడు—మహారాష్ట్రీ యుద్ధాశ్వము

సింధునదీ తటాన గభీరరమ్య గ్రీవంతో విజయహోషలతో నిష్ఠురఖురతాడ నాలతో జయభేరి కొట్టిన ఆనాడు—ఒక విశాల భూఖండము ఆయన పాదతలమున జోహారులిచ్చిన ఆనాడు—ఆ కార్యసాఫల్యము ఘనతరము కాలేదా? శివాజి చనిపోయినప్పుడు ఇంకను ఔరంగజెబ్ జీవించియే యుండినాడు. చివరకు, ఔరంగజేబును—హిందూద్వేష జన్మమైన ఆతడి అడియాసలను అహమ్మదు నగరంలో ఒకే గోరిలో బెట్ట గలిగినది శివాజి కాదు—ఆయన ఉజ్జీవింపజేసిన ఆయన మహారాష్ట్రజాతి. ఆయన రాయ గడములో నాటిన బీజము—గంభీర మనోజ్ఞ భూరి సామ్రాజ్య వృక్ష ముగా పెరిగినది. కాబట్టే దానికంత ప్రతిష్ఠ వచ్చినది. లేకున్నచో—నన యెత్తకయే మాడిపోయిన ఎన్నో యితర వృక్షాలవలెనే యిదిగూడ విస్మృతి ధూళిలో కలిసి ఫలశూన్యమైపోయి వుండేది. శివాజి రాయగడ మును పాలించినాడు. కాని, ఆయన ప్రజ ఢిల్లీని ఏలుదినము ఇంకను ఆసన్నము కాలేదు. ఇంతేకాదు—ధనాజి—శాంతాజి—బాలాజి—బాజి—నాన—భావు—మల్హారరావు — దత్తాజి — మాధవరావు — పరశురామ పంత్—నాన—బాపు ఆదిగాగల వీరసింహాలు విజృంభించి, పోరి శివాజి ఆశయాన్ని, ధర్మాన్ని సాధించియుండకపోయినచో, శివాజి సాధించినది నగ్నరూపంతో ఆకర్షణ శూన్యమై, స్వల్ప రాష్ట్రాలు పట్వర్ధన్—బుందేలు రాజ్యాలవలె క్షుద్రమై, మన జాతి చరిత్రలో అంతటి అద్వితీయమైన సర్వ హిందూత్వ గౌరవము పొందియుండదు. ఆయన జాతి, ఆయన కీర్త్యోచిత రీతిని ప్రవర్తిల్లి—ఆయన ఆదర్శభావాన్ని గ్రహించి ఫలప్రదముచేసి, ఆయన మానసికవాంఛల సాధించి, ఘనపరచినది. కాబట్టే శివాజి గొప్ప అయినాడు. శివాజి మరణము మహారాష్ట్ర చరిత్ర ప్రాతిపదికము మాత్రమే. ఆయన ఒక చిన్న హిందూసంస్థానాన్ని స్థాపించినాడు—అది యింకను ఎదిగి ఎదిగి హిందూసామ్రాజ్యము కావలసివున్నది. ఇదంతా

శివాజి మరణానంతరం జరిగింది. కార్యమును సాధింపవలసిన చండ శక్తులనెల్ల సృజించి శివాజి రంగమునుండి తిరోహితమైన వెనువెంటనే అసలు యితిహాసము ప్రారంభమైనది.

---

# 4. రాజ బలిదాత

"ధర్మసాక్షీ మారావే"

—రామదాసు

మహారాష్ట్ర ధర్మ నిమ్నతను—అది హిందూ పునరుజ్జీవనోద్యమానికి కలిగించిన జీవశక్తి అంతు కనుగొన ప్రయత్నించడమే ఔరంగజెబు చేసిన పొరపాటు. వ్యక్తిగతములు—మూఢాచార సంకుచితములును అగు అనేక యితర వుద్యమాలవలెనే, యీ మహారాష్ట్రోద్యమము గూడ దాని మూల పురుషుడు—ప్రజ్ఞాశాలి శివాజి మరణంతోపాటు తీవ్ర మరణా ఘాతము నొందినదని భావించి, శివాజీ తదనంతరం రాజ్యానికి వచ్చిన సాంబాజీ వీరుడైనను అశక్తుడైనందున ఔరంగజెబు తనకు మంచి అవకాశము లభించినదనుకొన్నాడు. కాబూలు మొదలు బెంగాలు వరకు వ్యాపించిన తన సంపూర్ణ విశాలరాజ్యము, కావలసినంత సైనిక బలాన్ని—దనవస్తుచయాన్ని అవలీలగా యివ్వగలిగినందున, మూడు లక్షలకు మించిన సర్వాంగయుత భూరి సేనతో దక్కను పీఠభూమిలోకి దిగినాడు, ఒకే సమయంలో అంతటి అజేయ బలాన్ని శివాజీగూడ ఎదుర్కొనియుండలేదు. ఇందు ఔరంగజెబు పొరబడలేదు—ఎందుకంటే, నిపుణంగా కేంద్రీకరింపబడిన మహాశక్తియుత మొగలు సామ్రాజ్య యావ

శ్శక్తి భారము, నూతనముగ నిర్మింపబడిన ఐక్యతలేని మహారాష్ట్ర రాజ్యానికేకాదు, దానికి పదింతల దేశాన్ని గూడ అణచి నుగ్గునూచము చేసియుండగలదు. దీనికితోడు, అప్పటి మహారాష్ట్ర నాయకుడు అంతటి గొప్పజాతిని నడుపుటకు చాలకపోయి, మొగలుల ప్రతిఘటించు ప్రయత్నమునే నిరాశోపహతము చేసినారు. నాయకుడగుటకు అశక్తత అటుండనిచ్చి సాంబాజీ వుద్రేకి, అసహిష్ణుడు—కొన్నివేళలలో అతికి పొయ్యేవాడు.

సాంబాజిలో ఎట్టి వెలితి, లోపాలువున్నను—జీవితంలో సమయానికి వుపకరించకపోయినను, మరణదశలోమాత్రం, శివాజీ కొడుకు తండ్రికి తగిన కొడుకు అనిపించి, రేగిన జాతీయోద్యమాన్ని నడపగలిగిన నాయకుడై, సమయానికి మించిన శక్తి సామర్థ్యాల జూపినాడు. కర్కశ శత్రువుమ్రోల, అసహాయ ప్రాణావశిష్ట బంధీగా నిలువబడియుండినప్పుడు గూడ, స్థైర్యంగా ధిక్కారరూపంతో భంగుర ప్రాణాలకై పవిత్ర మతాన్ని అమ్మదలచుకోలేదు. ప్రాణానికి ప్రతియైన ఇస్లాంను క్రోధారుణ నేత్రాలతో తిరస్కరించినాడు. తన తాతల మతాన్ని అంగీకరించి ఉగ్గడిస్తూ, తన ఎదుటనున్న ముస్లిం ఆతతాయిపై కరకునిందల విసరి మ్లేచ్ఛ మతాన్ని తత్త్వన్ని—రూపాన్ని తీవ్రంగా దూషించినాడు. ఈ మహారాష్ట్ర కేసరిని మాలిమిచేసి లోబరచుకొని, విలాసకామినీ పోషకశ్వానంగా మార్చలేకపోయి, ఔరంగజేబు యీ కాఫిరును తుదముట్టించమని ఆజ్ఞాపించినాడు. కాని యీ బెదరింపులు శివాజీ పుత్రునికి భీతిగొలుపజాలక పోయినవి. కాగిన సరిగోలలతో కండ్లుపొడిచి, గుడ్లజన కరగించి పారించినారు. ఆ వీరుని నాలుక ముక్క ముక్కలుగా కుందివేయబడింది. అయితేం! ఆ రాజ ఆత్మబలిదాతను యివన్నీ భయవిహ్వలుని చేయలేక పోయినవి—చివరకు శిరచ్ఛేదము చేయబడినాడు. ఇట్లు ముస్లిం మతా

వేశానికి బలి, అయి, హిందూజాతికి అమరకీర్తినిగూర్చినాడు. ఇతర మహా త్తరత్యాగాలకంటె, సాంబాజీ యీ ప్రాణదానంవల్ల—మహారాష్ట్రధర్మము, హిందూ పునర్వికాస ఆవేశ ఆదర్శాలను మూర్తీభవింపజేసినాడు—దోపిడి గుంపునాయకుడైతే అన్యథా ప్రవర్తించి యుండును.

శివాజీ ఐహిక సంపద సర్వమూ కొల్లగొట్టబడింది. ధనాగారములు కాళీచేయబడినవి. దుర్గాలు, రాజవాసాలు ధ్వంసం చేయబడినవి. తుదకు ఆయన రాజధానిగూడ శత్రు హస్తగతమైంది. సాంబాజీ దీనిని అరికట్టలేక పోయినాడు. సాంబాజీ శివాజి భూతల లక్ష్మిని సంరక్షింపలేక పోయినాడు. కాని, సాంబాజి తన మహోన్నత ఆత్మార్పణక్రియతో, శివాజి నైతిక ఆధ్యాత్మిక ప్రాభవాన్ని రక్షించుటేగాక దానిశక్తి తేజాలను వృద్ధిచేసినాడు. ఇట్లు, మతానికై ప్రాణార్పణము చేసిన ఆ మహా త్యాగి రక్తవర్ధితమైన హిందూ విమోచక సంగ్రామ గాంభీర్యము—నైతికశక్తి విశేషముగ పెంపొందినవి.

---

# 5. ఆత్మబలిదాత దుర్మరణ నిర్యాతనము

సర్వమహారాష్ట్రదేశము తమ రాజహత్యా ప్రతీకారమునకు యుద్ధ యుగమున ప్రవేశించినది. ఆ రాజు చరమ మహోదాత్త ఆత్మత్యాగము వల్ల ఆయన లోపాల, దుచ్చేష్టల మన్నించి మరచిపోయినారు. ధన బల శూన్యులైనవారుగూడ తమ జాతీయస్వాతంత్రమును బడయ కృతనిశ్చ యులైనారు. శివాజీ ద్వితీయపుత్రుడు రాజారాం నాయకత్వముక్రింద కోట్లలపడి, హిందూమతము హిందూరాజ్యరక్షణలకై ఆ మరణాంతము పోరుటకు పవిత్రదీక్ష బూనినారు.

ధర్మసాఠి మరావే మరోని అవధ్యాంసి మరావే,
మారితాం మారితాం ఘ్యావే రాజ్య అపులే
మరాఠా తితుకా మేళవావా అపులా రాష్ట్రిధర్మబాటవావా
యేవిశీ న కరితా తకవా పూర్వజ హాసతి.

అన్న రామదాసు ప్రభోదగీతాలు ఆయన మరణానంతరము విస్మృతిని జెందుటకుమారు—సర్వప్రజ సజీవ విశ్వాసమైనవి. రాజారాం—నీలో మోరేశ్వర్—ప్రహ్లాద నిరాజి—రామచంద్ర పంత్—శంకర్ జి మల్హార్—పరశురామ త్రియంబక్—శాంతాజీ గోర్ పడె—ధనాజి జాదవ్—ఖండే రావు దబాడె—నింబాల్ కర్—నేమాజి పర్ సోజి మొదలగు బ్రాహ్మణులు, క్షత్రియులు, శూద్రులు (మరాటులు) ప్రభువులు, రాజులు, కర్షకులు—సమస్త దేశము మహమ్మదీయశత్రు నిర్మథనమునకు అస్త్రమును వాల్చినది.

ఇప్పుడు దక్కనుపీఠభూమి అంతా మరల ఔరంగజేబు వశంగతమై ఉన్నది. సమస్త మహారాష్ట్రిభూమి, సర్వ దుర్గములతో—చివరకు శివాజి రాజధానితోగూడ మహమ్మదీయ సేనాపతుల సైనికాధికార భారము క్రింద మూల్గుచుండినది. శివాజి—ఆయన సమకాలీన ప్రజ వృథాగా పోరి ప్రాణాల గోల్పోయినారా ? అనిపించింది. అయితే రాజధానీ నగరాల—దుర్గాలసంగతేమి ? స్వాతంత్ర్య సంపాదనకై దీక్షబూనిన జాతికి పెట్టని కోటలు నిజహృదయసీమలే! నిజ ఆదర్శమే కేతనము! అది ఎగిరిన చోటెల్ల దాని రాజధానియే! "మహారాష్ట్రి దేశమునంతా గోల్పోతిమా, మదరాసు రాష్ట్రిములో పోరు సాగించగలము—రాయగడము పతనమైనదా—జింజీలో హిందూ సామ్రాజ్య ధ్వజాన్ని ఎగగట్టగలము. కాని, స్వాతంత్ర్య సమరాన్ని మాత్రం విడనాడజాలము" అన్న పరాభూతమెరుగని ధిక్కారముతో మహారాష్ట్రులు ఔరంగజెబు మహావాహినుల యిరవై

యేండ్లు అధీకరించినారు. తుదకు—అలంగీరు పాదుషా భగ్నుడై, పరా భూతుడై వెనుకకు తరుమబడి హృదయావలేపము వీడి అహమ్మదు నగ రంలో యాతనతో కృంగి కృశించి 1707 లో మరణించినాడు.

ఆ దీర్ఘ సమరాలలో "గనిమి కవ" అను విలక్షణమైన మహా రాష్ట్ర యుద్ధవిధానము చాల సహాయభూతమైనది. మరాఠదళాలు గుంపుగా ఎదుర్కొని ఏడబడి పొయ్యేవి—జొరబడి వెనుకకు బడేవి—పోరి పలాయన మయ్యేవి—నిరోధించి నిర్గమించేవి. ఇట్లే విద్యుల్లతావేగంతో, అసమాన నాయకత్వంతో, ఆటుపోటెరుగని ధైర్యంతో, తరుగని సాహసంతో మొగలు సేనలపై బడి ప్రతిచోట చిందరవందరచేసి, చీకాకు పరిచేవి. కాని, మరాఠిదండు తన ఉనికినిమాత్రం శత్రువులకు తెలియనిచ్చేది గాదు. ప్రతి సుప్రసిద్ధ ముస్లింసేనాపతిగూడ అవమానమో, పరాజయమో, బంధమో, మరణమో అనుభవించినాడు. జుల్ఫికర్ఖాను, ఆలిమర్దానా ఖాను, హిమ్మత్ఖాను, కస్సాం—ప్రతివాడును ధనాజి, శాంతాజీ మొద లగు మహారాష్ట్ర సేనాపతులచే తీవ్ర పరాజయానికి పాల్జేయబడినారు. జింజి, కావేరిపాకం, దుదారి మొదలగు ప్రచండ యుద్ధాలలో మరాఠీలు నిలిచి పోరి, ముస్లింసేనల తునాతునకలుగా నరకి చివరకు, ఔరంగజేబు మహారాష్ట్ర పునరాక్రమణ దురాశను నిర్మూలం జేసినారు. మహారాష్ట్రులు ఔరంగజేబు సామ్రాట్టు స్కంధావారాన్నే చుట్టుముట్టి సింహాన్ని తన గుహలోనే కేసరాలుపట్టి పెరికినారు. అదృష్టవశాత్తు ఆ సమయానికి తన బంగారు జలతారు గుడారములో లేనందున తప్పించుకొన్నాడు కాని, లేకున్న సార్వభౌముడు సజీవంగా ఆ సైన్యానికి బంధిఅయి వుండును. అప్పుడు మరాఠి సైన్యము విజయపారితోషికంగా ఆ పటకుటీని ఎత్తుకొని పోయినది.

ఆనాటి ప్రధానపాత్రలను ప్రోత్సాహపరచిన దేశారాధన భావమును

విపులీకరించుటకు—ఇంకను మొగలుల పక్షమువహించి, జింజీకోట ముట్టడిలో తోడ్పడిన కొందరు మహారాష్ట్ర పాలెగాండ్రను తమవైపు తిప్పుకొనుటకు ఖండుబలాల్ చేసిన ప్రయత్నమును వర్ణించిన చాలును. మహారాష్ట్ర పక్షమువహింపజేయుటకు నాగోజిరాజుతో చాటుమరుగు రాయబారములు ప్రారంభింపబడినవి. తాను రాజారాం పక్షము వహించిన జింజిదగ్గర మహమ్మదీయసేనను నాశనముచేయుట ఎంత సులభమో వివరింప బడింది. అదీగాక, తమ పూర్వుల దేశాన్ని—మతాన్ని సంరక్షించుచున్న మహారాష్ట్రులకు సహాయముచేయుట ఆయన నీతి—ధర్మమని నచ్చజెప్పినాడు. ఈ విజ్ఞప్తి వృథాకాలేదు. తగిన అదనులో నాగోజిరాజు ఐదువేల సైన్యంతో మొగలుల దిగనాడి మరాఠి దండును చేరినాడు. ఇంకను మొగలు వూడిగంలోవుండిన షిర్కాను తిప్పుకొన ఖండుబలాల్ ప్రయత్నము సాగించినాడు. కాని, రాజారాం కష్టాలనుగూర్చి వినగానే షిర్కా క్రోధోద్దీపితుడై "రాజారామేకాదు—భోంస్లావంశము యావత్తు తుడిచి వేయబడితేమాత్రం నాకేమి? కనబడ్డ మా వంశీకులనెల్ల సాంబాజీ చిత్రవధచేసి, సిర్కాను చిత్రవధ పర్యాయపదంగా చేయలేదా?" అని తిరస్కారలేఖను వ్రాసినాడు. దానికి ఖండు బలాల్ ఇట్లాబుజ్జగింపు ప్రతిలేఖ వ్రాసినాడు: "మిత్రమా, విను. నీవు చెప్పేదంతా నిజము. అయితే, యీ సాంబాజీయే, మా వంశీకులు ముగ్గురిని ఏనుగులచేత తొక్కించి చంపినది గూడ నిజమేగదా? ఇక ప్రస్తుత ప్రశ్న కుటుంబకలహాలకు సంబంధించినది గాదు. ఏ భోంస్లే వంశవృద్ధికో మరి యే యితరవంశ ఉన్నతికో నేడు మనము పోరాడుటలేదు—"హిందూ చ్య సామ్రాజ్యసాఠీ—ఆంహి ఝుటల్ ఆహో—" హిందూ సామ్రాజ్య సంస్థాపనము కొరకు పోరాడుచున్నాము."

జాతీయభావాన్ని రేగగొట్టిన యీ విజ్ఞప్తిని షిర్కా నిరోధించలేక

పోయినాడు. తన వ్యక్తిగత కుటుంబక్రోధాల మన్నించి మరచిపోయి, రాజారాం బంధవిముక్తికి సహాయపడెదనని వాగ్దానము చేసినాడు. అట్లే మరువరాని అపూర్వ సహాయాన్ని చేసినాడు. దీని ఫలితంగా రాజారాం మొగలుల పట్టు తప్పించుకొని వీరగౌరవంతో మరల మహారాష్ట్ర మాతృ భూమిలో కాలుబెట్టినాడు.

ఇట్లు—శివాజీ సమాకాలీనులేగాకుండ ఆతరువాతి పురుషాంతరము **గూడ** దేశారాధన లౌల్యముచే ప్రేరేపింపబడినది. హిందూజాతి రాజకీయ స్వాతంత్ర్యపునస్సంపాదనమను పవిత్ర లక్ష్యము—హిందూధర్మమును, విదేశీయ క్రూరశత్రువునుండి రక్షించుట అను ఆదేశము వారి కార్యాలనడి పినవి. అంతటి ప్రతిపక్షితో పోరి అంతటి విజయాలను దొంగలు, దోపిడి గాండ్రు పొందియుండలేరు. ఒక మహత్తర నైతిక, జాతీయశక్తి కష్ట ముల కోర్చి, శత్రువుల ధిక్కరించి కొన్ని పురుషాంతరముల దేశభక్తులు తమ దేశవిముక్తిని బొందునట్లు చేసినది. హిందూదేశంలో యీజాతి వలె శత్రుధాటికి ఆగి పరువు దక్కించుకొన్న మరియొకజాతి లేదు.

---

# 6. మహారాష్ట్ర మండలి

తన హిందేతర అడియాసలు. తృష్ణలు భగ్నమైనందున ఔరంగ జేబు విషాదఛాయావృత సమాధిలో క్రుంగి కృశించుచుండ—మహారా ష్ట్రులు మొగలు సామ్రాజ్యంలో ప్రతి ముఖానికి సేనల గొనిపోయినారు. ఖాందేష్, గోండ్వాణా, బీరార్, గుజరాతులలో మరాఠి సమరభేరీనినాదము హిందూ వీరవృక్షాల చిగురింపజేసింది. మొగలుపాదుషా సాహూని బంధ విముక్తుని జేసినాడు. మహారాష్ట్ర భూభాగానికి సర్వపాలక హక్కులతో

స్వరాజ్యమిచ్చినాడు. దక్కనులో ఆరు సుభాలు (మండలాలు) పైనను, సామంతదేశాలు—మైసూరు తిరువాంకూరు సంస్థానములలోను చౌత్ (నాల్గవభాగశిస్తు) సర్దేశముఖిని (పదివపాలు అధికశిస్తు) మహారాష్ట్రిలను వసూలు చేసుకోమన్నాడు. ఇవన్నియు, ఇంతకుముందు కని విని యెరుగ నంతటి శక్తిని మహారాష్ట్రిలకు ఒసంగినవి. ఇది యుద్ధపీడిత దేశానికి విశ్రామమొసంగి, ఇంటిని చక్కదిద్దుకొను అవకాశమిచ్చి, తీవ్ర అంతఃకల హోద్రేకాల ఉపశమింపజేసి, మాత్సర్యక్షతాల మాన్పింపజేసి, అఖిల మహా రాష్ట్రదేశ భావాలకు ఆశయాలకు ఏకైకలక్ష్య కేంద్రీకరణాన్నిగూర్చి మహా రాష్ట్రిల నందరిని సక్రమబద్ధమైన ఒక సంఘ అధికారము క్రిందకు కొని వచ్చినది. దీనిలో ఎన్నో తప్పనిసరి లోపాలుండినను—యీ మహారాష్ట్ర మండలియే—హిందూ పద్ పాదషాహి యై, నామమాత్రముగ గాక, యథార్థముగ యావద్భారతావనిని ఏలింది.

పైనచెప్పిన నైసర్గిక లోపాలన్నవి జాతీయగుణములు—వర్తనము. ఇవి జాతీయ సంస్థలకు అనుగుణ్యమైన సహజచ్యుతాలు. వీటిని యితర హిందూ ప్రజలవలెనే మహారాష్ట్రిలుగూడ పంచుకొన్నారు. వీటినిగూర్చి ముంయ ముందు ప్రస్తావించెదము. అపార్థాన్ని తొలగించుటకుమాత్రం, వాటిని మాకంటె ఎక్కువగా గుర్తించినవారు లేరని చెప్పగలము. మహా రాష్ట్రిలను ఒకేజాతిగా నడిపి, ప్రోద్బలపరచి, హిందూజాతి విమోచక యుద్ధభూరిప్రయత్న సన్నాహాలను ఓర్పుతో తలదాల్చునట్లుచేసిన ఆవుదాత్త జాతీయ నైతిక ధర్మసూత్రాలను సాదోహరణంగా అభివర్ణించునప్పుడు ఒకొక్కప్పుడు—కొందరు వ్యక్తులు, స్వార్థపూర్ణ నైచ్య ఆశయా లతో, నిజ ప్రాభవభంగ జన్య అమర్షముతో, అడ్డులేని పేరాసతో, జాతీయ ధర్మ వ్యతిరిక్తముగా ప్రవర్తించినారన్న విషయాల మేము విస్మృతిజెంద నూలేదు—లఘుపరచ దలచుకొనను లేదు. ఈలోపమే లేకపోయియుండిన

హిందువులు మానవజాతిగాక దివ్యులై యుందురు. ఇక ప్రస్తుతము అక్కడక్కడ మొలకెత్తిన దోషాల ఏరక, ఆ సమష్టి హిందోద్యమ సాధారణ చరిత్రను వర్ణింపదలచుకొన్నాం. వారు తలపెట్టిన కార్య విస్పష్ట ఘనత, వారియత్నాల వారి త్యాగాల గంభీరత, వారు సాధించిన విజయాల రూపము, యివన్నియు వ్యక్తిగతదోషాల పాలుబోను, ప్రతి హిందూదేశా రాధకుని అభినందనానికి, కృతజ్ఞాతామయ సంపూజనానికి పాత్రీకరింప బడకపోవు. ఈ సంక్షిప్త చరిత్రలోగూడ, సర్వపరీక్షలకు నిలువగలిగిన చారిత్రక ఆధారాలను, ఒక్కొక్కప్పుడు యీ జాతీయోద్యమాన్ని నడిపిన పాత్రల స్వవచనాలను, వారు నెరవేర్చిన కార్యానుగుణ్యముగ ఉదహరించి యున్నాము.

బాలాజీ విశ్వనాథరావు సొంతయింటిని చక్కదిద్దుకొని ఢిల్లీ సామ్రాజ్య రాజకీయాలలో బలవత్తర జోక్యమును కలిగించుకొన గలిగి నంతటి పరిస్థితిలోకి వచ్చినాడు. ముస్లింసైన్యం యిక తమమీద పడగల దను భయమే మరాఠులకు పోయినది. ఇంతేకాదు, మహమ్మదీయ సార్వ భౌముడే తిరుగబడ్డ తన మంత్రులు, సేనానాయకుల బారినుండి రక్షింపమని మహారాష్ట్రులనే యాచించినాడు. చూడుడు! మహారాష్ట్ర స్వాతంత్ర్య సమ రము ముస్లిం సామ్రాజ్యాధికారాన్ని ఎట్లు ఛిన్నముచేసిందో! 1718 లో సయ్యద్ సోదరులు, తమ్ము ప్రతిఘటించిన యితర ముస్లిం ప్రతిపక్షులను అణచుటకు సహాయమర్థించగా, బాలాజీ విశ్వనాథ్—దభాదె—50000 పరిమితిగల మరాఠి దండుతో ఢిల్లీకి నడచినారు. దీని ప్రతిఫలంగా సయ్యె దులు దక్కనులో చౌత్, సర్‌దేశముఖుల మహారాష్ట్రులను వసూలుచేసు కొన మన్నారు. 50000 గర్వ మహారాష్ట్ర సైనిక బలము, మొగలురాజ ధాని వీథులలో ప్రవేశించుట ఢిల్లీ మహమ్మదీయులకు కోపము కలిగించిన దనుట సహజమే! చౌతు—స్వరాజ్యములను స్థిరపరచే రాజసన్నదులను

మహారాష్ట్రులు పొందగానే, దారిమధ్య దాగివుండి మహారాష్ట్రనాయకుని చంపవలెనని కుట్రబన్నినారు. ఈ దుచ్చింత మహాష్ట్రులకు తెలియరాగానే, నాయకుని రక్షించి అవసరమైనచో ఆయనకు మారు తన ప్రాణమర్పించుటకు ఖాను ముందుకువచ్చినాడు. తదనుగుణ్యంగా బాలాజీపేష్వా దర్బారులో సన్నదులను స్వీకరించి ప్రచ్ఛన్నంగా వేరు గుప్తమార్గంలో విడిది చేరుటకు నిర్ణయింపబడింది. ఖానుడు బాలాజీ విశ్వనాథుడుగా ఆయన పల్లకీలో అర్హలాంఛనాలతో రాజమార్గాన బయలుదేరినాడు. మతావేశోన్మత్తులైన మహమ్మదీయ మూక పేష్వాపల్లకీని కనిపెట్టి, హఠాత్తుగా దానిపైబడి, బాలాజీ అనుకొని ఖానుని, మరికొద్ది మహారాష్ట్ర సైనికులను ముక్కలు ముక్కలుగా నరకివేసినారు. అటు బాలాజీ రాజాధికారపత్రాలతోగూడ సురక్షితంగా మహారాష్ట్ర స్కంధావారాన్ని చేరినాడు. జాతీయ క్షేమానికి ఒక వ్యక్తిచేసిన యిట్టి అకళంకత్యాగము ఆజాతి చరిత్రను పవిత్ర యితిహాస గౌరవ ప్రతిష్ఠలకు గొనిపోవును. ఈసంక్షిప్త చరిత్రలో గూడ యీ తేజోపూర్ణఘట్టాల ఒకటి రెండు పర్ణించినచో, సంపుటముల తరబడి వ్రాసిన నిస్సార విమర్శనములకంటె ఎక్కువగా ఆ జాతీయోద్యమ నైతిక వికాసాన్ని ప్రకటించగలదని మా ధృఢవిశ్వాసము.

---

# 7. బాజీరావు ప్రవేశము

"స్వతంత్ర మహారాష్ట్రము
హిందూస్వాతంత్ర్య యుద్ధాన్ని నడుపవలెను."

ఢిల్లీనుండి వచ్చినతర్వాత, బాలాజీ విశ్వనాథరావు 1720 లో మరణించినాడు. ఆయన కొమారుడు బాజీరావు, మహారాష్ట్రమండలికి సాహూ

అధ్యత క్రింద నాయకుడైనాడు. శివాజీ జననానంతరం, మహారాష్ట్రుల చరిత్రలో రెండవ ప్రస్ఫుట ప్రసిద్ధఘట్టం బాజీరావు రాజకీయరంగ ప్రవేశము. అప్పుడు పెద్దపెద్ద రాజ్యతంత్ర సమస్యలు పరిష్కారానికి ఎదురు చూస్తుండినవి. మహారాష్ట్రులకు రాజకీయ స్వాతంత్ర్యము సమకూడినది. మహారాష్ట్రాధికారము, ప్రాభవము ఎదిగి బలవత్తరమై—స్వక్రమశిక్షణ బద్ధమై తనకాళ్ళపై తాను నిలువబడగలిగి, ఎట్టి విపరీత పరిస్థితులలో నైనను తమ దేశమును, తమ మతమును రక్షించుకోగలిగియుండినవి. అటుతరువాత సామ్రాజ్య రాజకీయాలతో చెరలాటాలు ఆడక తమ ఆశయాల మహారాష్ట్ర పొలిమేరలలోనే నిలుపుకొన్నారంటే, వారు సాధించిన దానిని శాంతిమయంగా అనుభవించ దలచుకొన్నారన్నమాట. ఈ భావాలు కొందరు మహారాష్ట్ర నాయకులకు పొడమి, సాహూఛత్రపతికి నచ్చజెప్ప గలిగినారు. వారు దేశానికి నచ్చబలికి, హిందూమోక్ష యుద్ధాన్ని మహారాష్ట్రదేశసీమల కావల సాగించనీయకుండ ప్రజలను చేయగలిగినప్పటికిని, వారు సంపాదించినదానిని అట్లు విశ్రాంతిగా చాలకాలము అనుభవించ గలరనుటమాత్రం సందేహాస్పదము. వచ్చిన దండయాత్రల బారినుండి మహారాష్ట్రదేశమును వారు రక్షించగలిగియుండినను, మహారాష్ట్ర పొలిమేరల ఆవలి హిందూభాగాలలో ఏమిజరిగినను మనసున బెట్టక జోక్యము కలిగించుకొనక మడిగట్టుకొని కూర్చుండగలిగి యుండినను, అట్లు వారు చేయుట సమంజసమా ? అనువదే ప్రశ్న ! గత రెండు మూడు పురుషాంతరాలుగా, అంత కఠోరంగా—అంత దీర్ఘంగా పోరి వారేల అట్లు ఎక్తము ధారబోసినారు ? కేవలము శాంతిసౌఖ్యాల అనుభవమునకు మాత్రమేకాదే వారట్లు ప్రాణార్పణము గావించినది ? మహారాష్ట్రదేశ హద్దుల ఆవలినుండి వెలువడిన బాధిత హిందూసోదరుల దైన్య ఆక్రందనాలమధ్య దోష దూషిత మనశ్శాంతితో అనుభవించిన ఆ శాంతిసౌఖ్యాలు ఎన్నటికిని

గౌరవ ప్రదములు కాజాలవు. శివాజీ, ఆయన అనుయాయులు ఆకాంక్షించినది హిందవీ స్వరాజ్యము కాని, మరాఠిరాజ్యము కాదు.

మహారాష్ట్ర హిందూగ్రీవము విజాతీయ రాజ్యాధికారయుగము నుండి విముక్తినొందినది కాని, ఇతరభాగాలలో లక్షలాది స్వమతసోదరులు ఇంకనూ విదేశరాజ్యాధికార భారముక్రింద మూల్గుచునే యుండినారు. రామదాస స్వాములవారు ధర్మముకొరకు ప్రాణత్యాగము చేయమని ఆదేశించినారు. తీర్థక్షేత్రాలు భ్రష్టములై పోయినవని విలపించినారు. వారణాశిలో పవిత్ర విశ్వేశ్వరాలయంమీద, సగర్వంగా ముస్లిం చంద్రరేఖ ఇంకను తులకించుచుండగా, తమ ధర్మరక్షణకై పోరి ప్రాణార్పణము చేయవలెనన్న ధర్మలక్ష్యాన్ని మహారాష్ట్ర హిందువులు ఎట్లు జారవిడువగలరు? ఢిల్లీలో యుధిష్ఠిరుని హిందూసింహపీఠిపై ఇంకను మ్లేచ్ఛులు కూర్చుండి రాచరికాలు నడుపుచుండగా, శివాజీ ఛత్రపతి హిందవీ స్వరాజ్యము—హిందూ సామ్రాజ్యము ఎట్లు సమకూడగలవు? మహారాష్ట్రులు ముస్లిం చంద్రవంకను పండరిపురమునుంచి పెరికి పారవేసినారు. పునీత నాసికా నగరము ఆవేశాంధ ముస్లిం పరాభవాలతో ఇక న్యూనము కాజాలదు. కాని, సర్వహిందు సంస్కృతి కేంద్రము—కాశీ గతి ఏమి? కురుక్షేత్ర ఏమైనది? హరిద్వారము—రామేశ్వరము—గంగాసాగరముల సంగతేమి? అవి పండరి—నాశికలవలె మహారాష్ట్రులకు అంత పవిత్రములుగావా? వారి పూర్వుల దగ్ధధూళి గోదావరీ స్రవంతిలోనే కాదే అణగినది? అమరవాహిని గంగాశీకరాసారంవల్ల గూడ పవిత్రీకరింపబడినదే! వారి దేవగణ పవిత్రాలయాలు, హిమాలయ, రామేశ్వర, ద్వారక, జగన్నాథ పర్యంత భూమిని స్వర్గశోభతో వెలిగించినవే! అయితే ఏం? రామదాసులవారు నిశ్వాసపుచ్చినట్లు—ముస్లిం విజిగీషువు శిరోమండిత చంద్రరేఖ ప్రతిబింబించుటచే మలినమై, పుణ్యకార్య కలాపాలకు అనర్హమై గంగా

యమునల ఆకాశతీర్థము స్తంభించిపోయి, శైవాల తమసావృతమైపోయి వున్నది. కాబట్టే రామదాసు—

ధర్మసారీ - మరావే - మరోని అవధ్యాంసి మారావే -

మారితాం మారితాం ఘ్యావే - రాజ్య ఆపులే -

అని మహారాష్ట్రుల ఆదేశించినారు.

ఆ ముస్లింపాలకుల కరకు రాజదండము భగ్నమైనదా? అఖిల హిందూస్థానము రాజకీయ మత దాస్యశృంఖలాల ఛేదించినదా? మహా రాష్ట్ర భూమిలోనే కాదు, యావద్భారతావనిలో ముస్లిం అధికారము—ఆధిక్యము—శక్తి సమూలంగా నిర్మూలింప బడితేనేగాని హిందూధర్మము నిర్నిరోధంగా పాలింపబడజాలదు; హిందవీ స్వరాజ్యము పెంపొంద జాలదు. అంగుష్ఠమాత్ర హిందూక్షేత్రము మహమ్మదీయాధికారమునకు లోబడియున్నంతవరకు శివాజీ రామదాసుల ఆదేశ కార్యదీక్షలు. గత ఏబదేండ్లుగా హిందూస్వేచ్ఛా సమరంలో పోరి ధర్మస్వర్గాన్ని పొందిన కొన్ని పురుషాంతర ప్రజల త్యాగము అసమగ్రంగానే నిలిచిపోగలదు. "హీనదాస్యంలో మీ హిందూజాతిని మీ హిందూభూమిని బంధించియున్న నిగళాల తుత్తునియలు జేయనంతవరకు—వేదానుష్ఠానాల సక్రమంగా, ఇచ్ఛాపూర్ణంగా, నిరావరోధంగా పాలించుకొన గలుగునట్ల దేశభద్రత చేకూర్చు నంతవరకు—హిందూప్రజను ఒక బలవత్తర విశాల హిందూ సామ్రాజ్య పతాకముక్రింద కేంద్రీకరింప జేయునంతవరకు ధర్మకార్య ఖడ్గాన్ని దించమని ప్రతిజ్ఞబూని, లోకానికి ఎలుగెత్తి చాటిన మహారాష్ట్ర ప్రజలారా! ఇప్పుడు కాశీవిశ్వనాథుని గర్భగృహ శిధిలాలమీద ఒక మసీదు లేచుచుండ—విదేశమ్లేచ్ఛ సైంధవము నిర్విరోధంగా గర్వధాటితో పవిత్ర సింధునదీతోయాల కాలదన్ని దాటుచుండ—హిందూసాగరతరంగాలపై యవన నావికాచయము విజయయానము సలుపుచుండ, మీరు ఎట్లు కత్తి

దింపి ఒరలోదూర్చి, యేహ్యాశాంతిలోకి మునిగిపోగలరు? ఇది విషమ పరిక్షా సమయము! ఈ భూరి ఉద్యమము, కేవలము స్థానిక—సంకుచిత—వ్యక్తిగత ఆదర్శాలకుగాక, హిందూధర్మము— హిందవీ స్వరాజ్యము—హిందూ పద పాదషాహీల కొరకే ప్రారంభించబడి యుండినచో, మహారాష్ట్రీలారా! లెండు, వందలు—వేలుగా కార్యఖడ్గాన్ని ధరింపుడు—మీ పవిత్ర గైరికధ్వజాన్ని—నర్మద—ఛంబాలు—యమున—గంగ—సింధు—బ్రహ్మపుత్రానదుల కావలికి, త్రిసాగర సంగమంవరకు గొని పోవుడు! రామదాసస్వామివారి ఆజ్ఞల పాలింపుడు" అని మహారాష్ట్రి మంత్రద్రష్టలు—కార్యద్రష్టలు, రాజకీయకోవిదులు—రణవిద్యాకోవిదులు, ఆత్మజ్ఞలు, ఋషులు ప్రజానీకానికి ప్రబోధ శంకారావము గావించినారు.

బాజీరావు—చిమాజీ అప్పా—బ్రహ్మేంద్ర స్వామి—దీక్షితులు—మధురాబాయి—అగ్రే ఆది నాయకశ్రేణి యిట్టి మహోన్నత భావావేశులై మహారాష్ట్రియత్నాల పురోగమనోన్ముఖము జేసినారు. అప్పటి ప్రశ్న ఏది చేయతగినది? అనునది గాదు—ఏది చేయవలెను? అనునదే! ఒకవేళ చేతనైనను మహారాష్ట్రీలు రాజకీయ ఏకాంతమున ఉండజాలరు. మహారాష్ట్రి హిందూ జనవిధి ఆసింధు సింధు పర్యంత భూమిలో నివసించు సమస్త స్వమత స్వదేశస్థుల విధితో విడిబడరాని రీతిగ పెనవేసికొని పోయియున్నది.

ఈ స్థానికభావము; ఈ రాజకీయ ఏకాకతలే పూర్వము హిందూజాతి రాజకీయ విచ్ఛితికి, అటుతర్వాత హిందూమత జాతీయ వినాశాలకు హేతుభూతమైనవన్న సంగతి మహారాష్ట్రి రాజకీయవేత్తల సూక్ష్మబుద్ధికి బాగుగ గోచరించింది. సాధ్యమైతే యిప్పుడు వారు అఖిలహిందూ ఆశయాలతో పోరాడ ప్రయత్నించినారు. నాదిర్‌షా హిందూదేశముపై దండెత్తి వచ్చినప్పుడు వివిధ హిందూరాజులకు బాజీరావు యీ విషయాన్నే వ్రాసినాడు.

తమ జాతీయ సుస్థితి పారమార్థి కావసరాలకే గాకుండ, భౌతిక వ్యక్తి గతావసరాలకు గూడ, తమ ఆశయగమ్యాన్ని, తమ రాజకీయ స్వాతంత్ర్యాన్ని బొంద, సర్వహిందూజాతిని సమీకరించి, విడివడకుండా పట్టిపెట్టి వుంచగలిగిన ఒక అఖండ హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించునంతవరకు విశ్రాంతిలేక కార్యరంగమునుండి నిష్క్రమించరాదనిగూడ వారు గుర్తించినారు. తనజాతి, విజాతీయ అధికార వశంవర్తియై యున్నంతవరకు ఏ హిందువుడుగాని చిరకాలము శాంతిజీవనాన్ని నడిపి, తన ఆశయలబ్ధిని పొందజాలడు. విజాతి నిరంకుశాధికారముయొక్క అతి వృద్ధిక్రింద తన జాతి, అభివృద్ధి నిరోధక బానిసత్వంలో ప్రుగ్గుతుండినంతవరకు ఏ హిందువుడుగాని నిజ సంపూర్ణ పరిణామ వికాసాన్ని అందుకొనజాలడు. ఈ అన్ని కారణాలవల్లనే నాయకులేగాక మరాఠీ సైన్యములో ప్రతి పదాతిగూడ, ఢిల్లీలో తమ రాజ్యము సాగితేనేగాని సాతారాలో తమ రాజ్యము నడవదన్న విషయాన్ని ప్రత్యక్షముగ గ్రహించగలిగినారు. మహారాష్ట్రమండలి తమ భవిష్యద్రాజ్యతంత్రమును నిర్ణయించుటకు సాహూఛత్రపతి యాజ్ఞానుసార సమావేశమైన ఆ ప్రఖ్యాత దినమున, బాజీరావు లేచి, మహారాష్ట్ర ప్రజల సుదృఢ ఆశయాలను, సునిశ్చయ విశ్వాసాలను వెల్లడిస్తూ ఒక మహోజ్జ్వలభాషణాన్ని గావించినాడు. తన శక్తిని తన ఉత్సాహాన్ని ప్రస్తావిత విషయ ఉన్నతిని బాగుగ గుర్తెరిగి ఇట్లు భాషించినాడు: "ఢిల్లీ! ఢిల్లీపైకి నడువుడు, ముస్లిం స్వరాజ్యవృక్షమూలాన్ని వేళ్ళదగ్గరే నరకవలెను. మీరేల సంశయగ్రస్థులై ఆందోళిత చేతస్కులై యిక్కడ నిలువబడెదరు? హిందూ వీరకేసరులారా! ముందుకు నడువుడు—మీ విజయయానమును సాగింపుడు. హిందూ పద పాదషాహి సంస్థాపనకు మంగళతరుణ మాసన్నమైనది. ఇది సాధ్యముకాదని శంకించెదరా? వలదు—వలదు. మన ఖడ్గశక్తిని వారి ఖడ్గశక్తితోపోల్చి చూచితిని, దాని

సత్తా నాకు తెలియును. ఓ ఛత్రపతీ, తమ్ము ధనాన్నిగాని సైన్యాన్నిగాని అడుగను—కాని, ఓ రాజశేఖరా, యీ యానమునకు మాత్రము అనుజ్ఞ నొసంగి, ఆశీర్వదింపుము. అటుతర్వాత నేను నేరుగా ఢిల్లీపైనడచి, ఆ విష వృక్షాన్ని సమూలంగా నరికి, మీ పాదతలాన సమర్పింప గలను."

ఈ ప్రపంచములో వీరుని వీరవాక్యాలు నిర్నిరోధములు! సాహూ ఛత్రపతి, శివాజీ రక్తము ఆయన నాళములలో ఉప్పొంగి అగ్ని తరంగితముకాగా, ఉద్రేక విహ్వలుడై పలికినాడు: "ప్రజానాయకా పొమ్ము—నీ యిష్టానుసారముగా నాయీ మహారాష్ట్ర సైన్యాల విజయమునుండి విజయమునకు నానాముఖాల నడిపింపుము. ఒక్క ఢిల్లీకే ఏమి? ఇదిగో! మన పవిత్రగైరికకేతనాన్ని గ్రహింపుము. దానిని హిమవంతుని శిఖరాల మీద—దాని కావల కిన్నరఖండములో విజయహాసముతో దీపించునట్లు నాటి రమ్ము."

సాహూ అన్న యీ గేరుపజండా ఏది? అది బంగారుపూజలెరుగదు—వెండి తళుకులెరుగదు—కాని, పరిత్యాగచిహ్నము, దేవారాధన, మానవ సేవా లాంఛనము అయిన సన్న్యాసుల గైరికవర్ణమండితము. మహారాష్ట్ర వాహినులు యీ పతాకము వెనువెంట నడచినవి. తాము హిందూ మత రక్షకులు, మ్లేచ్ఛధికార బంధముక్తి ప్రదాతలు అని సదా జ్ఞప్తిపరచు చుండుటకు యిది వారి కొసంగబడినది. వారి ఖడ్గము భవాని, కేతనము భగవ. దీనిని రామదాసు ఎగగట్టినాడు, శివాజి దానిని ధరించి పోరి, సహ్యాద్రి శిఖరాలమీద స్థాపించినాడు. ఇక యిప్పుడు, సాహూ—ఆయన సమకాలీనులు హిమాద్రి అవల కిన్నరఖండమునకు దానిని గొనిపోవ కృతనిశ్చయులైనారు.

ఇట్టి చైతన్య వాతావరణంలో మహారాష్ట్రమండలి సమావేశము

సమాప్తమైనది. అదిమొదలు దాని చరిత్రే సర్వహిందూస్థాన చరిత్ర అయినది.

---

# 8. ఢిల్లీ దండయాత్ర

"అరే బఘతాం కాయ్ ! ఛలా జోరానే - ఛాల్ కరూఁ !
హిందూ పద్ పాద్‌శాహీస్ ఆతాం ఉశీర్ కాయ్ !"

—బాజీరావు.

బాజీరావు, ఆయన సహాయకులు శివాజీ సంప్రదాయ విధానముల ఎట్లు క్షుణ్ణముగ అవగాహనము చేసుకొన్నది, ఆ మహానాయకుని రాజ్య తంత్రము యుద్ధ తంత్రము లెట్లు సమగ్రముగ అలవరచుకొన్నది బాలాజీ రావు సాహూఛత్రపతిముందు గావించిన ఆ మహోపన్యాసము వెల్లడించు చున్నది. వ్యతిరేక పరిస్థితులలో, నాడు—శివాజి హిందూమోక్షక సైన్యాల దక్షిణాపథానికి నడిపించగా, అనుకూల వాతావరణంలో, నేడు—మహా రాష్ట్రవీరులు ఉత్తర దిగ్విజయయానము సలుపుటకు మారు కూర్చుండి, మీనమేషాల గుణించుటను గూర్చి మనసులకు నచ్చబలికినాడు, బాజీరావు నాటి మహారాష్ట్రమండలి సమావేశంలో. ఆనాటి ముస్లిం రాజకీయ నాయ కులలో, సేనాపతులలో గడుసరి అయిన నైజామును అణచుటే ప్రథమ కర్తవ్యమని బాలాజీ గుర్తించినాడు.

బాజీరావు అన్నిటా శివాజీకి తగిన శిష్యుడనిపించినాడు. 1727 ఆగస్టు 7 వ తేది కుంభవృష్టిలో బాజీరావు తన సైన్యాల నడిపించినాడు.

మొదట ఔరంగాబాదు జిల్లా ప్రవేశించి, నైజాం ఏలుబడిలోవున్న జాల్నా మొదలగు పరిసరమండలాలలో యుద్ధనిధిని వసూలు చేసినాడు. ఇంతలో నైజాం సైన్యాల యిరాజ్‌ఖాను నడిపించుకొనివచ్చి మరాఠీ దండుతో తల పడినాడు. మొదట కాసేపు బాజి యిష్టము వుండీ లేనట్లుగా మొగ్గరము పన్ని, వున్నట్లుండి, విరోధి సైన్యాల విడచి మహూరు పట్టణముపై అతి త్వరగా నడిచినాడు. దానితర్వాత ఔరంగాబాదుచేరి, యుద్ధానికి ధనము తెమ్మన్నాడు. భాగ్యవంతమైన ఔరంగాబాదును కొల్లగొట్టకుండా ఆపను, నైజాం ఒక పెద్ద సైన్యంతో యిరాజ్‌ఖానుకు సహాయపడను పరుగెత్తి నాడు. అనుకొన్నట్లు తాను పన్నిన వురులలో నైజాం పడి మోసపోయి నాడని తెలిసికొని, బాజీరావు ఆ ప్రాంతభూమిని వదలి గుజరాతు ప్రవే శించి, నైజాం ఆజ్ఞానుసారముగ ఆదేశముపై దండెత్తి వచ్చితినని అచటి మొగలు రాజప్రతినిధికి క్రూర అపహాస్య సందేశ మంపినాడు.

అతి త్వరితముగా ఔరంగాబాదుచేరిన నైజాము, ఆ నగరాన్ని ఎవరి బారినుండి రక్షింపదలచుకొన్నాడో ఆ వైరి, అప్పటికే గుజరాతు చేరినాడన్న ఉదంతము తెలిసికొని వెరగుపడినాడు. నైజాం కోపోద్దీపితుడై, బాజీరావును, ఆయన ప్రయోగించిన ఆయుధంతోనే మర్దించ కుతూహల పడి, మహారాష్ట్రుల హఠాత్‌యానాల అనుకరించి, పునహాపై దండెత్తి, దారిలో బాజీరావు రాజ్యాన్ని కొల్లగొట్ట సంకల్పించుకొన్నాడు. కాని, యీ మహారాష్ట్రపాఠాన్ని సమయము మించిన తర్వాత నేర్చుకొన్నాడు నైజాము. బాజీరావు యిదంతా ముందే వూహించి, ఎప్పుడో గుజరాతును వదలి, విద్యుల్లతా వేగంతో మరల నైజాం రాజ్యంలో ప్రవేసంచినాడు.

తాను ఒక అద్భుత యుద్ధవ్యూహాన్ని నెరవేర్చుచున్నానను ఒక మృషాభావానందంతో నైజాం పునహానగరోన్ముఖుడై నడుస్తుండగా, మార్గమధ్యంలో—తాను బాజీరావు దేశాన్ని దోచుకొనేదానికి ముందే,

ఆయన తన దేశాన్ని కొల్లగొట్టినాడన్న దారుణవార్త విని, పరాభూత చేతస్కుడై వితాకు నొందినాడు. వెంటనే పూనాయానమును విరమించు కొని, గోదావరీతటాన బాజీ సైన్యాల ఢీకొన మరలినాడు. ఇప్పటికి నైజాము సైనిక గణము పూర్తిగా అలసిపోయినది. నైజాము విముఖుడైనను బాజీ యుద్ధమున ఎదుర్కొనదలచినాడు యీమారు. ఇంతకు ముందువలె విరోధి తాకుడుకు నిలువక పరుగెత్తినట్లు పరుగెత్తక, నైపుణీ పూర్ణవ్యూహాలతో తాను చూపిన ప్రదేశాన్నే—తన ఆజ్ఞాను సారమో అన్నట్లు, మొగలులు ఆక్రమించుకొనునట్లు మోసగించినాడు. ఉన్నట్లుండి యిప్పుడు బాజీరావు విజృంభించి, ఫల్ ఖద్ ప్రాంతాలలో వున్న నైజాం బలాలమీద అతి చాకచక్యంగా పడినాడు. నైజాం సైన్యంలో పెద్ద ఫిరంగులు, యితర మారణయంత్రసామగ్రి వుండినప్పటికిని, నైజాం బంధింపబడినాడు. అప్పుడు మహారాష్ట్రులను వెనుకకు నెట్టివేయుట అసాధ్యమని తెలిసికొని, తన సైన్యసంపూర్ణ వధమునకో, బాజీ ఆ దేశాల శిరసావహించుటకో అంగీకరింపక తప్పదన్న భయదసత్యాన్ని గ్రహించినాడు. నైజాం చరమవిధానాన్నే అవలంబించి, సాహూను సర్వ మహారాష్ట్ర భూమికి ఏకైకసార్వభౌముడుగా అంగీకరించి, బాకీ నిలిచి వున్న చౌతు, సర్ దేశముఖులను పూర్ణంగా చెల్లించి తనరాజ్యంలో దీసి వేసిన మహారాష్ట్ర శిస్తువసూలు అధికారులను తమతమ స్థానాలలో మరల నెలకొల్పినాడు.

దీనిని యింత విపులంగా ఎందుకు వర్ణించవలసి వచ్చిందంటే— ఇదే అసలు మహారాష్ట్రయుద్ధ వైఖరి! శివాజీ గరపిన పాఠాల మరువకుండుటే గాకుండా, వాటిని అభివృద్ధిపరచి, ఆయన తరువాతి సేనానాయకులు విశేషముగాను, నిశితంగాను యీ విద్యను ప్రయోగించి విజయలక్ష్మిని చేకొన్నారు.

దక్కను మొగలు రాజప్రతినిధి కంటె, మాల్వాయందలి మొగలు రాజప్రతినిధి మేలనిపించలేదు. 1698 లో ఉదాజిపవార్ నాయకత్వము క్రింద మహారాష్ట్రులు మాల్వాను కొల్లగొట్టి, మాండ్వా దగ్గర విడిదిచేసి నదిమొదలు, పలు ముఖాలనుండి అచటి మొగలుల తాకుచునే వుండిరి. మాల్వా హిందూప్రజ, ముస్లిం నిరంకుశాధికారము, మత నిర్బంధముల బాధ సహించలేక విసుగెత్తి, హిందూజాతి విమోచక యుద్ధ పురోగామియై తలయెత్తిన హిందూజాతీయ పునర్వికాస తరంగాన్ని గుర్తించి, హిందూ సామ్రాజ్యోద్యమానికి చాల ఉత్సాహ సహానుభూతుల జూపి, సమయము నకై వేచియుండినారు. మాల్వా హిందూ సామాన్యప్రజ, తమ ప్రజా నాయకులు, ఘూస్వాములు, రాహూరులు, కులగురువుల ప్రభోద చకితులై, దినదిన ప్రవర్ధమాన మగుచుండిన మహారాష్ట్ర శక్తిని, వారిచేష్టల నడుపు చుండిన హిందూ సామ్రాజ్య లక్ష్యమును గుర్తించి, పోషించి, తమ దాస్యవిమోచనానికి అది ఒక్కటే తరణోపాయమని నిర్ణయించు కొన్నారు.

మాల్వాయందలి పలుకుబడి ప్రాభవము గలిగిన జయపూరు సంస్థానాధిపతి—సవాయ్ జయసింగు, హిందూ స్వతంత్ర ఉద్యమానికి అత్యంత సహాయకారి కావడం, హిందువుల సుకృతము! ఇంతకుముందు ఛత్రసాలుడు తన చిన్నరాజ్యాన్ని విదేశ విరోధులనుండి కాపాడుకొన లేక, ఒక హిందూసామ్రాట్టుకు సామంతుడగుటా? లేక ఒక హిందేతర ముస్లిం విదేశీయునిక్రింద ఐశ్వర్యవంతుడగుటా? అనుభీకర పక్షాంతర వరణ సమయంలో, దేశారాధన తత్పరతతో—నిజ క్షుద్రరాష్ట్రమునైన గోల్పోవుటకు సమ్మతించి, మహారాష్ట్రులుగాని, రసపుత్రులుగాని, శిక్కులు గాని—ఏ యితర హిందూజాతి నడిపినను అఖండ హిందూ సామ్రాజ్య లబ్ధికి వారితో చేతులు గలుపుటయే, ఢిల్లీ ముస్లిం సింహాసనంమ్రోల

చేయు వంగు మంగు గులాముల సలాములకంటె మేలని భావించినాడు. ఈ నీతియే జయసింగునకుగూడ మార్గదర్శకమైంది.

జయసింగు మాల్వాయందలి సమస్త బాధిత హిందుప్రజపక్షము వహించినాడు. ఠాకూరులు విధించిన హెచ్చుపన్నులక్రింద నలిగే కర్షకులు—భూస్వాములు—జాతిమత అవమానాలు, నిర్బంధాలు, దౌష్ట్యము, నిర్బంధ ధనాపహరణము మొదలగు ముస్లింపాలన సాగించే అత్యాచారాల సహించలేని మతగురువులు మొదలగువారి నందరినీ, మహారాష్ట్రుల సహాయమర్థించి, మాల్వాలో హిందూరాజ్యస్థాపనానికి తోడ్పడమని కోరునట్లు ప్రేరేపించినాడు. ఆ ఉదాత్త రాజపుత్రుని దేశభక్తి, అప్పుడు పాలించుచుండిన రాజులలోకెల్ల, మొగలుల శక్తిని ప్రతిఘటించి, అణచి, హిందూ ప్రభుతకు సుస్థిర భద్రతలు చేకూర్చగలిగినది సుస్థాపిత మహారాష్ట్రమండలి అజేయశక్తి ఒక్కటే అని గుర్తింపజేసినది. మొగలు నిర్బంధమునుండి హిందూ ప్రజను రక్షించుటకు తానే స్వయంగా పూనుకొన జాలనిచో, తన స్వార్థపర ఆశయాల త్యజించి దేశద్రోహకర సంకుచిత హైన్య అసూయాద్వేషాల అణచివేసికొని, విమోక్షకార్యదీక్ష బూనినవారికి సహాయపడుటే తర్వాత ఆయన చేయదగిన గౌరవప్రద ఆచరణీయ కార్యము.

ఈ కార్యంలో జయసింగుకు, మంచి పలుకుబడి కలిగిన ఠాకూరు నందలాల్ మాండవి చాల సహాయ పడినాడు. వీరిద్దరు మాల్వా హిందూ ప్రజ పక్షమున "మ్లేచ్ఛులను పారద్రోలి హిందూ గౌరవమును మరల ప్రతిష్ఠింపమని" మహారాష్ట్రులకు విజ్ఞాపన లంపినారు. మాల్వా స్వమతస్థుల ఆహ్వానమును మహారాష్ట్రులు అంగీకరించి, వెనువెంటనే బాజీరావు సోదరుడు—వీరుడు, చిమాజి అప్పారావు సేనానిక్రింద మహారాష్ట్రులు నానాముఖముల మాల్వాపై దండెత్తిరి. అచటి మొగలు ప్రతినిధి తన సర్వ

శక్తుల సమీకరించినాడు. కాని, మహారాష్ట్రులు వెనుకంజవేయలేదు. ఒక సదవకాశాన్ని గ్రహించి, దేవాస్ పట్టణందగ్గర హఠాత్తుగా మొగలుసేనలపై పోదివి రాజప్రతినిధిని వధించినారు.

మొగలు పాదుషా యింతసులభంగా తన భాగ్యవంతమైన ఒక రాజ్యభాగాన్ని గోల్పోవుటకు యిష్టపడలేదు. మహారాష్ట్రులతో ఢీకొనుటకు మరియొక క్రొత్త వైస్‌రాయి ఆదేశింపబడినాడు. ఈలోపల మహారాష్ట్రులపట్ల సానుభూతి కలిగిన హిందూపౌరులెల్ల మహారాష్ట్రులకు తోడ్పడిరి. నూత్నరాజప్రతినిధి తీవ్ర సన్నాహాలు, దారుణవ్యూహాలు పన్ని, ఒక ప్రచండమైన పెద్దసేనతో మహారాష్ట్రులను మండవ కనుమదగ్గర తలపడి తుదముట్టింప ప్రయత్నపడినాడు. కాని, మాల్వా హిందువుల సహాయంతో మహారాష్ట్రులు మొగలుల యోచనలకే అందక విజృంభించి, మల్హారరావు—పిలాజి—చిమాజి సేనాపతుల నాయకత్వంక్రింద కని విని ఎరుగని రీతిగా మొగలుసేనా నివహాన్ని గారియపరచి, చివరకు తిరాల్ ప్రాంతభూమిలో దారుణ యుద్ధంలో ఢీకొన్నారు. ఈ యుద్ధంలో మునల్మానులు చితికిపోయినారు—వారి రాజ ప్రతినిధి చంపబడినాడు.

ఈ ద్వితీయ విజయశుభవార్త మాల్వా హిందువులను ఆనంద విహ్వాలులను జేసినది. అడుగడుగుకు మహారాష్ట్రులకు స్వాగత నీరాజనాలే! కొన్ని శతాబ్దాల అవమాన పరాజయా లానంతరం—మరల నేడు విజయలక్ష్మి శోభిత హిందూకేతనదర్శనము, ప్రతి హిందూ హృదయంలో ఆనంద విద్యుత్ప్రవాహాన్ని పారించింది. జాతీయ ఆనందమును దేశారాధనలౌల్యమును రేకెత్తించింది.

జయసింగు, పవిత్రధర్మముకొరకు పోరి విజయలక్ష్మిని పొందిన మహారాష్ట్ర ముఖ్యనాయకుల ప్రశంసిస్తూ, ఉదాత్తభావంతో నెనరు తెలుపుచూ యిట్లా లేఖవ్రాసినాడు—"శతసహస్రాధిక వందనాలు, మీ విజయం

నిజంగా అద్భుతము! మ్లేచ్ఛుల పారద్రోలి మాల్వా హిందూవులకు స్వాతంత్ర్యమొసంగి, మన హిందూజాతి హిందూధర్మ గౌరవముల నిలిపి నందులకు ధన్యవాదాలు."

మహారాష్ట్రీలు తోడ్తోడనే మాల్వాయందు శాంతి నెలకొల్పినారు. మొగలు అధికారుల తీసివేసి, మహారాష్ట్రి భాగముగనే దానిని పాలింప దొడగిరి.

అయితే ఏం! ప్రయత్నం భగ్నమయ్యేకొంది ఢిల్లీ మొగలు పాదుషా ఆశదొంతరల పేర్చుకొంటూనే యుండినాడు. రోహిల్లా పఠానుడు—కరకు సేనాపతి—సహజ శౌర్యగుణంవల్ల ముస్లిం లోకంలో 'సమరకేసరమని' పేర్గాంచిన మహమ్మద్‌ఖాను బంగాష్ అనునతడు వైస్‌రాయిగా పంపబడి, ముఖ్యంగా, బుందేలుఖండ పాలకుడు ఛత్రశాలుని విజృంభణ శక్తిని పీచమణచి, ఆ విజయమును ఆనుచేసికొని మహారాష్ట్రీల మాల్వా నుండి పాలద్రోలమని ఆదేశింపబడినాడు.

విశ్రుతుడు ఛత్రసాలుని నాయకత్వంక్రింద మొగలు పాలనాశృంఖాల ఛేదించి, సుఖమయ శాంత రాజకీయజీవితాల అనుభవించుచుండిన బుందేలుపై బడినాడు మొదట మహమ్మద్‌ఖాను బంగాషు. ఛత్రసాలుడు శివాజీ ఛత్రపతిని ప్రశంసించి ఆదరించేవాడు. చిన్నప్పటినుండి ఆయనే ఆదర్శము, ఆయననే ఒజ్జగా—మార్గదర్శకుడుగా అంగీకరించినాడు. అది మొదలు గురువాదేశాను సారముగా, హిందూ విమోచకోద్యమాన్ని బుందేలు ఖండమందు సాగిస్తూ విజాతిపాలనను ధ్వంసముచేసి, హిందూ ధర్మము—హిందూదేశముల రక్షించి కృతకృత్యుడై, "హిందూమత పరిత్రాణ" బిరుద భూషితుడైనాడు.

ఇప్పుడు ఛత్రసాలుడు, తన వృద్ధాప్యంలో, తన స్వల్ప హిందూరాజ్య

మును నాశనము చేయుటకు నిశ్చయులైన, రోహిల్లా పఠానుల అధికతర ఆరణ్యక మూకలతో ముఖాముఖి నిలువబడినాడు. శివాజీ—రామదాసు—ప్రాణనాధ ప్రభువు మొదలగు మహానాయకుల నిఖిల హిందూ ఆశయాల ప్రాపున ఎదిగిన ఛత్రసాలునివంటి వృద్ధ హిందూ వీరుడు, శివాజీ శక్తికి, శివాజీ ధర్మాదర్శమునకు ప్రాతినిధ్యము వహించి, మహారాష్ట్రమండలి జీవనాయకుడైన బాజీరావువైపు దృక్కులు ప్రసరింపజేసి సహాయమర్థిం చుట సహజమేగదా! ఛత్రసాలుడు, హిందూ పురాణ సూక్ష్మపవిత్ర సంప్ర దాయాల ఉదహరిస్తూ బాజీరావుకు ఒక అనుకంపా చకిత లేఖను వ్రాసి నాడు. ఇది సర్వహిందూ సౌభ్రాతృత్వమును—సర్వహిందైక్యభావమును ప్రతి హిందూ హృదయాంతరాళములో రేగగొట్టినది.

"బాజీ. రమ్ము! విష్ణువు గజేంద్రుని గాచినట్లు విశ్వాసఘాతుకు డైన యీభీషణ శత్రు ఖరనఖర బంధమునుండి, నన్ను రక్షింపుము" అని ప్రార్థించినాడు బుందేలురాజు.

శివాజి శిష్యుడు—తన పాత స్నేహితుడు, ఇట్లు ముస్లిములచే పరిగొనబడి, హిందువు మరియొక హిందువుని క్లిష్టసమయంలో సహాయ మర్థించినప్పుడు మహారాష్ట్రులను మహోన్నత దేశారాధన క్రియకు రేగ గొట్టక మానుతుందా? వెంటనే బాజీరావు, మల్హారరావు, పిలాజి జాదవు అదిగాగల పన్నెండుగురు విఖ్యాత సేనాపతులతో 70000 సైన్యముతో ఛత్రసాలుని సహాయానికి ఎగవూపిరితో మనోవేగంతో ఎత్తిపోయినాడు. పరాభూతుడై ధమోరా దగ్గర విడిసియుండిన ఛత్రసాలుని కలుసుకొని, బుందేలు అవశిష్టసైన్యాల మరల కూర్చుకొని, అవర్షఋతువులోగూడ బాజీ యానమును సాగించినాడు.

మహమ్మదుఖాను, పిడికిట అణగే ఆచిన్న హిందూరాజ్యాన్ని గెలిచీ, ఛత్రసాలుని ఆ రాజధానినుండి తరిమివేసి, ఆ సులభసాధ్య స్వల్పవిజయా

నికే విశ్రమీగి, తన విజయాలకు ఉచితమైన విశ్రామాన్ని ఆ వానాకాలంలో అనుభవింప దలచుకొని వుండినాడు. ఇట్లు యితడు అవివేక వ్యూహాస్వర్గ సుఖానందంలో వుండగా, హిందూ బలాలు, జడివానల—కారడవుల—దాటరాని కొండల లెక్క బెట్టక, తటాలున మహమ్మదుఖాను బంగేషు సైన్యాలపై బడి, జెయిత్‌పూర్ మైదానాలలో మొగలు దండును యినుప పట్టులో బంధించివేసినారు (1729). చుట్టు ముట్టబడి, దెబ్బదిని, పూర్తిగా ఓడింపబడి, తన ప్రాణాన్ని రక్షించుకోను, యీ ముస్లింసమరకేసరి, బుందేలు మాల్వా రాజ్యాల హిందూ హస్తగతంచేసి, పిరికిపందవలె తప్పించుకొని పారిపోయినాడు. ముసలి బుందేలురాజు మరల రాజలాంఛనాలతో నిజ రాజధానిని సగర్వంగా ప్రవేశించినాడు. విజయదీపిత మహారాష్ట్రి శతఘ్నికర్ణపుట భేదన నిష్ఠుర గర్జనలమధ్య పౌరగణము గగన ముఖరిత ఉత్సాహధ్వనులతో రాజుకు స్వాగతమిచ్చినది.

ఛత్రసాలుడు మహారాష్ట్రిల కృతజ్ఞతా ఋణమును తీర్చుకోను బాజీరావును తన మూడవకుమారుడుగా దత్తస్వీకారముచేసినాడు. ఆయన మరణానంతరం బుందేలు ఖండంలో మూడవభాగం బాజీరావుకు పంచి పెట్టబడింది. మనసుకుతాకే యీ ఒక్క అంశమే—నాటి హిందూకార్యాచరణ విధానానికి మూలకారణం—ఆ భావావేశాన్ని పుట్టించిన సౌనకాల్వ ఎంతటి ఉదాత్తమో రుజువుచేయగలదు. ఇదే బాజీరావునాటి హిందూనాయకులను స్వార్థపూర్ణ సంకుచిత వాంఛాతీతులుగ జేసి, జాతి—రక్త—మత బంధాలతో ఒకటిగా ముప్పురిగొనిపోయినట్లు భావింపజేసి, రాజకీయ దాస్య విమోచనము—భూరి హిందూ సామ్రాజ్యస్థాపన ప్రయత్నాలకు ప్రోద్బల పరచి ఆయత్తము చేసింది,

మాల్వా బుందేలు ఖండాలనుండి మూడవ మొగలు రాజప్రతినిధి గావించిన పలాయనము మహారాష్ట్రిలను ఆ దేశాలకు అధిపతులజేసింది.

అది మొగలు సామ్రాజ్య హృదయభేదనకరంగా, హిందూజాతి విమోక్ష యుద్ధాన్ని సాగించుటకు అనుకూలమైన కేంద్రమైంది.

ఇట్లు మాల్వాబుందేలుఖండ యుద్ధాలు సాగుచుండ, గుజరాతులో గూడ స్థిరస్థాయియైన ఫలితాల మహారాష్ట్ర శస్త్రనివహము—మహారాష్ట్ర రాజకీయ పాండితి సాధించుచుండినవి. పిలాజి గెయిక్వాడ, కాంతాజీ బాందె, ఆతర్వాత ఛిమాజి అప్పారావు సేనాపతులు గుజరాతు మొగలుల వేధించి వేధించి, లొంగగొట్టి, చౌతు—సర్దేశముఖులను మహారాష్ట్రులకు చెల్లించునట్లు రాజప్రతినిధిచేత సంధికి ఒడబరచినారు. కాని, యీ అవ మానకరమైన ఒడంబడికకు ఢిల్లీ మొగలుపాదుషా కోపోద్దీపితుడై, గుజ రాతునుండి మహారాష్ట్రులను తరిమివేయుటకు పెద్ద సైన్యమిచ్చి అభయ సింగును ఆదేశించినాడు. అభయసింగు జయసింగువలెగాక, స్వార్థలా భము—ఉత్కృష్టలకు ప్రాకులాడేవాడు. ఈ ఆశ, తన హిందూధర్మముపట్ల అతనిని విముఖుని జేసింది. ఇతర హిందూరాజులవలె హిందూ రాజకీయ స్వాతంత్ర్య సంపాదనకు తాను చాలడన్న విషయం గుర్తించలేక పోయి నాడు. ఈ మహోన్నత కార్యసాధనము అప్పటికి ఒక్క మహారాష్ట్రమండ లికే సాధ్యమైనపని అని వెల్లడై యున్నది. అభయసింహుని స్వార్థతృష్ణ— నిజ ఐశ్వర్యాభివృద్ధి యీ ఆదర్శముపట్ల అంధునిజేసి, నికృష్ట అత్యాచా రాలు నెరపజేసినవి. గుజరాతులో హిందూ పుణ్యక్షేత్రము—దాకోరుకు, రాయబారాల నెపంతో నమ్మించి పిలాజిగైక్వాడను పిలిపించి, ఆ స్థలపవి త్రను—ఒక రసపుత్రుని విశ్వాసవాక్యమును, రెంటిని భంగపరచి అన్యృత పరచి పిలాజిని హత్యజేయించినాడు. కాని, వెంటనే తాను ఒక ఘోర, విశ్వాసఘాతుక నేరమునే గాక ఒక పొరపాటునుగూడ చేసినట్లు గ్రహించినాడు.

ఇక్కడ ఒక నాయకుని, అక్కడ మరొకనేతను హత్యచేయగానే

లొంగిపోవు భీరువులుగారు మహారాష్ట్రులు. యుద్ధము, మృత్యువు శైశవమునుండి వారి సంగాతగాండ్రు. కొన్ని పురుషాంతరాలుగా రణభూమి యందే వారు పెరిగినారు.

బుందేలు—మాల్వాలయందువలెనే గుజరాతులోగూడ హిందువులు మహారాష్ట్రులపట్ల సానుభూతినిజూపి, వారి సహాయమర్థించి, కొన్నిసమయములందు యుద్ధాలలో వారికి తోడునీడై నిలిచిరి. కోలులు – భిల్లులు– వఘేరీలు మొదలగు గుజరాతు వీరజాతులు తాము ప్రేమించిన పిలాజీ వీరుని వంచక దురంతానికి క్రోధ పూర్ణమానసులై, యీ మరణానికి ప్రతిక్రియచేయ కృతనిశ్చయులైనారు. మహారాష్ట్రులు పలుముఖాల గుజరాతును క్రమ్ముకొన్నారు. ముట్టడించి 1732 లో బరోడా నగరాన్ని పట్టుకొని, ఆ రాష్ట్రానికి దానిని రాజధానిజేసినారు; నేటికిని అదే రాజధాని. దీనితో అభయసింగు గుజరాతులో కాలు నిలదొక్కలేక పోయినాడు. ఈలోపల దామాజి గైక్వాడు, అభయసింగు స్వరాష్ట్రము—జోద్పూరుపైబడి, అతనిని సైన్యాలతోగూడ అక్కడకు రప్పించినాడు. వెంటనే దామాజి సుడిగాలివలె వెనుదిరిగి అహమ్మదాబాదు స్వాధీనము చేసుకొన్నాడు. దీనితో 1735 ప్రాంతాలకు, గుజరాతు సంపూర్ణముగ మొగలుల చేయిజారి పోయినందున, మొగలు రాజప్రతినిధులు ఆ రాష్ట్రానికివచ్చుట సాధ్యముకాకపోవుటే గాక, అనవసరముగూడ అయింది.

---

# 9. హిందూసాగర విముక్తి

హిందూ పవిత్రభూమిని నిర్లేచ్ఛంగా చేయను, హిందూ విమోచక యుద్ధాన్ని మహారాష్ట్రులు మొగల సామ్రాజ్య గర్భంలోకి సాగిస్తూ–

అదేసమయంలో, పశ్చిమదిశనుండి తమపై విజృంభించుటకు సమయా నికై నిరీక్షించుచుండిన విదేశీయుల ప్రాబల్యంనుండి హిందూ సముద్రాల విడిపింప తీవ్ర ప్రయత్నాల చేయుచునే వుండినారు. అప్పటికే యీదేశాన్ని వశంచేసుకొని యుండిన ముస్లింల వలెనే, యూరపుఖండ వర్తకజాతులు పరమటి సముద్రాల ఆక్రమించుకొనుటవల్ల గూడ తమ దేశభద్రతకు ముప్పువాటిల్లినదని ఆదియందే గ్రహించగలిగినారు. విశ్రుత మహారాష్ట్ర నాయకుడు—రాజనీతికోవిదుడు—అమాత్య రామచంద్రపంత్ తన "రాజ్య నీతి" గ్రంథములో వివరించిన రాజనీతి—రాజధర్మాలవల్ల శివాజి, ఆయన అనుయాయులు, ఐరోపీయుల ఆశల—తృష్ణల పరమటితీరాన ఎట్లు విశ్లే షంగా నిర్మూలించ దలచుకొన్నారో విశదము కాగలదు. ఈ రామచంద్ర పండితుని రాజనీతి సారము సంస్థానపాలనా విధాన పత్రముగ అంగీక రింపబడి, దేశమందంతట విరివిగా పంచిపెట్టబడినది. నాటి పరిస్థితులలో సాధ్యమైనంతవరకు, శివాజీ ఛత్రపతి పరమటి తీరంలో విదేశీయ ప్రాబ ల్యాన్ని అణచివేయుటకు తీవ్రంగా ప్రయత్నించి, బలయుత మహారాష్ట్ర నౌకాదళ నిర్మాణానికి పునాది వేసినాడు. దీనికి పట్టుకొమ్మగా ఒకశతాబ్దము వరకు హిందూసాగరముల రక్షించి, పాలించిన సర్వాంగవర్ధిత జలదుర్గాల చాల నిర్మించినాడు.

రాజారాం దినాలలో, ఔరంగజేబు బలగం దక్కనును సమగ్రంగా ఆక్రమించుకొన్నప్పుడు మహారాష్ట్రులు ఒక సక్రమబద్ధ కేంద్రప్రభుత్వాన్ని నెలకొల్పలేక పోయినారు. ప్రతినాయకుడు, తనకు ఓపినకొలది, వీలై వప్పుడు, వీలున్నచోట సమష్టి శత్రువుతో పోరాడుచుండినాడు. ఇక మొగ లులను పరమటి వాగర్తనుండి పారదోలుపని కనోజి అంగ్రే—గుజారులు, తదితర మహారాష్ట్ర సేనాపతుల భుజాలపై బడినది. వీరి కార్యదీక్షవలన ఇంగ్లీషులుగాని, పోర్చుగీసులుగాని, డచ్చివారుగాని, సిద్దీలుగాని, మొగలు

లుగాని, వేరువేరుగాగాని, అందరూకలిసిగాని, ఎదిగే మహారాష్ట్ర నావికా బలాన్ని అణచలేకపోయినారు — చంపలేక పోయినారు. బొంబాయి నౌకాశ్రయానికి దక్షిణం పదహారుమైళ్ళలోవున్న ఖాందేరిదేవి, మహారాష్ట్ర నావికాపతి—కనోజి అగ్రే స్వాధీనంలో వున్నందువలన ఆంగ్లేయులకు బాధాజనకముగా వుండినది. మహారాష్ట్ర ప్రాబల్యానికి ముందే కొంకణతీరాన్ని ఆక్రమించుకొని వుండిన పోర్చుగీసుల విశాలాధికారము, జంజీరా నవాబు—సిద్దిశక్తి, యివి లేకుండినచో తమ్ము మహారాష్ట్రిలు ఎప్పుడో ముగించి యుందురని ఇంగ్లీషువారు బాగా తెలుసుకొన్నారు.

ఇందరు శత్రువులబారినుండి రక్షించుకొనుటకు, అగ్రే ఒక పెద్ద సేనను పోషించవలసి వచ్చింది; దీని పోషణకు అరేబియా సముద్రంలో వ్యాపారంచేసే ఓడలమీద చౌతుసుంకము వసూలుచేసినాడు. మహారాష్ట్రిలు హిందూసాగరాలకు, తామే యజమానులని సహేతుకంగా భావించినారు. ఇక, తమ అనుమతితోనో అనుమతి లేకనో పరమటి సముద్రాలలో వ్యాపారంచేసే విజాతి నావలపైన పన్ను విధించుట సహజమే! కాని, ఇంగ్లీషువారు, ఇంక కొందరు ఐరోపీయ వర్తకులు యీ హక్కును గట్టిగా నిరోధించినారు. అందువలన కనోజి సరకులతో—మనుష్యులతోగూడ వారి నావల పట్టుకొని, సుంకానికి ప్రతిగా వీటిని స్వాధీనపరచుకొని, నిరోధానికిగా వారిని శిక్షించినాడు. 1715 లో బొంబాయి గవర్నరుగా నియమింపబడిన ఛార్లెస్ బూన్, అగ్రే దుర్గాన్ని నిర్మూలించ దలచుకొన్నాడు. ఒక బలవత్తర నౌకాదళాన్నిగూర్చి, మహారాష్ట్రిల రేవు పట్టణం—విజయదుర్గం పైకి పంపినాడు. ఆసమయంలో ఇంగ్లీషువారు కోపాగ్నిని గ్రక్కుచుండినారు. వారి నౌకలపేర్లే మహారాష్ట్రాధికారాన్ని ధిక్కరించినవి. ఒకదానిపేరు "వేటకాడు" ఇంకొకదాని

పేరు "సార్వడేగ" మరియొకటి "ప్రతీకారం" నాల్గవది "విజయం." ఇవి యుద్ధానికిముందు ఆ పడవలపేర్లు! ఈ అజేయ నౌకాబలానికి తోడు— భూమార్గంగా విజయదుర్గాన్ని ముట్టడించుటకు, ఏరికూర్చిన వేలకొలది ఇంగ్లీషు సోల్జర్ల పటాలం ఒకటి నియమింపబడింది. 1717 ఏప్రెల్ 17 తేది క్రోధఘూర్ణిత యీ నావికాబల శతఘ్నులు విజయదుర్గంపైన అగ్ని వర్షాన్ని కురిపింపసాగినవి కాని, వెంటనే మహారాష్ట్ర దుర్గాలు లక్ష్య యిండ్లుగావని తెలుసుకొన్నారు. కోటలోపల మహారాష్ట్రులు ధీరంగా— ఫిరంగిగుండ్ల ధాకకు నిలిచి, బురుజుల గర్భంలో సురక్షితంగా తలదాచు కొని, ఆంగ్లేయుల విఫల యత్నాల వెక్కిరించుచుండినారు. కోట లొంగని దానికి కోపపడి, ఇంగ్లీషులు బుసకొట్టుచు కోట గోడల నిచ్చెనలతో ఎగబ్రాక యత్నించినారు—కాని, మహారాష్ట్రులు వారిని పరాభవపరచి వెనుకకు తట్టివేసినారు. ఆశలన్నీ అడుగంటినవి—చివరకు ఆంగ్లే యులు వెనుదిరిగి పలాయనము గావించినారు. ఇదిచూచి మహారాష్ట్రులు ఫిరంగి గుండ్లను వారివెంట బంపి వారి గమనవేగాన్ని అతిశయింప చేసినారు.

మరుసటి సంవత్సరం బూనుదొర ఖాందేరిదుర్గంపై బడినాడు. కాని వెంటనే చావుదెబ్బలతో కాలికి బుద్ధి చెప్పినాడు. అదిమొదలు భారతదేశం లోని ఇంగ్లీషు అధికారానికి మహారాష్ట్రులపోరు దినదినానికి ఎదిగిపో తుండినది. చివరకు ఇంగ్లీషురాజు, నాలుగు ప్రచండయుద్ధనావల గూర్చి, ఆరితేరిన కామడోర్ మ్యాథ్యు అనే ఒక పెద్ద నావికోద్యోగి అధికారం క్రింద పంపినాడు. తమ ప్రయత్నాన్ని గట్టిపరచుకోను, ఇంగ్లీషులు పోర్చు గీసుల సహాయంకూడ అపేక్షించగా, వారు ఉల్లాసంగా యిందు పాల్గొని మహారాష్ట్రులపైకి నడచినారు. 1721 లో బలవత్తరమైన యీ రెండు యూరోపీయ రాజ్యాలు ఒక్కుమ్మడి మహారాష్ట్రులపై బడినవి. అప్పుడు

భూమిమీద, సముద్రంమీద మహారాష్ట్రులు అత్యద్భుతంగా, నిపుణంగా పోరాడి, యూరపు సైనికుల కోటగోడల దరియనీయకుండా జేసినారు. అశక్తక్రోధంతో నురుగులు గ్రక్కుతూ, ఆ కార్యవ్యగ్రోష్ణంలో మ్యాథ్యూ సేనాపతి స్వయంగా యుద్ధసమ్మర్దంలోకి దూరి, వెంటనే ఒక మహారాష్ట్రి పదాతి బల్లెపు పోటుకు ఎరై పోయినాడు. ఆ మరాఠిబరిసె ఆంగ్లసేనాపతి తొడలగుండా దూరిపోయినప్పటికిని ఆ సేనాని యీచిన్నపోటుకు లొంగక, పొడిసిన సైనికునిపైకి వెర్రికోపంతో దూకి, తన రెండు పిస్తోళ్ళనుదూసి అతనికి గురిచేసినాడు. కాని, వాటిని తోటాలతో దట్టించనుమాత్రం మరచి పోయినాడు. దీనికిదోడు విదేశమిత్రమండలి సైన్యాలకుగూడ అదృష్టము చాలినదికాదు. చివర ప్రయత్నంగా అన్ని అంగాల కోల్తలపరచుకొని మరల కోటపై బడినారు. కోటగోడలతాకి పైకి ఎక్కను యత్నించగానే, మహారాష్ట్రులు దారుణ దృఢనిశ్చయంతో, యుద్ధనైపుణితో ప్రతిఘటించి దెబ్బదీసినందున ఐరోపీయులు బొబ్బలిడుచు వెనుకకు పరుగెత్తిపోయినారు. ఇదేసమయంలో మరియొక మరాఠి దండు భూమిమీద పోర్చుగీసు సైన్య పార్శ్వాన్ని తాకింది. దీనితో పోర్చుగీసులు భయవిహ్వాలులై, ప్రాణాల దక్కించుకోను పారిపోయినారు. వెంటనే ఇంగ్లీషుసేన గూడ సమస్తము దిగవిడిచి పలాయనం అయింది. దీని ఫలితంగా మహారాష్ట్రులకు చాల ఫిరంగులు—తుపాకులు—మందుగుండు సామాను దొరికినవి. ఇక ఈ రెండు ఐరోపీయ బలాలలో మిగిలిన యుద్ధశక్తినంతా, యీ అవమాన కర పరాజయాల బాధ్యతా రోపణాలకై వాగ్యుద్ధంలో వ్రయించుకొన్నారు. ఆతర్వాత అధోముఖులై పోర్చుగీసులు ఛోలు పట్టణానికి నడిచిపోయి నారు. ఇంగ్లీషులు బొంబాయికి లంగరు, చాపల ఎత్తినారు. దీనిపిమ్మట చాలాకాలంవరకు, చౌతుకొరకు మహారాష్ట్రులు తమ నౌకల మలగొట్టి—లాగుకొనిపోదురేమో అన్న భయంతో ఇంగ్లీషు కంపెని తమ నౌకాయా

నానికి ఆయుధబల సహాయాన్నిగూర్చినారు. త్వరలోనే, ఇంగ్లీషువారి "విజయము" నిజసేనాపతివలెనే గుండ్లను బారుచేయను మరచిపోయింది. "ప్రతీకారము" పగసాధించలేకపోవడమే కాకుండ, మహారాష్ట్రిల చేజిక్కిపోయింది. 1724 లో డచ్చివారికిగూడ యిదేగతి పట్టింది. వారు ఏడు నావలతో, రెండు ఫిరంగి ఓడలతో, ఒక సైనిక పటాలంతో విజయ దుర్గాన్ని ముట్టడించినారు. వారుగూడ మహారాష్ట్రి స్థైర్యపాషాణాల ఏమీ చేయలేక పోయినారు. తదుపరి, ధీరవృద్ధ మహారాష్ట్రి సేనాధిపతి నిర్నిరోధంగా, నిరోధాతీతంగా, హిందూసాగర తరంగాలపైన జయనావల నడిపించినాడు. భూమిమీద కొంకణంలో సిద్ది, దక్కనులో నైజాము, గుజరాతు మాల్వా బుందేలు ఖండాలలో మొగలులతో నిరంతరం తీవ్ర యుద్ధాల సాగించుచునే యీ వీరవిహారాన్ని ఆయన—ఆయన మహారాష్ట్రిలు చేయగలిగినారు.

కనోజి అగ్రె 1729 ప్రాంతాల చనిపోయినాడు. ఆ ఉత్తరక్షణము నందే మరియొక చారిత్రిక పురుషుడు కొంకణ రాజకీయ రంగంలో ప్రవేశించి, మహారాష్ట్రిమండలి నాయకుల హృదయాల ఆకర్షించినాడు. ఈయనశక్తి — జనసామాన్యమునందలి రేగిన హీనరాగద్వేషాలవల్ల మహారాష్ట్రోద్యమము మాలిన్యము గాకుండ కాపాడినది. వీరే బ్రహ్మేంద్రస్వాములవారు! వీరు సాహూ—బాజీరావు — ఛిమాజి — అగ్రేవంశీకుల—ఇంకను శతాధిక మహారాష్ట్రిలకు కులగురువులు. వీరు, గొప్ప ఉదాత్త దేశారాధన తత్పరత, ఆదర్శాలచే నడుపబడి, నాటి సంకీర్ణ భావసమ్మర్దమునుండి నైతిక—ఆధ్యాత్మిక సూత్రాల ఏరి, ప్రజానీకం కండ్లఎదుట—స్వధర్మ, స్వరాజ్య ఆదర్శమును నిలుపగలిగినారు. స్వాముల వారు బాల్యమునుండి కఠోర యోగమార్గావలంబియై కొన్ని మహాద్భుత యోగసిద్ధుల బొందియుండినారు. వీరు ఏటేట ఒక నెలపాటు సంపూర్ణ

యోగ సమాధియందు ప్రవేశించి, భూస్థాపితుడై యుండెడివారు. రామ దాసు వలెనే వీరుగూడ విశేషముగ దేశసంచారముచేసి భారతదేశమందలి హిందూ పవిత్రక్షేత్రాలనెల్ల సేవించి, హిందూ దాస్యము—రాజకీయ పరాధీనతల కాటును బాగుగ గుర్తించి, ఖిన్నపడినారు.

వారి ఆత్మగత మాతృదేశారాధనాగ్నిని రాజజేసి, నిరంతర దీర్ఘ నాళాపూర్ణ ప్రచండజ్వలనంగా చేయుటకు ఒక స్వల్ప విస్ఫులింగము మాత్రమే కావలసి యుండినది. దీనిని జంజీరా ముస్లింపాలకులు సమకూర్చినారు. ఈ సిద్దీలు మహారాష్ట్రులకు ఆగర్భశత్రువులు, మహారాష్ట్రి ప్రాబల్యం అట్లే దినదినాభివృద్ధి జెందుచో, కొంకణతీరంలో, తమ అన్యాయార్జిత రాజ్యం త్వరలోనే తుదముట్టగలదని బాగుగ తెలిసికొన్నారు. కాబట్టే, వీరు ఎప్పుడూ, మహారాష్ట్రులకు వ్యతిరేకంగా—ఇంగ్లీషు డచ్చి, పోర్చుగీసులకు సహాయము చేయుటేగాక, పలుమారు మహారాష్ట్రి రాజ్యాన్ని కొల్లగొట్టినారు. ఇంతేగాదు—ముస్లిం అంధవిశ్వాసకులకు సహజమైన అనాగరక ఆదిమక్రౌర్యంతో, హిందూ బాలబాలికల అపహరించి, బలవంతంగా ఇస్లాంలోకి కలుపుకొని, హిందూ పవిత్రాలయాల నేలమట్టంచేసి, హిందూ ప్రజకు అనంతకోటి అత్యాచారాల చేసినారు. బ్రహ్మేంద్రులవారి సమాధి యోగనిష్టలచే పవిత్రీభూతమైన ప్రేమనిలయము—ఆ పరశురామసన్నిధి వారి అంధ మత వీరావేశాలకు గురియైనది. సిద్ది—రాయి రాయిగా పెరికించి దేవాలయాన్ని ధ్వంసంచేసి. దేవాలయ నిధి నిక్షేపాల దోచి, చేజిక్కిన బ్రాహ్మణుల చిత్రవధ గావించినాడు. ఈ హింసా మలినచేష్టలు బ్రహ్మేంద్రస్వామివారి మానసంలో ఆర్పరాని పవిత్ర క్రోధాగ్నిని రగులుకొల్పినవి, ఈ హృదయజ్వలనము, "ఏకం సత్ విప్ర బహుధావదంతి" అన్న శాశ్వతసత్య వాక్యానుగత సర్వమత సహనము—మంచిచెడ్డలు లెక్కగొనిన అతీతమానవ సౌమనస్య సిద్ధాంత

ముల మైకంలో పడిపోయిన స్థితప్రజ్ఞులు—హిందూసాధుపుంగవులకు సహజమైన మానసిక జాడ్యమును యీయనయందు మాన్పి, శూన్యశుష్క సిద్ధాంతముల ఆయన మానసమునుండి పారద్రోలినది. వెంటనే, హిందూ జాతి విమోచనకు—హిందూ రాజకీయస్వాతంత్ర్యమునకు తన యావ శ్శక్తిని వినియోగించ కృతనిశ్చయులైనారు స్వాములవారు.

ఆ ప్రాంత భూమియందు వ్యాపించిన స్వాములవారి భక్త్యధికార ములకు భయపడి, చెనకలేక, సిద్ది ఆయనతో తీరనిబలవత్తర వైరమును కలిగించుకొనుటకు భయపడి, మునుపటివలెనే స్వామీజీని ఆ శిధిలాలయము నందే యుండ ప్రార్థించినాడు. కాని, స్వామి "దేవబ్రాహ్మణుల నీవు వినాశముగావించినావు—ఇక తగిన ప్రతీకారాభిశాపము నిన్ను దగ్ధంచేయ గలదని" గర్జించినారు. అగ్రేగూడ ఆయనను శాంతపరచి కొంకణమున నిలుపలేక పోయినాడు. "విశ్వాసఘాతుక విదేశపాలనక్రింద మ్రగ్గే యీ దేశంలో గుక్కెడు నీళ్ళుగూడ త్రాగను. ప్రతీకారదీక్షమైన హిందూసైనిక బల అగ్రగామిగా మాత్రమే మరల యీకొంకణమున నేను కాలిడగలను" అని, ప్రతిజ్ఞావాక్యాలపలికి స్వాములవారు సాతార నగరంచేరి, నిరంతరము హిందూత్వ విరోధులు అవిశ్వాసకులు—జంజీరా సిద్దీలు, గోవా పోర్చు గీసులపై ద్వేషానలం రగుల్కొల్పుచునే యుండినారు. ఇప్పుడు బయట బడిన వారి నాటివ్రాతలు—భాషణాలు, కాశ్మీరము మొదలు కన్యాకుమారి వరకు గల సర్వహిందూ పుణ్యభూమి రాజకీయస్వాతంత్ర్య సంపాదన, హిందూ ధర్మరక్షణ అను పవిత్ర కార్యదీక్షాగ్నికి ప్రబోధ అర్ఘ్యేంధనాల సదా ఒసంగుచు, మహారాష్ట్రీల ఉత్తేజపరచుచుండినట్లు వెల్లడి అగు చున్నది.

బ్రహ్మేంద్రస్వామి శిష్యులు—సాహు, బాజీరావు లిద్దరు, సిద్ది— అతని సహాయకులైన మహారాష్ట్రీలు నెరపిన ఘోర దుష్కార్య ప్రతీ

కారమునకు పన్నాగముల పన్నుచు, కొంకణములో సిద్దీలు—పోర్చు గీసులపై యుద్ధము సాగించుటకు తగిన అవకాశముల సమకూర్చుకొను చుండినారు. ఆ సమయంలో వారు ఢిల్లీనుండి ఆర్కాటువరకు ఒకేపరి పలురంగాలలో వివిధ శత్రువుల ఎదుర్కొనవలసి వచ్చుటచే, కొంకణ యాత్రకు తగిన అదనుకు ప్రతీక్షించుచుండినారు. ఆ సమయంలో రాజ్యా నికై అంతఃకలహాల పెంచుకొని, ఒక సిద్దీవంశీకుడు సహాయమర్థించి మహారాష్ట్రుల అండజేరినాడు. మహారాష్ట్రులు తమ రాజనీతి ఫలించినదని సంతోషపడినారు. సాహు యీ దీర్ఘకాల నిరీక్షిత ఉదంతము వినగానే సంతోషంతో ఉబ్బి తబ్బిబై బాజీరావు కిట్లా ఆజ్ఞాపత్రం పంపినాడు:— "ఈ జాబు చదువకు—మొదట గుర్రమెక్కి ఆతర్వాత దీన్ని చదువు." 1733 లో యుద్ధకాహళమును ఊదినారు. మహారాష్ట్ర వాహినులు, పశ్చి మాద్రి దిగివచ్చి తలఘోషల దుర్గాన్ని పట్టుకొని, మహమ్మదీయ బలా గముల ఒకదాని తరువాత మరియొకదాన్ని నిర్మూలిస్తూ సిద్దీరాజ్యాన్నంతా ఆక్రమించుకొన్నారు. వెంటనే బాజీరావు రాయగడమునే తిరిగి పట్టు కొన్నాడు ఈ విఖ్యాతదుర్గము శివాజీ పట్టాభిషేకము జరిగినచోటు!— ఇదే ఆయన సింహాపీఠిక నెలకొన్న స్థలము! ఈ కోట స్వాతంత్ర్యయుద్ధ దినాలు మొదలు మహమ్మదీయుల హస్తగతమై యుండినది. తమ రాజాధిరాజు కోట యిట్లు తిరిగి హిందువులకు దక్కినదన్న సంతోష వార్తతో యావత్తు మహారాష్ట్రభూమియందలి పల్లీ పట్టణాలు ఆనందత రంగితమై పోయినవి. దీనికి మహారాష్ట్రుల సముద్ర విజయాలుగూడ తోడైనవి. మానాజి అగ్రె జంజీరదాపున సిద్ది నావికాబలాన్ని పీచమణగ గొట్టినాడు.

దీనితోగూడ ఇంగ్లీషువారు వ్యాకులపడి, మొదట రహస్యంగా— ఆతర్వాత బహిరంగంగా శస్త్రసహాయంచేసి, చివరకు మహారాష్ట్రులను

ఎదిరించను హోల్డేను చమూపతిక్రింద ఒకపాటి సైనికదళాన్నిగూడ పంపినారు. కాని, ఖండోజీ—నరహర్—ఖర్దె—మోరె—మోహితె ఆదిగాగల వీరులు, మధురాబాయి అగ్రెవంటి వీరమాతలు హిందూధర్మ సంరక్షక యుద్ధాన్ని సాగించినారు. ఈ విఖ్యాత వీరవనిత బ్రహ్మేంద్రస్వామిజీకి వ్రాసిన లేఖలలో—హిందూకాశ్యపి విదేశీయ బంధవిముక్తినొందగా ఆమె అనుభవించిన మాతృదేశారాధనౌత్సుక్యము, శత్రువులనుండి గుంజుకొనిన పట్టణ హర్మ్య శిఖరాలపైన హిందూధ్వజము మరల సగర్వంగా తల ఎత్తుటనుచూచి ఆమె అనుభవించిన స్వచ్ఛగౌరవోన్మీలనము ప్రకటితమగుచున్నవి. చివరకు 1736 లో చిమాజి అప్పారావు రేవాస్ యుద్ధంలో అబిసీనియన్ బలాల నుగ్గునూచము చేసినాడు. అందు సిద్దీ బలముల అరబ్బీ నాయకుడు, కొంకణ హిందువుల కరకువిరోధి, పరశురామాలయమును నేలచదరము చేసిన హిందూధర్మ విఘాతుకుడు శిరచ్ఛేదము చేయబడి, తానుచేసిన ఘోరాలకు తగినశాస్తి ననుభవించినాడు. అతనితో గూడ, మరియొక ముస్లింసేనాపతి ఉన్దేరి, పదకొండువేల సైనికులు నిహతులైనారు.

తమ మత విద్రోహులపై అక్కసముదీరా కసిదీర్చుకొని, హిందూజాతి గౌరవాన్ని నిలిపిన విజయలక్ష్మీ శోభితుడు—వీరనాయకుడు చిమాజీపై సమస్త కొంకణము, సమస్త మహారాష్ట్రము కృతజ్ఞాపూర్వక ధన్యవాదాల ఆశీస్సుల ధారాపాతంగా కురిపించినవి. ఛత్రపతి సాహూ గూడ ఆనందాతిశయంతో—"సిద్ది, రావణునంతటి క్రూరపిశాచాము. వానిని చంపి నీవు సిద్దీవంశాన్ని సమూలంగా నిర్మూలించినావు. నీకీర్తి దిగంతాలకు ప్రాకివున్న"దని ఒక ప్రశంశాలేఖను వ్రాసినాడు. ఆయువక విజయుని ఆస్థానమునకు రప్పించి, బహుమతుల గౌరవలాంఛనాల ఒసంగి భూషించినాడు ఛత్రపతి. పరస్పర అసూయానల దగ్ధులై, చిల్లి

జగడాలతో ఉత్సాహాన్ని వ్రయింపజేసుకొనే మహారాష్ట్రులను ఏకోన్ముఖముగా నిలిపి, నిజదేశధర్మములపట్ల వారి ఉత్సాహాల రేగగొట్టి, వారు సాగించుచుండిన హిందూ విమోచక యుద్ధముయొక్క నైతిక ఆధ్యాత్మిక ఆశయాల ఘనపరచుచు; ఆ ఉద్యమానికి ప్రాణముగా వుండిన నటన సూత్రధారి బ్రహ్మేంద్ర స్వామికి ఆనందాతిశయంలో. దేవునికి కృతజ్ఞతాభి వాదనాలు చేయుటకుగాని, తన శిష్యుని దీవించుటకుగాని శక్తిలేకపోయింది. చివరకు పరశురామ భగవానుని పవిత్రభూమిని విముక్తిజేసి, హిందూ ధర్మమును రక్షించి బ్రహ్మేంద్రులు కృతకృత్యులై

"శ్యామలాంచీ క్షితి కేలీ।
కొంకణాంత ధర్మరాఖిలా।"

అని గానముచేసినారు. ఇట్లు సిద్ది అణచివేయబడి, అతని ముస్లిం రాజ్యము అనామకమై, హిందూసామ్రాజ్యానికి తలవంచి ఒక క్షుద్ర సామంతరాజ్యమైనది. దీనితో పోర్చుగీసులు ఏకాకులైనారు. వారి సులభలభ్య రాజ్యభాగాలు, పరమటితీరంలో ఖంబాయత్‌నుండి సింహళమువరకు వారు నెరపుచుండిన విశాల రాజ్యాధికారము మహారాష్ట్ర విజృంభణముతో క్రమేపి సన్నగిలసాగింది. వీరిఅన్యమత అసహన క్రౌర్యము, మతాంతరుల వేధించి వధించిన గాథలు మహమ్మదీయ హత్యకాండకు ఆవంతగూడ తీసిపోవు. మధ్యయుగంలో స్పెయినుదేశంలో నెరపబడిన క్రూరమతవధలుమాత్రమే యీ పోర్చుగీసు దౌష్ట్యానికి తులతూగగలవు. ఇట్లు కొంకణ హిందూ స్వజనులు యిప్పుడు స్వతంత్రులై సుఖము లనుభవించుటనుజూచి, ఒక శతాబ్దంగా ముస్లిం నిరంకుశపాలన క్రింద, మతవిద్వేషాలమధ్య బాధపడుచుండిన పరిసర హిందూప్రజ, తమదాస్య విముక్తికి మహారాష్ట్ర పతాకము వైపునకు దీనదృక్కుల ప్రసరింపజేయుట సహజమేగదా। దీనితోగూడ

హిందూ మానసము ఆశాచకితమై, దేశారాధన పరాయణతతో ఉప్పొంగి పోయినది. అదిమొదలు పోర్చుగీసులు, తమ ఏలుబడిక్రిందనున్న కొంకణములో హిందూత్వమును నిర్మూలించుటకు గావించిన కఠోరచర్యలను, గోవా పట్టణమునందు నెలకొల్పిన మత విషయక దారుణదండన సభను తీవ్రముగ నిరోధించసాగినారు. బాజీరావు విజయపరంపరలు, తమ పొలి మేరల తాకిన మరాఠిదండు కోలాహలము—యివన్నీ పోర్చుగీసులకు భయవిభ్రమాలగూర్చి పిచ్చెత్తించినవి. నిస్పృహాజన్యమైన పొరబాటు వల్ల, పోర్చుగీసులు హిందోద్యమాన్ని అణచి, అది జనింపజేసిన నూతనాశయాల, ధిక్కారభావాల తుదముట్టింపను విశ్వప్రయత్నాల హృదయశూన్యంగా సాగించినారు. పాత ప్రమాణ పత్రాలు ఇట్లా వాకొంటున్నవి: "హిందూ భూస్వాముల విశాలక్షేత్రాల హరించినారు. పల్లెల చుట్టుముట్టి బలవంతముగా గ్రామస్థులందరిని క్రైస్తవమతములోనికి కలుపుకొన్నారు. హిందూ బాల బాలికల ఎత్తుకొని పారిపోయి, హిందుమతము విడనాడని వారిని బంధించి—బానిసలజేసి—చివరకు వధించినారు. బ్రాహ్మణులే ముఖ్యముగ వారి క్రోధాగ్నికి గురిచేయబడినారు. వారిని వారివారి యిండ్ల నుండి బయటికి రానీయక చెరయందుంచినారు. బహిరంగముగా జరుగు ప్రతి హిందుమతకార్యము నిషేధింపబడినది. అథవా, ఎవరైన స్వగృహములందే వేదవిధుల నెరపుచుండినట్లు తెలిసిన పోర్చుగీసు సైనికదుండగీండ్రు ఆ ఇంటిని చుట్టుముట్టి, గృహస్థుల బంధించి మతవిచారణ సభకు గొనిపోయి, బలవంతంగా తమ మతములోనికి కలుపుకొనేవారు. నిరాకరించినవారిని బానిసలుగా అమ్మో—చంపో కార్యాన్ని పూర్తి జేసేవారు."

ఈ నిర్బంధము ఎంత తీవ్రముగా సాగుచుండినను, హిందూనాయకులు పోర్చుగీసువారి యీపైశాచిక ఆజ్ఞల ధిక్కరించుచునే యుండినారు.

ఈ మ్లేచ్ఛ క్రోధానికి వేనకువేలు బలి అయినారు. చివరకు బస్సీనుప్రాంత దేశముఖులు—దేశాయిలు ఆదిగాగల హిందూనాయకులు, బాజీరావు, సాహుఛత్రపతులతో రహస్యయోచనలు సాగించి, హిందూధర్మస్థాపనకు—హిందూజాతి విమోచనకు—హిందూదేశ స్వాతంత్ర్యానికి మహారాష్ట్రీల సహాయమర్థించినారు. మలాదు జాగీరు సర్దేశాయి, వీరుడు—ప్రజానురంజకుడు—హిందువులలో హిందువు—అంతాజీ రఘునాథుడు, పోర్చుగీసువారి మత అనుష్ఠాన నిషేధాజ్ఞను బహిరంగంగా ధిక్కరించి, తన సంస్థానప్రజలనుగూడ అట్లే ధిక్కరించమని ప్రోత్సాహపరచి, పోర్చుగీసు హింసావిధానానికి గురియైనాడు. గోవా పోర్చుగీసులు రఘునాథుని బంధీజేసి, మడిమ్మాన్యాల ఆక్రమించుకొని, హింసా న్యాయాస్థానానికి పంపినారు. అదృష్టవశాత్తు తప్పించుకొని, రఘునాథ అంతాజి సురక్షితంగా పునహాచేరినాడు. అక్కడ ఒక రహస్యవిధానాన్ని పన్ని—మహారాష్ట్రీలు ఆదేశంలో కాలిడగానే, సర్వసహాయాలు చేయుటకు ప్రయత్నాల పూర్తిజేసి బాజీరావుకు వార్తనంపినాడు. పోర్చుగీసు కొంకణ అశేష హిందూజనము బాజీరావును, హిందు మతవిరోధి నిర్మూలనానికిగా ఉద్భవించిన అవతారపురుషుడుగా భావించి పూజించుచు, ఆ దివ్య జగత్పరిత్రాణుని ఆగమనానికై ఉవ్విళ్ళూరుచు ప్రతీక్షించుచున్నారని గూడ తెలియజేసినాడు.

ఆ సమయంలో, మహారాష్ట్రీలు ఉత్తరాన తీవ్రయుద్ధాలు సాగించుచుండినను, వివిధభూరి యుద్ధ సన్నాహాలకు ధనవ్యయము ఎదిగి ఎదిగి కొంత బాధాజనకమైనను, బాజీరావు కొంకణ ప్రాంత స్వమతస్థుల ఆర్తినినాదాల పెడచెవిని బెట్టువాడుగాడు. అతి త్వరితంగా, రహస్యంగా—జాగరూకతతో—పార్వతీదేవి ఉత్సవ మిషతో బాజీరావు ఒక పెద్ద సేనను పునహాలో సమావేశపరచినాడు. ప్రతివానిపని రాబోవు కార్యవిధానము

నిర్ణయింపబడినవి. ఛిమాజీ అప్పారావు సర్వసేనాధిపతిగా అభిషిక్తుడై నాడు. రామచంద్రజోషి—అంతాజీ—రామచంద్ర రఘునాథుడు—ఇంకను తక్కుంగల నాయకులు తమ తమ నిర్దిష్టస్థానాలకు పంపివేయబడినారు. 1737 లో మహారాష్ట్రులు పోర్చుగీసువారి ఠాణా దుర్గాన్ని ముట్టడించి నారు. కోటను చివరవరకు కాచుకొని పోర్చుగీసులు లొంగిపోయినారు. ఈ జయోత్సాహంతో మహారాష్ట్రులు సాల్‌సెట్‌పై వెల్లువవలె పడినారు. శంకరజి కేశవ సేనాని ఆర్నాల దుర్గాన్ని పట్టుకొన్నాడు. జోషి ధారవ ఇతర పార్శ్వక దుర్గాల ఆక్రమించుకొన్నాడు. గోవాయందలి అధికారులు, యీ పరాజయాలకు అలజడిపొంది, అంథోనియో అను వీరసేనాపతిని మహారాష్ట్రులపైకి పంపినారు. యూరపునుండి కొత్త సోల్జర్ల పటాలము గూడ దిగినది. ఈ బలయుత సన్నాహంతో నిశితయుద్ధ ప్రణాళికను పన్ని, ఠాణా పునరాక్రమణానికి సన్నద్ధులైనారు. పెద్రొమెల్లో అను ఉపసే నానిక్రింద నాలుగున్నర వేయి మెరికలవంటి పోర్చుగీసు సైనికులు ఠాణాపైకి నడచినారు. ప్రఖ్యాతవీరుడు మల్హారరావు హోల్కారు ఠాణాను సంరక్షించు చుండినాడు. దెబ్బ—ఎదురుదెబ్బ రెండుగూడ వీరగౌరవా ర్హముగా వుండినవి. కాని, మహారాష్ట్ర ఫిరంగిబారు పోర్చుగీసు బలాన్ని తరిగివేసింది. పోర్చుగీసులు అధైర్యపడక తక్కిన బలాల కూర్చుకొని మరల విజృంభినారు. కాని, సేనాపతి పెద్రొమెల్లో ఒక మరారిగుండుకు ఎరయై వీరస్వర్గ మలంకరించినాడు. దీనితో పోర్చుగీసులు చిల్లాపల్లా పరుగెత్తి, తమ పడవలయెక్కి పలాయితులైనారు. వెంటనే మాహిం గూడ మహారాష్ట్రుల వశమైనది. వెంకటరావు ఘోర్పడె గోవా కను చూపుమేర—రఖోలు వరకు సైన్యాల నడపించినాడు. పోర్చుగీసు అధికారము వినాశోన్ముఖమైనట్లు గాన్పించింది ఆ సమయంలో.

ఆ సమయానికే నాదిర్‌షా భారతవర్షముపై దండెత్తి వచ్చినాడన్న

వార్త చేరినది, హిందూదేశము, కాదు—విదేశమూకల అరికట్టజాలిన ఏకైక హిందూప్రభుత్వశక్తి—మహారాష్ట్రులు తలపడి ఎదిరించవలసి వచ్చిన మహోత్పాతాలలో ఇది ప్రచండతరమైనది. ఇది పోర్చుగీసుపాలనా పరిమితిని కొంత పొడిగించినది. బాజీరావు నిశితదూరదృష్టితో సర్వమును పరికించి "పోర్చుగీసులతోడి యుద్ధము లెక్కలోది కాదు. నేడు హిందూ స్థానంలో ఒకే శత్రువు ఉన్నాడు. హిందుదేశ సర్వశక్తుల సమీకరించ వలెను. నామటుకు నేను, మన మహారాష్ట్ర సైన్యాల నర్మదానదము మొదలు ఛంబాలునదివరకు పరచిపెట్టివేస్తా. అప్పుడుచూస్తాం! నాదిర్‌షా ఎట్లా తప్పించుకొని దక్కనులోకి దూరిపోగలడో" అని వ్రాసియున్నాడు. ఢిల్లీ, జయపూరు మొదలగు ఉత్తర హిందూస్థాన దర్బారులందలి మహా రాష్ట్ర రాయబారులకు సర్వము సిద్ధముచేయమని ఆజ్ఞల యిచ్చినాడు. ఒక్క మహారాష్ట్రరాజ్యమండలే గాక, రజపుత్రులు—బుందేలులు, మొద లగు సమస్త హిందూరాజ్యములు యీ కార్యమున తోడ్పడజేసినాడు. ఇప్పుడు లభించి—ముద్రితములై యున్న నాటి మహారాష్ట్ర రాజనీతజ్ఞుల లేఖలు—మొగలు పాదుషానే పదభ్రష్టునిజేసి, వానిస్థానే అఖిల హిందూ స్థాన సింహాసనముమీద ఉదయపూరు మహారాణాను అఖండ హిందూస్థాన సార్వభౌముడుగా అభిషేకముచేయను జరిగిన ఒక బ్రహ్మాండ హిందూ రాజకీయ వ్యూహమును వర్ణించుచున్నవి.

ఆశాపూర్ణమైన యీ మహారాష్ట్ర నాయకుని మానసము యితరత్రా హిందూ దిగ్విజయాలకు మార్గాలు వెదకుచుండినా మహారాష్ట్ర రాజ్య శక్తి—వస్తుసంపత్తి, ఒకవైపు బస్సీన్ పట్టణాన్ని ముట్టడించి పోర్చు గీసుతో పోరుసాగించను, మరియొకవైపు ఢిల్లీనుండి నాదిర్‌షాను పార ద్రోలదగిన మహాసైన్యాన్ని కూర్చనుగూడ ఓపికయుండినది. నాదిర్‌షా దండయాత్రగూడ, తమ కుత్తుక నొక్కిపట్టిన మరాఠి పిడికిలిని సడలింప

లేక పోయిందని పోర్చుగీసులు తెలుసుకొన్నారు. తమ పట్టణాలు ఒకటి వెంబడి ఒకటి తమ అధికారాన్ని వీడిపోతున్నవని గోవా వైస్‌రాయి గుర్తించినాడు. శిరిగావ్, తరపౌరె, దహను పట్టణాలు మహారాష్ట్రుల వశమైనవి. బస్సీన్ ముట్టడింపబడినది. బస్సీన్ యుద్ధంలో యిరువాగుల వారు మహాద్భుతముగ పోరాడినారు. మహారాష్ట్రులు ప్రాణాలకు తెగించి యుద్ధము చేసినారు. ఆ యుద్ధమును స్వయముగ చూచిన ఒకరు యిట్లు వ్రాసినారు: "పెద్ద పెద్ద సేనాపతులే నిలుచుండినచోటువీడక పోరి నిహతులైనారు. తమ నాయకుడు బాజీరావు పరుషవాక్యాల భరించలేక ప్రాణాలనే బలియిచ్చి—పోరి—పొలికలనలో పుణ్యగతి నొందినారు." పోర్చుగీసులుగూడ, ఒకసేనానివెంట మరియొకసేనాని కత్తిచేతితోనే ప్రాణాల వీడినారు. మహారాష్ట్రుల దాడులను చాలా నష్టాలతో తిరుగగొట్టివేసినారు. మరాఠులు మరల మరల విజృంభినారు, మరల మరల తరుమగొట్టబడినారు. చివరకు రెండుపక్షాలకు అపార నష్టం కలిగింది. మరాఠులు భూమిలో పాతిన మందుగనులే ప్రేలి కొన్ని సమయాలలో తమవారినే వందలాదిగా చీల్చి కుందివేసినవి. అయితే ఏం! పగబూనిన మొండి మరాఠులు లొంగలేదు. 18 దాడులు సాగించినారు. 18 మారులు పోర్చుగీసువారు వాటిని ఆపి తిరుగగొట్టినారు. ఒక్కొక్కదాడి ఇరుపక్షాలవారిని నిర్వీర్యుల జేసింది—ముట్టడి నానుడు బడింది. నాదిర్‌షా రానూ వచ్చినాడు. తిరిగి పోనూ పోయినాడు—బస్సీన్ ముట్టడి తెమలలేదు, కోట పడలేదు.

చివరకు ఛిమాజీ చమూపతి నిస్పృహతో క్రోధమూర్తి అయిపోయి "ఇదిగో! వీరులారా! నేడు బస్సీన్ దుర్గములో ప్రవేశించితీరాల. ఈ దినం నేను బ్రతికివుండగా అది మీరు చేయలేకపోతే, రేపు నాతలను కోట గోడలపై బెట్టి మీ తుపాకులతో చిదురుచేసివేయండి—చివరకు వచ్చిఅన్నా కోట ప్రవేశించగలుగుతాను" అని గర్జించినాడు. అంతటి

అజేయ పరాక్రమము సైనికుల ఉత్సాహపూరితుల చేయకుండగలదా? మానాజి అగ్రె, మల్హారరావు హోల్కార్, రణోజిసింధె, కోటగోడల ఎగబ్రాకను ఒకరికంటె ఒకరు ముందంజవేసినారు. అదే సమయానికి ఒక మరాఠి మందుపాతర ప్రేలి కోట గోడను గండి కొట్టింది. వెంటనే మహారాష్ట్రులు దూకి శిథిలకుడ్యభాగాన్ని ఆక్రమించుకొన్నారు. భూచక్రం రెండు ఖండాలలో పేర్గాంచిన పోర్చుగీసు శౌర్యము మహారాష్ట్రులను ఆస్థానంనుండి నెట్టివేయలేకపోయింది. ఇక పోర్చుగీసులు మహారాష్ట్ర ఉద్ధతిని ఆపలేక, తుదకు పోర్చుగీసు సైనికులు ఆయుధ విసర్జనచేసి లొంగిపోయినారు. హిందుమతము, హిందూజాతి అనుభవించిన చిత్ర వధల—బాధల తుదముట్టించి, చివరకు మహారాష్ట్ర కేతనము సర్వ మహారాష్ట్ర విజయకోలాహల హర్షధ్వాన సంభ్రమముల మధ్య రూప రిన బస్సీన్ దుర్గ శిఖరాలపై విజయ శుషమా శోభింతంగా ఎగురవేయ బడింది.

కొంకణము పూర్తిగా విముక్తినొందినది! గోవాలోమాత్రం నికృష్ట జీవితాన్ని గడపగలిగినా, పోర్చుగీసుపాలన యీతాకుకు ఆగి బ్రతుకలేక పోయింది. దీనితో మహారాష్ట్రులు యితర కార్యాలలో మగ్నులైపోయి నారు. ఒకనాడు ఆఫ్రికా దక్షిణాగ్రము మొదలు జావా సుమత్రల కావల వరకు తూర్పు సముద్రాలపై వ్యాపించియుండిన పోర్చుగీసు ప్రాభవము యీనాడు భూజలయుద్ధాలలో మహారాష్ట్రులచే ఛిన్నము చేయబడింది. అదిమొదలు హిందూప్రజపై తన చేయిచాచి ఎరుగదు—పోర్చుగీసు పొగరు.

తమ దేశమును తమ మతమును గారియపరచి, కొన్ని శతాబ్ద ములు తాము పాలకులగా—హిందువులు పాలితులుగా నుండుటకే పుట్టి నట్లు తోపజేసిన అపైశాచిక నిరంకుశ పాలకులు నేడు, తమ వీరపురుష

సింహాల సాహసోపేత కార్యాలవల్ల అవమాన పరాభూతోపహతులై పాదాక్రాంతులైన అదృశ్యాన్ని చూచి, ఏ హిందువుని మనస్సు శాంతించదు? ఏ హిందువుని ఆత్మశక్తి, జాతీయోత్కర్షలు వికసింపవు? ఏ హిందువుని హృదయము విజయశోభితగర్వంతో పొంగి పొరలదు? కొన్నివందల ఏండ్లనుండి పోర్చుగీసు కొంకణ హిందువులు, ఒక స్వతంత్ర హిందూకేతనాన్ని గాని, తమరక్షణకై మండి మెరసి, విదేశ నిరంకుశుల తలదురిమి, అవలేపాన్ని అణచి, తమ మత—దేశాలకు గావించిన అపకృతులకు ప్రతీకారము చేసిన ఒక హిందూ శితాసినిగాని కనులపండువుగ చూచి ఎరుగరు. ఈ విషయము బ్రహ్మేంద్రస్వామికి ఆనాటి లేకరి యిట్లు వ్రాయునుగాక:—"ఈ శౌర్యము, యీ పట్టుదల, యీ విజయము—యీనాటివిగావు! మన మాతృభూమి దేవతల సంచారముచేతను, వారి పాదధూళిచేతను, పవిత్రభూతమగుచుండిన ఆ సత్యయుగోచితములు. ఈ విజయఘోషా ముఖరిత దినాలలో జీవించియున్న మానవులుధన్యులు. ఈ విజయాన్ని కూర్చను వీరస్వర్గ మలంకరించిన పురుషులు ధన్యతములు!"

---

# 10. నాదిర్‌షా — బాజీరావు

"బఘూం నాదిర్‌శాహో కసా పుడే యేతోతో"

—బాజీరావు.

కొంకణమునందలి యీ అద్భుత విజయాలకు, యితర రంగాలలో మహారాష్ట్రి సాయుధ బాహుబలసంపత్తి కూర్చిన విజయాలు మెరుగుబెట్టినవి. గుజరాతు—మాల్వా—బుందేలు ఖండముల జయించి

ఆక్రమించుకొని హిందూసామ్రాజ్యాన్ని ఛంబాలనదివరకు వ్యాపింపజే యుటతోడనే బాజీరావు తృప్తిజెంది యూరకుండదలచు కొనలేదు. సమస్త హిందూస్థానమును తన ఏలుబడిక్రిందకు తీసుకొనిరాగలిగిన హిందూ సామ్రాజ్య స్థాపనమే ఆయన దృఢాశయము. హిందూధర్మ పరిపంధి— విశ్వాసశూన్య విదేశఘాతకుని స్వర్శచే మలినపడిన హిందూ పవిత్రా లయాల శుద్ధిచేసి, భద్రపరచుటకు ఆయన ఔత్సుక్యంతో ప్రతీక్షించు చుండినారు.

కాబట్టే ఆయన ఉద్యమదీక్ష కొంకణతీరస్థ పుణ్య పరశురామా లయానికి మాత్రమే అంటివుండలేదు. వారణాసి, గయ, మధుర, పట్టణా లింకను ముస్లిం దౌష్ట్యము, ముస్లిం మతావేశాలకు గురియై బాధపడు చునే యున్నవి. అందువల్లనే పండరి, నాసికల విమోచనానికి ప్రదర్శిం చిన ఆరని ఆసక్తిని బాజీరావు—యింకను తక్కుంగల మహారాష్ట్రి చమూపతులు, యీ పుణ్యక్షేత్రాలనుగూడ ముస్లిం పిడికిలినుండి విడి పించుటకు పదేపదే చూపుచుండినారు. మహారాష్ట్రీలు కొంకణములో వివిధముఖాల బలతమ వైరితో యుద్ధము చేయవలసివుండినను, కాశీ— గయ—మధుర పట్టణాలను, వాటి పరిసర పుణ్యభూమిని హిందువులకు అప్పగించనిచో, ఢిల్లీనే ముట్టడింతుమని మొగలు పాదుషాకు బాజీరావు ఒక సందేశాన్ని అంపినాడు. ఢిల్లీ ముస్లింనాయకులు భయవితాకుచే ఆరణ్యోద్రేకులై, సర్వశక్తుల వినియోగించి, 22 మంది సేనానాయకులు తమతమ సైన్యాల గూర్చుకొని ఢిల్లీ మొగలు అధికారమును ధిక్కరించిన ఈ మహారాష్ట్రీలపైకి నడచినారు. ఇందు వారి ప్రయత్నాలు విఫలమైనవి. కాని, తమ ఆత్మోత్కర్షను తృప్తిపరచుకోను, తమ యజమాని దయను సంపాదించుకోను—జరుగని ఒక మృషాయుద్ధంలో బాజీరావు తలఎత్త కుండా అణచివేయబడినాడని—మహారాష్ట్రీల పొలుకులే ఉత్తరాన కవ

బడటంలేదని ఒక అసత్యవార్తను ఢిల్లీకి పంపినారు. దీనికి పాదుషా సంతోష స్వాంతుడై, పొగరుబోతుతనంగా తన దర్బారునందలి మహా రాష్ట్రరాయబారిని వెడలగొట్టి, యీ మహా విజయానికి నగరమంతా వేడుకలు చేయమని ఆజ్ఞాపించినాడు.

ఢిల్లీలో జరిగిన యీ తంతువిని, బాజీరావు భీషణమందహాసంతో, "అవును! మహారాష్ట్ర సైన్యాల ఢిల్లీ కోటగోడల దరికిజేర్చి, తనరాజధాని ధగ్గజ్వాల భీభత్సకాంతిలో ఢిల్లీ పాదుషాకు ఉత్తరహిందూస్థానంలో నిండివున్న మనసేనలను ప్రదర్శించగలను" అన్నాడు. బాజీరావు యీ మాట నిలుపుకొన్నాడు. అచిరకాలంలోనే, శాంతాజీ జాదవ్, తుకోజీ హోల్కార్, శివాజి, యశ్వంతరావు పవార్ మొదలగు అసహాయశూరులతోగూడ నడచి ఢిల్లీ దుర్గకవాటాల తట్టి మొగలులలేపినాడు. కంటిమబ్బు వీడిన ఢిల్లీసామ్రాట్టు వాహిని వెంబడి వాహినిని స్వసైన్యాలబంపినాడు; కానీ, అన్నిదాడులను మహారాష్ట్రులు ఓడగొట్టినారు. ఇప్పుడు తన జీవితాన్నే పిడికిట బట్టుకొని గడగడవణకుచు, మహారాష్ట్రులు నామరూపాలు లేకుండా అణచివేయబడినారని నమ్మిన ఫలితాన్ని ఆ అవివేకి బాగా అనుభవించినాడు. ప్రత్యక్ష నిరోధంలో మహారాష్ట్ర శౌర్యము ఢిల్లీ కోటగోడల తాకి, వాటి పునాదులతోగూడ వూపించివేయుటకు యిదే మొదలు! ఉత్తరహిందూస్థానంలో మహారాష్ట్ర వాహినుల దిగ్విజయయానాల సహించలేక, నైజాము 34,000 సుశిక్షితులైన సైనికులతో—హిందూదేశానికి గర్వహేతువైన యుద్ధయంత్ర సన్నాహంతో బయలుదేరి, శిరోంజి పట్టణ సమీపాలకు పోయినాడు. రసపుత్రులుగూడ కొందరు మహారాష్ట్రులకు వ్యతిరేకంగా ఇందు నైజాముకు దోడ్పడినారు. బాజీరావు వారి మడిమల త్రొక్కుచూ, వెంటదగిలి అద్భుత వ్యూహాసంపత్తితో, ప్రదీప శౌర్యంతో త్వరలో నైజామును తమ చేతజిక్కించుకొని

ఆడించినాడు. విధివిరామం.లేకుండా సాగించిన మోదులకు నైజాం అలసి పోయి భోపాలు దుర్గంలో దూరి, తలుపులు బిగించుకొన్నాడు. అలసి పోయిన తన బలాల కూర్చుకొని యుద్ధానికి దిగను పలుమారులు ప్రయ త్నించి యుద్ధతంత్రంలోను—యావశక్తిలోను తమ్ముమించిన మహారాష్ట్ర బలగం చేతులలో—తాను తన రసపుత్ర సహాయకులు పూర్తిగ ఓడి పోయినారు. చివరకు ముట్టడులచే ఆకటమాడి పేర్గాంచిన యీ ముస్లిం సేనాపతి బాజీరావు ఆజ్ఞానుసారం సంధిచేసుకొన్నాడు.

ఆ సమయానికి, మహమ్మదీయులు పన్నిన ఒకపెద్ద కుట్ర ఫలిం చింది. నాదిర్‌షా సింధునదిని దాటినాడు. దీనితో అవసానోన్ముఖమైన ముస్లిం సామ్రాజ్యమునకు జీవనసుధ నొసంగు ఆశలు మహమ్మదీయు లలో ననలెత్తినవి. ఔరంగజేబు పద్ధతిలో పెరిగి పెద్దలైన నైజాంవోటి కొందరు ముస్లిం నాయకులు, నవాబులు, నాదిర్‌షా దండయాత్రను ఆదరించినారు. దుర్భేద్య రాజదండముతో మహారాష్ట్రమండలి విజృంభిత హిందూశక్తిని నురుముచేసి, ముస్లిం సామ్రాజ్యాన్ని పూర్వపు టౌన్నత్య శిఖరానికి—ప్రాభవానికి గొనిపోవుటకు నిర్జీవ కృశిత మొగల్‌పాదుషా శక్తిహీనుడైనందున, యీ పారసీక స్వమతస్థునిచేత యీ వాంఛితాన్ని యీడేర్పజేసుకొన వారు ఆశించినారు. ఆ కరకువిదేశీయుని నాయకత్వము క్రింద చెలరేగిన ముస్లిం మిత్రమండలి సైన్యాలను—మొక్కవోని సేనాముఖంతో ఆటుపోటు ఎరుగని శౌర్యంతో బాజీరావు నడిపిన హిందూసైన్యాలు ఎదిరించి నిలువకుండినచో హిందూత్వ చరిత్ర యవ నులు అనుకొన్నట్లే అయివుండేది.

ఈ తీవ్ర జాతీయ క్లిష్ట పరిస్థితులలో, అణగి వితాకుపడుటకు మారు బాజీరావు ఉద్ధూత ఉపజ్ఞ, ఘనతర ఆదర్శాల వైపుకు ప్రాకి, ఊర్ధ్వాభిముఖమైంది. నాదిర్‌షా ఆగమనంతో—దీర్ఘ శతాబ్ద పర్యంత

వ్యాప్త హిందూచరిత్రను కొన్ని సంవత్సరాలలో యిమిడ్చుటకు ఒక అపూర్వ సదవకాశాన్ని కనుగొన్నాడు. ఉత్త హిందూస్థాన వివిధ రాజాస్థానము లందలి, పరిణీతకార్యవేదులైన మహారాష్ట్ర రాయబారులు బాగుగ ఆ సమయాన్ని గుర్తెరిగి, తమ ప్రసిద్ధ సేనాపతులు యుద్ధవ్యూహాల జయప్రదముగ సాగించినట్లే వారుగూడ తమ రాజనీతి తంత్రాల అంత ఫలప్రదంగా, అంత గంభీరముగ నడపినారు. పవారులు—సింధేలు—గుజార్లు — అగ్రేలు మొదలగు సైన్యాధిపతుల యుద్ధవిజయాలకు తీసిపోని రాజతంత్ర విజయాలను, వెంకోజిరావు—ఈశ్వరరావు—దాదాజి—గోవిందనారాయణ—సదాశివబాలాజి—బాబురంగ మల్హార్—మహాదేవభట్ట హింజ్నె మొదలగు రాజకీయ ధురంధరులు సముపార్జించినారు.

నిజానికి, హిందూ ఉద్యమ రాజనీతిని, దాని ఆదర్శముల నిర్భిన్న సంప్రదాయముల కాపాడి, మహారాష్ట్ర సైనికనాయకుల ఫలప్రదయత్నాలకు ముందుగా కార్యరంగాన్ని ప్రజ్ఞాపూర్ణముగ సరిదిద్ది ఆయత్తపరచినది యీ మహారాష్ట్ర రాజకీయవేత్తలే! ఈ విశ్వవిఖ్యాత ప్రజ్ఞానిధుల జాబులు—వ్రాతలు నేడు అచ్చుపడివున్నవి. వాటిని చదివినచో, ఈ మహారాష్ట్ర రాయబారులు—రాజతంత్ర ప్రవీణులు—సేనాపతులు—సైనికులు—నావికులు—సర్వసమీకృత సుదృఢ హిందూ సామ్రాజ్య స్థాపనమే ఏకైక సంపూర్ణ లక్ష్యంగా సాగించిన వ్యూహాల—కార్యవిధానాల—ప్రయత్నాల యొక్క బ్రహ్మాండ గంభీరదృశ్యము పాఠకునికి గోచరించక మానదు. ఈ సామ్రాజ్యమే సర్వ హిందూజాతి రాజకీయస్వాతంత్ర్యానికి రక్షణ దుర్గము కాగలదని వారు ఆశించినారు. ఈ హిందూకార్యసిద్ధిని భగ్నము చేయుటకే, నాదిర్ షా ఆహ్వానింపబడినాడు. ఔరంగజేబు దగ్గర పాతాల

నేర్చుకొని, హిందూజాతి జృంభితశక్తిని సహించలేని మహమ్మదీయ పాలకులు, పరోక్షముగనో—ప్రత్యక్షముగనో నాదిర్‌షాకు సహాయ పడినారు.

కాని, 1120–1124 లో మహమ్మద్ గజ్‌నవిని ఎదుర్కొనిన హిందూశక్తికి కేవలము భిన్నమైనశక్తి 1739 లో తనకు ముఖాముఖి నిలచినదని నాదిర్‌షా వెంటనే తెలిసికొన్నాడు. శ్రీరాముడు, శ్రీకృష్ణభగవానుల వాంఛాపూర్తికే తాము పోరాడుచున్నామన్న పవిత్రవిశ్వాసంతో తమ దేశము తమ మతముల పేరట ఏకజాతిగా మహారాష్ట్ర హిందువులు విజృంభించినది మొదలు, రాజనీతిలో—రాజతంత్ర పాండితిలో—దేశారాధన తత్పరతలో, వీటి అన్నిటికి పైన, సైనికబలములో—యుద్ధకౌశలములో—ఆత్మార్పణ క్రియలో—ఆత్మార్పణ లౌల్యంలో మహారాష్ట్ర హిందువులకు మహమ్మదీయులు ఎందును చాలకపోయినారు. వారు నాదిర్‌షాలకు భయపడలేదు. "నాదిర్‌షా దేవుడుకాడు. సృష్టిని అతడు నిర్మాలించలేడు. తనకంటె బలవంతులతో సఖ్యానికి రాకతప్పదు. బాహుశక్తి పరీక్షానంతరమే స్నేహసంధి వాక్యాలకు తావుండగలదు. యుద్ధానంతరమే శాంతి చేకూరగలదు. కాబట్టి ముందు మహారాష్ట్రసేనలు నగారా కొట్టి బయలుదేరవలెను. రాజపుత్రులు ఇంకను యితర హిందువులు మీ (బాజీరావు) అధ్వరమున నడచి ఏకముఖంతో ఎదిరించినచో మహాద్భుతాలు చేకూరగలవు. నాదిర్‌షా, నైజాం సహాయంచేస్తున్నందున వెనుకకు మరలడు——సూటిగా హిందూరాజ్యాలమీదకే నడువగలడు. కాబట్టి హిందూరాజులు—మహారాజులు—సవాయ్ జయసింగుతో సహా, తమ (బాజీరావు) రాకకు నిరీక్షించుచున్నారు. మీరేగాన నాయకత్వము వహించిన యెడల మహారాష్ట్రులవెంట సర్వ హిందూసైన్యము ఢిల్లీకే పయనమై ముస్లిం పాదుషాను పదభ్రష్టునిజేసి, ఉదయపూరు మహా

రాణావారినిఢిల్లీ యుధిష్ఠరుని సింహపీఠికపై గూర్చుండబెట్టగలరు." ఇట్లు వివిధ మహారాష్ట్ర రాజకీయ వేత్తలు బాజీరావుకు వ్రాసినది.

బస్సీన్ ఇంకా వశంకాలేదు. కర్ణాటక కటక ప్రయాగ మధ్యస్థ దేశంలో మహారాష్ట్రచమూనివహములు ఇంకను తీవ్ర పోరాటముల సాగించుచునే యుండినవి. కాని, బాజీరావు ఒక క్షణమైనను ఆలసించ లేదు. ఉత్తర హిందూస్థాన హిందువులకు, తమ ప్రతినిధులు కలిగించిన పేరాసలపై చన్నీళ్ళు చల్లలేదు. వీరు చేగొన్న భాద్యతల సడలించలేదు. కొందరు తోడినాయకులు సంశయోప హతులైనప్పుడు బాజీరావు— "వీరాగ్రేసరులారా! వృధా యోచనలపాలై ఏల సంశయించెదరు? సంఘీభావంతో ఏకోన్ముఖంగా నడవండి. హిందూపద్ పాదషాహి మీ హస్తగతం కాగలదు" అని ప్రబోధశంఖారావము గావించినాడు. "నా మహారాష్ట్రిలను నర్మద మొదలు ఛంబాల్ వరకు పరచిపెట్టెదను. అప్పుడుచూస్తాం—దక్షిణాపథంలోకి అడుగుబెట్టను నాదిర్ షా ఎట్లా సాహసిస్తాడో" అని గర్జించినాడు.

ప్రతీకార రుధిర పానాసక్తులైన మహారాష్ట్రిల యీ సుస్థిర ధిక్కారమే పారసీక విజగీషు—నాదిర్ షా హిందూమతేతర అభిమతాన్ని మొక్కబరచి, మరణకల్పమైన శైత్యాన్ని గూర్చింది. బాజీరావును "ముస్లిం మత భక్తా' అని సంబోధించి, ఢిల్లీమొగల్ పాదుషాకు తల వంచి లొంగమని, లేకున్న పితూరీకి తగిన శిక్ష విధింతునని బెదరింపులతో ఒకదీర్ఘ అపహాస్యలేఖను వ్రాసిన నాదిర్ షా, మహా చాకచక్యంతో వెనుదిరిగి పలాయనం గావించినాడు. మహారాష్ట్రిలకు నాదిర్ షా వ్రాసిన యీ కాగితపు పేలిక పెంటకుప్ప పాలైంది. 1739 జూను 14 వ తేది మహారాష్ట్రిల మహారాజు సాహు, రాజదర్బారులో—

"నాదిర్‌షా మహారాష్ట్రులకు భయపడి దేశంవిడిచి పరుగెత్తిపోయినాడు" అని చాటినాడు.

నాదిర్‌షా యిట్లు హఠాత్తుగా దేశంవిడిచి పోవడం నైజామును విషమస్థితిలోనికి నొక్కినది. నైజాం, భోపాల్ సంధిని పాలించనందులకు, నాదిర్‌షా హిందూద్వేషక దండయాత్రలో సహాయపడినందులకు తగిన విధమున శిక్షించుటకుగా, మహారాష్ట్రులు ఢిల్లీపైకి నడచినారు.

కాని, అదేసమయానికి అద్వితీయ దుర్దాంత సేనాపతి బాజీరావు 22 ఏప్రెల్ 1740 లో పరమపదించినారు.

హిందూ స్వాతంత్ర్యలబ్ధికి వీరివలె మరెవరుగాని అంత నిష్కల్మష హృదయంతో—అంత ఫలప్రదంగా పాటుబడి ఎరుగరు. చిరతప్రాయానసే నిజమత, నిజధర్మ, నిజదేశ విరోధులపైకి దూసినకత్తిని, తనకీర్తిమయ మరణ పారితోషికముగానైన ఒరయందు దూర్చలేదు. హిందూజాతి ప్రతిపక్ష నిరోధక యుద్ధమునందే—యుద్ధపుటలబలము మధ్యనే, యుద్ధపటకుటియందే—వీరోచిత మరణాన్ని బొందినాడు. సిద్దీలు—రోహిల్లాలు—మొగలులు—పోర్చుగీసులపై వారు సాగించిన నిరంతర దీర్ఘ కఠోర యుద్ధాలలో అపజయ మెరుగడు. హిందూప్రజా పరమోత్కృష్ట గమ్యము—హిందూపద్ పాదషాహి సత్వర లబ్ధికై వారు పడిన మానవాతీత శ్రమయే ఆయన అకాలమరణానికి సన్నిహితకారణ మైంది. ఈజ్యోతి అస్తమయము, నాదిర్‌షా ప్రభృతుల కొన్ని దండయాత్రల ఫలితముకంటె దారుణమై హిందూ ఆశయాన్ని ఒక పెద్ద దెబ్బ కొట్టింది.

---

# 11. నానాసాహెబ్ – భావుసాహెబ్

బాజీరావు స్వర్గస్థుడైనాడు—కాని, ప్రజలయందు ఆయన లేవగొట్టిన నిత్యచైతన్యశక్తి మాత్రం చావలేదు. ఈ మరణము, వారిని నిష్ఠురతర ఘనతర కార్యమగ్నుల జేసినది. బాజీరావు కొమారుడు, నానాసాహెబ్ నామాంతరం గల బాలాజీరావు, బస్సీన్ పట్టణమును జయించిన చిమాజి పుత్రుడు, భావుసాహెబ్ మహారాష్ట్ర నాయకత్వమువహించినారు. ఆనాటికి బాలాజీకి 19 ఏండ్లు అయినను, తండ్రిపజ్జన అలవరచుకొన్న కార్యనైపుణితో, మహారాష్ట్ర ప్రజకు తగిననేత అనిపించుకొన్నాడు. యోగ్యతను ఆదరించే సాహుఛత్రపతి, యీ యువక ప్రజ్ఞాశాలిని తండ్రిస్థానే మహారాష్ట్ర సామ్రాజ్య ప్రధానామాత్య శేఖరుడుగా నియమించుటకు వెనుదీయలేదు. ఈ మంత్రిపదవీ పట్టాభిషేకము మహావైభవంగా జరిగింది. ఘనతర మహారాష్ట్రోద్యమ మహోన్నత హృదయ ప్రదర్శకమైన కొన్ని ఉత్తేజకర వాక్యాలతో, సాహూ చక్రవర్తి బాలాజీ బాజీరావుకు ఒక అధికారదత్త పత్రమును పట్టాభిషేక సమయమున అందించినాడు. "మీ తండ్రి బాజీరావు—మమ్ము, మన మహారాష్ట్రమును విశ్వాసపూర్ణముగ సేవించి మహోన్నత కార్యాల నెరవేర్చినాడు. హిందూస్థాన చరమ సీమాంతాలకు హిందూప్రభుతను విస్తరింపజేయ ఆశించి, యత్నించినాడు. నీవు ఆ మహాపురుషుని పుత్రుడవు. మీ తండ్రి ఆదర్శాల అభిమతాల సాధింపుము ! ఇక నీ ఆశ్వదళోద్ధూతధూళి అట్టకదుర్గ దుర్భేద్యకుడ్యాల కావలకు ప్రసరింపజేయము" అని ఆరాజు ఒక జాగరణ సందేశాన్ని ఆ యువక మంత్రికి అందజేసినాడు.

ఈ రాజాజ్ఞను బొదలదాల్చి, నానా, భావుసాహెబులు, శివాజీ చక్రవర్తి ప్రారంభించిన కార్యాన్ని ఫలప్రదము చేయుటకు, ప్రాణత్యాగము

నకు గూడ వెనుదీయరైరి. అసలు వారికి యీ ప్రబోధసందేశాలే అవసరము లేకపోయినవి. హిందూసామ్రాజ్యము వారి శైశవవాంఛిత దృశ్యము. అది వారి కౌమార వాంఛితార్థము. దానికై కష్టించి, పోరి, చివరకు ప్రాణార్పణము చేయుటగూడ వారికి ప్రేమమయకార్యమైనది. సాహూ, బంధిగా ఉన్నప్పుడు ఢిల్లీ మొగలుదర్బారులో అప్పుడప్పుడు, యిష్టములేకున్నను పాదుషా చిరునవ్వులకు ప్రత్యుత్తరంగా చూపిన హీన విశ్వాసము బానిసప్రవృత్తిని వీరిద్దరు ఏవగించుకొన్నారు.

అమాత్యాభిషేకానంతరం, సాహూ బాలాజీని పునహాకు పొమ్మని, రఘోజీ భోసలేని దక్షిణాపథ దండయాత్రకు పంపినాడు.

సాహూ పునరాగమనానంతరం, మహారాష్ట్రులలో అధికారానికి క్షుద్ర అంతఃకలహము రేగినది. దీని సందుచూచుకొని మహమ్మదీయుల, ప్రజ్ఞాశాలి సద్దత్‌ఉల్లా చమూపతి అధ్వర్యాన, కొరమండలతీర ప్రాంత భూమినంతా ఆక్రమించుకొని తంజావూరు మహారాష్ట్రరాజ్యంపై ఒత్తిడిని కలిగించినారు. తంజావూరు రాజు, ప్రతాపసింగు మహారాష్ట్రుల సహాయ మర్థించినాడు. సద్దత్‌ఉల్లా 1732 లో చనిపోయినాడు, అతని మేనల్లుడు, దోస్తు అల్లీ ఆతనిస్థానే ఆర్కాటు నవాబు అయినాడు. దోస్తు మహారాష్ట్రుల ఆగర్భశత్రువు— బలయుతుడు. 19-మే 1740 లో మహారాష్ట్రులు ఒక యిరుకు కనుమలోనికి దోస్తు సైన్యాల నొక్కి, నానాముఖాల పొదివి తాకినారు. కొన్ని గంటలలోనే మహమ్మదీయు సైనం సంపూర్ణంగా నరకివేయబడింది. దోస్తు శవంగూడ పొలికలలో పీనుగపెంటలమధ్య పడి వుండినది. చాలాకాలంగా ముస్లింపాలనా బాధ ననుభవించుచుండిన తూర్పుతీర హిందూప్రజలు, స్వమతస్థుల యీ విజయానికి ఉప్పొంగి, మహారాష్ట్రులతో చేతులు గలిపినారు. రఘోజి, దారిలో పట్టణాలు పల్లెల నుండి ఎక్కువ యుద్ధసుంకమును వసూలు చేసుకొంటూ, ఆర్కాటుకోదికి

నడిచినాడు. దోస్తు అల్లీ కొడుకు—సఫ్దర్ అల్లీ, అల్లుడు ఛందాసాహెబ్ వేలూరు, తిరుచునాపల్లి పట్టణాలలో భూరిసైన్యాలతో యుద్ధసన్నద్ధులై నిలిచియుండినారు. రఘోజీ, ఆ దండయాత్ర ఆర్థికంగా చాల నష్టదాయకంగా వుండుటచే దానిని విరమించుకొనదలచి, తిరుచునాపల్లినుండి 80 మైళ్ళుగూడ మరలిపోయినాడు. యోచనాపరుడు, కార్యచతురుడు అయిన ఛందా సాహెబుగూడ, యీ ఎత్తును పూర్తిగానమ్మి 10,000 మంది సిపాయిలను, హిందూ పుణ్యతీర్థము—భాగ్యలక్ష్మి ఒడిలో నోలలాడు మధురాపురిని కొల్లగొట్టను పంపినాడు. తానుపన్నిన బోనులో యిట్లు మహమ్మదీయులు, తప్పించుకొనుటకు వీలులేకుండ పడిపోవుటను జూచి, రఘోజీ హఠాత్తుగా వెనుదిరిగి విధివిరామములేని యానంతో తిరుచునాపల్లి గమనిలో ప్రత్యక్షమైనాడు. మధురపై కసిదీర్చుకొని, కొల్లగొట్టను బయలుదేరిన బారాసాహెబు, తన సోదరుని సహాయానికి పరుగెత్త ప్రయత్నించినాడు. కాని, రఘోజీ, కొంత సైన్యాన్ని పంపి అతనిని మార్గమధ్యాననే అడ్డగించి, ఒక భీకరయుద్ధంలో ఏనుగుమీదనుండి అతనిని పడగొట్టి వధింపజేసినాడు. దీనితో మహమ్మదీయులు సంపూర్ణంగా పరాజితులు కాగా, మిగిలిన బలాలు పారిపోయినవి. ముస్లింసేనాపతి కళేబరం రఘోజీ విడిదికి కొనిపోబడింది. రఘోజీ ఆశవాన్ని బాగా అలంకరించి సోదరుడు, చందా సాహెబుకు పంపినాడు.

తిరుచునాపల్లి ముట్టడి కొన్నినెలలు సాగింది. మహమ్మదీయులు ఎంత ధీరముగ ప్రతిఘటించినను తుదకు ఆ గర్వితహిందువుకు లొంగక తప్పిందిగాదు. బంధింపబడిన ఛందాసాహెబును సాతారాకు పంపివేసినారు. మురారిరావు ఘోర్పడె, 14,000 సైనికులతో తిరుచునాపల్లి దుర్గరక్షకుడుగా నియమింపబడినాడు. ఇంతకుముందే సుఫ్దర్ అల్లి మహారాష్ట్రులకు లొంగిపోయి, కోటి రూపాయలతో ఆర్కాటు నవాబుపదవిని

కొనుక్కొని, వారి అనుమతితో పాలిస్తూ, 1736 నుండి ఆయనతండ్రి పదభ్రష్టుల జేసిన హిందూ సామంతుల, పాలెగాండ్ర మరల యథాస్థానాల యందుంచినాడు.

ఇట్లు, రఘోజి దక్షిణాపథంలో మహాద్భుత విజయాల సమకూర్చు చుండ, బెంగాల్—బీహారు—ఒరిస్సా నవాబు అలివర్దీఖానుతో మహారాష్ట్రులకు కయ్యాలు సమకూడినవి. అలివర్దీఖానుని ప్రతిపక్షనాయకుడు, మీర్ హబీబ్ మహారాష్ట్ర సహాయ మపేక్షించినాడు. రఘోజీ అమాత్యుడు—భాస్కరపంత్ కొల్హట్కర్, వంగరాష్ట్రంలో ముస్లింప్రభుతను చిన్నపరచి, హిందూ పుణ్యభూమి ప్రాక్సీమలకు మహారాష్ట్రాధికారాన్ని వ్యాపింపజేయు కుతూహలంతో మీర్ హబీబ్ ఆహ్వానమును అంగీకరించినాడు. ఆ మరుక్షణమే, పదివేల మహారాష్ట్ర అశ్వదళము, ఉత్సాహఘోషలతో రోదసిని నింపుచూ, బీహారు ముస్లిం రాజ్యాధికారాన్ని గిట్టలదొక్కి, దుమ్ములో కలుపుచు ఆదేశంగుండా ధాటిని జరిపింది. ఈసి ఫోని సేనానాయకుడు అలివర్ది, తమ్ము మూర్కొనగానే, మహారాష్ట్రులు ఒక సంకటస్థితిలో అతనిని మహా మెళుకువగా యిరికించి, వస్తువాహక సార్థవాహాల అడ్డగించి, సైన్యాల ఉక్కడంచి, కాట్వా వైపుకు తరిమి వేసినారు. మీర్ హబీబ్, భాస్కరపంతు మనసు మార్పించి, వర్షఋతువంతా బెంగాలులోనే వుండి, శత్రుదేశంలో యుద్ధనిధిని వసూలుచేయు నట్లు చేసినాడు. ఆతర్వాత, మహారాష్ట్రులు మూర్షీదాబాదు పైబడి, గంగానది పరమటితీరానవుండే హుగ్లి, మిడ్నపూరు, రాజమహల్, జిల్లాల అన్నిటిని ఆక్రమించుకొన్నారు. ఇక మూర్షిదాబాదుమాత్రం మిగిలివుండినది. హిందువులకు విజయాన్నిగూర్చి, బెంగాల్ హిందూవిరోధక మ్లేచ్ఛుల గర్వాన్ని అణచినందులకుగా కాళికాదేవికి మహోత్సవాలు, మహావైభవోపేతంగా చేయ దలచుకొన్నారు. ఆ సమయానికే, అలివర్ది

ఖాను హుగ్లీనదిని దాటి, తలవని తలంపుగా పైబడి మహారాష్ట్రులను బెంగాలు పొలిమేరలవరకు తరిమినాడు. కాని, ఇది తాత్కాలికమైన వెనుకపాటు. అచిరకాలంలోనే రఘోజి, తిరిగి బెంగాల్ ప్రవేశించినాడు. బాలాజీరావుగూడ, మరియొక పెద్ద బలగంతో, పైకి సామ్రాజ్యసేనా పతిగా, లోపలికి సొంతానికి కప్పం వసూలుచేసుకొని, రఘోజి భోసలెతో వ్యవహారం పరిష్కారం చేసుకోను బయలుదేరి వచ్చినాడు. ఈ ఇద్దరు మరాఠి ఎకిమీడులకు సంధి పొసగగానే, బాలాజీ మరలి పోయినాడు. భాస్కరపంత్ బెంగాలులో చౌతు సిమ్మని అలివర్దీని కోరినాడు.

పొలికలనులో ఢీకొనజాలక అలివర్దీఖాను విద్రోహవిధానానికి యియ్యకొన్నాడు. నష్టపరిహార పరిష్కారానికి, అతిధిగా, రాయబారిగా భాస్కరరావును తన గుడారానికి ఆహ్వానించినాడు. ముందే సిద్ధముచేసి వుంచబడిన హంతకులు, సైగచేయగానే "కాఫిరులను చంపుడు" అనే పెడబొబ్బలతో పైబడి, భాస్కరరావును—మరి యిరవై మహారాష్ట్రనాయ కులను చిత్రవధ చేసినారు. చివరకు ప్రాణాల తప్పించుకొన్న రఘోజి గైక్వాడు, విశాకుపడి, మృతకల్పులైన మహారాష్ట్ర అవశిష్ట సైన్యాల చేర్చుకొని, వెంటతరిమి, గారియపరిచే శత్రుసైన్యాల తప్పించుకొంటూ, అపరచిత శత్రురాజ్యంగుండా నడచి స్వదేశం చేరినాడు.

ఔరంగజేబు సామ్రాట్టుయొక్క విపుల సామ్రాజ్యైశ్వర్యమే అణచలేక భంగపోయినప్పుడు యీ మహారాష్ట్రోద్యమ తరంగాన్ని ఇక్కడ ఒక హత్య—అక్కడ ఒక విద్రోహము వెనుకకు తిప్పికొట్ట గలదా? అయితే ఏం—అలివర్దీఖాను అవివేకియై రఘోజీకి ఒక వికా రపు జాబుగూడ వ్రాయగలిగినాడు—"మహమ్మదు ధన్యుడు! ముస్లిం విశ్వాసకుల వీరసైంధవాలు అవిశ్వాసకులపైబడి నురుముచేయుటకు ఎన్న డును భయపడవు. విగ్రహారాధక పిశాచాల ఇస్లాం సింహాలు ఎదిరించి,

పీచమడపగా, రక్షించమని వేడినప్పుడే శాంతికి అవకాశం కలుగుతుంది." అని. తాను వేయిమైళ్ళు దండెత్తివస్తే ఇస్లాం సింహం నూరుమైళ్ళు అయినా ముందుకు నడవను భయపడింది అని రఘోజి అపహాస్యంచేసి, అవివేకపు వాగ్వివాదాన్ని సాగించ నిచ్ఛగింపక, మహారాష్ట్ర ఉపసైంధవ దళాన్ని పంపి, ఒరిస్సా—బర్ద్వానుల ఆక్రమించుకొని, భూమిపన్ను విధించినాడు. వచ్చేసంవత్సరం పొయ్యే సంవత్సరం అనకుండా, అలివర్దీని మహారాష్ట్రులు అవస్థలుబెట్టి వీలున్నచోట శిస్తులు వసూలు జేసి, లొంగినచోట యుద్ధనిధి శిస్తు రెండూ వసూలుచేస్తూ ఒకజిల్లా తర్వాత మరియొకదానిని ఆక్రమించుకొని, మరల వదలివేసి, ఒకపరి యుద్ధం చేసి, మరియొకమారు పలాయితులై, ఇట్లా కాలోచిత కార్యాలుచేసి, చివరకు బెంగాలు—బీహారు—ఒరిస్సాలలో ముస్లింపాలన సాగుటే దుస్సాధ్య మనిపించినారు. పరాజయం వారిని కార్యవిముఖుల జేయ లేదు—ప్రబలనష్టం వారికి ఉత్సాహభంగం చేయలేదు. వారు వారి చౌతును వదలలేదు.

చివరకు, 1750 లో ఇస్లాంసింహము అలివర్దీఖానుకు యీ అవి శ్వాసకుల చర్యలతో కడుపునిండిపోయింది. వారిని తాకుట అంటేనే భయోత్పాదమై, శరణుజొచ్చి "ముండ్కటై" అనగా భాస్కరరావు రుధిర ప్రతిఫలంగా ఒరిస్సాపరగణాను యిచ్చివేసి, బెంగాలు—బీహారులపై చౌతుకుగా పదిలక్షల ఒసంగినాడు. చివరకు, విగ్రహారాధక పిశాచాలను ఆత్మరక్షణభిక్ష వర్థించినది ఆ విశ్వాసక వీరులే! ఆనాడుగూడ వారు అల్లాకు ధన్యవాదాలు చేసినారేమో!

ఇట్లు రఘోజీభోసలె బెంగాలులో ముస్లిం అధికారాన్ని సమూలంగా పెరికి పారవేయుచుండగా, యితర మహారాష్ట్రనాయకులు ఉత్తర హిందూస్థానంలో యితర మహమ్మదీయ అధికారాల్లను భంగముచేయుచు,

కీర్తిప్రతిష్ఠల చేకూర్చుకొనుచుండిరి. మతాంధులైన రోహిల్లాలు—పఠాణులు, యమున మొదలు నేపాలువరకు గలదేశాన్ని హస్తగతం చేసుకొని, అజేయులై, ఢిల్లీ సింహాసనముపై ఒక ఆఫ్ఘనుని పాదుషాగా అభిషేకించి, మరల ఆఫ్ఘను పాదుషాహిని హిందూదేశంలో మొగలు సామ్రాజ్య శిధిలాలమీద పునర్నిర్మాణము చేయుటకు తీవ్రప్రయత్నాలు సాగించినారు. ఈ దౌష్ట్య యత్నాన్ని వమ్ముజేయుటకు ఢిల్లీ మొగల్‌పాదుషా వజీరు మహారాష్ట్రుల అండజేరినాడు. మొగల్ సామ్రాజ్య విచ్ఛిత్తికి అంతశ్రమ పడిన మహారాష్ట్రులు, ఎక్కడనుండియో మరియొకరువచ్చి, ఆరాజ్య జీర్ణోద్ధరణకు ప్రయత్నించి తమ ఆశయాన్ని భంగముచేసి, తాము పొందిన లాభాన్ని పాడుజేయ దలంచినచో, తృప్తిపడి వూరకుందురా ? కావుననే, మహారాష్ట్రులు మహా సంతోషముతో మొగలువజీరు ప్రార్థనము నంగీకరించినారు. వెంటనే మల్హారరావు హోల్కారు, జయాజిరావు సింధె. తగు సైన్యంతో యమునదాటి, కేదారగంజి దగ్గర పఠాణుల దుర్గముపై బడినారు. పఠానులు దృఢమైన పట్టుదలతో నిరోధించినారు. కాని, చివరకు పరాభూతులు కావలిసివచ్చింది. మహారాష్ట్రులు దీనితో నిలువక, పఠాను మహానాయకుడు అహమ్మద్‌ఖానుడు, కేదారగంజి సహాయార్థము బయలుదేరి వచ్చుచుండ మార్గమధ్యాన నిరోధించి చుట్టుముట్టినారు. అహమ్మదుఖాను తలదాచుకోను ఫరూకాబాదు ప్రవేశించినాడు; మహారాష్ట్రులు దానినివలగొని, ముట్టడించినారు. యుద్ధం మొండిగా చాలా వారాలు సాగింది. గంగకావలిగట్టునుండి రోహిల్లా సేనలు పంపిన సర్వవిధ సహాయంవల్ల పఠానులు లొంగలేదు. మహారాష్ట్రులు ఒక పడవల వంతెన నిర్మించి, మంచి అదనుకు కొంతసైన్యమును గంగనుదాటించిరి. 30 వేల రోహిల్లా—పఠానుసేనలతో ఢీకొని, సంకుల భీషణ సమరంలో వారిని సంపూర్ణము ఓడించినారు. అహమ్మద్‌ఖాను తరిగిన మహారాష్ట్రి

బలాలతో పోరాడి ఫరూకాబాదునుండి తప్పించుకొనిపోదలచినాడు. కాని వెన్నుజరిచి వెంటాడిన మహారాష్ట్రులు పఠానుల చిందరవందరగా తరిమి, స్కంధావారాన్ని కొల్లగొట్టి, అమూల్య వస్తుచయాన్ని, అసంఖ్యాక గజతురగ ఉష్ట్రబలాన్ని హరించినారు.

నాటి సైనిక విజయకీర్తి ఎంత మహోజ్జ్వలముగా వుండినదో యీ విజయ నైతిక బలముగూడ అంత ఘనముగ నుండినది. అసూయానలదగ్ధులై, మహారాష్ట్రులపై కడుపుమంట వెళ్ళగ్రక్కను, తమ ప్రయత్నాల మతాంకితము చేయను, పఠానులు కాశీనగరముపైబడి, విశ్వేశ్వరాలయము—అచటి పూజారులపట్ల దారుణ దురంతముల జరిపి "పఠానుల కాఫిరులు ఎన్నటికి ఎదిరించజాల"రని కారుకూతలు గూసి పోయినారు. అల్లా వారిపక్షమట! ఔను! నిజమే! మహారాష్ట్రులు ఎదుర్కొని దారుణ సమరానికి దిగగానే పఠానులు వీపులుచూపి పరుగెత్తసాగినపుడు నిజంగా వారికి ముఖాముఖి కావడం మరారులకు అసాధ్యమేకదా! మరణసన్నిభమైన ముస్లిం పరాజయాలు, తరిమితరిమి కొట్టిన మహారాష్ట్ర నిరంతర దారుణ ధాటి, ఇవి—మ్లేచ్ఛులు తమ పవిత్రాలయాలకు గావించిన అత్యాచారాలకు తగిన ప్రాయశ్చిత్తాలని అశేష హిందూప్రజ ఊరట బొందింది. నాటి లేఖలన్నీ యీ విజయగౌరవోన్మీలనంతో పొంగి పొరలుతున్నవి. "పఠానులు కాశీప్రయాగలను హీనపరచినారు. కానిమ్ము—చివరకు హరిభక్తులే గెలిచినారు....విరోధులు కాశిలో మందమారుతాన్ని రేగగొట్టగా, దేవుడు ఫరూకాబాదులో ఝంఝూమారుతంతో ప్రతిఫలం వారికి తిరుగ ముట్టజెప్పినాడు."

దీనికి, రాజకీయ ఫలితాలుగూడ తీసిపోలేదు. ముస్లిం సార్వభౌముడు పూర్తిగా లొంగిపోయి మిగత హిందూదేశంలో చౌతువసూలు హక్కును వీరికి యిచ్చినాడు. ఇదే పదును వాదరకు చోటివ్వడం. దీనితో

ముల్తాను (సింధు) పంజాబు, రాజపుత్రస్థానము, రోహిల్ ఖండములు మహారాష్ట్ర ప్రాబల్యములోనికి కొనిరాబడినవి. ఆనాడు—హరిభక్తులు మొగల్ సామ్రాజ్యహృదయం దూసిపోవునట్లు యీ దెబ్బ పొడిచినారని మహారాష్ట్రులు సగర్వంగా చెప్పుకోగలిగినారు. ఈ సంతోషపూర్ణ—ఫలపూర్ణ సంఘటనల వృత్తాంతము వినగానే, మహారాష్ట్రమండలి నాయకుడు బాలాజీరావు సైన్యాలకిట్లు వుత్సాహసందేశాన్ని పంపినాడు :— "మీ ధైర్యము అమోఘము—మీ స్థైర్యము అకుంఠితము. దక్కను సైన్యాలు నర్మద—యమున—గంగానదులనుదాటి, రోహిల్లాలు—పఠానులుబోటి ప్రచండ శత్రుబలాల ఎదుర్కొని, పోరి, తుదముట్టించినవి. సైనికులారా, సైన్యాధిపతులారా, నిజంగా మీరు అపరూపవిజయాల సాధించినారు. ఈ అఖండ హిందూ సామ్రాజ్యానికి భారధుర్యములైన స్తంభాలు మీరే! రాజపదవీ ప్రతిష్ఠాపకులుగా మీపేరు ఇరాను—తురాను దేశాలకు ప్రాకింది (1751)."

కాశీ ప్రయాగలను, ఔద్ నవాబు ఢిల్లీ వజీరుల అధికారమునుండి విడిపింప మహారాష్ట్ర నాయకులు మరియొకపరి ప్రయత్నించినారు. హిందూమత విమోచక ఉద్యమ ప్రాతినిధ్యము వహించిన వారికి, హిందూ పుణ్యతీర్థరాజాలైన ఆ రెండు క్షేత్రాలు యింకను ముస్లిం హస్తగతాలై యుండటం, నిజంగా అవమానచిహ్నంగా తోచి మనసుల నొవ్వజేసింది. దాని విషయమై వారు నిరంతరము అశాంతితో బాధపడినట్లు ఆకాలపు ఉత్తర ప్రత్యుత్తరాలు వెల్లడిస్తున్నవి. సౌమ్యసంధిమార్గాల నానుడును భరించలేక, ఒక సమయంలో మల్హారరావు, కాశీపై దండెత్తి, ధ్యానవాపీ పుణ్యస్థలంలో శిఖరాలెత్తి నిక్కిచూచుచుండిన మసీదును నిర్మూలించి, హిందూప్రజకు—హిందూ మతానికి చిరంతర ప్రస్ఫుటావమానమును తుడిచివేయుటకు తహతహపడినాడు. హిందూ ప్రసిద్ధాలయ శిథిలావశిష్టా

లపై లెచి, మెరసిన ముస్లిం చంద్రవంకలు, హిందూత్వమునకు అపా దింపజేసిన ఆ అపకీర్తి ధ్వాంత దుర్దినాలను, ఈ కాశీ మసీదు సదా జ్ఞప్తికిదెచ్చుచుండినది. కాని, యవనులు కాశీ ప్రాంతదేశంలో యింకను అధికార ప్రాభవాలను అనుభవించుచుండినందున, తమపైన, పుణ్యకాశీ పైన క్రోధపుపగ సాధింతురేమో అన్న భీతితో అచటి భూసురగణము "మంచి పరిస్థితులు ఏర్పడువరకు దండయాత్రను మాను" మని మల్హార రావును ప్రార్థించినారు. స్వార్థచింతతో, నిజక్షేమాల కొరకు—ఆ పట్టణ భద్రతకొరకు, జాతీయ అవమానానికి ప్రతీకారము చేయవలదని మహా రాష్ట్ర నాయకునికి కార్యవైముఖ్యము బోధించుట పాపహేతువని వగచి ధర్మ ఆవేదనను ప్రకటించినారు (18 - జూను - 1751).

1749 లో సాహు చనిపోయినాడు. సాహూవలన సర్వాధికారముల పొందిన బాలాజి అదిమొదలు, మహారాష్ట్రమండలికి నేతఅయి, నాటి జాతీయ కాంక్షలకు—ఆదర్శాలకు ఆత్మప్రాయమైనాడు. అప్పుడప్పుడు రాజప్రాసాద వంచకతంత్రాలు, అంతఃకలహాలు దారుణరూపము దాల్చు చుండినను—తన ముందటివారికంటె యీ కార్యచతురుడు, సుదృఢ దీక్షతో ఆత్మసాక్షితో రాజకార్యముల పాలించినాడు. జీర్ణమొగలు సామ్రాజ్య పునాదులమీద, మహారాష్ట్రుల యాజమాన్యాన, భూరి స్వతంత్ర హిందూ సామ్రాజ్యాన్ని పెంచి, పెద్దజేయుటకు, ముస్లిం—క్రిశ్చియను—ఆసియా ఐరోపీయాది సమస్త ప్రతిపక్షివర్గములవారితో బాలాజీ ఒక ప్రచండ సమరాన్ని సాగించినాడు.

వీరిలో, ఫ్రెంచివారు అప్పటికే దక్షిణ దక్కనులో విశేష ప్రాభ వాధికారముల సమకూర్చుకొనియుండినారు. బాలాజీ దీనిని గుర్తించక పోలేదు. కాని, ఏకైక హిందూ మహారాష్ట్ర రాజ్యాన్ని నానాముఖాల అణచివేయ ప్రయత్నించుచుండిన పలువురు విరోధులతో వివిధదూరదేశా

లలో ఒక్కుమ్మడి ఢీకొనవలసి వచ్చుటచే, బాలాజీ చాలాకాలముదాక, ఫ్రెంచివారిపనిని తలపెట్టి పూర్తిచేయలేక పోయినాడు. చివరకు—నానావిధ రాజతంత్ర వ్యూహమాలవల్లను, యుద్ధభూమియందు నెరపిన దుర్జయమైన ఒత్తిడివల్లను, బాలాజీ ఫ్రెంచివారికి, వారి పోషణకర్త నైజాముకు దిగ్భ్రమపుట్టించి, అనకొన తెలియనీయకుండాజేసి 1752 లో భలాకిపట్టం వద్ద వారిద్దరిని సంధికి ఒడంబడజేసినాడు దీనిప్రకారం తపతీ గోదావరిమధ్యస్థ భూమినెల్ల మహారాష్ట్రులు పొందినారు. దీనితో దక్కనులోని ఫ్రెంచి అధికారము బీటలువారిపోయింది.

పేష్వా బాలాజీరావు వెంటనే కర్నాటకము—దక్షిణ దక్కనులలో ఎదురుతిరిగిన నబాబులనందరిని శిక్షింప మొదలుపెట్టినాడు. సావనూరు నవాబును చావుదెబ్బకొట్టి అతని విశాలభూభాగాన్ని స్వాధీనంచేసుకొని, మిగిలిన రాజ్యఖండానికి 11 లక్షల కప్పమును గుంజినాడు. ఆతర్వాత 60,000 మహారాష్ట్ర చమూగణము బాలాజీ భావురావుల అధ్వర్యాన నడచి, శ్రీరంగపట్న సప్తప్రాకారాల మ్రోలనిలిచి, నిలువదేలిన చౌతుకుగా 35 లక్షలు వసూలుచేసుకొన్నారు. శివరె దుర్గ పునరాక్రమణానంతరము చిల్లర నవాబుల శిక్షించినారు. అప్పుడే, బల్వంతరావు మహేందలె కడప మండల ముస్లింపాలకునిపై దండెత్తిపోయినాడు. 'మహారాష్ట్ర' శబ్దము వినుకలిచేతనే వణకిపొయ్యే దక్కను నవాబులెల్ల కడప నవాబుకు పట్టుకొమ్మలైనారు; ఇంగ్లీషువారుగూడ యితని పక్షము వహించినారు, ధారాపాతమైన వర్షంలోనే దారుణ సమరానికి దిగి, బల్వంతరావు నిజ నిశితాసికి వేలకొలది పఠానుల బలియిచ్చి, నవాబునే స్వయంగా ముక్కలుచేసి పారవేసినాడు. కడపరాజ్యాన్ని సగం తమరాజ్యానికి కలుపుకొని, ఇంగ్లీషు వారి విశేష సహాయంతో బలయుతుడై పొంగుచుండిన ఆర్కాటునవాబును దరిసినాడు. నవాబుగాని, ఆయన పోషకులు—ఆంగ్లేయులుగాని

మహారాష్ట్రి ఆదేశాల నిరాకరించలేక పోయినారు. వారిని శాంతపరచను నవాబు 4 లక్షలు యిచ్చిపంపినాడు. 1759 లో మహారాష్ట్రిలు బెంగళూరును ముట్టడించి, చిన్నపట్నాన్ని పట్టుకొని, అప్పుడప్పుడే మైసూరు రాజ్యగ్రహణానికి ప్రయత్నించుచుండిన హైదర్ ఆలీ 34 లక్షలిచ్చేటట్లు బలవంతపరచినారు. బాలాజీరావు అక్కడనే హైదరును అణగద్రొక్క దలచుకొన్నాడు. కాని, యితరత్రా సాగుచుండిన సంఘర్షణల ఒత్తిడివలన అరకొరలుగా నెరవేరిన కార్యాలతోనే తృప్తిపడి. మహారాష్ట్రిసైన్యము క్రింది దక్కనును విడిచిపోవలసి వచ్చింది.

ఈ మధ్యకాలంలో, 1753 సంవత్సరమున, రఘోబా అహమ్మదాబాదును పట్టుకొని, ఢిల్లీలో నెలకొన్న మహారాష్ట్రాధికారమును శిరసావహించనందులకుగా జతు జాతీయులనుండి 30 లక్షలు గుంజినాడు. ఆసమయానికే యోధపురసింహాసనానికై రసపుత్రులలో అంతః కలహము రేగినది. రామసింగు, తన ప్రతిపక్షి, విజయసింగును అణచుటకు మహారాష్ట్రిల సహాయము కోరినాడు. మహారాష్ట్రిలు దత్తాజి, జయప్పసింధె నాయకత్వాన బయలుదేరినారు. 50,000 రాజపుత్రులతో రక్తపానాసక్తమైన క్రోధంతో భీభత్సయుద్ధంచేసి, విజయసింగును పూర్తిగా ఓడించి, నాగోరు దుర్గంలో దాగుకొనేటట్లు చేసినారు. ఆ యుద్ధము ఎవరికిగాని నచ్చినది గాదు. రసపుత్రులు—మహారాష్ట్రిలు, అనగా—హిందువులు ఆత్మబంధువులైన హిందువులతోడనే పోరాడుట! దీనిని బాలాజీ సహించక, రాజీచేసుకోమని జయప్పను ఊరకే బలవంతముచేసి, ప్రతి మహారాష్ట్రిని హృదయవాంఛ అయిన—కాశీ ప్రయాగాది ఉత్తరహిందూస్థాన పవిత్ర తీర్థ క్షేత్ర విమోచనమునకు మరాఠి దండును నడిపించమని విజ్ఞప్తులంపినాడు.

ఈ అదనులో—విజయసింగు కృత్రిమ హత్యామార్గానికి తార్కొ-

న్నాడు. ఈ దారుణ అత్యాచారము, సర్వమహారాష్ట్ర హృదయాన్ని భయ విహ్వలము జేసివేసింది. విజయసింగు మామ, యిట్లే స్నేహగోష్ఠిమిషతో, తన దండు విడిదిలో పిలాజి గైక్వాడను దారుణ హత్యకు పాల్జేసినది మరచియుండరు. పిలాజి నిర్దోషరుధిరము, మహారాష్ట్ర ప్రతీకార క్రోధాసిధారను సానబెట్టినది. తగినశాస్తి అనుభవించిన సంగతి జ్ఞాపకముండి గూడ, విజయసింగు మామ నడచిన త్రోవనే నడువదలుచుకొన్నాడు. విజయసింగు సేవకులు—ముగ్గురు రసపుత్ర హంతకులు, బిక్షగాండ్ర వేషాలతో, జయప్ప అశ్వశాల వాకిట రాలిన గుర్రాల గుగ్గిళ్ళను ఏరుకొం టుండినారు. స్నానానికి జయప్ప బయటికివచ్చి తడితుడుపు తుండు ముఖాన వేసికోగానే, ఆ ముగ్గురు ఆయనపై దూకి కటారుల డొక్కలో దింపివేసినారు. జయప్ప మరణఘాతలతో క్రిందపడి పోయినాడు. ఇద్దరు హంతకులు పట్టుబడినారు; మూడవవాడు తప్పించుకొని పారిపోయినాడు. ఆ సందిగ్ధ సమయంలో నాయకుని గోల్పోయి, మనోవైకల్యాన్ని పొంది, అజాగరూకులై యుండిన మహారాష్ట్రులపై రసపుత్రులు పడినారు. కాని, మోసపు చావుదెబ్బతో పడియుండిన ఆ మహావీరుని దుర్జయశక్తి స్వజ నానికి ఊపిరిపోసింది. నెత్తురుపడియలో, కొనవూపిరితో పడివున్న జయప్ప, క్షీణ ధ్వనితో—విషాదమూర్తులైన తన సైనికుల వీరావేశాన్ని రేగగొట్టి, "ముందు సైన్యాలకూర్చుకొని, చుట్టు ముట్టిన శత్రువులతో పోరి తర్వాత నాగాయాలపైబడి ఆడముండలవలె ఏడ్వండి" అని గర్జించి నాడు. ఆ వీరనాయకుని చరమప్రబోధం వారి రక్తాన్ని ఉప్పెనదెబ్బ కొట్టింది. మహారాష్ట్రులు కయ్యానికి దూకినారు. విజయసింగు మరియొక మారు ఓడింపబడినాడు. సింధె సహాయానికి మరికొన్ని మహారాష్ట్ర సైన్యాలు పరుగెత్తినవి. అనంతాజీ మంకేశ్వరుడు 10 వేల సైన్యంతో రాజపుత్రస్థానము ప్రవేశించి, విజయసింగుకు సహాయపడిన వివిధక్షుద్ర

రాజస్థానాలకు తగిన పాఠము చెప్పినాడు. ఈవిధంగా విజయసింగు బల ముడిగి, నిస్సహాయుడై సంధికి దిగినాడు. తాను పదభ్రష్టుని జేసిన రామ సింగుకు నాగూరు — మరియొక్క జిల్లానుయిచ్చి, మహారాష్ట్రులకు అజమీరు యిచ్చి, యీ యుద్ధయాత్ర సంపూర్ణవ్యయాన్ని భరించు కొన్నాడు.

అప్పుడే, బుంది సంస్థాన రాజమాత ప్రతిపక్షుల అణచి, తన పితృహీన పుత్రశిశువు రాజ్యాధికారమును రక్షించి, తమ సింహాసనమును తమకు నిలుపుమని సింధేని ప్రార్థించినది. దత్తాజిసింధె, ఆ రసపుత్రరాణి హృదయవాంఛను తీర్చినాడు. ఆమె 75 లక్షల పారితోషికమిచ్చి, విశ్వాస ఋణం తీర్చుకొన్నది.

---

# 12. సింధునదీ దండయాత్ర

ఢిల్లీయందు, రఘోబా సూత్రధారియై, గొప్ప సంఘటనల రూపొంద జేయుచుండినాడు. సామ్రాజ్యప్రధాని అగుటకు గాజీయుద్దీనుకు సహా యము చేసినాడు. పాదుషా, గయ—కురుక్షేత్రములు మహారాష్ట్రులకు యిచ్చునట్లు చేసినాడు. ఆయన స్వయముగా మధుర, బృందావనము, ఘట ముక్తేశ్వరము, పుష్పవతి, పుష్కరము మొదలగు హిందూ తీర్థాల స్వాధీనపరచుకొన్నాడు. పుణ్యావారణాసిగూడ విముక్తినొందినది. దాని రక్షణకు ఒక సైనికదళము నియమింపబడింది. ఇట్లు చివరకు, హిందూ అశేషజన హృదయవాంఛ ఫలప్రదమైంది. సర్వహిందూక్షేత్రాలు—తీర్థాలు ముస్లిం దాస్య విమోచనాన్ని పొందినవని, సగర్వంగా రఘోబా పేష్వాకు

వ్రాసినాడు. ఉత్తర హిందూస్థానంలో తరతరములుగా అసంఖ్యాకమైన పుణ్యసంబంధాలవల్ల ప్రతి హిందూ హృదయానికి పుణ్యకాణాచులై వెలసిన ఆ దివ్యక్షేత్రాలలో సగర్వంగా విజయశోభతో హిందూకేతనాలు మరల ఎగిరినవి. ఈ విజయదృశ్యమే హిందూవిమోచక, హిందూసామ్రాజ్యస్థాపక ఘనతరోద్యమానికి మహారాష్ట్రీలు ప్రాతినిధ్యమువహించి నాయకులగుటకు నైతిక హక్కును ప్రసాదించుచున్నది. మొగలుపాదుపాకు మహారాష్ట్రీలతో తల బట్టగట్టి, యుద్ధసన్నాహాలకు ఉపక్రమించినాడు. కొత్త వజీరు—గాజియుద్దీను తనమీద, తనకధికారము ప్రసాదించిన మహారాష్ట్రీలపైన పాదుషా పన్నుచుండిన యీ రహస్యాలోచనల తెలిసికొనగానే, హోల్కారును సహాయానికిగా ఆహ్వానించినాడు. హోల్కారు 50,000 సైన్యంతో దండెత్తివచ్చి, మొగలుసామ్రాజ్య వాహినుల నురుము చేసినాడు. మొగలులు తమ రాణివాసాన్నే సంరక్షించుకోలేక పలాయితులై, తమ అంతఃపుర జనాన్ని మహారాష్ట్రీల చేజిక్కించినారు. గాజియుద్దీన్‌తో గూడ మహారాష్ట్రీలు ఢిల్లీ నగరవీథులలో నడచి, రాజవాసాన్ని ప్రవేశించినారు. అచట ముసలి మొగలు పాదుషాను పదభ్రష్టునిచేసి, మరియొకనిని ఆ గద్దెమీద కూర్చుండబెట్టి, ప్రతీకారదేవత కార్యము రసోక్తిమయంగా పూర్తిజేయనో అన్నట్లు—సర్వజగత్తును జయించినవాడు—అను అర్థంగల 'రెండవ అలంగీరు పాదుషా' అను బిరుదమును అతనికి ఒసంగినారు.

ఔరంగజేబు మొదటి అలంగీరు; ఇతడు రెండవ అలంగీరు; ఔరంగజేబు అలంగీరు పాదుషావారు, హిందూ జీవనజ్యోతిని, హిందూ దేవాలయాలలో దేవ సాన్నిధ్యమున వెలుగు అఖండ నిత్యజ్యోతిని, తన సార్వభౌమిక క్రోధ నిశ్వాసముతోనే ఆర్పివేయగలనని భావించుకొన్నాడు. అల్లాపై ఆనతిగొని, ఆర్పి పేర్చినాడు. కాని, మరుక్షణంలోనే, కాంతి

పేదయై మిణుకు మిణుకుమను చుండిన ఆ దీపము, మతగర్వ ప్రోద్ధత మైన అతని పొడుగుగడ్డాన్ని కమలింపజేసి, హఠాత్తుగా మండి—జ్వాలలు చాచి, కార్చిచ్చు అయింది. ఆమంటలో సహ్యాద్రి శిఖరాలు అంటుకొని, అసంఖ్యాక హృదయాలను ప్రజ్వలింపజేసి—దుర్భేద్య దుర్గాల—పర్వత కటకాల—భూమ్యాకాశాల—నదీసాగరాల వెలిగింపజేసి, ఎదిగి ఎదిగి, ఒక భూరిత్యాగ హోమాగ్ని అయినది. ఈ సత్యాన్ని ఆయన చివరకు కాతరుడై తెలిసికొన్నాడు. ఆ మొదటి అలంగీరు మహారాష్ట్రిలను కొండ ఎలుకలని గర్హించినాడు. అదిమొదలు యీ హిందూ మూషికాలు పెంచుకొన్న నిశిత దీర్ఘ కరాళ నఖాలతో రెండవ అలంగీరు పాదుషా రాజధానీ నగరంలోనే, అనేక ఇస్లాం సింహాలు చీల్చబడి, నెత్తురుమడుగులో వారి పాదతలాన పడి మూల్గుచుండినవి. మొదటి అలంగీరు పాదుషావారు శివాజీని ఒక చిన్న రాజుగానైన అంగీకరింపలేదు. కాని, ఆయన వంశాంకురము ఈ రెండవ అలంగీరును—శివాజీ వంశీకుడు, పాదుషా నామ ప్రాసాదిత మానసిక సౌఖ్యాన్ని దయతో అనుభవింప నిచ్చినాడు. కాబట్టే సార్వభౌమ బిరుదమును దాల్చినాడు.

భారతదేశస్థ ముస్లిం ప్రపంచము, ఆ పాదమస్తకం ప్రకంపించి పోయినది. హిందూ అధికార ప్రాభవాలు, పలుముఖ వ్యాప్తాలు కావడం జూచి, అశక్తి నపుంసక క్రోధంతో బుసగొట్టుచుండినారు. ఫరూకాబాదు మొదలగు చోట్ల చావుదెబ్బలు తిన్న రోహిల్లాలు—పఠానులు, పదభ్రష్టులైన వజీర్లు—నవాబులు, దిన దినము క్రుంగిపొయ్యే తమ చంద్రవంక యొక్క అనుక్షణ క్షీణమాన తేజాన్ని—కాఫిరుల విజయోత్సాహాన్ని చూడసహించలేని మౌల్వీలు—మౌలానాలు, మహారాష్ట్రి శస్త్రనిశితాగ్రంపై నెలకొని, వారి యిచ్ఛాధీన ప్రాభవుడైన పాదుషా, మొదలైన పదభ్రష్టులు, నిస్సహాయులు, ఆశాపూర్ణులైన వివిధ ముస్లింగణము మహా

రాష్ట్రిలపై ప్రతీకారదీక్షను బూని, మహారాష్ట్రిలను తరిమి నిర్మూలించ వలెనని విద్రోహయత్నాల రహస్యముగ గావించుచుండినారు. ఉత్తరాన మహారాష్ట్రాధికార వ్యాప్తి, కొందరు హిందూ భూపతుల హృదయంలో గూడ తీవ్ర అసూయను రేకెత్తించింది అనుట ఒకవిధముగా వింతవిష యమే : జయపూరు మాధవసింగు, యోధపూరు విజయసింగు, జతులు మొదలగు కొందరు చిల్లర హిందూ పాలెగాండ్రు మహారాష్ట్రిలను అణచను తమ సహజ జాతీయ శత్రువులైన మహమ్మదీయులతో చేతులు గలుపుటకు వెనుదీయలేదు. హిందూమతమును, హిందూ స్వాతంత్ర్య నిర్మూలన యత్నాల నిరోధించి భగ్నయచేయగలిగిన ఏకైక హిందూ మహాశక్తి—మహారాష్ట్రి ప్రభుత్వమును కూలద్రోయను మహమ్మదీయు లకు వీరు సహాయపడి, వారి కుట్రలకు దోహదమిచ్చినారు. నేటి మహమ్మదీయులు హిందువులను బహిరంగ యుద్ధములోగాని, కుతంత్ర ములోగాని ఓడించలేకపోయినారు. క్రూర * మ్యాకివిల్లె కుతంత్రములో గాని ఔరంగజేబుకు ప్రియమైన ఘాతుక వంచనయత్నాలలోగాని ఘరాతులు తీసిపోలేదు. ఇక యీ గర్హిత విగ్రహోచ్ఛేదక కాఫిరులను పీచమణచను, విదేశీయ స్వమతస్థులను పిలిచే మామూలు పాత పద్ధతిలోనే పడినాడు నాటి ముస్లిం నాయకుడు.

ఈ విపులవ్యాప్త వంచకవ్యూహానికి రోహిల్లా—నజీబ్ ఖానుడు నాయకుడైనాడు. మహారాష్ట్రి పతనము యితనికి సర్వవిధాలా లాభ దాయకం. ఇతనికి, మొగలు జనానాలో దుస్తంత్రాలకు పేర్గాంచిన మల్కా-

* ఇటలీ దేశస్థుడు, ఖరోపియ దారుణ రాజనీతికి మూలపురుషుడు— మానవభావ శూన్య క్రోధమూర్తి మ్యాకివిలె—మన చాణక్యునివలె ఒక రాజనీతి పుస్తకాన్ని వ్రాసినాడు.

జమాని అను ప్రతిభాశాలిని తోడైనది. గర్వితహిందూహస్తగళిత కబళా నికి ప్రాధేయపడి గ్రహించటాన్ని ఆమె సహించలేక పోయింది. తమ ముందటివారు, ఎట్టి ఆశాభయాలతో నాదిర్‌షాను ఆహ్వానించినారో అదే విధానాన్ని వీరుగూడ అవలంబించ దలచుకొన్నారు. అహమ్మద్‌షా అబ్దల్లీతో వీరు రహస్య మంతనాలు సాగించి, వెంటనే హిందూదేశంపై దండెత్తివచ్చి అవిశ్వాసుల బారినుండి హైందవ ముస్లింసామ్రాజ్యాన్ని రక్షించమని ప్రార్థించి, తొందరపెట్టినారు. ఇందు, అహమ్మద్‌షాకుగూడ ఒక స్వార్థచింత గలదు. హత్యాపూర్ణ దురాక్రమణ తృష్ణ అతని నిసర్గ వాంఛ. వీటన్నిటికిపైన, ముల్తాను పొలిమేరలో మహారాష్ట్రాధికారము తన ప్రభుత్వముతో ఒరసుకొని, అనుక్షణము ఎదుగుచు, తన ప్రాభవంతో, ఎదుర్కొన చూచుచుండినందున ఏనాటికైనను మహారాష్ట్రుల ఎదిరించి, నిర్మూలించవలసి వున్నదన్న సర్వవేద్యవిషయంగూడ అతనిని యీ ప్రయత్నానికి దించింది.

అతడు ఇంతకుమందే ముల్తాను, పంజాబులను తన ఏలుబడిలో కలుపుకొని వున్నాడు. కాని, 1750 లోనే, తట్టా—ముల్తాను—పంజాబు రాష్ట్రాలలో శాంతిభద్రతల కాపాడి, విదేశదండయాత్రలనుండి రక్షించను మహారాష్ట్రులు బాధ్యతవహించి, దానికిగా ఆరాష్ట్రాలలో చౌతును వసూలు చేసుకొను చుండినారు. కాబట్టే, తాము ఏరి కోరి, అధికారంలో నిలిపిన గాజీవుద్దీన్ వజీరుకుగా అబ్దల్లీతో పోరి 1754 లో పంజాబు—ముల్తాను మండలాల వజీరుకు అప్పగించినారు. ఇది అతనిపట్లవారు చూపిన ప్రత్యక్ష ధిక్కారము! ఈ అదనులో నజీబ్‌ఖాను కుట్రలు అబ్దల్లీకి అతివ్యాప్త బల యుత భారతీయ మహమ్మదీయ రాజ్యాల సహాయాన్ని కూర్చినవి. ఇది ఆ పఠాను విజిగీషు ఆశాగ్రాన్ని నిశిత తమముజేసింది. దీనితో, నాదిర్‌షా చేజిక్కక విఫల మనోరథుని జేసిన, హిందూ సామ్రాజ్య కిరీటమును,

తాను సులభముగ పొందగలుగుదునన్న ఆశాస్వప్నాలలో పడిపోయినాడు. 1756 లో ముఖ్య మహారాష్ట్రి హిందూనాయకులు దక్కను పీఠభూమిలో అన్యకార్యమగ్నులై వున్నారని తెలుసుకొని, 60 వేల దండుతో సింధు నదిని దాటి పంజాబును ఆక్రమించుకొని, ఎదురించు దిక్కులేని ఢిల్లీని ఒర కత్తితోనే స్వాధీనము చేసుకొని, సర్వసామ్రాజ్య బిరుదావళిని సొంతము చేసుకొన్నాడు. పఠాను విజయులకు ఉచితమైన రీతిగానే, తన రాజ్యపదవీ స్వీకార మహోత్సవ స్మారకంగా, ఢిల్లీ ప్రజలను ఆడ - మగ, బిడ్డ - పాప అనక కొన్ని గంటలు భీభత్స సంఘాతమరణాల పాల్జేయించినాడు. ఆ స్వల్పకాలంలోనే 18 వేలమంది నిస్సహాయ నిరపరాధుల కంఠాల ఆ కరకు తురకకత్తి తరిగివేసింది. ఆతర్వాత, మొన్నమొన్ననే ముస్లిం ముష్టినుండి మహారాష్ట్రులు విడిపించిన హిందూ పవిత్రాలయాల, క్షేత్రాల ధ్వంసంచేస్తూ—తన ముస్లిం మత పరిత్రాణ బిరుదాన్ని నిలుపుకొని వన్నెదెచ్చుకొన్నాడు. మొదటిముద్ద మధుర. అయితేనేం? అది వీరోచిత పతనము! 5000 మంది జతులు అధిక సంఖ్యాక విరోధి బలంతో కడపటి నెత్తురుబొట్టు వరకు పోరి తమ ప్రాణాలతోబాటు పట్టణాన్నిగూడ గోల్పోయినారు. మహారాష్ట్రులపై కడుపుమంట మధురపై జూపి, గోకులబృందావనం చేరినారు. అక్కడ తమ గోకులనాథుని రక్షించుటో, మరణించుటో—అన్న దీక్షతో చేరియుండిన 4000 మంది సాయుధ నాగజాతీయులు మొక్కబోని ప్రతిఘటనతో ఎదిరించినారు. రమారమి 2000 మంది బైరాగుల బలిహరణంతో శత్రుధాటిని తిరుగగొట్టి తమ పుణ్యాలయాన్ని రక్షించుకొన్నారు. ఆవెంట, అబ్దల్లి ఆగ్రాపై నడచి ఆక్రమించుకొని కోటను ముట్టడించినాడు. అందు గాజీవుద్దీన్ వజీరు తల దాచుకొని, ప్రతిక్షణము మహారాష్ట్రి సహాయానికై నిరీక్షించుచుండినాడు. ఈ వజీరు, ఉత్తర హిందూస్థానంలో పఠానుల ద్వేషించిన మహమ్మ

దీయులనెల్ల సమకూర్చుకొని, పఠానులుగాని పారశీకులుగాని హిందూ దేశంలో రాజ్యాన్ని నెలకొల్పకుండా చేయను, మహారాష్ట్రులవలెనే తీవ్రముగా పోరాడు చుండినాడు.

అయితే, జయపుర-యోధపుర-ఉదయపుర రసపుత్రులు, తక్కంగల యితర హిందూపాలకులు యీ విషాదసమయంలో ఏమిచేయుచుండినారు ? వారు మహారాష్ట్రులను ద్వేషించి వారి హిందూసామ్రాజ్య స్థాపనోద్యమ నాయకత్వాన్నిగూర్చి శంకించి, అంగీకరింపరైరి. సరే! ఇక, హిందూ మతమును హిందూ పద్ పాదషాహిని, ఉత్తర హిందూస్థాన హిందూత్వమును రక్షించుటకు, ఒకరుగానో, అందరూ కలసియో, మహమ్మదీయలతో పోరి మహారాష్ట్రులకంటె యీ కార్యానికి తామే తగివున్నామని రుజువు చేయుటకు అదేగదా తగిన సమయము ? కాని, ఒక్కరుగూడ కాలు కదుపలేదు. అహమద్‌షా అబ్దల్లీ అసంఖ్యాక హిందూజనంతో క్రిక్కిరిసి యుండిన ఆ విశాల సారవంత సమప్రదేశాలపై అవలీలగా నడచి, ఢిల్లీ—ఆగ్రా నగరాల చేరుకొన్నాడు. ఢంకాగొట్టి సాటినట్లు—దక్కనులోగూడ కాలుబెట్టియుండును. రసపుత్రులు—జతులు—ఇంకను లెక్కకుమించిన హిందూరాజుల కట్టెదుటనే, ముస్లింమూకలు కలుజులుదీసిన వరవ వలె పొంగి పొరలి, కాఫిరుల నెత్తురు ప్రతీకారంగా పారించవలెనని బొబ్బలిడుచు, హిందూ హృదయాల—హిందూ ఆవాసాల—హిందూ దేవాలయాల—హిందూ తీర్థాల కాళ్ళక్రింద నలిచివేస్తూ, క్రూరవికట విహారాన్ని గావించినారు. కాని, మహారాష్ట్రులు కత్తిదూసి పైబడునంతవరకు ఎవరుగాని వారితట్టు వ్రేలెత్తి చూపలేక పోయినారు.

అబ్దల్లీ దండయాత్ర నాదిర్‌షా దండయాత్రకంటె ఎక్కువగా పునహా మహారాష్ట్రి నాయకుల ఉత్సాహాన్ని భంగముచేయలేదు; హృదయాలకు శైత్యాన్ని గూర్చలేదు. ఒక మహావాహినిని నడిపించుకొని

రఘునాధరావు ఉత్తరాదికి బయలుదేరినాడు. ఈ వార్త అగ్రాలోవున్న అబ్దల్లీకి చేరింది. అతడు అనుభవపరుడైన వివేకి; తన జీవితంలో మంచి తాకుల చవిచూచినవాడు. అట్టి విరోధి సాగించగలిగిన బలవత్తర నిరోధానికి రొమ్మిచ్చి ముందుకుసాగడంలో గల అపాయాన్ని వెంటనే గుర్తించి, తన గురువు—నాదిర్‌షా వలెనే, యుద్ధానికి దిగి, గెలుచుకొన్నదానిని గోల్పోదలచు కొనలేదు. కాబట్టి సత్వరంగా వెనుకకుమరలి ఢిల్లీ చేరుకొన్నాడు. హుటాహుటిగా, బీగం మల్కా జమాని కూతురును పెండ్లాడి, మొగలుగద్దె వారసత్వాన్ని బలపరచుకొన్నాడు. ఆతర్వాత 10 వేలమంది సిపాయిల సారహింద్ దుర్గరక్షణకు నిలిపి, కొడుకు—తైమూర్‌షాను లాహోరుకు రాజప్రతినిధిగాజేసి, తానువచ్చిన దానికంటే శీఘ్రంగా స్వదేశానికి వెడలిపోయినాడు.

దక్కనులో చేతులునిండా పనివుండినప్పటికిన్నీ, మహారాష్ట్రులు చేతనైనంత త్వరగా ముందుకు సాగిపోతూ అబ్దల్లీ చేసినదానినంతా సవరించుకొంటూ వుండినారు. సఖారాం భగ్వంత్, గంగాధర్ యశ్వంత్ ఆదిగాగల మహారాష్ట్ర చమూపతులు డోబ్ ప్రవేశించి (గంగాయమునల మధ్యప్రదేశం) మధ్యకాలంలో తిరుగబడిన రోహిల్లాల—ఫఠానుల అణచివేసినారు. గాజీఉద్దీను వజీరును సంరక్షించినారు. విఠ్ఠల శివదేవుడు ఢిల్లీని ముట్టడించి, ఒక పక్షపు తీవ్రయుద్ధానంతరం ఆరాజధానీ నగరాన్ని పట్టుకొని, మహారాష్ట్రుల ప్రబల విరోధి—పఠాను కుట్రలో ప్రధానపాత్ర అయిన నాజీబ్‌ఖానుని బంధిగా పట్టుకొన్నాడు. అక్కడనుండి సార్‌హిందు దుర్గంపైకి మరాఠిదండు నడచి, అచటి 10,000 మ్లేచ్ఛగుల్మాన్ని అణచి వారి సేనాపతి అబ్దల్ సమ్మదును చెరగొన్నది. అక్కడనుండి ఇంకను ముందుకు సాగిపోయి లాహోరును తాక నిశ్చయించుకొన్నారు. మహారాష్ట్రుల తీవ్రగమనము, అబ్దల్లీ రాజప్రతినిధి—తైమూరుషా గుండె

లవియ జేసింది. ముల్తాన్-పంజాబులను స్వభుక్తం చేసుకోదలచు కొనిన షాకు మరాఠులతో పోర గుండె చాలినదిగాదు. అతడు దేశంవిడిచి పరుగెత్తిపోగా, రఘునాథరావు జయదుందుభులతో లాహోరునగరం ప్రవేశించినాడు. జహాన్‌ఖాను, తైమూరుషాలు చేజిక్కకుండా తప్పించు కొని పోజూచినారుగాని, మహారాష్ట్రులు చురచురవెన్నాడి పలాయనాన్ని పరాభూతంగా మార్చినారు. ప్రాణాలమాత్రం దక్కించుకొని, సర్వమూ దిగవిడిచి, మహారాష్ట్రుల అణచి హిందూసామ్రాజ్యాని గ్రహించవచ్చిన వాని కొడుకు - వాని వైస్‌రాయి, మహారాష్ట్రుల చేజిక్కక ముందు పరు గెత్తుటవల్లనే ప్రాణాల కాపాడుకోగలిగినాడు. యవనుల దండువిడిది కొల్లగొట్టబడింది. సమర్థ రామదాసస్వామి శివాజీ ఛత్రపతిచేత బెట్టిన గైరికకేతనము చివరకు హిందూస్థాన ఉత్తరాంత సీమలో నెలకొల్ప బడింది.

హిందువులు అటకును దరిసినారు. ఆ పృథ్వీరాజ పతన ఘోరదుర్దిన మాదిగా నేటికి, విజయదీపితమైన హిందూ పతాకము, వేదఘోషాముఖరిత ఆ పావన నదీతటాన సగర్వంగా మరల ఎగిరింది. హిందూ విజయా శ్వము స్ఫటిక స్వచ్ఛతరంగాలపై బింబించిన నిజప్రతిబింబాన్ని సగ ర్వంగా, భయరహితంగా చూచుకొంటూ, మరల కడుపునిండ, కమ్మటి ఆ పంచనదీ తీర్థాల గ్రోలింది.

ఈ విజయ శుభవార్తలు మహారాష్ట్రము చేరగానే అబాలగోపా లము విద్యుచ్ఛక్తి చైతన్యులై పోయినారు. అంతాజీ మంకేశ్వరుడు రఘు నాథునికి యిట్లా వ్రాసినాడు :—"లాహోరు ఆక్రమింపబడి శత్రువు మన పుణ్యభూమి పొలిమేరల కావలకు తరిమివేయబడినాడు. చివరకు మన దండు సింధునదీ శీతలవారిలో సేదదీర్చుకొన్నది! అహో! ఎంతటి ఆనందవార్త! ఉత్తరాన అతృప్తులై తలలెత్త దలచుకొన్న వారినంద

రిని అణచివేసినాము. రాజాలు — రావులు — సుబాదారులు — నవాబులు అందరు అధోముఖులైనారు. మనజాతికి జరిగిన అత్యాచారాలకు, మహారాష్ట్రులే ప్రతీకార చర్యలు చేయగలిగినారు. సమస్త హిందూస్థానపు పగను అబ్దల్లీమీద తీర్చుకోగలిగినది వారొక్కరే! హృదయభావాన్ని పూర్ణముగా వెల్లడించుటకు మాటలు చాలకున్నవి. అవతారపురుషులు నెరపిన వీరకార్యాలకంటె వీరతర కార్యాలు యివి!"

తాము సాధించిన కార్యాలు తమకే ఆశ్చర్యాన్ని గొల్పినవనుటలో ఆశ్చర్యములేదు. ద్వారక మొదలు జగన్నాథమువరకు, ముల్తాను మొదలు రామేశ్వరంవరకు, వారి ఖడ్గము నిర్నిరోధముగ మెరసినది; వారిమాట శాసనాక్షరమైనది. తాము హిందుధర్మ సంరక్షకులమని, హిందూసామ్రాజ్యానికి ఔరసులమని బాహాటముగ చాటుకొని, యీ హక్కును ధిక్కరించవచ్చిన, ఇరాను — తురాను — ఆఫ్ఘనిస్థాను — ఇంగ్లండు — ఫ్రాంసు — పోర్చుగల్ దేశస్థులతో పోరి, తమహక్కును నిలబెట్టుకొన్నారు. శివాజీ హిందుసామ్రాజ్య కాంక్ష ఫలప్రదమైంది! రామదాసు యోగీంద్రుని ఉపదేశవాక్యాలు కార్యరూపాన్ని దాల్చినవి! జయోత్సాహంతో హిందూపటధ్వజాన్ని సింధునదీ తీరానికి గొనిపోయినారు. సాహూ చక్రవర్తి బాజీరావును ఆదేశించినట్లు ఇంకను పైకిదీసికొనిపోవ నుండినారు.

అటక్ ఆక్రమణతోగూడ మహారాష్ట్రుల ప్రాబల్యము, వారి రాజకీయ రంగవైశాల్యము విరివిగ పెరిగినవి. వారి రాజకీయాలు ఢిల్లీకోట నాలుగు గోడల మధ్యనే విశ్రమించి యుండలేకపోయినవి. కాశ్మీరము కాంధహారము, కాబూలు ఆస్థానాలనుండి, వార్తాహరులు—రాయబారులువచ్చి మహారాష్ట్రుల ఓలగంలో మూగినారు, రాజ్యాలు పోగొట్టు

కొనిన హిందూరాజులు తమ సహాయానికి కాబూలు, పారసీక యవనులను దేబిరించిన దినాలు కొన్ని గలవు. ఆస్థితి యిప్పుడు తారుమారై, కాబూలు కాంధహారులనుండి సహాయమర్థించే ప్రార్థనపత్రాలు అనంతాలు యిప్పుడు రఘునాథుని జేరుచుండినవి. 1758 లో నానాసాహెబులవారికి సేనాపతి యిట్లావ్రాసినాడు:—"తైమూరు సుల్తాన్ — జహాన్‌ఖానుల బలాలు పూర్తిగా నాశనముచేయబడినవి. వారి సమరసంపత్తి అంతా మనచేతులలో బడింది. ఏ కొద్దిమందిమాత్రమే ప్రాణాలతో అటకును దాటి పోగలిగినారు. ఇరానుదేశపుషా అబ్దల్లీని ఓడించి. కాంధహారముపైకి దండెత్తి రమ్మని బలవంతముచేస్తూ నాకు స్వయముగ వ్రాసివున్నాడు. ఇట్లు అబ్దల్లి మన ఉభయమిత్రసైన్యాలమధ్య చిదుగగొట్టబడిన తర్వాత, అటకుపట్నం మన సామ్రాజ్యహద్దుగా అంగీకరిస్తానంటాడు. అయితే, అటకు ఆక్రమణతో మనమెందుకు తృప్తిపడవలెనో నాకు తెలియడంలేదు. అక్బరు—ఔరంగజేబుల కాలాలనుండి, కాబూలు కాంధహారాలు మన హిందూస్థానీ సామ్రాజ్యానికి జెందియున్నవి. అందువల్ల ఇప్పుడు వాటిని మనము విదేశీయులకెందుకు అప్పగించవలెను? ఇరాను పాదుషా తన యిరానుతోనే తృప్తిపడి, కాబూలు కాంధహారాలకుగా మనతో వివాదపడడని అనుకొంటా. అతడు యిష్టపడినా యిష్టపడకుండినా వాటిని మన సామ్రాజ్యభాగాలుగాభావించదలచుకొన్నా. ఇక వాటిపై మన అధికారమును సాగించవలసివున్నది. అప్పుడే అబ్దల్లీ సోదరపుత్రుడు, తండ్రికి వ్యతిరేకంగా తనకు సహాయం చేయమని మనల చాల ప్రాధేయపడివున్నాడు. అతనిని మన ఏలుబడిక్రింద, సింధునది అవలి భాగాలకు మనపాలకునిగా నియమింపదలచుకొని, సహాయార్థంగా కొంతసైన్యాన్ని పంపివున్నా. ఇక ప్రస్తుతం నేను అవసరంగా దక్కను చేరాల. ఇక్కడ నాతర్వాతవచ్చిన నాయకుడు, యీ విశాల విధానం ఫలప్రదమయ్యేటట్లు ప్రయత్నించి,

కాబూలు కాంధహారాలలో సక్రమ హిందూపాలనము నెలకొల్ప యత్నించునుగాక !"

---

# 13. హిందూ పద్ పాదషాహి

ఆలేఖ వ్రాసి, రఘునాధరావు, ఆసన్నవర్షఋతువుకు ముందే దక్కను చేరను సత్వరముగ బయిలుదేరినాడు. నూతనాక్రమిత దేశాన్ని అట్లు తగిన రక్షణ లేకుండా వదలిరావలసివచ్చుట దురదృష్టము. ఆనాటికి తృప్తికరంగా పరిష్కారం గానిది నజీబ్ ఖాను దారుణ సమస్య ఒక్కటే! పతానుకుట్ర ప్రజ్ఞాపూర్ణనిర్మాత - అహమ్మదల్లీ ఆగమనానికి హేతువు. మహారాష్ట్రాధికార ధిక్కారి - నజీబును, అతడుచేసిన ఘాతుకచర్యలకు ప్రతీకారంగా వధించమన్న అశేష మహారాష్ట్ర ప్రజావాంఛను భిన్నంగా, పట్టుబడినవానిని వదలివేసినాడు. ఈ జిత్తులమారి—అరితేరిన వేషధారి—మాట మాటకు అడుగడుగుకు క్షమాపణ కోరినాడు; మల్హారరావును తండ్రిగా స్వీకరించినాడు; ఆతర్వాత పశ్చాత్తాప తప్తుడైన బిడ్డను తండ్రి వలె మన్నించమన్నాడు. మహారాష్ట్ర విరోధులై, జీవనహక్కును గోల్పోయిన ప్రతివానిని పుత్రుడుగా స్వీకరించను మల్హారరావు సదా కుతూహలపడుచుండేవాడు. కాబట్టే నజీబ్ ఖాన్ కొడుకు గట్టిగా ప్రాధేయపడుటవల్ల యిష్టములేకపోయినా రఘునాథరావు యీపనికి యియ్యకొన్నాడు. ఆతర్వాత యీ దత్తపుత్రుడు తన్నుకాచిన అయ్యలను ముంచను ఎంతటి ఘోరకుతంత్రాల పన్నుచు, తన పశ్చాత్తాపానల తప్త చరమ జీవితాన్ని ఎట్లు గడపినాడో వెంటనే పారకునికి తెలియగలదు.

ఇంతవరకు రాజనీతికిగా, మహారాష్ట్రీలు హెచ్చుతక్కువగా ఢిల్లీ పాదుషా పేరనే కార్యకలాపాలు సాగించుచుండినారు. అది ప్రతిఘటనలేని మార్గము. దానివల్ల మంచి లాభము కలిగింది. అప్పుడు వారి స్థితి, 1818 లో మహారాష్ట్ర పతనానికి ముందు, హిందూదేశంలో బ్రిటిషు వారి స్థితికి సరిపోయివుండింది. బ్రిటీషువారు, యథార్థానికి అసలు పాలకులే అయినను, రాజకీయ రాజతంత్రకారణాలవల్ల 1837 వరకు సార్వభౌమ ప్రతినిధులుగా నటించుచుండవలసినట్లు జేసిన పరిస్థితులే మహారాష్ట్రీలనుగూడ ఢిల్లీ పాదుషా కార్యనిర్వాహకు లనిపించింది. తొందరపడి దీనికి భిన్నంగా వారు మెలగినచో, హిందూదేశస్థ ముస్లింలందేగాక ఫ్రెంచి—ఇంగ్లీషు—పఠానులు, హిందూ రాజులలోగూడ అలజడి చెలరేగి, తీవ్ర నిరోధానికి ఆస్పదమై వుండేది. మరణోన్ముఖమై అనుదినం క్షీణిస్తుండిన మొగల్ పాదుషా సామ్రాజ్యముపై వీరిలో ప్రతివాడు కన్ను వేసియుండి, ఆ సామ్రాజ్య వారసులెల్ల దుర్బలులై నామరూపాలు లేకుండా అణగిపోవు నంతవరకు పీడిత వృద్ధ పాదుషా మరణశయ్యయందే కొనవూపిరితో మని వుండవలెనని కోరుకొంటూ, ఢిల్లీ సులభసాధ్యకబళం ఏనాడు అగునా అని ఉవ్విళ్ళూరుచుండినారు.

ఉత్తర హిందూస్థాన దిగ్విజయాలు, దక్షిణాపథంలో పేష్వా స్వయంగా సాధించిన విజయాలు మహారాష్ట్ర అధికారాన్ని ఘనతరము జేసినవి. ఆకారణంగా, బాలాజీ—సదాశివరావు భావు మొదలు సామాన్య పథికునివరకు గల అశేష మహారాష్ట్రప్రజ తమ నాయకులు ఉద్యమించిన ఘనతర కార్యాన్ని, కొరవలు పూర్తిజేసి ముగించను చాలినంతశక్తి తమ జాతికి అప్పటికి చేకూరినదని భావించినది. మహారాష్ట్ర కార్యాలోచన వర్గాల మ్రోల ఘనతరప్రణాళికలు చర్చకు గొనిరాబడినవి. తమ శక్తిని గుర్తించుకొన్నారు. హిందూదేశీయ ముస్లిం సామ్రాజ్యానికి చావుదెబ్బ

కొట్టినామని తెలుసుకొన్నారు. సమస్త ఆసియా ఖండంలో ఎన్నదగిన అధికారంగా పెరిగి, పునహానగరము భారతీయ రాజకీయాలకే గాకుండ, అఖండ ప్రాక్ఖండ రాజకీయాలకే కేంద్రమైనదని కనుగొని ఉప్పొంగినారు. మొగలు సామ్రాజ్యము తునియలై వారి పాదాక్రాంతమై వుండినది. ఇక ఆ సామ్రాజ్యమకుటమును బహిరంగముగ స్వహస్తగతము చేసికొని, నిజఉద్యమపూర్తిని కొరవపరచివుండిన క్షుద్రావరోధాల నిర్మూలించ నిశ్చయించుకొన్నారు. మహారాష్ట్ర పక్షంలో యితరులందరికంటే తానే యీ పనికి తగివున్నానని, సదాశివరావు భావించుకొని, యీ కార్యమును పూర్తిజేయుటో, లేక ఆ ఉద్యమమున మరణించుటో అని కృతనిశ్చయుడైనాడు. మహారాష్ట్రులు మొగలు సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నము జేసినారు. ఇప్పుడు హిందువులు విజయిని జయించినారు. భావు ప్రబోధచకితులై సమస్త హిందూదేశమును విముక్తిజేయు కార్యభారమునకు కడంగి అచిర కాలంలోనే దేశాన్ని సంపూర్ణముగా హిందూపాలనలోకి గొనివచ్చుటకు యత్నించినారు.

ఈ ఆదర్శలబ్ధికి మూడు యానాలు నిర్ణయింపబడినవి. దత్తాజీ సింధె, నూతనముగ జయింపబడిన పంజాబు ముల్తాను రాష్ట్రాలలో శాంతి భద్రతలు—సుస్థిర పాలనావిధానమును, నెలకొల్పుటకు నియోగింపబడినాడు. ఆ పని పూర్తిజేసికొని సింధె, కాశీ—ప్రయాగలజేరి, పెద్ద సైన్యంతో అచటికి రానున్న రఘునాథరావును కలుసుకొనవలెను. అటనుండి రెండు సైన్యాలు బయలుదేరి, బెంగాలు ప్రవేశించి, ముస్లింలు—ఇంగ్లీషువారిని ఆదేశమునుండి తరిమి, సముద్రాలవరకు మహారాష్ట్ర ప్రభుత్వాన్ని వ్యాపింపజేయవలెను. ఇంగ్లీషులు అప్పుడే ప్లాసీ (1757) యుద్ధమును గెలిచి, అబ్ధిమేఖలయైన వంగభూమినంత స్వాధీనము చేసుకోదలచుకొని యుండినారు. ఇట్లు, సింధు బ్రహ్మపుత్రానదుల మధ్యభూమిని దత్తాజీ—

జంకోజి—రఘునాథరావులు విడిపించుచుండ, బాలాజి, ఆయన పుత్రుడు—విశ్వాసరావు, సదాశివరావులు దక్షిణాపథ విమోచనకార్యానికి ఉపక్ర మించినారు.

అనుకొన్నట్లు దత్తాజి ఉచిత సైన్యంతో ఉత్తరాభిముఖుడై బయలు దేరినాడు. బాలాజి భావురావులు మొదట నైజామును నామమాత్రావశిష్టు నిగా చేయదలచుకొన్నారు. వెంటనే బహుళ సైన్యంతో సరికొత్త రణ యంత్ర సామగ్రితో నడచి, చిల్లర పోరులతో బహువిధ వ్యూహాలతో నైజాం సేనల అలయించి, తుదకు 1760 లో ఉదయగిరి సమరాంగణ భూమిలో శాశ్వతవిజయాన్ని పొందినారు. ఆ యుద్ధంలో ముస్లిములు బాగా చితికిపోయినారు. నైజాం హీనాతిహీనంగా లొంగిపోయి, నిజరాజ ముద్రికల స్వయంగా భావురావుకు అప్పగించి, వారి యిష్టానుసారము సంధికి ఒడబడసిద్ధమని దైన్యంగా సమ్మతించినాడు. ఆసంధిప్రకారం, నగరు—బరిహంపురము—సాల్హేరు—ముల్హేరు—అశీర్‌ఘడము—దౌలతాబాదు దుర్గాలు, నందేడు—పులుంబ్రి—అంబేద్—విజయపూరు మండలాలు మహారాష్ట్రుల కొసంగబడినవి. భావుగూడ తృప్తిపడినాడు—"నైజాంశక్తి ఉడిగిపోయింది. ఇక లెక్కబడదు. ఉత్తర హిందూస్థాన యాత్ర లేకపోయిన, యీ సంవత్సరాంతం లోపలనే యావద్భారతావని విముక్తిని బొందియుండగలదు." శివాజీ ఛత్రపతి తోరణదుర్గాన్ని స్వాధీనం చేసుకొని, బాహాటంగా హిందూవిప్లవపతాకాన్ని ఎగగట్టి నప్పుడు, ఆ చిరుత విప్లవనాయకుని, గర్హణస్మితాలతో ఆదిరించిన నగరు—విజయపూరురాజులు, నేడు, తమశిథిల దుర్గాలపై మహారాష్ట్ర కేతనము పెటపెటలాడటం చూడగలిగినారు.

ఈ రాజతంత్ర రణతంత్ర విజయాల అనంతరం, ఆ ఉదయగిరి విజయి, హైదరు అలీని అణగద్రొక్కను బయలు దేరినాడు. అప్పటికే

హైదరు మైసూరును ముట్టడించి, ఆ ప్రాచీన హిందూసంస్థానాన్ని కూల ద్రోసి, ఆ గద్దెపై తానే కూర్చుండినాడు. ఆ హిందూరాజు—ఆ సంస్థాన మంత్రి, యీ నూతన ముస్లిం రాజ్యస్థాపకుని అత్యాశలనుండి తమ్ము—తమ పురాణ మహిషపురాన్ని రక్షించమని మనసుకరగించు విజ్ఞాపనల మహారాష్ట్రులకు అంపినారు. ఈ సదవకాశాన్ని గ్రహించి, హైదరును అణచి, దక్కను విమోచక కార్యాన్ని పరిపూర్తిగావించను తహతహ పడుచుండిన సదాశివరావు, భావు వెంటనే బయలుదేం దలచుకొన్నారు. కాని, ఉత్తరంనుండి చేరిన విషాదవార్త ప్రయత్నభంగం గావించింది. "విజయామృతపూర్ణ కలశము తన పెదవులంటబోవు సమయంలో, అది తన చేతులనుండి క్రూరముగ పెరికివేయబడింది" అని భావు వ్రాసినాడు.

దత్తాజిక్రింద ఉత్తరం నడచిన మరాఠిదండు 1758 సంవత్సరాంతంలో ఢిల్లీ చేరింది. పూర్వ నిర్ణయానుసారం, అచటనుండి దత్తాజీ నూతనా క్రమిత లాహూరు పరగణాచేర ఉద్యమించినాడు. శాబాజిసింధె, త్రియంబక బాపూజీలను అటకు పర్యంత వ్యాప్త నూతనరాష్ట్రాల పాలింపుమని, సార్‌హిందు—లాహోరు ఆది దుర్గాల బలపరచినాడు. అంతట దత్తాజీ పంజాబును వదలి — బంగాళమునకు బయలుదేరి, ఇంగ్లీషుల పని ముగించి, హిందూపాలనా సీమల సముద్రాల తాకించదలచుకొన్నాడు.

ఇక్కడ దత్తాజి ఒక పొరబాటు చేసినారు; నజీబ్‌ఖాను విషయంలో పేష్వా ఆజ్ఞల పాలించలేదు. దత్తాజీ వంగయాత్రలో సహాయపడి విశ్వాసపాత్రముగ ప్రవర్తింతునన్న ఒక అస్ఫుట వాగ్దానానికిగా, ఓగినశాస్తి జరిగించకుండా సింధె, ఖానును వదలిపెట్టియుండినాడు. అతడు యీలోపల నిజప్రాభవాధికారాల పెంపొంద జేసుకొన్నాడు. పేష్వా కోపంగా యిట్లా

వ్రాసినాడు:—"నజీబును బక్షీగా నియమిస్తే మనకు 30 లక్షలిస్తాడని వ్రాస్తున్నావు. చిల్లిగవ్వగూడ తాకవద్దు. నజీబు అబ్దల్లీలో సగంమనిషి, వానిని నమ్మవద్దు. ఆ మాయోపాయ ఘాతుక విషమయ మ్లేచ్ఛ భుజంగానికి పాలుపోయవద్దు". కాని, వంచకవిద్యా పారగుడైన ఆ వేషధారి మాయోపాయాలకు, మంచి మాటలకు దత్తాజీ లోబడిపోయి, గంగనుదాటను అతడు నిర్మిస్తానన్న పడవల అట్టెడపై కొండంత ఆశలుపెట్టుకొని వుండినాడు. ఇట్లా ఒకప్రక్క మహారాష్ట్రీల వంగయానాన్ని ఆలస్యపరుస్తూ, నజీబ్ ఖాను మరియొకప్రక్క లభించిన పూర్ణావకాశంతో, మహారాష్ట్రీలపై మరియొక దారుణతర ఘోరితరమైన కుట్రను యితర మహమ్మదీయుల సహాయంతో పన్నుచుండినాడు. ఈమారు ఢిల్లీ పాదుషానుగూడ లోగట్టుకొని, సహాయమర్థించి —దండెత్తిరమ్మని స్వహస్తాక్షరలేఖను ఒకదానిని అబ్దల్లీకి పంపునట్లుగూడ చేయగలిగినాడు. అల్లా పేర—మతము పేర—ముస్లిం హృదయాలకు పవిత్రమైన సమస్తముపేర, పఠానుల మతోద్రేకాన్ని రెచ్చగొట్టినాడు. అబ్దల్లి మతపరిత్రాణుడై, గాజీయై (విజయి), అవిశ్వాస విగ్రహారాధకుల మరణబంధమునుండి హైందవ ముస్లిం సామ్రాజ్యాన్ని రక్షించడా? అబ్దల్లీగూడ మహారాష్ట్రీలు తనకు గూర్చిన పరాజయ పరాభవశల్యంతో ఆవేదన పడుచుండినాడు. తనచేతుల నుండి సర్వ హిందూదేశ మకుటాన్ని వారు ఎగురదన్నుకొని పోయినారు. ఇంతేకాదు—పంజాబు, ముల్తానులనుండి తన్ను తరిమివేయుటే గాకుండా, తన సొంత కాబూలు, కాంధహారులనే తమరాజ్యభాగమని చాటుచుండ, తగిన ప్రతిక్రియ చేయలేక వూరకచూస్తూ కూర్చుండవలసివచ్చింది. ఇక యిప్పుడు, ముందటికంటె మంచి పరిస్థితులలో—మంచి యాజమాన్యాన తనకు అవకాశం మరల లభించింది. మరియొకమారు హైందవ ఏకచ్ఛత్రాధిపత్యమును గ్రహించి, పరిపూర్ణదశకువచ్చిన మహారాష్ట్రీల

హిందూ సామ్రాజ్యస్థాపనల వమ్ముచేయ దలచుకొన్నాడు. కాబట్టి అబ్దల్లి మహోత్సాహంతో నజీబుతో చేతులు కలుపను అంగీకరించి, ప్రచండ సైన్యావళితో మరల సింధుదాటి లాహోరు ఆక్రమించుకొన్నాడు.

అబ్దల్లి దండయాత్రవార్త ఢిల్లీ చేరగానే నజీబ్‌ఖాను, ముసుకును పెరికి పారవేసి, బహిరంగంగా అబ్దల్లీకి సహాయంచేస్తానని చాటినాడు. పేష్వా యోచనలప్రకారం నడచుకోనందున సంభవించిన ముప్పును, తాను గావించిన ఘోర ప్రమాదాన్ని దత్తాజీ యిప్పుడు గుర్తించినాడు. తన్ను నజీబు, సుజాలు మోసగించినసంగతి, తన్ను యిప్పుడు రెండు బలవత్తర శత్రుసైన్యాలు రెండుప్రక్కల ఒత్తివేసిన విషయము ఆయనకు బాగా తెలియవచ్చినవి. ముందు సుజ, ప్రక్కన నజీబు, మరియొకప్రక్కన రోహిల్లాలు—పఠానులు, వెనుక అతిత్వరితగతిగా పొర్లివచ్చే అబ్దల్లీ భూరిసేనా ప్రవాహము మహారాష్ట్రులను చుట్టుముట్టుచుండినవి. అటకు, లాహోరు దుర్గ సంరక్షణాల కుంచబడిన మహారాష్ట్ర స్వల్పసైనం అబ్దల్లీ ధాటికి ఆగలేక పలాయనము గావలసివచ్చింది. ఉత్తర హిందూస్థానంలో మహమ్మదీయులను మహారాష్ట్రులతోబాటు ఒక్క నవోదిత శిక్కుజాతి మాత్రమే ధిక్కరించుచుండినది. ఈ వీరజాతి, శత్రువుల కొట్టి—నిలుపుటకు తమ సాయశక్తుల జూపినది. కాని, అప్పుడప్పుడే రూపొంది ఏకోన్ముఖమగుచుండిన నూతనశక్తి అగుటచే దార్ఢ్యముచాలక తమ రాష్ట్రాన్ని గూడ శత్రుబారినుండి రక్షించుకోలేక పోయినది. ఆ మంచిదినాలు ఇంకను రావలసివున్నవి. కాబట్టే, అబ్దల్లీ తన ప్రచండసైనిక నివహాన్ని నిర్నిరోధంగా సారహింద్‌పైకి నడిపించినాడు. రాజస్థానమునందలి అధిక సంఖ్యాక రసపుత్ర సంస్థానాధిపతులు, మరికొందరు హిందూరాజులు, పుణ్య మధురాపట్న విధ్వంసి—హిందుమత జన్మవిరోధి—అబ్దల్లిపట్ల సానుభూతిని చూపినారు. ఇక అబ్దల్లీమధ్య, ఢిల్లీ సామ్రాజ్య సింహాపీఠిక

మధ్య, నిలచిన అవరోధము—దత్తాజీ నడిపిన ఆ క్షుద్ర మహారాష్ట్ర వాహిని ఒక్కటే! వెంటనే సహాయానికి రమ్మని హోల్కారుకు వ్రాసినాడు. కాని, నజీబు దత్తుతంత్రి—ఆ సేనాపతి అక్కడక్కడి చిన్న పాలెగాండ్రతో పోరుచే ఆ సమయానికి ఉచితమనుకొన్నాడు. ఇట్లు సర్వముఖములా, అజేయ శత్రుగణముచే పొదువబడిన ఆ మరాఠి దండుకు, ఢిల్లీవదలి వెనుకకు మరలిపోవుట ఒక్కటే రక్షణమార్గముగ మిగిలియుండినది. సైన్యమునందలి ప్రతి అనుభవపరుడు—వీరుడుగూడ ఉపసంహరించుకొని, హోల్కారు రాకకు నిరీక్షించవలెనని నొక్కి చెప్పినారు. ఆటుపోటు ఎరుగని ఆ లేత మగటిమికాడు—జంకోజిగూడ వెనుకకు దిరగమన్నాడు. కాని, దత్తాజి వినిపించుకొనలేదు. తననమ్మకము చేతనే, యీ బలగాన్ని యింతటి దుర్దశకు పాల్జేసితినన్న ఆత్మజ్ఞానము ఆయన మనస్సును నమలివేసింది. మహారాష్ట్రుల ప్రధానశత్రువు నజీబు తల రక్షించిన అపాత్రవిశ్వాసానికి దోడు, పిరికితనాన్ని బాసటజేసికొన దలచుకొనలేదు. ఉపసంహరించుమన్న ఆ ఒత్తిడికంతా—"ఇష్టమున్న వారు చేయండి. నేను బలవంతము చేయను. నేనుమాత్రం అడుగు కదల్పను. ఈ జన్మలో నానా, భావులకు నాముఖమెట్లు చూపగలను? అబ్దల్లీని ఎదుర్కొనక తప్పదు—దైవసంకల్పమున్న సమరాంగణంలో వానిని జయించుటో, లేక వీరస్వర్గ మలంకరించుటో నాకు మిగిలిన మహిత గతులు" అని ప్రత్యుత్తరమిచ్చినాడు.

ఈలోపల, సార్వభౌముడుగూడ పరాని కుట్రలోచేరి, తన ప్రాణ మానధనాల హరించుటకు యత్నించినాడని గాజీయుద్దీనుకు తెలియ వచ్చింది. వెంటనే పాదుషాను బయటకు తీసికొనిపోయి, చంపించి, మరి యొకనిని ఆ గద్దెపై కూర్చుండబెట్టి తాను మహారాష్ట్ర సైన్యాలతో గలసినాడు.

అన్నమాటప్రకారం దత్తాజీ అబ్దల్లీని కురుక్షేత్ర రణభూమిలో ఢీకొన్నాడు. దత్తాజీ ప్రతాపగుణం, సైనికుల పొంగించి, అబ్దల్లీ సైన్యాల నిరోధించి, వెనుకకు నెట్టునట్లు జేసింది. ఇతరసహాయం లేకుండా అబ్దల్లి మహారాష్ట్రులను నిరోధించలేమని తెలుసుకొన్నాడు. కాబట్టి యమునా నదిని అతి కష్టంమీద దాటి, నజీబుఖానుని సైన్యాలతో ఘక్రతాల్ దగ్గర చేరుకొన్నాడు. సుజా, అహమ్మద్‌ఖాన్‌బంగేషి, కుతుబ్‌షాలు అచటకే చేరుకొన్నారు. ఆ ముస్లిం కలయిక అజేయమైనది. దత్తాజి చిన్నసైన్యం యీ విపుల సైన్యాన్ని నిరోధించజాలదు; మరల మంత్రులు ఉపసంహరించమన్నారు. "ఇష్టమున్నవారు పోవచ్చును, దత్తాజీమాత్రం తనసైనిక ధర్మాన్ని నెరవేర్చవలెను" అని పలికినాడు. అంతటి వీరుని నోటినుండి వెలువడిన ఆ మాటలు వృథాకాలేదు. దానితో ఒక్కరుగూడ తమస్థానాల వదలలేదు. 10-జనవరి 1760 నాడు, మహారాష్ట్ర సైనికులు కదనకుతూహలులై, యమునానదీతీరఘట్టాల రక్షించి, మ్లేచ్ఛవాహినుల ఆ వాహినిని దాటనీయకుండ జేయదలచుకొన్నారు. యుద్ధము ప్రారంభమైంది. బయ్యాజి, మాలోజి మొదలైన మహారాష్ట్ర నాయకులు, ఒకరివెంబడి ఒకరు బలాతీత సైన్యాల క్షాత్రతేజంతో ఢీకొని వీరస్వర్గ మలంకరించినారు. ఇరుబలాలు కలియబడి సంకులసమరమైంది. ప్రమాదవశాత్తు—మహారాష్ట్ర పతాకము, పఠాను—రోహిల్లా మూకలచే చుట్టబడింది. మహారాష్ట్రులు దాని రక్షణానికి దూకినారు. పోరు తుములమైంది. దత్తాజీ జంకోజీలు తమ జాతీయ పతాకం అట్టి దుర్దశకు పాల్గావడం సహించలేక, శాశ్వత కీర్తిదాయకమైన ఆ యుద్ధంలోకి జొరజడినారు. అప్పుడే ఒక తుపాకిగుండు జంకోజీని తాకింది. ఆ యౌవ్వన ప్రతాపమూర్తి గుర్రం మీదనుండి నేలకు విరుగబడినాడు. దీనిని దత్తాజీ చూచినాడు. సురక్షిత స్థానానికి ఉపసంహరించేదానికి బదులు, మోకరించుకొని ముందుకుదూకి,

శత్రుబలాన్ని నరుకుకొంటూ దారిచేసుకొని లోపలికి పోయినాడు. ఆయన వెంట విశ్వాస పాత్రులు కొందరు జొరబడినారు. కాసేపటికి మరాఠులు శత్రుసైన్యంలో కలియబడిపోయి, తేనెలో ముంచిన వ్రేళ్ళవలె అయిపోయినారు. చివరకు విధి బలీయమైంది; దత్తాజీ గుండుదెబ్బతో మృతకల్పుడుగా నేలపై బడినాడు.

నజీబ్ ఖానుని ఆధ్యాత్మిక గురువు, కులపతి—కుతుబ్ షా దీనిని చూచినాడు. ఈ పఠాణి కుట్రకు మొనగాడైన షా, పతిత మహారాష్ట్రి చమూపతిని దరిసి, నిష్ఠుర నర్మ వాక్యాలతో: "మీరా! పటేలుసాహెబ్ గారు, మాతో ఇంకా పోరాడుతారా?" అని పలుకరించగా "అవును! బ్రతికితే తప్పకుండా పోట్లాడుతా" అని, ధీరంగా ఆ వీరస్వర్గపధికుడు వీరోచిత ప్రతివాక్యాన్ని పలికినాడు. ఈ మాటలు ఆ మతావేశమూఢుని మండించినవి; అతడు కోపోద్రేకంతో గాయాలతో క్రిందపడి లేవలేకుండిన ఆ వీరసింహాన్ని కాలదన్ని, ఖడ్గాన్నిదూసి, తల నరికి, విజయి విజయకలశాన్ని తీసికొనిపోయినట్లు ఆ కాఫిరు—దత్తాజీ తరిగిన శిరాన్ని తీసికొనిపోయినాడు.

ఇదీ దత్తాజీ వీరమరణోదంతము! ప్రపంచంలో ఏ వీరుడుగాని, యింతటి, విశ్వాసభక్తులతో నిజజాతీయపతాకాన్ని రక్షించలేదు; ఏశూరుడు గాని, యింత క్షాత్రంగా దానికై పోరి ప్రాణాల అర్పించలేదు.

దత్తాజి పతనము, ఆ మరణాయమాన శూరునిపట్ల జూపిన వీరానుచిత నీచపరాభవము మహారాష్ట్రి భూమికి తెలిసి, దానిని రగుల్కొల్పినవి. ఒకే కంఠముతో, ప్రతీకారము గావింపుమని ఘోషించినది దేశమంతా.

వారు దక్షిణాన ఉదయగిరి విజయాన్ని సాధించి, హైదరుని అణచి, దక్షిణాపథ విముక్తి యత్నాన్ని ఫలప్రదంగా ముగించాల అను

కొన్న ఆ తరుణంలో దత్తాజీ పరాజయ మరణవార్తలు వారికి చేరినవి. ఆ మహత్తర సంఘటనను సాగించుటలో బాలాజీ బావురావులు ఒక్కక్షణ మైనను వృథాపుచ్చలేదు. ఆ వారంలోనే, దక్కనులో నాలుగు పెద్ద యుద్ధాలు చేసివుండినను, వారుగాని వారిసైన్యాలుగాని ఒక దినమైనను విశ్రాంతికై ఆగక, సేనాపతులను మంత్రులను ఆలోచనలకుగా పతదూరు నందు సమావేశం కమ్మన్నారు. అచట ఆ దారుణసమస్య నానావిధాల సమాలోచింపబడి అబ్దల్లి మాల్వాప్రాంతం చేరుటకుముందే అతనిమార్గాన్ని నిరోధించి, అటో ఇటో తేల్చుటకు ఒక చండప్రచండ సైన్యాన్ని అంపినారు.

మహారాష్ట్రి జాతివల్లరి పూచిన యువకపుష్పాలెల్ల యీ సమయంలో మాతృదేవి పూజకు అపచయింపబడినవి. సంషేర్ బహదూర్—విఠల్ శివదేవుడు—మానాజి దైగూడె—అంతాజి మంకేశ్వర్—మానె—నింబాల్కెర్ ఆదిగాగల, కాకలదీరిన దళవాయిలు, తమతమ నియోజక సారథ్యాల వహించినారు. ఉదయగిరి దుర్గ విజయి, భావురావు సర్వసేనా పతిగా నియోగింపబడినారు. బాలాజీరావు జ్యేష్ఠపుత్రుడు—ఉదయగిరి కయ్యాన మగటిమిజూపి మెరసిన కోడెప్రాయపు వీరుడు—మహారాష్ట్రి జాతీయ ఆశాప్రభాతతార—విశ్వేశరావు ఆయన వెంటనడచినాడు. ఇబ్రహీంఖాఁ గర్ది, నాటి బలవత్తర రణయంత్రవర్గానికి అధినాయకుడై నాడు. మరారిదండు సాగిపొయ్యేకొంది, దామాజి గైక్వాడ్—శాంతోజి వాగ్, మరియొక సేనాపతివచ్చి కనుసుకొన్నారు. ఉత్తర హిందూస్థాన వివిధ రసపుత్రరాజులకు—యిప్పటికైన, మధుర గోకులబృందావన విధ్వంసి, హిందూమత విరోధిని ఉక్కడంచమని, మహారాష్ట్రిల పక్షము హిందూత్వరక్షణకుగా వహింపుమని ప్రార్థించుచు, దూతలు—రాయబారులు—సందేశాలు పంపబడినవి. వింధ్యాద్రినిదాటి, నర్మదను అవత

రించి, మహారాష్ట్రులు ఛంబాలును దరిసినారు. ఆ ధాటీ మహత్తరశక్తిని, ఆ విజయ గాంభీర్యదీపిత దృశ్యాన్ని చూచి, ఉత్తర హిందూస్థాన నిఖిల హిందూ జనము చకితమై నిలిచినది. స్వార్థచింతచే విరాగులైన, రాజులు—రావులు—నవాబులు—ఖానులు అందరూ కుంచితగర్వులై ఆ దండును వేలెత్తి చూపలేకపోయినారు. త్వరలోనే జంకోజి సింధెగూడ తనపరివారంతోవచ్చి భావును, సాహెబును కలుసుకొన్నాడు. శౌర్యమండిత సుందరమూర్తి ఆ రాజకిశోరాన్ని ఆ సేన అంతయు ప్రేమోత్సాహాలతో సేవించింది. బదక్ సమరాంగణభూమిలో వీరస్వర్గ మలంకరించిన, ఆయన పినతండ్రి దత్తాజిస్మృతి చిహ్నంగా ఆయనను గౌరవించినారు. బాలుడయ్యు, అనేక యుద్ధాలలో విజయలక్ష్మిని చేకొని, తనజాతి—తన ప్రజల రక్షణలలో ప్రాణాపాయ రణవ్రణమండిత గాత్రుడైన ఆ యౌవన ప్రతాపమూర్తి గౌరవార్థం భావురావు ఒక సభను సమావేశపరచి, గౌరవ లాంఛనాలు—బహుమతులతో సత్కరించినారు. శౌర్యనిధి విశ్వేశరావు తండ్రి బాలాజీస్థానే అచటి మహారాష్ట్ర సేనకు జాతీయనాయకుడైనాడు. ఈ తరుణ శౌర్యసింహము, మరియొక యువక వీరపురుష సింహం—జంకోజిని కలుసుకొన్న ఆ శుభసమయంలో ఆ సభాసదుల హృదయాలు సంతోషరసాన్ని స్రవించినవి. ఆ యిద్దరు యువకులు—సుందరమూర్తులు—ప్రతాపమూర్తులు—నిజజాతి ఆశయ ఆదర్శాలకు పరమభక్తులు! వీరే హిందూజాతి నవోదిత ఆశాజ్యోతులు!

మల్హారరావు హోల్కార్ గూడ వచ్చిచేరినాడు. ఆత్మవినాశన కారియైన నజీబుఖాను దత్తస్వీకారం ఇతనికి దుష్ప్రతిఫలాన్ని బాగా ముట్టజెప్పింది. సమయానికి దత్తాజీకి సహాయం బుద్ధిపూర్వకంగా పంపని దానికిగూడ తగిన ఫలితమును బొందినాడు. దత్తాజీ పతనానంతరం అద్దల్లి యితనిని తుక్కురేగ గొట్టినాడు. భావు యమునదాటి యవన

సైన్యాల ఆవలిగట్టున తాకొనదలచినాడు. సాధ్యమైనచోట్లనెల్లా, అబ్దల్లీ సైన్య వెనుకభాగాన్నితాకి, చీకాకుపరచి, అతని రణసామగ్రిమార్గాల అరి కట్టమని గోవిందపంత్ బుందేలె నియోగింపబడినాడు. కాని, నదులు వెల్లువబెట్టి పారుచుండినందునను, ప్రబల శత్రుసైన్యాలు ఆవలి దరిని నిలిచియున్నందునను, ఆ నిండు ఏర్లను దాటుట కష్టసాధ్యమైంది. కాబట్టి భావు ఢిల్లీపై నడచి రాజధానిని మొదట పట్టుకొనదలచినాడు. ఉత్తర హిందూస్థాన రాజులలోకెల్ల ఒక జతులుమాత్రమే మహారాష్ట్రులతో చేరినారు. జతునాయకునికి భావు స్వయముగ వీరోచిత స్వాగతమిచ్చినాడు. ఆ యిద్దరు ఆ పవిత్రయమునాతోయాల సాక్షిగా, అబ్దల్లీని రూపుమాపు వరకు పోరవలెనని ప్రతిజ్ఞా కంకణాల ధరించినారు.

ఇప్పుడు ప్రజలదృక్కులు ఢిల్లీవైపు ప్రసరించినవి. ఆ చారిత్రాత్మక ప్రసిద్ధ రాజధానీ నగరము—ఢిల్లీ ఆక్రమణవిలువను హిందువులు— మహమ్మదీయులుగూడ గుర్తించినారు. సింధియా—హోల్కార్—బల్వంత రావు మహేందాలె సైన్యాల భావు ఢిల్లీపైకి పంపినాడు. దానిని రక్షించు చుండిన పఠానులు చాల గొప్పగా పోట్లాడినారు. కాని, మహారాష్ట్ర బల వత్తర ఘాతానికి నిలువలేక చివరకు లొంగిపోయినారు. తీవ్రయుద్ధానంతరం, ఢిల్లీ కోటగూడ వశమైంది. హిందూజాతికి—యీ ఢిల్లీనగర పతనవార్త హృదయానందాన్ని అతిశయింపజేసింది. మహారాష్ట్ర సేనలు విజయకోలాహలంతో విజయశోభతో నగరము ప్రవేశించినవి. చివరకు పాండవ రాజధాని ఆ హస్తినాపురపు కోట బురుజులపైన మరల భావురావు మహారాష్ట్ర పతాకాన్ని ఎగురగట్టినాడు. పృథ్వీరాజు తర్వాత, స్వతంత్ర హిందూ జయపతాకలక్రింద, హరిభక్తులని పిలుచుకొనిన హిందూసైన్యాలు ఆ ఢిల్లీ నగరవీథులలో ప్రవేశించుటకు అదే మొదలు! పఠానులు— రోహిల్లాలు— మొగలులు — తురుష్కులు — షేకులు — సయ్యదులు

ఎంతతీవ్రముగ వ్యతిరేకించినను, చివరకు హిందూసామ్రాజ్య రాజధాని—ఢిల్లీపై ముస్లిం చంద్రవంక అస్తమించింది. దానిస్థానే హిందూ పద్ పాదషాహి జండా ఎగిరింది. అబ్దల్లీ వివిధ ముస్లింబలయుతుడై ఆవలియమునాతీరాననే ఉన్నప్పటికిని దీనిని ప్రతిఘటించ జాలక పోయినాడు.

సదాశివరావు భావు — ఒకనాటి ముచ్చటేగానీయండి — తమ హిందూ సామ్రాజ్యస్థాపనవాంఛ తన కండ్ల ఎదుటనే రూపొందుటను చూచినాడు. అట్టి సుముహూర్తము క్షణికమైనను–ఆ సుదిన లబ్ధికై పాటుబడి, నెరవేర్చిన జాతి యీ ప్రపంచంలో మనదగినది. ఆదిన క్షణిక జీవనము–ఒక శతాబ్ది పర్యంతవ్యాప్తమైన జాతీయ యత్నాల—కార్యసాఫల్యాల—ఖేదాల—మోదాల, అవస్థల—బాధలయొక్క ప్రవర్ధమాన కాంతిమయ చరితను ప్రకాశింపజేస్తున్నది. ఆదినమే, ఏడువందల ఏండ్ల ముస్లిం దుష్పరిపాలన—హింసామలిన రాజనీతి, హిందూ చైతన్య శక్తినిగాని పునర్వికసన జీవగుణాన్నిగాని నిర్మూలించ లేకపోయిందని రూఢిగ నిరూపించింది. హిందువులు తమ శత్రువులతో సమబలముగ ఢీకొనుటేగాక, చివరకు వారిని మించిరనిగూడ స్థాపించుకొన్నారు.

భావు—తన యిష్టానుసారముగ చేయగలిగియుండినచో సర్వ హిందూ పుణ్యభూమికి ఏకైకఛత్రపతిగా, విశ్వాశరావును పట్టాభిషిక్తుని జేసి, శాస్త్రోక్తంగా హిందూ పద్ పాదషాహిని ప్రారంభించియుండును. కాని, అట్టి సత్వరకార్యముయొక్క రాజకీయ పరిణామాన్నిగూర్చి ఆయన శంకించినాడు. అట్లుచేసియుండిన, ఏపక్షము బూనుటకుగాని—మహారాష్ట్రులకు భయపడి ముందువెనుక లాలోచించుచుండిన వివిధ ముస్లిం పాలకులేగాదు, మనదేశ దౌర్భాగ్య వశాత్తు, ఉత్తరదేశ హిందూరాజులు గూడ ఆ హిందూ ఉద్యమానికి దూరమైపోదురన్న సత్యాన్ని ఆయన

గుర్తించినాడు. అయినప్పటికి, అట్టి అపూర్వ అవకాశాన్ని జారవిడువక, ప్రజాబాహుళ్య మానసిక పరిణామాన్ని గమనించ దలచుకొన్నాడు. ఆ పట్టాభిషేక ప్రస్ఫుట తాత్పర్యాన్ని, శత్రు మిత్ర సర్వ హిందూస్థాన వాసుల మానసాలపై అద్దదలచుకొన్నాడు. తదనుగుణ్యంగా ఒకపెద్ద రాజసభ యీ విజయగౌరవ స్మారకంగా సమావేశ పరుపబడింది. దానికి విశ్వేశరావు అధ్యక్షత వహించినాడు. అఖిలమహారాష్ట్రము అచట ప్రాతినిధ్యము వహించినది; ఇంతేకాదు—సర్వహిందూ శౌర్యము—ఐశ్వర్యము—రాజనీతి—పాండితి ఆపేరోలగములో ప్రకాశించినవి. క్షాత్ర వినోదాలు ఆరంభమైనవి. యంత్రదళము—గజతురగ పదాతిదళము విన్యాసపూర్వకంగా పౌరుష క్రీడలలో పాల్గొని వీరానీకాన్ని మోదితుల జేసింది. గోదావరి తటమునుండి ఉత్తరాన సింధుతీరానికి, దక్షిణాన రామసేతువు వరకు హిందూ విజయకేతనాన్ని గొనిపోయిన వీరసింహాలు, ప్రచండ శతఘ్ని యుద్ధదుందుభి వీరకాహళ గర్జఘోషలు దిక్కుల బీటలువారచేయుచుండ, హిందూ విజయభద్రకలశయుత వీరకేతనానికి యుద్ధోచిత జోహారులు ఒసంగినారు. అటుతరువాత, సేనాపతులు—మంత్రులు—రాజదూతలు—రాజనీతికోవిదులు—సర్దారులు—రాష్ట్రపాలకులు—రాజప్రతినిధులు ఒకరి వెంబడి ఒకరు, రాజ్యాధికారాన్ని ధరించిన ప్రేమపాత్రుడైన తమ రాకుమారునికి దిగ్విజయోచిత మర్యాదల చేసి సేవించినారు. నాటి ఆ ఉత్సాహదృశ్యాన్ని చూచినవారికే దాని అర్థము బోధపడగలదు. అందు పాల్గొనిన ప్రతివాడు, దైవ ఆశీర్వాదంతో, ముందు ముందు ఆ యువకుడు అఖండ హిందూస్థాన ఏకఛత్రాధిపతిగా అభిషిక్తుడు కాబోవు ఆ సంఘటనకు అది పూర్వశిక్షణ క్రమముగా భావించినారు.

# 14. పానిపట్

ఢిల్లీయందు జరిగిన యీ ప్రసిద్ధ సంఘటన భావమును ముస్లింలు వెంటనే గ్రహించినారు. మహారాష్ట్రులు తమ రాజపుత్రుని యావద్భారతావనికి సామ్రాట్టుగా ఢిల్లీ సింహపీఠాన పట్టాభిషేకము గావించినారన్నవార్త కార్చిచ్చువలె వ్యాపించిపోయింది. నజీబుఖాను ఆదిగాగల ముస్లింనాయకులు దీనిని ఉదహరించి, తమ్ము పైకొనునని వూహించిన భయాలు సహేతుకాలు అయినవని చాటి, అప్పటి పరిస్థితుల దారుణరూపాన్ని వర్ణించి, మహమ్మదీయ ప్రపంచాన్ని కార్యవ్యగ్రముగ జేసినారు. నజీబుఖానుబోటి మతావేశపరులు, భయోత్పాదియైన దారుణ హిందూ పద్ పాదషాహి—కాదు—బ్రాహ్మణ పాదుషాహి—స్థాపింపబడినదని ఎలుగెత్తిచాటి, ఆందోళన పరచినారు. మహమ్మదు ప్రవక్త భక్తులెల్లరు లేచి కాఫిర్ మూకల రూపడంచుడని ప్రేరేపించినారు.

ఈ తీవ్రోత్సాహంమధ్యగూడ—స్వార్థపరత్వమే మొగ్గు అయింది. నజీబు-మౌల్వీలు మతముపేర గావించిన ప్రబోధం సుజాబోటి కొందరు మహమ్మదీయులను అంటలేదు. అంధవిశ్వాసులు రోహిల్లాల మబ్బుగూడ వీడిపోయింది. అబ్దల్లీ అఖండసేన నెరసిన ప్రతిఘటనలోగూడ మహారాష్ట్రులు పొందిన విజయము నాటి పరిస్థితుల వారికి బాగ నచ్చజెప్పింది. అందువల్ల మహారాష్ట్ర జృంభణాన్ని ఉపేక్షించి వూరకున్నందున అబ్దల్లీ ప్రతిఘటన శక్తినే వారు సంకోచించినారు. సుజా, అబ్దల్లీతో కలసినందులకు సంతాపాన్ని వెలిబుచ్చుచు భావుకు ఒకక్షమాపణ లేఖనుగూడ వ్రాసినాడు. భావుగూడ సుజాను తమ పక్షంలో వుంచుకోదలచి, మహా

రాష్ట్రులు మొగల్ పాదుషాహీని తారుమారు చేయదలచుకోలేదనియు, తాను అబ్దల్లీ పక్షమువదలిన, తాము అంగీకరించిన పాదుషా—షా ఆలంకు వజీరుగా సుజానే నియమింతుమనియు దూతలద్వారా చెప్పి పంపినాడు. రోహిల్లాలుగూడ వెనుకదండి పెట్టి, అబ్దల్లీ పక్షము పరిత్యజింపనుండినారు. పరిస్థితులు ఎట్లు తనకు వ్యతిరేకంగా నడుస్తున్నవో గమనించి, అబ్దల్లి మహారాష్ట్రులతో నేస్తానికి కడంగదలచుకొని, సంధికార్యానికి రాయబారుల పంపినాడు. కాని, అబ్దల్లీ కోరినట్లు పంజాబును భావు అతనికి వదలువాడుగాడు. ఇంతేకాకుండా, శుష్కరాయబారాలకు మోసపోయి, యినుము కాగి మెత్తబడియుండినప్పుడు సాగకొట్టకుండా సదవకాశాన్ని జారవిడుచువాడు గాడు. కాబట్టే మనసుకు పట్టీపట్టనట్లుగా యీ రాజీమాటల జరుపుచునే, ఉత్తరం సేనలంపి కుంజపుర ప్రాంతాలలో సుస్థిర స్థానాలనుండి అబ్దల్లీని తరిమికొట్ట దలచుకొన్నాడు. కుంజపుర దుర్గమును సమ్మద్ ఖాను క్రింద ఒక గడుసుదండు రక్షించుచుండినది. కుతుబ్ షా గూడ అందే వుండినాడు. మహారాష్ట్రులు తమపై బడనున్నారని తెలియగానే దెబ్బకాచుకోను వారు విశ్వప్రయత్నాలు జేసినారు. అబ్దల్లీగూడ వారిని జంకవద్దని, ఏమైనాగాని స్థానాల వీడవద్దని, సహాయసేనల అంపుచున్నానని సందేశ మంపినాడు.

భావుసాహెబ్ ఢిల్లీనుండి బయలుదేరినాడు. ధనాగారాన్ని మరల సంపూర్ణముగ నింపవలె ననుకొన్నాడు. గోవిందపంత్ బుందేలి అబ్దల్లీ వస్తువాహక మార్గాల కొల్లగొట్టి అతని సైన్యపృష్ఠభాగాల గారియపెట్టి, సుజా రోహిల్లారాజ్యాలపై బడుచు శాంతి లేకుండా జేస్తాడనుకొన్నాడు. కాని, గోవిందపంతు యీ కార్యాలు అన్నిటా విఫలుడైనాడు. గోవిందపంత్ భావుకు కడకు ధనసహాయంగూడ చేయలేక పోయినాడు. ధనాగారమే యుద్ధానికి ప్రధాన రక్తనాళమని తెలుసుకొన్న భావు అర్థగ్రహ

ణానికి అన్యమార్గాలు వెదకదలచుకొన్నాడు. ఢిల్లీ సింహాసన మండపము పూర్తిగా వెండితో చేయబడి దశాధిక లక్షల విలువచేయగలిగియుండినది. భావు దానిని పీడదీసి టంకసాలకుపంపదలచుకొన్నాడు. పూర్వ మూఢాచార బానిసలు వలదని గగ్గోలుపెట్టినారు. దైవ ప్రసాదంతో, అఖండ హిందూ భూమండల సార్వభౌముడైన అజేయ మొగలు పాదుషా రాజపీఠాన్ని అట్లా అవమానించడం దైవదూషణము కాగలదేమో అని, ఇతగూడ భయపడి సమ్మతించలేదట! ఇదే నిజమైతే, జరిగినది ప్రతిదిగూడ— అన్యాయార్జిత రాజ్యాలు, శాస్త్రభిన్న దురాక్రమణాలుగూడ ఫలప్రదాలైనంత మాత్రాననే దైవేచ్ఛపాలితాలై—దైవాంశాలు, పవిత్రాలు కావలసి వుంటవి. అప్పుడు నిజంగా, రాయగడమునందు శివాజీ నిర్మించిన సింహపీఠము గూడ దైవాంశ శోభితమై, పుణ్యమై సేవితము కావలయును గదా! దీనికి దోడు రాయగడ రాజ్యపీఠము, దురాక్రమణ తృష్ణతోగాని, మతావేశ నిరంకుశ పాలనాభిలాషతోగాని నెలకొల్పబడక, కేవలము జాతీయ స్వాతంత్ర్య జీవనేచ్ఛ—రాజకీయ స్వాతంత్ర్యరక్షణ—ఆత్మరక్షణలకొరకే స్థాపింపబడినది కాబట్టి, ఢిల్లీ యవనగద్దెకంటె ఘనతరము పుణ్యతరము కావలయునుగదా! కాని, కొల్లలు—చెరలు, మంటలు—పోటులతో, దురాక్రమణ మతావేశాల సమస్తబలాలతో హిందూ జాతీయ జీవనాన్ని అణచి, బాల్యదశయందుండిన మహారాష్ట్ర రాజ్యాన్ని గొంతు నులిమి వేయను, ఔరంగజేబు దక్కనుపై దిగివచ్చినప్పుడు—అతడు శివాజీ సింహాసనాన్ని తునియలుతునియలుగా విరుగగొట్టను సంకోశించినాడా? లేనిచో—పైశాచికాధికార జన్మస్థానమై, నిశాట చండశాసన చిహ్నమై, అసంఖ్యాక హిందూ ఆత్మబలిదాతల నెత్తుట స్నానమాడి, హిందూ పావన దేవాలయ—గృహ—క్షేత్ర శిథిలాలపై నిర్మింపబడి, తన ఉనికిచేతనే హిందూజాతీయ రాజకీయ మరణాన్ని సూచిస్తుండిన ఆ మొగలు సామ్రాజ్య పీఠమన్న

సర్వ హిందువులకు తృణప్రాయముకాదా? హిందూత్వ సామ్రాజ్యపీఠాన్ని నుగ్గునూచము చేయను, ఔరంగజేబు తన నిష్ఠుర అయోబాహువు నెత్తినాడు: అనంతకాల అధిష్టాన దేవత, ప్రతీకారదేవి, హిందూస్థాన సంరక్షక దివ్యమూర్తి—యీ ముగ్గురు, ఎత్తిన ఆ సుత్తిని ఔరంగజేబు చేతినుండి గుంజుకొని, అదిగో చూడుడు! అతని సామ్రాజ్యపీఠమునే ముక్కలు జేసివేసినారు.

సైనికులకు యివ్వవలసిన జీతాలు బత్యాలు యిచ్చివేసి, భావుసాహెబు కుంజపురముమీదికి నడచినాడు. సింధె, హోల్కారు, విఠ్ఠల శివదేవులు సైన్యాల నడిపినారు. పఠానులు వీరపురుషోచితంగా పోరినారు. ఆ కోట, పట్టణము నైసర్గికంగానే దుర్గమాలు. కాని, మహారాష్ట్రి శతఘ్ని నిర్గత అగ్ని ఆసారానికి, సింధియాసేనల ప్రచండధాటికి ముస్లింలు ఆగలేక పోయినారు. ముస్లిం రక్షకశ్రేణిలో కొన్ని గండ్లు పడినవి. దామాజి గైక్వాడ్ తన బలాన్ని దూకమని ఆజ్ఞాపించగానే, సైనికులు, అశ్వికులు "హరహర" నినాదాలతో చెంగలించి విరోధి పైబడినారు. దారుణసమరం ప్రారంభమైంది. వేనకువేలు పఠాను సిపాయిలు కత్తికి ఎరవేయబడినారు. కోట పడింది - యవనదండువీడు కొల్లపోయింది - వందలాది సైనికులు పట్టుబడినారు; సేనాపతి మహమ్మద్ ఖాను గూడ మరాఠుల చేజిక్కినాడు. ఇంతకుముందుగూడ యితడు రఘునాథరావు చేజిక్కి, ఎక్కువ డబ్బిచ్చి బయటబడినాడు. అదిమొదలు అతడు మహారాష్ట్రులతోడి వైరమును వీడక మరల యిప్పుడు యిట్లయినాడు.

యుద్ధము విజయప్రదంగా ముగియవచ్చింది. భావు సాహెబ్, హోల్కారు - సింధియాలతో సంప్రదిస్తూ, శత్రువులు వారాలు నెలలు పట్టుననుకొన్న దాన్ని మూడుదినాలలో ముగించిన సైనికుల ప్రతాపాన్ని

ఉగ్గడిస్తూ ఒకచోట నిలబడియుండినాడు. అక్కడకి ఆ సమయంలో యిద్దరు ఖయిదీలు ఏనుగులపై తీసికొనిరాబడినారు. అందు ఒకడు—కుంజపుర పఠాను సేనల నేత, సమ్మద్ ఖాను. ఇక—రెండవవాడెవడు?—అతడే కతుబ్ షా—నజీబుఖాను గురువు! అతడే పఠాణి తంత్రంలో ముఖ్యనాయకుడు! సమరభూమిలో పడి ప్రాణముల వీడనుండిన వీర సింహం దత్తాజీని కాలదన్ని కాఫీరని అతనిపై హేయనిందల గురిపించి ఒక నీచభీరువువలె ప్రవర్తించిన మత్సరదగ్ధు డితడే!

కుతుబ్ షాను చూడగానే మరాఠి నెత్తురు ఉడికిపోయింది. ప్రతీకార జన్య శాంతినిగోరే దత్తాజీ స్మృతి ఆ రంగాన్ని దట్టంగా అలముకొన్నది—"కాఫిరని నిస్సహాయుడై మరణించుచుండిన మా వీరదత్తాజీని కాల దన్నినది నీవేనా?" "అవును! ఒక విగ్రహారాధకుని చంపి, కాఫిరైనందున నీచావమానానికి పాల్జేయడం మామతంలో పుణ్యం" అన్నాడు కుతుబ్ షా. "అయితే కుక్కచావు చావు" అన్నాడు భావు. ఒకసైనికుడు షాను ఆవలికి తీసికొనిపోయి శిరచ్ఛేదము చేసినాడు. సమ్మద్ ఖానుడుగూడ యిదే గతిని పంచుకొన్నాడు.

నజీబుఖానుని కుటుంబము, అల్లునితోగూడ మహారాష్ట్రులకు చిక్కింది. కాని వారు కుతుబ్ షావలె దారుణశిక్షకు పాత్రీకరింపబడలేదు. ఒకవేళ యుద్ధంలోచిక్కినవారిని అట్లేచేసియుండినప్పటికిని ఆచర్యయొక్క మానుషత్వాన్ని గురించి ప్రశ్నించను అబ్దల్లీకి నైతికశక్తి లేదు. ఎందుకంటే—అతడు, అతని ముస్లింసహాయకులు ఎన్నో రాక్షసకృత్యాల జరిపించి యున్నారు. పంజాబులో పొలికలనిలో దొరికిన హిందూ సైనికుల ముక్కులు గోసినారు. బదను మొదలగుచోట్ల మరణించిన హిందూవీరుల తలలన్నీ నరికించి, తమ గుడారంముందు విజయ బహూకరణంగా, కుప్పబోయించి ఆ దారుణదృశ్యానికి ఆనందించినారు. ఈ ఆరణ్యక విధా

నాన్ని మహారాష్ట్రులు చేయగలిగి యుండిగూడ, మానవులుగానే ప్రవర్తించినారు. అబ్దల్లి - ఔరంగజేబు - నాదిర్ - మహమ్మదులు అత్యాచారాలను ఒక పద్ధతిగా సాగించినట్లు వీరు చేయదలచుకొనలేదు. వారు హిందూమతముపట్ల గావించిన అపచారమునకు బదులుగా, మసీదుల ధ్వంసముచేయలేదు - కురానును తగులబెట్టలేదు - పవిత్రాలయాలలో దైవదూషణము చేయలేదు.

కుంజపుర పతనము అబ్దల్లి గౌరవప్రతిష్ఠలకు ఒక పెద్ద దెబ్బ. 10 వేల ముస్లిం సైనికుల హతమార్చి, విజయదశమీ మహోత్సవాన్ని సైనికోచిత మహా వైభవంతో అతని కట్టెదుటనే మహారాష్ట్రులు జరుపుచుండినారు. అతడు చురుకైన సేనాపతి; ఆ విషమ పరిణామ సమయంలో ఒక వీరోచిత సాహసకార్యాన్ని నెరవేర్చి తన పరువు నిలుపుకోకపోతే తన యుద్ధాశయమే వమ్ము అయిపోతుందని తెలిసికొని, భగపత్ రేవు దగ్గర యమునదాటి, కుంజపుర మహారాష్ట్ర సేనలకు ఢిల్లీతో రాకపోకలు లేకుండా జేసి బంధించ దలచుకొన్నాడు.

అబ్దల్లి యీ వ్యూహంలో కృతకృత్యుడైనాడు. ఒక లక్ష పరిమితి గల తన భూరిసేనను మరలించి, కుంజపుర - ఢిల్లీ మహారాష్ట్రులమధ్య ఒక పెద్ద గండికొట్టి రెంటిని వేరుచేసినాడు. ఇదే అతడు చేసిన ప్రయత్నాలలోకల్ల, తనభూరి సైన్య బలానికంటెగూడ ఎక్కువగా లాభించింది. మహారాష్ట్ర బలాలు చీల్చబడినవేగాని, అబ్దల్లీకిమాత్రం రోహిల్లాలతోను, సుజారాజ్యంతోను రాకపోకల సంబంధము కలిగేయుండినవి. దీనికి కారణం - అతని తెలివితేటలకంటె, గోవిందపంత్ అవివేకమే అయింది. భావుసాహెబు చెప్పినట్లు ఆయన అబ్దల్లీ వస్తుసామాగ్రిని అవరోధించలేక పోయినాడు.

మహారాష్ట్రులు తనతో ఢీకొనుటకు సంపూర్ణంగా సంసిద్ధులైనట్లు

అబ్దల్లీ తెలుసుకొన్నాడు. భగవత్‌దగ్గర యమున దాటగానే, భావు అతని సేనల కలుసుకొనను కురుక్షేత్రంవైపు నడచి పానిపట్ వద్ద విడిదిచేసి నాడు. గోవిందపంతు, గోపాల గణేశులు, వెనుక యవనసైన్యాల చీకాకు పరచి, వీరికి రణసామాగ్రి చేరకుండ అడ్డగించ గలిగినచో, ముస్లిం సైన్యాల అవలీలగా జయించగలుగుదుమని మహారాష్ట్రులు మంచి ధైర్యంతో ఉండినారు. కాని, యీమారుగూడ గోవిందపంతు నిర్దిష్ట కార్యాన్ని నెరవెర్చలేక పోయినాడు. సామదాన దండనోపాయాలన్నీ ప్రయోగించినాడు భావు. కాని, గోవిందపంతు తనకు ఓపినంత గూడ చేయలేదు. జత్ యింతకుముందే మహారాష్ట్ర శిబిరము వదలి, తనరాజ ధాని - భరతపూరుచేరి దూరంనుండి యీ ఆటను చూస్తుండి, అప్పు డప్పుడు మహారాష్ట్రులకు కొంత వస్తుసహాయం చేస్తుండినాడు. అయితే రసపుత్రులు యీపాటిగూడ చేయలేదు. వారిలో ఒకరుగూడ మహారాష్ట్రు లను నిరోధించలేకపోయినా, వారు నాశనంకావలెనని మాత్రం కోరుకొను చుండినారు. హిందూరాజులు ప్రదర్శించిన ఆత్మవినాశనకరమైన యీ వాంఛ ఎంతవరకు నెరవేరిందో భవిష్యచ్చరిత్రే చాటగలదు. ఇట్లు ఇరు వాగుల వారు, ప్రతిపక్షుల సరఫరాల అరికట్ట యత్నించుచుండగా, ఆకలిదప్పులు అబ్దల్లీకంటే ముందు మహారాష్ట్రులనే తికమక జేసినవి.

చివరకు, నవంబరు 22 తేది, జంకోజి శిబిరం వదలి, తన సైన్యా లతో ముస్లింల ఎదిరించినాడు. యుద్ధం నానాముఖాల తీవ్రంగా రేగింది. ఆరితేరిన మహారాష్ట్రులు యువకనాయకుని సారథ్యాన సాగించిన ధాటికి ముస్లింలు నిలువలేక సాయంత్రానికి వెనుకకు పడగానే, విడిదికి తరిమి నారు. చీకటిపడి ముస్లింల కాపాడినది; లేకున్న, నాడే సంపూర్ణపరాజయా నికి లోనైయుందురు. మహారాష్ట్ర వీరులకు శిబిరంలో వీరజోహారు లొసంగబడినవి. ఈ పరాజయావమాన కళంకాన్ని బాపుకొని నిజజన నిరా

శను పోగొట్టను. అబ్దల్లి ఒక పక్షముదినముల తదనంతరం, మునిమాపు చీకటి మునుగులో, మహారాష్ట్రిల పై బడమని ఏరికూర్చిన సైనికుల నియమించినాడు. కాని, బయలుదేరగానే, తమకుముందే 20 వేల మెరికల వంటి సైన్యాలతో బల్వంతరావు మహేందలె రణాంగణంలో ప్రవేశించుటను చూచి ముస్లిం నాయకులు బమ్మెరపోయినారు. వెంటనే పఠాను ఫిరంగులు అగ్నిగోళాల గ్రక్కినవి. మరాఠులు యంత్రాయుధాల కొని రానందున చాల నష్టపడినారు—త్వరలో వారు ఆందోళిత చేతస్కులై పోవునట్లుండినది. ఇంతలో సేనాపతి మెరుపుతీగవలె ముందుకు గుర్రంపై దూకి, తమ పతాకాన్ని అపకీర్తి పాల్జేయవద్దని ప్రబోధము గావించినాడు. వెంటనే విడిబడ్డ సైన్యాల కూర్చుకొని, నిజఖడ్గాన్ని ఝళిపిస్తూ ఒక్కుమ్మడి శత్రుసైన్యాలపై బడునట్లు జేసినాడు. మహారాష్ట్రి సైంధవదళము ప్లుతంతో శత్రుసేనలపైబడి, ఫిరంగుల నోరుమూయించి, ముఖాముఖీ తీవ్రయుద్ధంలో తగులుకొన్నది. అందులో చమూపతి బల్వంతరావుగూడ యిరుక్కొనిపోయినాడు. తుముల సంగ్రామంలో ఒక గుండుదెబ్బకు బల్వంతరావు క్రిందబడి మరణించినాడు. ఇదిచూచి, ముస్లింలు ఆయనపై దూకి తల నరికి జయబహూకరణంగా తీసికొనపోవ యత్నించినారు. కాని, ఇంతలో నింబాల్కర్ తమ నాయకుని శవముపైబడి, తురుష్క ఖడ్గ ఘాతాలకు తన దేహమిచ్చి మహారాష్ట్రిలువచ్చి రక్షించునందాక బల్వంతరావు తలను గాపాడినాడు. ఈ మధ్యలో వందలాది పఠానులు మడిసి, నిలువనే శక్తిలేక, చివరకు చిదుగగొట్టబడి, శిబిరాల వైపుకు పరుగెత్తిపోయినారు. అనేకవేల తురకపీనుగులు కుప్పలు కుప్పలుగా మరాఠీ మొగ్గరం మధ్య వికలాంగాలతో పడివుండినవి. మహారాష్ట్రిలు గొప్ప విజయాన్ని సాధించినారు గాని, గొప్ప నాయకుని గోల్పోయినారు. బల్వంతరావు శవమును సగౌరంగా విడిదికి గొనిపోయి, విజయోచిత

సైనిక మర్యాదలతో చరమ సంస్కారాలు గావించినారు. భావు అందరి కంటె ఎక్కువగా యీ మరణానికి సంతాపపడి తానుగూడ శ్మశానానికి పోయినాడు. ఆయన వీరపత్ని, భావు ఎంతచెప్పినను పట్టువీడక భర్త చితియందే సహగమనంచేసి భర్తవెంట పుణ్యగతి నొందినది. సర్వ సైన్యము దహన సంస్కారమున పాల్గొని ఆ వీరదంపతుల సేవించినది. ఆ సతీమతల్లి భర్త శిరాన్ని తొడపై బెట్టుకొని ప్రేమస్పర్శలచే లాలిస్తూ జ్వాలా నాళాలమధ్య ఆత్మార్పణము గావిస్తూ దగ్ధయైపోవుచు యుద్ధభూమిని పవిత్రీకరించుచుండ, మహారాష్ట్ర సైన్యము చుట్టుమూగి గౌరవ దిగ్భ్రమాలలో ఆ పుణ్యలోకపు జంటకు జోహారు లిచ్చుచుండినది.

ఈవిధంగా అబ్దల్లి రెండుమారులు యుద్ధానికి దిగి, రెండుమారులు పరాభూతుడైనాడు. అయితే ఏం? యీ విజయాలు మహారాష్ట్రుల ఆకలి దప్పుల అణచలేదు. ఈలోపల గోవిందపంత్‌కు చలనం గలిగి అబ్దల్లీ భోజనవస్తు సామగ్రి ప్రవాహాన్ని అరికట్టినది నిజమే! కాని, అప్పటికే అకాలమై పోయింది. అదిగూడ గాక, ఆపనిని ఎంతోసేపు సాగించలేదు. అట్టేఖాను 10 వేల సైనికులను కృత్రిమ పతాకంతో, మారువేషాలతో నడిపించి గోవిందపంతుపై బడినాడు. పైకివచ్చే సైన్యంముందు హోల్కారు జెండానుచూచి, తమవారే అనుకొన్నారు. పఠానులు దగ్గరకువచ్చి దెబ్బ తీయసాగినంతవరకు మహారాష్ట్రులకు అసలు నిజము తెలియలేదు. చివరకు గోవిందపంతుగూడ నరకివేయబడినాడు. ఈ సాహసమును - త్యాగమును గోవిందపంతు నాలుగునెలలముందు, భావు సాహెబు ఆజ్ఞలప్రకారం గావించియుండినచో, తనకేగాకుండ తన జాతికి, తన దేశానికి యీముప్పు వాటిల్లకుండ కాపాడియుండి యుండును. పఠానులు పంతు తలగోసుకొని పోయినారు. అబ్దల్లీ ఆ శిరాన్ని కొన్ని చిలిపిగీతల జాబుతో భావుకుపంపి యీమారు ఒకపాటి మానవత్వాన్ని చూపినాడు.

సైనికదృష్టితో చూచిన, అబ్దల్లీని హతమార్చుటకు యింకను అవకాశముండినది. ఎట్లనగా, యవనులు ఎంతజాగ్రత్తగా పరిసరప్రాంతాల కాచియుండినను, మహారాష్ట్రుల క్లిష్టస్థితి దక్కనులో బాలాజీకి తెలయవచ్చి ఆయన 50,000 సైన్యంతో భావు సహాయార్థం ఉత్తరాభిముఖుడై బయలుదేరినాడు. మహారాష్ట్రులు పానిపట్టుభూమిలో మరియొక నెలపాటు ఆగగలిగియుండినచో అబ్దల్లి విపులవాహినులు తిరుగలిరాళ్ల సందున వలె యీరెండు మహారాష్ట్రసైన్యాలమధ్య చిక్కొని పోయియుండును. అయితే క్షుధార్తి? గడ్డిలేక వేలతరబడి సార్థవాహక జంతువులు-గుర్రాలు సహితము దినదినము చనిపోవుచుండినవి. జంతుకంకాళదుర్గంధము ఒకచీడగారేగి సైనికుల ఆరోగ్యమునే చెడగొట్టసాగి, అన్నకాటకాని కంటె అపాయకరమైంది. ఇక మిగిలిన గత్యంతరము? సంసిద్ధముగాని యుద్ధము! అనుదినము పౌరుషవంతులు భావు గుడారంచుట్టుమూగి, ఆకటమాడి, మురిగి చచ్చేదానికిబదులు యుద్ధంలో చంపి చచ్చునట్లు ఆజ్ఞలయివ్వమని కడుపు తరుక్కొనిపోయేటట్లు దీనయాచనల గావించుచుండినారు. ఈకూటికరవు చావుకు యింకొక పక్షాంతరంమాత్రం గలదు; అదే తమ తరతరముల పూర్వజనులు దేనికొరకు మనియుండి, శ్రమపడి, ప్రాణార్పణము గావించినారో ఆహిందూఆశయాన్ని బలిబెట్టి, పరాభూతులవలె ఎట్టి షరతుగానిలేకుండా లొంగి, విరోధి పాదాక్రాంతులగుటే! వారట్లుచేసి, జాతీయస్వాతంత్ర్యమును దారబోసి అబ్దల్లీని హిందూదేశ సామ్రాట్టుగా అంగీకరింతురా? లేదు—ఎన్నటికిని వారట్లుచేయరు. ఒక్క మహారాష్ట్రుడుగూడ దానికి యియ్యకొనలేదు. కడుపుగాలిన కక్కుర్తి దశలో వున్నప్పటికిని, ఘనతరశక్తులనైన ఢీకొని, తాము గెలువ లేకపోయినను, విరోధి సాధించిన విజయమును అప్రయోజనంగా చేయుదురేగాని, లొంగజాలరు. ఈమానసికప్రవృత్తిలోవుండిన వీరిలో

భావుసాహెబు మేరుధీరంగా, అజేయ శౌర్యోత్సాహంతో, మొక్కవోని నిశ్చయంతో లొంగరాదని, తమ ప్రజాపీక జాతీయగౌరవముల కళంకితముచేయు ఎట్టి క్షుద్రకార్యాన్నిగాని చేయరాదని చాటుచుండినారు. ఇక దుర్గతి తప్పనిచో, విజయమును చేకూర్చలేకపోయినను పరాజయమైనను-భవిష్యస్సంతతికి శాశ్వత జాతీయకీర్తిని, నిరంతర ప్రబోధవాణిని, అమర ప్రతిష్ఠలను గూర్చగలిగినట్టి దానిని సముపార్జించి, గెలుపుకంటె ఓటమేమే లనిపించవలయునని కృతనిశ్చయులైనారు.

సత్వరవిషయపరిశీలనానికి సైనికసమాలోచన సంఘం సమావేశపరుపబడింది. యుద్ధసన్నద్ధమై ఢిల్లీకి బయలుదేరునట్లును, మార్గమధ్యమంలో అబ్దల్లీ సేనలు అడ్డగించినచో నరుకుకొంటూ దారిజేసికొని బయటపడవలసినట్లును నిర్ణయింపబడింది. అడ్డగించినచో! అని అనటం అవసరం-ఎందుకంటే, అబ్దల్లి వారిని తప్పించుకొని పోనిచ్చేవాడుగాడు.

జరీపతాకమండిత సువర్ణ హిందూధ్వజముచుట్టు, హరిభక్తులైన వీరనికాయము అసంఖ్యాకముగ చేరినది. సర్వసేనాని భావుసాహెబు భవిష్యత్ప్రణాళికను గూర్చి తమనిర్ణయాన్ని నివేదించినారు. చివరవరకు యుద్ధంచేయాలన్నమాట వినగానే సైనికులంతా ఉత్సాహధ్వానాలతో చెలరేగిపోయినారు. కార్యప్రణాళిక విశదీకరింపబడింది. నాయకుడు భావుసాహెబు—"మహారాష్ట్రధీరులారా! చూచుచున్నారుగదా! మీముంగల ఎగురుచున్న యీపవిత్రహిందూజాతీయ కేతనమును! ఈకేతనమే సర్వహిందూజాతికి అండ. వినుడు! యీపతాకము గంభీరమూకవాక్యసణితో తేజోమయపూర్వగాథల ఎట్లు అభివర్ణించుచున్నదో! హిందూసామ్రాజ్యము హిందూస్వధర్మరాజ్యముల నిరంతర స్మారకచిహ్నంగా రామదాసస్వామి దీనిని శివాజీ ఛత్రపతికి దత్తముచేసినారు. మీపితామహ ప్రపితామహులు—మరణించియు చిరంజీవులైన మీవీరశ్రేణి, యీకేతనాన్ని జయపరంపర

ముందు నడిపి, అటకు ఆది ఆర్కాటువరకు గల సాగరావృత సర్వ హిందూస్థానమును దీని నీడక్రిందకు గొనివచ్చినారు. ఇంతవరకు ఈ దుర్జయ వీరపతాక విజయయానముౖమోల హిందూత్వశత్రుకోటి పరాభూతులై అవనతమస్తకాలతో సేవించినారు. ఇక యిప్పుడు అట్టి మహోజ్జ్వల పతాకాన్ని దించి, మడచి, ముల్లెమూటగా శత్రువుకు అప్పగింతురో ? లేక యీధ్వజము పాలించు ధర్మరక్షణకుగా, మీపవిత్రస్మృతి స్మృతి పురాణోక్త ధర్మరక్షణకుగా మరణింతురో నిర్ణయించుకొనుడు" అని ఉత్తేజ ప్రబోధము గావించి మోడుల చిగిరింపజేసినారు. దీనితో సర్వసేన హరహర మహదేవ్ అని కేకలిడుచు ఉత్సాహతరంగితమై మిన్నుముట్టు వీరని నాదాల గావించింది. వెంటనే కత్తులుదూసి, తమజాతీయ పతాకానికి తమ విజయసేనానికి భక్తిని ప్రకటించుచు మరణానికి వెనుదీయమని ప్రమాణ దీక్ష గైకొన్నారు.

జనవరి 14తేదినాటి వేగుజుక్క యుద్ధానికి బయలుదేరిన మరాఠి దండును చూచింది. భావు-విశ్వాసరావులు సైన్యమధ్యభాగానికి నాయకులైనారు. దక్షిణభాగంలో జంకోజి, మల్హారరావుహోల్కార్, వామ భాగంలో దామాజగైక్వాడ్, యశ్వంతరావుపవార్, అంతాజీమంకేశ్వర్, విఠలశివదేవ్, సంషేర్‌బహద్దర్ నిలిచి సైన్యాల నడుపుచుండినారు. అద్భుతమైన యంత్రదళాన్ని ఇబ్రహీంఖాను గార్దె నాయకత్వాన మొగదల నుంచినారు, ఇబ్రహీం మహమ్మదీయుడైనను యీవీరాగ్రేసరుడు తుది వరకు యజమానికి విశ్వాసపాత్రుడుగానే యుండినాడు. ఇట్లు దుర్జయ శక్తిసన్నాహాలతో మహారాష్ట్రులు యుద్ధానికి నడచినారు. అసంఖ్యాక రణభేరులు—నిష్ఠుర కాహళాలు కదనయానాన్ని ఉద్రూత లూగించినవి.

అబ్దల్లి యీవార్తవినగానే, తానుగూడ యుద్ధానికి బయలుదేరినాడు. యవనసైన్యమధ్యభాగాన్ని అబ్దల్లీవజీరు-షహ నవాజ్‌ఖాను, కుడిప్రక్క

రోహిల్లాలు, ఎడమప్రక్క నజీబుఖాను—సుజాలు నడిపినారు. అతడుగూడ ఫిరంగిబారుల ముందు దీర్చినాడు.

వెంటనే యిరువాగులవారు మోటుకొన్నారు. ఫిరంగులు దారుణ రక్తస్రావక కార్యానికి కడంగినవి. మారణయంత్ర ముఖనిర్గత ధ్వాంత ధూమము, విపులవాహినీ పాదోద్ధూతపరాగము రోదసినినింపి చీకట్లనీనినవి; సూర్యబింబము ఆఛ్ఛాదితమైపోయింది. యశ్వంతరావు, విఠల శివదేవుడు మొదటిదెబ్బ గొట్టినారు. పోరు చిక్కనై పోయింది. రోహిల్లాలు వెనుకకు తోసివేయబడి 8000 మందిని గోల్పోయినారు. మధ్య భాగాలు, రెండుకొండలు ఢీకొన్నట్లు ఢీకొన్నవి. అన్యోన్యం మరణ బంధంలో చిక్కొన్నారు. పఠానులు చులకనచేయదగిన శత్రువులు గారు కాని, భావు నడిపిన మహారాష్ట్రులుగూడ అడుగు వెనుకకువేయువారు గారు. ఒకగంట దారుణ సమరానంతము భావుసాహెబు—విశ్వాసరావులు పఠానుల యినుపమొగబారును భేదించినారు. మ్లేచ్ఛులు అనేకులు హతులై క్రింద నెత్తురువెల్లువలో పడియుండినారు. వజీరు గుర్రంనుండి క్రిందపడినాడు. వానికొడుకు తునియలై పోయినాడు. ముస్లింల మధ్య ఖండంగూడ వెనుకకు తగ్గింది. మరాఠిదండు ముందుకు చొచ్చుకొన్నది. భావు-విశ్వాసులు శత్రువుల ఒకస్థానంనుండి ఇంకొకస్థానానికి తరిమినారు. ఇంతలో నజీబుఖాను వజీరుసహాయానికి పరుగెత్తినాడు. అతని పిరుందనే తరుముకొంటూ యుద్ధనిపుణులైన సైనికులతో జంకోజి భావు అండకు చేరినాడు. కనివిని ఎరుగనిరీతిగా సంగ్రామం బీభత్సమైంది. సమరాంగణములో ప్రతిచోట సాహసాద్భుత ప్రతారణాలు చెలరేగినవి. అబ్దల్లీ తన సైన్యం అన్నిముఖాల వెనుకకుతగ్గి శక్తి విరిగిపోవనున్నట్లు దెలుసుకొన్నాడు. యవనులు పిక్కబలమును చూపసాగినారు. కాని, అబ్దల్లి చలించలేదు—కాలు కదుపలేదు. స్థానాల వదలి పరుగెత్తేవారిని

నిలువున నరికివేయమని స్వసైన్యాలకు ఆజ్ఞయిచ్చినాడు. తూర్పురేఖలు మైలవిడిచినప్పుడు ప్రారంభమైనపోరు మధ్యాహ్నం రెండుగంటలకుగూడ విధివిరామంలేకుండా సాగుచునే యుండింది. సైనికులు విశ్రాంతి ఎరుగరు. నెత్తురు భూమంతా మడుగులు గట్టిపోయింది. వికలాంగుల హృదయ విదారణ ఆక్రందనాలు—చావనున్నవారి యాతనాపూర్ణ రోదనాలు—భీమ యుద్ధయంత్ర భేరీగర్జలు—వీరసైనిక ఆహారావాలు, అన్నీకలసి భయదసామరస్యంతో సంకీర్ణమై జడిపించుచుండినవి.

మధ్యాహ్నం రెండుగంటలు దాటింది. మహారాష్ట్రులపట్టుదల, శౌర్యము తుదకు ముస్లింసైన్యాన్ని అలయింపజేసినవి. ఆరితేరిన వీరుడు అబ్దల్లీగూడ యుద్ధం మాని యమునదాటి ఆవలిగట్టు చేరాలని ఆతురపడినాడు. మంచి తెలివిని ఉపయోగించి 10 వేలమంది సైనికుల చేకావలి యుంచిపెట్టినాడు. ఇప్పుడు యీసందిగ్ధ సమయంలో వాటిని యుద్ధంలోకి త్రోసి, భావుకు ముఖాముఖి నిలిపినాడు. ఈకొత్త బలగం, పిడుగులవలె మహారాష్ట్రులపై బడింది.

ఉదయంనుంచి పోరి అలసిపోయి వుండినప్పటికిని మరాటులు చలించలేదు. కొత్తసైన్యాల మొదటి రాతివంటి తాకుడును మొక్కబోని సాహసంతో మహారాష్ట్రులు ఎదిరించినారు. మరియొకమారు మహారాష్ట్రులు విజయలక్ష్మిని దరిసినట్లుండినది. అబ్దల్లి చరమదశలో గరళ ప్రయోగం చేసినాడు.

ఆక్షణంలోనే, మృత్యుసందేశాన్ని దీసికొని ఒకతుపాకిగుండు ఋజ్ జ్ జ్ పెడుతూ వచ్చి విశ్వాసరావు నొసటికి తాకింది. ఆయన గాయంతో ఆఏనుగు అంబారీలోనే మూర్ఛిల్లినాడు. సుందరమూర్తి, మహారాష్ట్రజాతీయజీవన వికాసము, తరుణవీరుడు, దేశ ఆశాంకురము, అట్లు పడిపోయినాడు. తీవ్రయుద్ధంలో పోరి—నడిపి—ప్రోత్సహించి—

స్వయంగా పాల్గొనుచుండిన భావుసాహెబుకు యీవార్త పిడుగువలె చెవినోకింది. సేనాపతి పరుగెత్తిపోయి తనసోదర పుత్రుని మరణ ఘాతను చూచినాడు. ఆఉదయగిరి దుర్భేద్య దుర్గభేదన శౌరి వజ్రసన్నిభ హృదయంగూడ ఒక్క క్షణకాలం ద్రవించింది; ఆయన వీరకపోలాలు, కన్నీటికెరటాలతో కడుగబడినవి. దుఃఖరుద్ధకంఠంతో "విశ్వాస్! విశ్వాస్" అని పలికినాడు. ఎక్కిళ్లు యీపలుకుల అణచివేసినవి. మరణోన్ముఖుడైన ఆయువకుడు, రాచరికాలపుట్ట అయినకండ్లు నెత్తినాడు. ధీరంగా—"నాయనా, నాదగ్గర ఏలకాలయాపనం చేస్తారు? సేనాని దగ్గరలేకపోయిన ఫలితం మనకు వ్యతిరేకం కావచ్చును" అని పలికినాడు. మరణయాతనలోగూడ ఆమహారాష్ట్ర రాకొమారుడు తన విధ్యుక్తధర్మాన్ని మరువలేదు. ఆయన మనసే యుద్ధలగ్నమైంది—ఆయన ఆశ, తన మరణానంతరమైనను విజయాన్నే కోరింది. ఈమాటలు భావుకు జాగరణశక్తిని ఒసంగినవి. మరల భావు మునుపటి వీరుడైనాడు. "ఏమైతేనేం! ఇదిగో! నేనేస్వయంగా శత్రువును హతమారుస్తా" అని వీరభాషణం చేస్తూ తన గుర్రాన్ని ముందుకునడిపి తన సేనను కదిలించినాడు. యుద్ధం సాగుచునేయుండినది. విజయలక్ష్మి మహారాష్ట్రులనే ఆదరించియుండినది.

విశ్వాసరావు మరణదారుణవార్త దవానలం మాదిరి ప్రాకి, శక్తిని మించిన కార్యంవల్ల ముందేఅలసిపోయిన మహారాష్ట్రుల వుత్సాహాన్ని అణచివేసింది. దీనికిదోడు ఇంకొక ప్రమాదము సంభవించింది. ఒకటి రెండు నెలలక్రితము రెండువేలమంది పఠానులు అబ్దల్లీని పరిత్యజించి, భావుసైన్యంలో చేరియుండినారు. యుద్ధంలో వీరిని గుర్తించుటకు శిరస్త్రాణాలపైన మహారాష్ట్రపతాక చిహ్నాన్ని ధరించియుండినారు. ఇంతకుముందే, నిర్ణయింపబడిన గూఢవంచకవిధానంవల్ల ఉన్నట్లుండి

యీ 2000 కపటసైనికులు మహారాష్ట్రచిహ్నాల పెరికిపారవేసి, లెనిపాని అపోహల-అబద్ధభయాల వ్యాపింపజేస్తూ-విశ్వాసరావుమరణాన్ని చాటుచు, సైన్యంగుండా వెనుకనుండిన విడిదిగుడారాలు చేరి, ఆచోటనున్న వారిని చంపుచూ, వీడును కొల్లగొట్టినారు. వెనుకరేగిన యీపఠాను జృంభణమును, ముందున్న మహారాష్ట్రులు పఠానువిజయముగా భావించి, చలితులై రంగంపీడి పరుగెత్తసాగినారు.

పఠానులుగూడ యీదృశ్యాన్ని చూచి నమ్మలేకపోయినారు; వారుఅప్పటికే తమపరాజయము హెచ్చుతక్కువ పూర్తిఅయినదనుకొని యుండినారు. అంతవరకు మహారాష్ట్రులు మధ్య-యిరుపార్శ్వరంగాలలో జయమును పొందినారు. దెబ్బకాచుకొంటూ సైన్యశ్రేణుల అతికష్టంమీద చెదరకుండా నిలుపుకోగలుగుచుండిన అబ్దల్లీకి, మహారాష్ట్రసైన్యాల వెనుకరేగిన విఠాకు-కాందిశీకత-పలాయనము అర్థమైనదికాదు. మరాఠిబలాన్ని అణచివేసిన చరమచేష్ట యిదే! దీనితో మహారాష్ట్రులు విరుగబడిపోయినారు. సైన్యం ధ్వంసమైపోయింది.

కాని, తమజాతీయపతాకాన్ని రక్షిస్తూ భావుమొదలగు వీరులు నిలువబడియుండినచోట మాత్రం యుద్ధం యింకను సాగుచునే యుండింది. కడపటినెత్తురుబొట్టువరకు పోరదలచుకొని, "కొట్టుడు-చంపుడు" అని ఉత్సాహధ్వనులతో మిగిలిఉన్న సైనికుల ప్రోత్సహించుచుండిన భావుసాహెబు గొంతు బొంగురుపోయింది. మాటలాడలేక పోయినా, గుర్రంపై అటుఇటు పరుగెత్తుచు, సంజ్ఞలతో కోత్తలజేస్తూ మృత్యుకరాళముఖగహ్వరంలోకే ప్రవేశించినారు. ఆనైరాశ్యమూర్తిని జూచి, ముకుంద సింధె భావుసాహెబు గుర్రపుపగ్గాల పట్టినిలిపి సాహసించి యిట్లాపలికినాడు:— "సేనాపతిశ్రేష్ఠా—మీశౌర్యము మానవాతీతము. మనవారు వీరోచితంగా, మానవశక్తికి సాధ్యమైనంతవరకు చేసినారు. ఇక

వెనుదిరిగి పోవుటశ్రేయము" అని బ్రతిమాలినాడు. "వెనుదిరుగుటా? సేనాపతీ, మనవిశ్వాసుడు, అప్పుడే విరియబూసిన తరుణసైనికావళి ప్రాణాల అర్పించి నేలపైగూలుటను చూడలేదా? ఇక యిప్పుడు, తుచ్ఛప్రాణాలకుగా సమరభూమిని వదలి, నాముఖాన్ని ఎట్లు మనజాతికి మన నానాసాహెబుకు చూపగలను? కొట్టుడు-శత్రువును మరణపర్యంతము చావమోదుడు. ఇదే నా కడపటిఆజ్ఞ" అని భావు జేవురుబారిన ముఖంతో గర్జించినాడు.

ముకుందసింధె, సేనాపతి యీచరమసందేశాన్ని ఔదలదాల్చి, హరహరమహదేవ్ ధ్వానాలతో ఖడ్గాన్ని ఝుళిపిస్తూ శత్రుమూకమధ్య పడినాడు. యువకవీరుడు జంకోజి-యశ్వంతరావు పవారు మొదలగు మహారథులు ఒకరివెంబడి ఒకరు ఇట్లేదూకినారు. భావూ? ఆయనగూడ యుద్ధపిశాచము సోకినట్లు, ఆవేశంతో శత్రువ్యూహంమధ్య ప్రవేశించి, ఆ సంకీర్ణదారుణ సమరంలో యిరుక్కొని పోయినాడు. ఆయన ఆడిన మాటప్రకారం జాతీయధర్మరక్షణకుగా, చావువరకు పోరినాడు.

పానిపట్ యుద్ధంలో, హిందూవిపులసైన్య సర్వసేనాని ఉదంతము లోకానికి తెలిసిందియింతే! పానిపట్ పొలికలనిలో ఆయన జాతిగోల్పోయిన ఐహిక ఐశ్వర్యమునకు మారుగా భావుసాహెబు నిజశౌర్య అలౌకిక శోభతో, ధర్మపరాయణమైన మరణంతో ఋణముదీర్చుకొన్నాడు.



# 15. వినాశనకారియైన విజయము

"దంతచ్ఛేదోహి నాగానాం
శ్లాఘ్యో గిరివిదారణే."

పానిపట్ యుద్ధంలో కలిగిననష్టం అపారం. భావు, విశ్వాస పాత్రులగు అనుచరులతో జాతీయపతాకరక్షణకు, అసమయుద్ధాన్ని కఠోరంగా సాగించుచుండగా, యితర అన్నిచోట్ల మహారాష్ట్రులు సంపూర్ణ పరాజయాన్ని పొంది, తరుమబడి వెన్నాడబడినారు. వేనకువేలు హతులైనారు. వేనకువేలు బంధీలైనారు. మరుసటి ఉదయాన, మహారాష్ట్రి ఖయిదీల నంతా బారులుగా విలువబెట్టి, ఆక్రోధమూర్తిఅయిన విజయి, ఆనిరపరాధ నిస్సహాయుల నందరిని అమానుషంగా నరికించి పారవేసినాడు. ఆఫ్ఘనుల హస్తగతమైన కొల్లధనముగూడ అపారము.

కాని, విరోధి యీవిజయానికిగా మహారాష్ట్రిశౌర్యానికి చెల్లించిన విలుపధనముగూడ అపారమైంది. పఠానులు గెలుపొందినారు కాని, యీ విజయం ఆత్మమూలచ్ఛేదనకారి యైంది. ఒక్క చివరదినమునాడే యుద్ధభూమిలో 40,000 మంది ముస్లింలు మృత్యువువాత బడినారు. గోవిందపంతుని తలగోసిన సేనాని అట్టైఖాను, ఉస్మాన్ మొదలగు అసంఖ్యాక నాయకులు నరికివేయబడినారు. నజీబుకు ప్రాణాపాయకరమైన గాయాలు తగిలినవి. దీనికిదోడు, తమ అద్భుత నాయకత్వము—ప్రశంశాపాత్రమైన శౌర్యమే గాక, హఠాత్ సంభవసంఘటన గూడ నాటి విజయానికి కారణభూతమైందని తెలిసికొన్నారు.

---

* పర్వతాల ఛేదించడంలో ఏనుగులకు దంతాలు విరిగినా ప్రశంసనీయమే.

మహారాష్ట్రులు యుద్ధంలో పరాభూతులైనా, అందు తగిలిన దెబ్బ లవల్ల శత్రువుగూడ ఇక ఎన్నటికిని యుద్ధముచేయు శక్తిలేకుండా వికలాంగుడై పోయినాడు.

పానిపట్ యుద్ధంలో ఓడిపోతేమాత్రం ఏమి? పానిపట్ సమరాగణంలో మహారాష్ట్రులు అణచివేయబడినప్పటికిని వారు మహారాష్ట్రములో జీవించియే యుండినారు. పానిపట్ పొలికలనులో, ప్రతి మహారాష్ట్రకుటుంబము ఎవరినో ఒకరిని పోగొట్టుకొని, విలపించింది. అట్లయిగూడ, తమబిడ్డలు—తమ సేనాపతులు ప్రాణాలు అర్పించిన ఆ ఆశయలబ్ధికి పాటుబడి, వారి ఆత్మబలిదాన ఋణమును దీర్చుకొని, తమ జాతీయగౌరవమునకు ఆపాదించిన కళంకమును బాపుకొనను ప్రతిజ్ఞ బూనని కుటుంబమే లేదు. అప్పుడే, అబ్దల్లీ కార్యక్రమాన్ని ఛిన్నము చేయను, 50,000 సైన్యంతో పేష్వా నర్మదను దాటినాడు. తనప్రజకు, తన కుటుంబానికి సంభవించిన దారుణ దురంతమును తెలిసికొనగానే, నానాసాహెబ్ పానిపట్ ఫలితాల లెక్కబెట్టక అబ్దల్లీ శక్తిని నాశనము చేసి, పొందిన జయాన్ని స్థిరపరచుకోను అవకాశమును యివ్వదలచుకొనలేదు. ఉత్తరాన వున్న మహారాష్ట్రసైనికుల మానసికోత్సాహాన్ని వికలము కాకుండచేయదలచు కొన్నాడు. ఆయన స్వకీయ పుత్రశోకము ఓర్వజాలనిదై యుండినను, ఆరోగ్యము పూర్తిగా చెడియుండినను, యీపరాజయము తన ప్రజాశత్రువుపై ప్రతీకారోత్సాహానికి దోహదమిచ్చింది; అబ్దల్లీని వెనుకకు కొట్టివేయవలెనను పట్టుదలను బలవత్తరము చేసినది. అతివిశ్వాసంతో ఉత్తరదేశ హిందూసంస్థానాధిపతులకెల్ల ధైర్యోత్సాహాల గూర్చే జాబులువ్రాసినాడు. హిందూత్వవిరోధులు—హిందూమత విద్వేషులు అందరు ఒకపై హిందూస్వాతంత్ర్యోద్యమాన్నే అసలే లేకుండా నాశనముచేయుటకు సర్వయత్నాలు చేయుచుండ,

హిందూరాజులు, చూస్తూ ఎడదొలగి నిలిచియుండుట ఆత్మవినాశనకారి అనియు, యీవిధానము ఎన్నటికి శ్రేయోదాయకము—వివేకము కాద నియు గట్టిగా వారితో వాదించినాడు. హిందూవిమోచక యుద్ధంలో పాల్గొనమని వారినందరిని ఆహ్వానించినాడు; పానిపట్ పరాజయానంత రముగూడ, మొగల్‌సామ్రాజ్య విచ్ఛిత్తిపై అబ్దల్లి మరల మరియొక ముస్లింసామ్రాజ్యమును నిర్మించకుండా చేయగలనని అందరికి నమ్మ బలికినాడు. "పానిపట్‌యుద్ధ ఫలితం ఏమైతేనేం? అభిమన్యునివలె యుద్ధముచేసి, మాబిడ్డ విశ్వేశరావు శత్రుఖడ్గానికి ఆహుతియై వీరస్వర్గ మలంకరించినది నిజమే! నాతమ్ముడు భావు, వీరపురుషకిశోరము— జంకోజీ ఏమైనారో దేవునికే ఎరుక. అనేకులు సేనాపతులు, శూరులు నిహతులైనారు. ఇక జయాపజయాలు దైవాధీనాలు, సమయాధీనాలు కాబట్టి యిందువిశేషమేమీలేదు. ఇంత జరిగినా, ఇకనింత జరుగనున్నా దీనిసంగతి అటో ఇటో తేల్చుకో గలము" అని వ్రాసినాడు.

ఇట్టి అచంచలమును—శాశ్వతమును అయిన పట్టుదలవల్లను, ఘోర విపత్తులలోగూడ నిలువగలిగిన శక్తివల్లను, మహారాష్ట్రులు భరత ఖండాని కంతటికి యజమానులైనారు. అబ్దల్లి అతిసూక్ష్మగ్రాహి గావున, విరోధుల మానసికోద్వేగాన్ని అపార్థము చేసుకొనలేదు, వారి శక్తిసామ ర్థ్యాల క్రిందుపరచలేదు. పానిపట్ విజయ మరుక్షణమందే, త్వరగా తన సైన్యాలతో స్వదేశం మరలిపోక పోయినచో, తాను కబళించిన స్వల్పాన్ని గూడ మరల బలవంతంగా కక్కివేయవలసి వస్తుందని గ్రహించినాడు. నానాసాహెబు, పానిపట్ హతశేషులైన సరదారుల, పదాతుల అందరిని సమకూర్చుకొని దండుజేసినాడు. మల్హారరావు హోల్కార్, విఠల్ శివదేవ్, నరోశంకర్, జానోజిభోసలె మొదలగు మహారాష్ట్ర వీరులు నానా ముఖాలనుండి, తమతమ సేనాంగాలతో వచ్చి గ్వాలియరులో చేరు

చుండినారు. ఈ బలగముతో నానాసాహెబు మరల ఢిల్లీపై నడువదలచు కొన్నాడు. మహారాష్ట్రీల యీ నవ్యరణోత్సాహము సూజా నజీబుఖాను లను భయ విహ్వాలుల జేసింది. పానిపట్టు విజయము—మహారాష్ట్రీలను పూర్తిగా జయించుట గాదని వారు తెలుసుకొన్నారు. వెంటనే వారు వేరు వేరుగా సంధికి దూత వాక్యాలబంపి, గ్వాలియర్ చేరిన నానాసాహెబును బూతు పొగడినట్లు పొగడి కైవారాల పంపినారు. అబ్దల్లి ఒంటరిగా నైనను, తమ సహాయముతో నైనను, హిందువుల అణచజాలడనియు, కూలిపోవుచుండిన ముస్లిం సామ్రాజ్యాన్ని నిలుపజాలడనియు సుజా గ్రహించినాడు. మహమ్మదీయ సైనిక కేంద్రము త్యజింపబడింది. ప్రతి వాడు వాడివాడి సౌకర్యాన్ని వెదకసాగినాడు. సుజా అబ్దల్లీని వీడి ఎడ దొలిగి పోయినాడు. అబ్దల్లి ఢిల్లీచేరి, అందు కొన్నివారాలుండినాడు. నానా సాహెబు ౫0,000 సైన్యంతో అతనిని వెన్నాడుచుండినాడు. అబ్దల్లీ స్వదేశంపై పారసీకులు దండెత్తివచ్చినారని విని, ఢిల్లీ సామ్రాజ్య రాజ కీయాల నట్టేట విడిచి, 1761 మార్చిలో మహా వేగంతో సింధునుదాటి పరుగెత్తిపోయినాడు. మొదట అబ్దల్లి దేనినికోరి సింధునదినిదాటినాడో పాపం! ఆవాంఛ ఏమాత్రముగాని నెరవేరలేదు.

తమ సామ్రాజ్యాన్ని హిందూపేనల బారినుండి కాచుకొనుటకు హిందూదేశస్థ మహమ్మదీయులు విదేశ క్రూర స్వమతస్థులతో చేతులు గలుపుటకు యిదే తుదియత్నము. పానిపట్ యుద్ధాన్ని గెలిచినారుగాని, హిందూ ప్రభుత్వకేంద్రమైన మహారాష్ట్ర రాజ్యమండలిని అణచగలిగినట్టి, ముస్లిం సామ్రాజ్య కంఠాన్ని నొక్కిపెట్టియుండిన మహారాష్ట్ర రాజ్యాధి కార మృత్యునఖాలనుండి విడుపించుకొన గలిగినట్టి, చరమావకాశాన్ని మాత్రం గోల్పోయినారు.

ఇదిసుతా, పఠానులు ఢిల్లీ పొలిమేర చేరలేక పోయినారు. దీనితో సింధునదిని దాటుపనిని మానుకొన్నారు.

కారణము:—పానిపట్ సమరాంగణ బీభత్స వినాశన దగ్ధధూళి నుండి, పంజాబులో మరియొక హిందూశక్తి సత్వరముగా విజృంభించింది. అదే దినదిన ప్రవర్ధమానమగు శిక్కు ప్రభుత్వము. ఈ శౌర్యసింహాలజాతి క్రమేణా తమ మతప్రాబల్యాన్ని—మతసంస్థను పెంచి పోషించుకొంటూ వుండినారు. ఈ మతము పలుమారు ప్రాణార్పణలౌల్యులైన మహాత్యాగుల రక్తప్రోద్ధతమై మున్ముందు ఒక ప్రచండశక్తి కానున్నదని ఆశల గొల్పినది. వారి గురుపరంపరలో పదియవస్వామి, మహారథుడు. సింహబలుడు, గోవిందసింగు, నిజప్రాణదాత బందాసింగుల అధ్వర్యాన సిక్కులు హిందూ రాజకీయ స్వాతంత్ర్యముకొరకు పంజాబులో పోరాడినారు. ఈ యిద్దరు మహాశూరులు. హిందూ దేవగణములో, జాతీయ వీరపురుషాగ్ర గణ్యులుగా శాశ్వతారాధనకు పాత్రీకరింపబడినారు. బందా నాయకత్వాన, తమ భూమిని కొంచము కొంచముగా విదేశీయుల చేతులనుండి విడిపించుటలో కొంతకాలము ఒకపాటిగా కృతకృత్యులగుచు వుండినారు. కాని, పంజాబునందలి ముస్లిం ప్రభుతను మరణఘాతగొట్టి, పంచనదీ వారి పావన వేదభూమిని మరల హిందూ పతాకముక్రిందికి గొనివచ్చు కార్యము మాత్రం మహారాష్ట్రులకు ప్రత్యేకింపబడి నిలచియుండినది. దీనిని వారు నెరవేర్చినారు. వారు తమ నెలవులవదలి దూరభూములలో నిరంతరము పోరాడవలసి వచ్చినను, నిజగుహాంతరస్థ సింహాలనే పీచమణచవలసి వచ్చినను, వారు తమ నిర్దిష్టకార్యాన్ని ఫలప్రదముగ కొనసాగించి, పృథ్వీరాజు పాలనానంతరం ప్రప్రథముగ హిందూ విజయకేతనాన్ని అటకు దుర్గముపై నెలకొల్పినారు. నాదిర్‌షా—అబ్దల్లీల సహాయంతో ముస్లిములు, హిందూదేశంలో తమ అధికారాన్ని పునరుద్ధరింప

చేసిన అనేక యత్నాల, మహారాష్ట్రులు తమ తరుగని పట్టుదలతో విఫలము చేయుచుండ, పంజాబునందలి శిక్కులు, దొరకిన అవకాశాన్ని గ్రహించి, తమ రాజ్యాధికారమును, శక్తిని పెంచుకొనుచుండినారు. పానిపట్ యుద్ధానికి అబ్దల్లీ చెల్లించిన భూరివిలువకుగా, మరల ఒకమారు పంజాబును తన ఏలుబడి క్రిందకు గొనిపోయి అనుభవింప దలచుకొనిన ఆత్మతృప్తి లేశాన్నిగూడ అబ్దల్లీకి దక్కనీకుండ జేసింది యీ నూతన జృంభిత హిందూశక్తి. పంజాబు, మహారాష్ట్ర హిందువుల చేతులనుండి జెడిసిపోయినప్పటికి, అది ముస్లిముల చేతులలోమాత్రం నిలువలేదు. అబ్దల్లీ వెనుదిరుగగానే, తక్షణం పంజాబు హిందువులు అబ్దల్లీ దుర్గాలపై బడినారు. అబ్దల్లి దీనికై మరల రెండుమారులు వచ్చి సింధునదిని దాటినను, వారు తమదేశాన్ని స్వాధీనము చేసుకొని నిలుపుకో గలిగినారు. దీని వెనువెంటనే మహారాష్ట్రులు మరల ఢిల్లీ నగరము ప్రవేశించి; అఖిల హిందూస్థానములో ప్రథమగణ్యమైన హిందూ ప్రభుత్వమును నిలువబెట్టుకొన్నారు. శిక్కుల అధికారముగూడ పెంపొంది పోయింది. వీరు తమ అధికారాన్ని నిజరాష్ట్ర సీమాంతాలకు గొనిపోలేక పోయినను, స్వరాష్ట్రంలో బలవంతులై విదేశదండయాత్రల నిరోధించి, దేశస్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలిగినారు. అదిమొదలు, ఎన్నడుగాని నిశాట మతావేశముగాని, భూమ్యాక్రమణ అతృప్తతృష్ణగాని, అటు పఠానులను, ఇటు తురుష్కులను—సింధు నదిని దాటుటకు ప్రేరేపించలేదు. ఈమారు, యవనులకు బదులు సిక్కులే యీ నదిని దాటి, కాబూలు నదీతటానికి హిందూ వీరకేతనాన్ని గొనిపోయి, అప్పు తీర్చివచ్చినారు. శిక్కులు తమ సీమాంతర ముస్లింజాతులను, వారి మత మూఢభక్త్యావేశాన్ని తల ఎత్తకుండాజేసి, భయవిహ్వాలుల జేయుటచే, పఠాణిదేశంలో 'సిక్కు' అనుమాట భయోత్పాదన శక్తికి పర్యాయపదమై పోయింది.

ఈవిధంగా, యీ విషయాన్ని సర్వహిందూదృష్టితో పరికిస్తే మహా రాష్ట్రీయులు తమ ఆదర్శలబ్ధిని పొందలేకపోయినారు. వారు పానిపట్ యుద్ధం గెలిచినారు; గెలిచిగూడ, హిందూ పద్ పాదషాహి స్థాపన ప్రయత్నకులతో 'వారు గావించుచుండిన నిరంతర సమరమును మాత్రం గోల్పోయినారు. ఈ పానిపట్ విజయులు, త్రిసాగరావృత హిమాద్రి పర్యంత అఖండ హిందూస్థానానికి హిందువులనే యజమానులుగా జేసి చూస్తూవూరకుండవలసివచ్చినది.

ఇట్లు ఉత్తరాన, హిందువులు తమ భీకర ముస్లింప్రతిపక్షులతో భూరి జాతీయ సమరాన్ని సాగించుచుండ, మరియొక యుద్ధప్రియుడు, మెలుకువతో రంగములోకి ప్రాకి, యీ దారణయుద్ధాన్ని ఆసక్తితో కనిపెట్టియుండినాడు. ఇరుపక్షాలవారిని చావమోదిన పానిపట్ దుఃఖాంతానికి అందరికంటె ఎక్కువగా యితడే సంతోషంతో ఇకిలించ గలిగినాడు. పానిపట్ దారుణదుష్ఫలితము మహారాష్ట్రుల దుర్బలులజేసి, బెంగాలు దండయాత్రను తాత్కాలికముగా అడ్డివేసింది. అందువల్ల, మొన్న మొన్ననే ప్లాసీ మైదానంలో ప్రభవించిన బ్రిటీషు అధికార శిశువు గొంతును మహారాష్ట్రులు తోడ్తోడనే నులిమివేయలేక పోయినారు. పానిపట్ పొలికలనులో గెలిచినవారు ఎవరైనా వున్నచో, అది దారుణముగా పోరి కుత్తుకలు నరుకుకొన్న ఆ యిరుపక్షాల మహావీరులుగాదు; ఇక, యీ పోరును ఆసక్తితో చూచుచుండి, యిరుపక్షాలవారు క్రుంగి దుర్బలులైపోయిన ఆ అవకాశాన్ని గ్రహించి, కార్యరంగంలో అక్రమంగా చాకచక్యంగా ప్రవేశించిన ఆ నూతనాగంతుకునిదే గెలుపు అనవలసివున్నంది.

పానిపట్ యుద్ధం, ఈస్టు ఇండియా కంపెనీ జీవితానికి మరియొక క్రొత్తకొలుయిచ్చి, యింగ్లీషువారి పనిని ముగించుటకు మహారాష్ట్రులకు

తాత్కాలికముగా నిరోధము కల్పించింది నిజమే కాని, దీనివల్ల బ్రిటీషు వారికి స్థిరస్థాయియైన లాభం చేకూరిందనిమాత్రం అనుకోరాదు. ఎందువలన అంటే—పానిపట్ దారుణ ప్రహరణానంతరం మహారాష్ట్రులు అతిత్వరగా తేరుకొన్నారు. కాని, వారిమధ్య చెలరేగిన అంతఃకలహాలు, గృహచ్ఛిద్రాలు, నాయకుల మరణాలు లేకపోయియుండినచో, పానిపట్ పరాజయానంతరంగూడ ఇంగ్లీషులను ఓడించియే యుందురు. ఇంగ్లీషు జయపరంపరకు, పానిపట్ పతనానికంటె, మహారాష్ట్రుల అంతఃకలహాలే ఎక్కువ కారణభూతం అయినవి.

మేజర్ ఇవాన్స్యబాల్‌గారిట్లు వ్రాసినారు : "పానిపట్టు యుద్ధంగూడ మహారాష్ట్రులకు కీర్తిప్రతిష్ఠల గూర్చింది. ఒకవిధంగా అదిగూడ ఒకవిజయమే. అశేష భారతీయుల కొరకు, సంపూర్ణభారతదేశము కొరకు వారు పోరాడినారు. వారు ఓడిపోయినప్పటికిని జయించిన ఆఫ్ఘనులుగూడ వెనుకకు మరలిపోవలసివచ్చింది. అదిమొదలు ఆఫ్ఘనులు హిందూదేశ విషయాలను తాకించుకొనలేదు."

ఉన్నట్లుండి అబ్దల్లీ స్వదేశం పరుగెత్తిపోయినవార్త, సుజా నజీబుఖానుల వినయపూర్వక ప్రార్థనల ఉదంతము మహారాష్ట్ర దేవిడి చేరగానే, పరిస్థితులు దాల్చిన సుముఖ రూపానికి వారు సంతోషపడినారు. పానిపట్ తదనంతరం రెండునెలలకు నరోశంకరుడు యిట్లా వ్రాసినాడు—"భగవానునికి ధన్యవాదాలు! హరిపూజా పరాయణులైన మహారాష్ట్రులు ఇంకను హిందూదేశపాలకులుగానే యున్నారు." ఈ వీరపురుష సింహనాదము ఒక పెదవినుండి మరియొక పెదవికి ప్రాకి మహారాష్ట్ర మంతా అలముకొన్నది. "ఏమైతేనేమి? అసలు యిది యుద్ధము—జయాపజయాలు మనస్వాధీనాలు కావు. మరల యత్నించిచూస్తాం" అని, అందరు రేకెత్తిన ఉత్సాహాన్ని చూపినారు.

ఈ మధ్యకాలంలో నానాసాహెబు ఆరోగ్యం నానాటికి క్షీణించి పోతుండినది. పోయిన రెండేండ్లుగా ఆయన క్రుంగిపోతుండిన ఆనవాలు కనిపిస్తుండినవి. అదే సమయానికి పానిపట్ భయానక వార్త వచ్చింది. మానవశక్తిని, స్థైర్యాన్ని అంతా ఉపయోగించి, ఆ భారాన్ని ఓర్చుకొన్నాడు. స్వకీయ దురంత సంతాపాన్ని అణచుకొని, యుద్ధ పరాజయజన్య మానసిక దౌర్బల్యాన్ని, భీరుత్వాన్ని అధిగమించునట్లు తన జాతికి నూతన శక్త్యుత్సాహాల కలిగించినాడు; సమయోచితంగా, విశ్వతోముఖ విజయ శక్తితో విరోధుల నిరోధించు సామర్థ్యమును మహారాష్ట్ర రక్తనాళాలలో పారించినాడు. కాని, తనబిడ్డ విశ్వేశుని మరణము, తన అనుగు తమ్ముడు భావుపతనము, శూరసేనాపతులు—వీరపదాతుల వధలు మాత్రం ఆయన మానసాన్ని ఓదార్ప వీలులేనంతగా, నలుగుడుపడ జేసినవి. మొదలే క్షీణించుచుండిన ఆరోగ్యము త్వరగా అవసానానికి సమీపించింది. ఇక, మహారాష్ట్రమును అఖండ హిందూస్థానమునకు అధికారిణిగా జేసిన యీ మహారాష్ట్రనాయకుడు 1761 - జూను 23 తేది స్వర్గస్థుడైనాడు. చనిపోవునప్పటికి ఆయన వయస్సు 41 ఏండ్లు మాత్రమే !

ఇచట, ఆయన శీలమును గురించిగాని, సామర్థ్యమును గురించి గాని ప్రస్తావించుట అనవసరము. మాటల కంటె గంభీరముగ—బిగ్గరగా యింతకుముందే ఆయన చేతలు వాటిని చాటివున్నవి. ఆయన పౌరరాజ పాలనము న్యాయైకవర్తియై, ప్రజానురంజకంగా వుండుటచే యిప్పటికివి వారి పాలనము నెనరుతో మననము చేయబడుచున్నది. శివాజి వాంఛితార్థమైన హిందూసామ్రాజ్య స్థాపనము ఆయన ప్రయత్నానికిగా ప్రత్యేకింపబడి యుండినది. నిజానికి, యావద్భారతావనిని, ముస్లిం బంధం నుండి విడిపించినది ఆయనే ! పృథ్వీరాజు పతనమాది, గత ఏడు శతాబ్దములు ఎరుగనంతటి ఉన్నత కీర్తి శిఖరానికి ఆయన హిందూజాతిని గొని

పోయినాడు, నాటి ప్రపంచమహాపురుషులలో అగ్రగణ్యుడు కాకపోయినను, వారిలోమాత్రం ఒకడుగా లెక్కబడినాడు.

నానాసాహెబు అను నామాంతరముగలిగిన బాలాజీరావు అకాల మరణము పానిపట్ నష్టమును మించకపోయినను, దానితో మాత్రం తులతూగింది. ఈ రెండు అరిష్టాలు పెనగొని ఒక్కుమ్మడి పైబడుటచే యీ దెబ్బనుండి తేరుకొనుటకు దేశానికి చాలాకాలము పట్టింది.

---

# 16. పుణ్యమూర్తి మాధవరావు

"భువమధిపతి ర్బాలావస్థో ప్యలం పరిరక్షితం
నఖలు వయసా జాత్యైవాయం స్వకార్య సహోభరః."

నానాసాహెబు మరణకారణంవల్ల నడుపగలిగిన నాయకుడులేని మహారాష్ట్రము, పానిపట్ దారణ ప్రహరణ ఫలితంగా మహారాష్ట్ర మండలియు భగ్నమై పోగలవని వూహించి, మహారాష్ట్ర శత్రుగణము ఏకోన్ముఖంగా లేచి, అన్నిప్రక్కలా పొదివినారు. తన హిందూ ప్రభువును—సార్వభౌముని పారద్రోలి హైదర్ఆలి మైసూరు సింహపీఠాన్ని ఆక్రమించుకొని, లభించిన అవకాశంతో మహారాష్ట్రభాగాలపై బడినాడు. ఉదయగిరి పరాభవ కళంకాన్ని మాపుకోను హైదరాబాదు నైజాము తీవ్ర ప్రయత్నాల సాగించుచుండినాడు. మధ్యలో ఓపినమటుకు, సాధ్యమైనంత వరకు ఇంగ్లీషువారుగూడ కబళింపజూచుచుండినారు. ఉత్తర హిందూస్థానంలో ఒక మహమ్మదీయులేకాకుండా, రసపుత్రులు, జతులు, ఇంకను పలు

వురు సంస్థానాధిపతులు మహారాష్ట్రులపై తిరుగుబాటుజేసి, యథోచితంగా తమ తమ కులాయాలల్ని చక్కదిద్దుకొని పెంపొందజేసికొన యత్నించుచుండినారు. విషమపరిస్థితుల యింకను విషమతరము చేయుటకు—రఘునాథరావు విఘాతుకస్వార్థచింత అంతఃకలహాల లేవదీసి మహారాష్ట్రమండలిని రెండుకక్షలగా చీల్చుటకు సంసిద్ధమైంది. తమ జాతిని, ప్రతిపక్షులు నలుగడల చుట్టుముట్టి అణచివేయదలచుకొని చెలరేగిన ఆ సమయంలో, తమ జాతి భాగ్య—అభాగ్యరేఖలపై హిందూ స్వాతంత్ర్యము ఆధారపడి యుండిన ఆ సందిగ్ధసమయంలో మహారాష్ట్రనాయకులకు యీ దుర్బుద్ధి పుట్టినది.

అట్టి అపూర్వ క్లిష్ట అరిష్ట పరిస్థితులలో దేశాన్ని చక్కని రాజమార్గాన నడుపవలసిన భాద్యత బాలాజీ రెండవకొమారుడు - మాధవరావు భుజస్కంధాలపై బడింది. ఆనాటికి యీ నాయకుని వయస్సు 17 ఏండ్లు. అయితే ఏం, మనజాతి సంచితపుణ్యాన, యీ యువకుడు మానవాతీత, ప్రజ్ఞలతో—జనాకర్షణ శక్తితో విరాజిల్లినాడు. తనతండ్రి రక్తము ధారపోసిన హిందూసామ్రాజ్య ఘనతరాదర్శమునకు నిజ సర్వస్వమును వినిమయము చేసినాడు. అట్టి మహాపురుషుని అధ్వర్యాన, తన జాతి సమస్త కష్టాలనుండి గట్టెక్కింది. అదిమొదలు మరల, తన్ను నిరోధించిన వివిధశక్తుల అణచివేస్తూ మహారాష్ట్రము అఖిల హిందూస్థాన ప్రథమ రాజకీయశక్తి అయింది.

ఓం ప్రథమంలో నైజాము తన అదృష్ట పాచిక విసరినాడు. మహారాష్ట్రశక్తి అడుగంటా ఎండిపోయిందని భావించుకొని, నేరుగా పునహా నరగంపై కే నడవవలెననుకొన్నాడు. హిందూమత పరిత్రాణులన్న మహారాష్ట్రుల బిరుదమునే న్యూనపరచుటకు, టోకపట్టణ దేవాలయమును అపవిత్రీకరించి, ధ్వంసముచేసినాడు. కాని, మహారాష్ట్రులు నానాముఖాల

నుండి పునహాలో గుమికూడి, 80,000 బలగంతో తమ రాజధానీనగరాన్ని కాచుకోను కత్తిదూసినప్పుడు నైజాము నిరాశోపహతుడైనాడు. నైజాము ఉరలిదగ్గర ఓడింపబడి వెనుకకు తరిమివేయబడినాడు. కాని, నీచుడు రఘునాథరావు ఆ సమయానికే కుట్రలబన్ని, తన సోదరపుత్రుడు మాధవ రావుకు వ్యతిరేకంగా మహారాష్ట్రిలను చీల్చినాడు. అంతఃకలహాలలో కుత్తుకలబంటి వుండినవారిని అణచుటకు నైజాం మరియొక పెద్దసేనతో బయలుదేరి వచ్చినాడు. భోసలే—మరికొందరు సరదారులు నైజాం పక్షంలోచేరినారు. కాని, మహారాష్ట్రి చరిత్రలో పలుమారు జరిగినట్లే, తమ రాజకీయ ఐక్యతను ఛిన్నముచేయుచు వచ్చిన దేశవిద్రోహక స్వార్థ చింతలు, వెనువెంటనే నిరోధించబడి, నిసర్గ దేశారాధక ప్రవృత్తివల్ల సరిజేయబడుచుండినవి. ఈ దేశారాధన పరాయణము, స్వార్థ అహంకార తృష్ణల మధ్యగూడ ఆజాతి విలక్షణ మానసికభావంగా చాలకాలం నిలిచి వుండినది. ఆంతరంగిక కల్లోలజనిత నిష్ఠూర్యంవల్ల మనసుతిరిగి, పేష్వాకు వ్యతిరేకంగా నైజాంపక్షం వహించిన సరదారులు, క్లిష్టసమయంలో తమ అసహజస్నేహితుని పరిత్యజించి, మరల మరాఠి విడిదిలో చేరి నారు. నైజాముకు ముందు నుయ్యి, వెనుక గొయ్యి అయింది. 1763 లో రాక్షసభువనమందు ఒక దారుణ సమరము రేగి, సంయుక్త వివిధమహా రాష్ట్రి శక్తులచే మరియొకమారు నైజాం ఓడింపబడినాడు. నైజాము దివాను హతుడైనాడు. అతని 22 మంది సరదారులు దెబ్బలు తిని బంధీ లైనారు. పెద్ద ఫిరంగులు, రణసామగ్రి, వస్తుసామగ్రి విశేషంగా మహా రాష్ట్రిల చేజిక్కినవి. ఉదయగిరి దుర్గంలో విరిగిన పరువును ప్రాభవాన్ని నిలువబెట్టుకొన దలచి, పూనాయందలి "కర్ భారి"ని నియమించు అధి కారం తనదేనని డంబముకొట్టిన నైజాము, చివరకు—అవనతుడై, అవమానితుడై—సురక్షితంగా స్వదేశం చేరనిచ్చినందులకు సాలుకు

82 లక్షల గూర్చే భూభాగాన్ని మహారాష్ట్రులకు సమర్పించి మరలిపో వలసి వచ్చిరది. ఆ తరుణ పేష్వా కదన పాండితి మండిమెరసిన మొదటి యుద్ధము యిదే! ఇందు మాధవరావును వరించిన క్షాత్రవిజయలక్ష్మిల వల్ల ప్రజానీకము, తమజాతిని సంకుల పరిస్థితులలో విజయపారానికి నడుప గలిగిన మహానేత ఆయనే అని సహజ బుద్ధిపరిపాకముచేతనే గుర్తించినారు.

పానిపట్ యుద్ధభూమిలో పరాభూతమయ్యు యింకను హిందూ శక్తి అజేయంగానే వున్నదని నైజాముకు నచ్చజెప్పి, మాధవరావు పానిపట్ నీచావకాశాన్ని గ్రహించి, హిందూ సింహపీఠ శిధిలాలపై నూతన ముస్లిం రాజ్యాన్ని స్థాపించి, కృష్ణ అంచువరకు మరాఠిదేశాన్ని ఆక్రమించుకొన్న సాహసిక సైనికుడు ఆ హైదరుకుగూడ యిదేపాఠమును నేర్పను బయలుదేరినాడు. 1764 లో మాధవరావు హైదరుపై నడచినాడు. ధార్వారును ఆక్రమించుకొని, ఖోర్‌పడె, వించూర్‌కర్, పట్‌వర్ధన ఆదిగాగల మహారాష్ట్ర సేనాపతులు హైదరును అన్నిప్రక్కలా పొదివి నొక్కినారు. రట్టిహల్లి యుద్ధానంతరం, హైదరు—వివేకి అయిన సేనాని, గడుసు సైనికుడు అయియుండిగూడ, ఇక ఎంతోకాలం ఆ విరోధులను ఎదిరించ జాలనని తెలిసికొని, చాకచక్యంగా ఉపసంహరించుకో దలచుకొన్నాడు కాని, మాధవరావు దీనిని ముందే వూహించుకొని బేడనూరు దగ్గర సేనల నిలిపివుంచినాడు. ముస్లింలు యుద్ధముచేయక తప్పిందికాదు, అందు దారుణ ఫలితాన్ని అనుభవించినారు. మాధవరావుచే స్వయంగా నడుపబడిన ఆ సేనలు హైదరుసైన్యమును చిందరవందరచేసినవి. పరాసు శిక్షణల తీరిన హైదరు ప్రజ్ఞాపూర్ణాదళముగూడ చావుదెబ్బతిన్నది. లెక్కకు మించిన గుర్రాలు, ఒంటెలు, ఫిరంగులు, తుపాకులు, బత్తెపు దినుసులు విజయులైన మరాఠుల చేజిక్కినవి. ఇక నిరోధము ప్రయోజనంలేదను

కొని, హైదరు సంధిని కోరినాడు. అప్పటివరకు మహారాష్ట్రుల చేజిక్కిన దేశాన్ని వారికేవదలి, బాకీ నిలిచిన కప్పమునకు, చౌతుకు 22 లక్షలు సమర్పించుకొని దండముబెట్టినాడు.

మాధవరావు తన యిష్టానుసారముగ చేయగలిగియుండినచో హైదరును యిట్లు విడిచిపెట్టి యుండడు. కాని, రఘునాథుని విద్రోహకరమైన పేరాస మహారాష్ట్రులకు హైదరుకంటె, నజీబుకంటె తీవ్రమైన పీడ అయింది. హిందూప్రభుత్వ పరిపంథులతో మాధవరావు యుద్ధాలలో తగులుకొని జయలక్ష్మిని చేకొననున్న సమయంలో అనేక పర్యాయములు రఘునాథుడు పేష్వాపై తిరుగబడినాడు. రఘోబా అధికార పిపాసను తీర్చగలిగినదే లేకపోయింది. ఇక అతడు—ఉన్న అధికారమునే పాలింపజాలని అశక్త దుర్జనుడు. మహారాష్ట్రి నాయకులు దక్షిణ దిగ్విజయ యాత్రలో మగ్నులై యున్నసమయంలో స్వదేశంలో నిరోధంలేనందున, రఘునాథుడు తన ఆత్మబంధువునికి వ్యతిరేకంగా, హింద్వేతర రాజ్యాలతో చేతులగలుపు విద్రోహకవృత్తికి యియ్యకొన్నాడు. రఘునాథుడు—ఓడి, చేజిక్కినప్పుడెల్ల రోగపీడిత పూర్వాచార బానిసలవలెకూడూ, నీరూ ముట్టకుండా ప్రాయోపవేశంతో ప్రాణాల తీసుకొంటానని బెదరించేవాడు. ఇట్టి పలుగాకి, మొగలు సింహాసన భాగాన్నేకోరి యీదారి త్రొక్కివుండినచో వానిగతి, ఒక చిన్న విషబిందువో—లేక, ఒకచిన్న కూచిబాకో పాలకుని చిరునవ్వులమధ్యనో, అనుతాపబాష్పాల తడితోనో, ఎప్పుడో అతి త్వరగా తీర్చివేసివుండేవి. కాని, యీ యువక బ్రాహ్మణరాజు—సద్ధర్మ సత్యవర్తనాల అవతారమూర్తి! దేశాన్ని పంచుకొనగోరిన చిన్నాయన కోర్కెను, కేవలము లొంగిపోయినట్లు నెరవేర్చుటకు సంసిద్ధుడై అతనికి ఒక జాబు కూడ వ్రాసినాడు—"నాయనా, యీ రాజ్యాన్ని పంచుకోవాలంటున్నారు. కాని, యీ అఖండ సామ్రాజ్యానికి అధిపతు లెవరో వూహించుకోండి.

ఇది ఒక వ్య క్తిగతమైన ఆ స్తియా ? దీనిని యింత ఘనపరచి యింత గొప్పజేసి పరువుగూర్చుటకు అనేకవేలమంది దేశీయులు నె'త్తురు చెమ టల వూడ్చినారే ! రాజ్యాధికారము, నడుపగలిగిన ఒకేవ్య క్తి హ స్తబద్ధమై కేంద్రీకరింపబడి యుండవలయును. ఈ రాజ్యాన్ని పంచి, ముక్కలుజేసి, సొంత ఆ స్తిమాదిరి మూటలుగట్టుకొనిపోతే, యీ రాజ్యం తన ఘనతను ప్రాభవాన్ని ఎట్లు పోషించుకొని నిలువగలదు ? ఇది ఎన్నటికిని కానిపని. ఇక యీ సంయు క్త రాజ్యమండలిని పంచి దాన్ని దుర్బలంచేసిన పాపానికి ఒడిగట్టేదానికి బదులు, నేనే నా నామరూపాలులేకుండా జేసు కొని, యీ అఖండ హిందూరాజ్యానికి మిమ్మే నిర్నిరోధాధిపతిగా చేయుటే దేశ క్షేమకరముగదా! స్వార్థ అవలేప తృష్ణలకుగా, మహారాష్ట్రి ర క్తవర్ధిత సామ్రాజ్యాన్ని బలిబెట్టినాడని, భవిష్యస్సంతతుల వారి అభిశా పావమానాలకు గురిచేయబడుటకంటె, ఇదే ! నా సమ స్త రాజ్యాధి కారాలత్యజించి, మీ సైన్యశిబిరంలో ఒక సాధారణ అనామక పదాతిగా చేరి, మీరు పారవేసిన కమికెడు అన్నాన్ని ఏరుకొని తింటూ మహా రాష్ట్రి జననిని సేవించుట శుభముకదా ?" అని మాధవరావు రఘోబాకు వ్రాసినాడు.

మాధవరావువంటి న్యాయైక శీలుడు, ధర్మి, వీరుడు పేష్వాగా వున్నంతవరకు, మహారాష్ట్రిప్రజ—రఘునాథునివంటి అశక్త చంచలస్వభా వుని నేతగా గ్రహించియుండదు.

---

# 17. పానిపట్ ప్రతీకారము

"ఉపకారులకు మహారాష్ట్రీలు కృతజ్ఞతా బద్ధులు—
అపకారులకు తీరని విరోధులు. వారిని అవమానపర
చిన, ప్రాణాలకు సరకుగొనకుండా పగసాధింతురు."

—హ్యూయన్ సాంగ్ (చైనా బౌద్ధభిక్షు)

ఈ గృహఛిద్రాలుగాని, విద్రోహక అంతఃకలహాలుగాని, హైదరు—టిప్పుబోటి క్రూరశత్రు విజృంభణలు గాని, పానిపట్ పరాజయ ప్రతీకార దీక్షను మహారాష్ట్రీలందు సడలింపజేయలేదు; నాటి విరోధులకు తగిన ప్రతిక్రియచేయు సంకల్పమును మరపింపలేదు. నానాసాహెబు మరణానంతరం కొంతకాలంవరకు ఉత్తరాన నిజ జాతీయ యోగక్షేమాలకు హోల్కార్—సింధేలు రక్షకులుగావుండి, యీ యిద్దరు మరాఠి సరదారులు తమ శక్తికొలది ధర్మాన్ని పాలించినారు. రఘోబా లేవదీసిన కుట్రలు—పితూరీలను అణచి చేతిక్రిందికి తీసుకొని రాగానే, 1769 లో మాధవరావు, దుర్మార్గుల శిక్షించుటకు బినివాలె ఆధిపత్యాన ఒక సేనను ఉత్తరదేశం పంపినాడు. ఉత్తరహిందూదేశమందున్న మహారాష్ట్రీ చమూపతుల కందరికి, యీ యీన సేనలో చేరమని ఆజ్ఞలు, విజ్ఞాపనలు పంపబడినవి. హిందూ సామ్రాజ్యాధికార నిర్వహణమును మరల సాగించి, కుదటబెట్టుటకును—1761 సంవత్సరమాది మహారాష్ట్రాధికార విధ్వంసనాన్ని అపేక్షించి, ప్రార్థించి, ప్రయత్నించి, సాహసించిన వివిధ భారతీయ సంస్థానాలకు మరపురాని గుణపాఠాన్ని నేర్పి అణచిపెట్టుటకును, మహారాష్ట్రీ ప్రచండవాహినులు బయలుదేరి, నర్మదానదమును దాటి బుందేలుఖండము చేరినవి. అచటి క్షుద్రకలహాల అణచి, మార్గమధ్యాన నిరోధిం

చిన చిన్నచిన్న సంస్థానాల శిక్షించి, నిర్నిరోధంగా అవలీలగా ఛంబాలు తటమున విడిసినవి. పానిపట్ అనంతరం, అన్యాయంగా ఆక్రమించు కొనిన ఆగ్రా మొదలగు దుర్గాల మరల మహారాష్ట్రుల వశము చేయుటకు జతు యియ్యకొనక యుద్ధానికి దిగినాడు. భరతపూరు సమీపంలో పెద్ద నిలుకడపోరు జరిగింది. వీరోచితంగా జతులు పోరినారు కాని, మహా రాష్ట్ర ధాకకు దీర్ఘకాలము నిలువలేక, వ్యూహాల విరుగగొట్టుకొని పలా యితులైనారు. అనేకవేలమంది మరణించినారు. వివిధ రణవస్తు చయంతో—గజాశ్వబలంతో వారి దండువీడ మహారాష్ట్రుల వశమైంది. వెంటనే జతునాయకుడు—నబాబుసింగు సంధికి ఒడబడి, మహారాష్ట్ర భూభాగాల మరల వారికి యిచ్చివేస్తూ, నిలువదేలి పెరిగిన కప్పము 65 లక్షలను రూకలతోగూడ చెల్లించినాడు.

ఆతర్వాత విజయమహారాష్ట్ర సేనలు ఢిల్లీ కోటగోడల దరిసినవి. అక్కడ, తమ ప్రబల దీక్షాబద్ధవిరోధితో ఢీకొన ఉవ్విళ్ళూరుచుండినారు. కాని, ఆ వృద్ధమాయావి గోమాయువు అయిన నజీబుఖాను తక్షణమే పశ్చాత్తాపంతో, వినయంతో, దీనుడై, మహారాష్ట్ర స్కంధావారముచేరి ప్రాణభిక్షను పెట్టమని ప్రార్థించినాడు. అతడు గంగాయమున మధ్య దేశంలో కొల్లగొట్టిన సంపత్తునంతా వారి పాదతలమున బెట్టినాడు. మహారాష్ట్రులకు ఢిల్లీ యానమును సుకరముజేసి, కోరినదెల్ల యిత్తునని వాగ్దానము చేసినాడు, దీనికి ప్రతిఫలం ప్రాణదానంచేయమని ప్రార్థించి నాడు. ప్రాణాల దక్కించుకొని, మరల అవకాశాల చూచుకొని ప్రాణదాత పట్ల కుత్సితపు కుట్రల సాగించదలచుకొన్నాడు గాబోలు ! కావి, యీమారు, ఆ పానిపట్ యుద్ధకారకుని రక్షించగలిగిన శక్తియే లేకపోయింది. మృత్యువే వచ్చి, మహారాష్ట్ర ప్రతీకార క్రోధాగ్నికి, పానిపట్ రణాంగణ విహతుల కోపాగ్నికి వానిని గురికాకుండా కాపాడింది.

మహారాష్ట్రులు ఢిల్లీలో జొరబడినారు. అక్బర్—ఔరంగజేబుల ఆ రాజధానికై పోరాడువారే లేకపోయినారు. కడపటి పర్యాయము ఢిల్లీ నగరానికై పోరిన అహమ్మద్‌షా అబ్దల్లి చివరకు రాజీకి ఒడబడి, పేష్వాలతో రాయబారాల నెరపను తన ప్రతినిధిని పునహాకు పంపినాడు. ఈ మంతనాల ఫలితంగా హిందూదేశ రాజకీయాలలో ఎన్నటికి జోక్యం కలిపించుకొనననని అబ్దల్లి మాటయిస్తూ, హిందూదేశ సామ్రాజ్యరక్షకులు మహారాష్ట్రులే అని అంగీకరించినాడు. ఈవిధంగా పానిపట్ విజయియే తన విజయము రాజకీయముగ విఫలమైనదనియు, యుద్ధానికి తన్నుదింపిన అడియాస వమ్ము అయినదనియు అంగీకరించినాడు; చివరకు హిందూస్థానానికి హిందువులే సర్వాధికారులని అంగీకరించినాడు. హిందూదేశ రాజకీయరంగంనుండి యీవిధంగా ఆఫ్ఘను ప్రాబల్యాన్ని తొలగించివేసి, ఢిల్లీని ఆక్రమించుకొని, ఇంకను హిందూదేశములో ఎన్నదగిన బలముగా నిలిచియుండి. సార్వభౌమ పదవికి హిందువుల నిరోధించగలిగిన రోహిల్లాలను, పఠానులను వేరుచేసినారు. కాని, వారికిగూడ అవసాన దినము ఆసన్నమైనది. పానిపట్ రణాంగణంలో యీ పఠానులు, రోహిల్లాలు మహారాష్ట్రులపట్ల నెరపిన అవచేష్టలు—అత్యాచారాలు—అవమానాలు మహారాష్ట్ర ప్రతీకార క్రోధాసిధారను సానలుబెట్టినవి. దీనితో యిచ్చకాలకు లొంగని ప్రతిక్రియ శక్తులు విజృంభించినవి. దీనిని పఠాణి—రోహిల్లాలు బాగా గుర్తెరిగినారు. ఇక, వారు పానిపట్‌లో పాల్గొన్న తమ నాయకులు హఫీజ్ రహిమత్, అహమ్మద్‌ఖానుబంగేషుల నాయకత్వంక్రింద ఒకటై—ముందుకు సాగివచ్చే మరాఠిదండును సుస్థిర నిశ్చయంతో మార్కొన దలచినారు.

మహారాష్ట్ర సైన్యం ఢిల్లీలో కొంతకాలం ఆగి, డోబ్ అను గంగాయమునలమధ్య సమప్రదేశాన్ని ప్రవేశించినది. అచట పాతవిరోధుల

సైనికబలం భయోత్పాదకంగా పెరుగుటను చూచినారు. 70,000 మహమ్మదీయులు సాయుధపాణులై కయ్యానికి కాలుద్రవ్వుచుండినారు. కాని వారిని లెక్కించుటలో మహారాష్ట్రులు కాలయాపనము జేయలేదు. అనేకయుద్ధాలు భీకరంగా సాగినవి; ప్రతియుద్ధంలో ముస్లింలు దయాశూన్యంగా నరికి వేయబడినారు. దుర్గం తర్వాత దుర్గాన్ని, పట్నం వెంబడి పట్నాన్ని శత్రువులనుండి ఒడిసి పెరుక్కొంటూ, డోబ్ భూభాగంలో సంపూర్ణంగా మ్లేచ్ఛ చిహ్నాల తుడిచివేస్తూ, పొంగి ప్రవహించే ప్రవాహం మాదిరి మహారాష్ట్ర జయసేనలు రోహిల్లా ఖండము పైబడినవి. అచట, కటికి గుండెతో, పఠానులను రూపుమాపినట్లే రోహిల్లాలనుగూడ నలిపివేసినారు. మరణము, నజీబును మరాఠి పగమంటలో నీరుగాకుండ కాచింది. కాని, అతని కొడుకు జబేదాఖానుడు—తన, తనతండ్రి అపరాధాలకు ప్రాయశ్చిత్తం అనుభవించను ఇంకను మనియుండినాడు. అతడు శుక్రతాల్ దుర్భేద్య దుర్గభిత్తికలలో తలదాచుకొన్నాడు. మహారాష్ట్రులు సూటిగా ఆ కోటపైకి నడచి, శతఘ్నులతో దారుణ అగ్నిగోళ ఆసారాన్ని క్రుమ్మరించి, ఉక్కడంచి, ఛిన్నాభిన్నము చేయగా జబేదాఖాను అందు నిలువలేక పోయినాడు. ఒకరాత్రి కటికి చీకట్లలో అతడు తప్పించుకొని, గంగదాటి పరుగెత్తి బీజనూరు ప్రవేశించినాడు. ప్రతీకార పరాయణమైన మహారాష్ట్ర వాహినిగూడ శీఘ్రంగా గంగానదిని లంఘించి, బీజనూరు దరిసినది. జబేదాఖాను నియమించిన యవన మారణయంత్ర చయము, భయంకర నరకజ్వాలల గ్రక్కినను, మహారాష్ట్రులు వెనుదీయలేదు. యవన రణయంత్రాలతో తమ మార్గాన్ని నిరోధించిన రెండు ముస్లిం సైన్యాల హతమార్చి, అసంఖ్యాక రోహిల్లాల కత్తులతో తరిగివేసి బీజనూరు ప్రవేశించినారు. ఆ మండలము సంపూర్ణముగ మహారాష్ట్ర విజయ సైంధవ ఖురాఘాతానికి నలిగిపడియుండినది. జబేదాఖాను నజీబుగడము

నకు పారిపోయినాడు. అచటికిగూడ మహారాష్ట్రులు వెంటబడి, పుత్తే ఖరును పట్టుకొన్నారు. ఇచట, పానిపట్ సమరభూమిలో నజీబుఖాను, రోహిల్లాలు దోచుకొనిపోయిన మహారాష్ట్ర ఐశ్వర్య సర్వస్వము మరల విజయులైన మహారాష్ట్రుల చేతులలోబడి, వారికి మేరలేని ఆనందాన్ని గూర్చింది. దానితో వారి విజయము పరిపూర్ణమైంది. జబేదాఖాను ఆలు బిడ్డలు బంధితులైనారు. పానిపట్‌లో దొరకినకొలది హిందూ స్త్రీలు, యువ కులు క్రూర రోహిల్లాల కరకుచేతులలో అనుభవించిన ఘోర పైశాచిక దురంతమువల్ల, అదే ఆరణ్యకమార్గాన, యిప్పుడు నజీబు కుటుంబానికి, జబేదాకు మరాఠులు దారుణ పరిహారమును ముట్టజెప్పియుండినను ఉచిత మనిపించుకొని యుండును; కాని, హిందూ విజయాల సంప్రదాయాను గుణ్యంగా మహారాష్ట్రుల ప్రతీకారదీక్ష, బలవంతంగా వారిని హిందూ మతములోకి కలుపుకొనలేదు; స్కంధావార విపణివీథులలో సైనికుల పశు తుల్య కామోద్రేకానికి వారి స్త్రీల ఆహుతిచేయలేదు. హిందూ విజయశస్త్ర సంపద యీ ఆరణ్యక అమానుష క్రియలకు తార్కొనకుండుటయే గాక, రోహిల్లాల—పఠానుల నరనరానికి పిరికిమందు ఎక్కించి, ఒక మరాఠి సిపాయి దర్శనమాత్రంచేతనే ఒకరోహిల్లా గ్రామమంతా హాందిశీకతతో పరుగెత్తునట్లు జేసినారు. మిగిలిన యవన నాయకులు పరిసరారణ్యాలలో దాగుకొన్నారు. అక్కడ ఆసన్న వర్షాలు వారిని మహారాష్ట్ర నిర్యాతనా గ్నికి యింధనము గాకుండ రక్షించినవి. పానిపట్ పరిహారం చివరకు వారు యింత దారుణంగా చెల్లించినారు.

ఇట్లు, తెరె అరణ్యపరిసరాలవరకు, దిగ్విజయ యానంతో విజయ కేతనాన్ని గొనిపోయి, సర్వవిరోధుల అణచివేసి, మహారాష్ట్ర జయసే నలు వెనుదిరిగి, 1771 లో మరల ఢిల్లీ చేరినవి. ఢిల్లీలో రాజతంత్రదూతలు తమ సేనాపతుల విజయాలకు మెరుగుపెట్టగలిగిన రాజతంత్ర వ్యూహాల

పన్ని కృతకృత్యులైనారు. ఇంగ్లీషువారు, సుజా, మొగలు సామ్రాజ్యానికి వారసు అయిన షా ఆలంను తమ కైవశముచేసుకొని, హిందూదేశ సర్వసార్వ భౌమికాధికారమునకు తాము అధిపతులు కాదలచుకొని తీవ్ర ప్రయత్నాల గావించుచుండినారు. కాని, మహారాష్ట్ర రాజనీతజ్ఞులు యుక్తులలో వారినిమించి, షా ఆలమును లోగట్టుకొన్నారు. అతడు భారతీయ సామ్రాజ్యాన్ని రక్షించు బాధ్యతలు—హక్కులన్నీ మహారాష్ట్రులకు ఒసంగి, దానికి బదులు నామమాత్రమైన భారత సార్వభౌమ బిరుద ప్రదానముచేతనే తృప్తిపడినాడు. ఈ అధికారశూన్య నామమాత్ర లాంఛనమునుగూడ, పానిపట్ మొదలు నిలిచియుండిన బాకీలు, చౌతును పూర్తిగా చెల్లించిననేగాని మహారాష్ట్రులు ఆలంకు ఒసంగరైరి. అదిమొదలు ఆక్రమించుకొనిన నూతన భూభాగాల్ని యిరుపక్షాలవారు సమంగా పంచుకొనునట్లుగూడ ఒడబరచుకొన్నారు. 1761 లో అరకొరలుగా చేసినపని యిప్పుడు 1771 లో పూర్తి అయినది. రోహిల్లా—పఠానుల తీవ్రపరాజయానంతరం, హిందూస్థానములో హిందూ సామ్రాజ్యాధికారమును ధిక్కరించగలిగిన ముస్లిం శక్తి భారతదేశంలోనే మిగులలేదు. ఈ సంవత్సరమునందే, ముస్లిం స్వాతంత్ర్యము—ముస్లిం ప్రాభవము—ముస్లిం తృష్ణలు పూర్ణంగా రూపుమాసిపోయినవి. మొగలులు, తురుష్కులు, ఆఫ్ఘనులు, పఠానులు, రోహిల్లాలు, పారసీకులు, దక్షిణ ఉత్తర భారతమందలి వివిధ ముస్లింశాఖలు, జాతులు, భారతదేశీయ సామ్రాజ్యాధికారమును, ప్రతీకార దీక్షబూనిన హిందూత్వసేనల హస్తగతము కాకుండ చేయుటకు శక్తికిమించిన యత్నాల గావించినారు. కాని, మహారాష్ట్రులు వారి ప్రయత్నాలనెల్ల భగ్నముచేసి భారతీయ సామ్రాజ్య సంరక్షకులుగా, ఏకఛత్రాధికారమును పాలించి, తదధికారమును ధిక్కరించిన సమస్త శక్తుల అణచివేస్తూ 50 ఏండ్లపాటు నిరంతరాయంగా ఆ అధికారమును

సాగించినారు. 1771 తర్వాత భారతరాజకీయ రంగంలో మహమ్మదీయులు ఎన్నదగిన శక్తిగా లేరు. హిందువులు పూర్తిగా మహమ్మదీయుల రూపుమాపి, ఆసేతు శీతనగ పర్యంత పుణ్య ఆర్యావర్తాన్ని, హిందూ స్వాతంత్ర్యాన్ని మరల స్వాధీనము చేసుకొని నిలుపుకొన్నారు. అది మొదలు మహారాష్ట్రులు ఎదిరించి పోరవలసి వచ్చినది—ముస్లింలకు కేవలము భిన్నమైన మరొకజాతిగాని, మహమ్మదీయులు గారు. గుణములో, వర్తనములో, శక్తిలో భిన్నులైన వీరే యింగ్లీషువారు.

ఇంతటి బలవత్తర సైన్యాలు రెండు మహారాష్ట్రదేశమును వదలి, ఉత్తర దేశానికి కదలిపోవడం, ప్రజ్ఞాశాలి హైదరుకు ఆశలుగొలుపక పోయినచో ఆశ్చర్యకరముగా వుండేది. మరల దక్షిణంలో మహారాష్ట్రాధికారమును చెనకి, తన అదృష్టాన్ని చూడదలచుకొన్నాడు. మాధవరావు వెంటనే తుంగభద్రనుదాటి, ఒక యుద్ధం తర్వాత మరియొక యుద్ధాన్ని జయిస్తూ, కోటలు—ఒకదాని తర్వాత మరియొకదానిని ఆక్రమించుకొంటూ దక్కనులోకి దిగివచ్చినాడు. అనవడి అరణ్యాలలో హైదరు ప్రవేశించగానే అతనిని చీకాకుపరచను మరియొకసైన్యం నియమింపబడింది. ఒకరాత్రి హైదరు 20 వేలమందితో, అడవినుండి బయటబడి మట్టూ దగ్గర విడిచి, ప్రమత్తతలో విశ్రాంతి దీసుకోనుండిన మరాఠి దండుపై హఠాత్తుగా పులివలె పడినాడు. కాని, హైదరు శతఘ్ని ప్రథమ గర్జనమే మహారాష్ట్ర చమూపతి-గోపాలరావును లేపినది. విద్యుద్వేగంతో ఆసన్న విపత్తును వూహించుకొని, కించిత్ప్రమాదముగాని దౌర్బల్యముగాని, మాంద్యముగాని చూపిన, నిద్రలేచులోపలనే దండంతా నరికివేయబడుతుందని తెలుసుకొన్నాడు. ఎగిరి గుర్రముపై వాలి, జాతీయపతాకాన్ని ఎగురగట్టి, దుందుభుల మ్రోగించి, అపాయాన్ని సూచింపమని ఆజ్ఞాపించినాడు. భయద సమరభేరి వినాదానికి సర్వసైనికులు ఉలికిపడి నిద్రాశయ్యల

పీడి యుద్ధరంగానికి దూకినారు. శత్రు మారణయంత్ర నిర్గత ఘోరాగ్ని సాంద్రమైపోయింది. మరాఠి సైనికులు ఒకరివెంబడి ఒకరు చీల్చివేయ బడినారు. కాని దండు భయపడి వెనుకదండి పెట్టలేదు. హైదరు రణ యంత్ర బీభత్స నిష్ఠురారావము, అగ్నిగోళ క్రోధోల్బణము మహారాష్ట్రిల దిగ్భ్రమింగ జూచుచుండినవి. కాని, గోపాలరావు అచంచలంగా ధైర్యంగా నిలుపబడియుండినాడు. ఆయనపైన హిందూకేతనము విజయదీధితులతో మెరస్తుండినది. మహారాష్ట్రి భేరు లింకను మ్రోగుచునే, నిద్రాసక్తుల మేల్కొలుపు చుండినవి. గోపాలరావు అంగరక్షకులు ఆయన ప్రక్కన మూగినారు. అంతలో ఒక ఫిరంగిగుండు ఆయనమ్రోలపడి, ప్రేలి ఆయన దేహాన్ని చిదురుజేసి వేసింది. నెత్తురు గొట్టముతో చిమ్మినట్లు పైకెగరి వర్షము కురిసినట్లు క్రిందకుదిగి ఆ మహారాష్ట్రివీరుని రుధిరస్నానమాడిం చినది. ఆ దారుణభూమిలో ఉపసేనాని పరశురామభావు అశ్వారూఢుడై యింకను అచటనే నిలిచియుండినాడు. ఒక గుండు గుఱ్ఱాన్ని చంపింది; ఆయన మరియొక సైంధవాన్ని ఎక్కినాడు. దానినిగూడ ఒక ప్రేలుడు గుండు తాకి కుందివేసింది; మరల సేనాని విగతవాహనుడై, వెనువెంటనే మూడవ యుద్ధాశ్వాన్ని ఆరోహించి, మృత్యుకరాళ దంష్ట్రిలమధ్య మేరు ధీరంగా నిలచియుండినాడు. ఆయన శూరరక్తనాళము స్వల్పతమముగ వికంపించియుండినను, ఆయన ఒక అడుగు భూమిని త్యజించియుండి నను, సైన్యం పిరికిబారి, సంతోన్మత్తులైన ఆ శత్రుసేన హస్తగతమై యుండెడిది. కాని, శూరధనుడు ఆ సేనాని ధైర్యసాహసములు అంటు వ్యాధియై మహారాష్ట్రిసేనకంత సోకింది. వెంటనే సర్వమహారాష్ట్రిసేన యినుపగోడవలె నిలిచి యవన శతఘ్నినిర్గతానల కుంభవృష్టిని భరించి, శత్రు పురోగమనాన్ని అడ్డివేసింది. హైదరు యీ శ్రేణిని సమీపించి, ఆ అమానుష స్థైర్యానికి నివ్వెరపడి నిలిచి, భయవిహ్వలుడై నిలువలేక

వెనుదిరిగి రివ్వున స్వస్థానంచేరి, సైన్యాల మరలించుకొని పారిపోయి నాడు. యుద్ధం యింకను సాగింది. పెథె, పట్వర్ధన్, పాన్సె ఆదిగాగల మహారాష్ట్ర చమూపతులు హైదరు దళాల వెన్నంటి నిరంతరాయముగ వేటాడసాగినారు. చివరకు మోతీతలావు దగ్గర యవనసైన్యాల నిలిపి తమ పిడికిట ఒడిసి పట్టుకొన్నారు. దానితో హైదరుసైన్యం సంపూర్తిగా తురిమివేయబడింది. శత్రు స్కంధావారము అమూల్య అసంఖ్యాక సామ గ్రితో మరాఠుల వశమైంది. ఇక రాజకీయరంగంలో హైదరును నామరూ పాలు లేకుండా చేయదలచుకొన్నారు. కాని, ఇంతలో పూనానగరంనుండి ఒక సందేశము వచ్చింది. అందు, పేష్వా ప్రాణాపాయస్థితిలో మరణ శయ్యాగతుడై యున్నాడనియు, యుద్ధాలు మాని వెంటనే రాజధానీ నగ రము చేరమనియు ఆజ్ఞాపింపబడింది. తిన్నగా మహారాష్ట్రసేనాపతులు హైదరును ఒక సంధికి ఒడబరచినారు. దానిప్రకారము మహారాష్ట్ర "స్వరాజ్య" భాగాలైన దేశాలన్నిటిని హైదరు వారికి యిచ్చివేసి, యుద్ధ వ్యయాన్ని పూర్తిగా భరించుటేగాక, పేష్వాకు కానుకగా 50 లక్షలు అర్పించినాడు.

ఇట్టి దిగ్విజయ కోలాహలముమధ్య, పానిపట్‌లో తమకు జరిగిన అత్యాచారములకు ప్రతీకారము గావించి, మహారాష్ట్రజాతిని యథాపూర్వ కంగా కీర్తి శిఖరానికి గొనిపోయిన తమ నాయకుని అనారోగ్యవార్త, ఢిల్లీ మొదలు మైసూరువరకు గల వివిధ మహారాష్ట్ర విడుదులలో, రాజ ధానులలో తెలియవచ్చి, అశేషమహారాష్ట్ర ప్రజ దానిని తీరని జాతీయా రిష్టముగ భావించి వేదనపడింది. అంతటి ప్రజానురక్తికి, అనురాగము నకు మాధవరావును పాత్రుజేసినది ఆయన శూరగుణము, దిగ్విజయాలే కాదు; ఆయన పౌరపాలనముగూడ సమదర్శినియై ధర్మానువర్తి అయి నది. రాజుమొదలు భిక్షుకునివరకు గల తన ప్రజాక్షేమానికి అత్యంత

ఆసక్తితో స్వచ్ఛ ప్రేమతో ఉద్యమించినాడు. ఆబాలగోపాలమునకు న్యాయ్యము సమముగా పాలింపబడుటకు అత్యంతము కృషిజేసి జాగరూకతతో మెలగినాడు. అందువలననే క్షుద్రాతిక్షుద్ర పౌరుడు—జానపదుడు గూడ మాధవుపట్ల భక్తిప్రేమల ప్రదర్శించినారు. ఆయన నిర్దాక్షిణ్య సమదృష్టికి—ధర్మపరాయణ శీలానికి శక్తివంతులు భయపడిపోయినారు; ఇక, కటికి దరిద్రుడు, కష్టజీవి కర్షకుడు, ఆయనయందు భక్తివిశ్వాసముల లగ్నముచేసి, తమ దయాపూర్ణ పరిరక్షకుడుగా భావించినారు. ఆయన పినతండ్రి నైచ్యస్వార్థ చింతలవల్ల దేశంలో రేగిన నాశనకారులైన అల్లకల్లోలాలు—అంతఃకలహాలు దేశాన్ని జర్జరితము చేయుచుండినను, పానిపట్ దారుణ దుష్ఫలితం తర్వాత పదేండ్లలోగానే దేశం దాన్ని మరచిపొయ్యేటట్లు చేసినాడు. మరచునట్లుకాదు—వీరోచితంగా పోగొట్టుకొన్న ఆ ఫలితం మరియొకవిధంగా లభింపజేసి, హిందూసామ్రాజ్యాశయాన్ని చెనకను యత్నించిన ప్రతివారిని తన భూరిహస్తావలేపాలతో అణచివేసిన సమరముగా పానిపట్టును దేశమానసిక ఫలకంలో చెక్కివేసినాడు. తానింకను లేబ్రాయంలో వున్నను తనకీర్తి భాగ్యలక్ష్మలు మాత్రం ఉన్నత కీర్తి శిఖరాలకు ఎగబ్రాకినవి; తన తండ్రిసాధించిన మహత్కార్యాలకంటె ఘనతరకార్యాలను ఆయన చేయగలడని దేశము విశ్వసించి, కార్యసిద్ధికై నిరీక్షించుచుండినది. 27 వ ఏట, క్షయవ్యాధి మాధవరావును ఆహుతిగొన్నది. మాధవరావు తన అంతఃపురములో మరణశయ్యలో పరుండి యుండి గూడ, అప్పటికిగూడ నైజాంతో కుట్రలు పన్నుచుండిన తన పినతండ్రిని—అవచేష్టలలో ముదిరిపోయినప్పటికిని సర్ది, సంతోష పెట్టదలచుకొని, ఆయన చేసిన ఋణాల చెల్లించివేసినాడు. ప్రాణాలవీడునప్పుడు పరమేశ్వరస్తోత్రము చేయగలిగియుండుటకు—నోరుపడిపోకుండా చేయను ఏ ప్రయోగమునైన చేయమని ఆస్థాన భిషగ్వరుడు ఆదేశింపబడినారు. పేష్వా

వ్యాధి దారుణవార్త దేశమంతా అలముకొనగానే అన్ని పొలిమేరలనుండి విశ్వాశపాత్రులైన ప్రజలు పునహాచేరి, తమ జాతీయగాయకుని, జాతీయ ప్రియతమ జనకుని చరమదర్శనానికి ఔత్సుక్యపడినారు. వెంటనే పేష్వా రాజద్వారాల తెరిపించి, సర్వజనులకు—నీచజన్మునికిగూడ తనదర్శనావ కాశాన్ని కల్పించినాడు. 1772 లో కార్తీక అష్టమినాడు మాధవరావు పండితుల పురోహితుల తన పడకదగ్గరకు రప్పించినాడు. ప్రజలు దేవాలయంచుట్టు మూగినట్లు రాజనగరుచుట్టు మూగినారు. మాధవరావు వారందరికి వినమితగాత్రుడై మొక్కి: "చరమ మహత్తర పుణ్యతీర్థయాత్రకు మేము బయలుదేరినాము—ఇదిగో పోవుచున్నాము. మిరందరు నాకు హృదయపూర్వక ఆమంత్రణము నొసంగుడు" అని పలికి, భగవన్నామ స్మరణంతో "గజానన—గజానన" అనుమాట పెదవులపై చిందులాడు చుండ మూగిన ప్రజల దీర్ఘనిశ్వాస ఆక్రందనాల మధ్య, ఆ పుణ్యమూర్తి, నిష్ఖేదమూర్తి, ఒక పెద్ద యోగీశ్వరునివలె అసువుల బాసినాడు. ఆయన అర్ధాంగి - సతి - నిస్సంతాన - రమాబాయి, తన అమూల్యాభరణాల, తన సర్వ సంపదను బీదసాదలకు పంచిపెట్టి, బంధువులు ఎంత బ్రతిమాలినను వినక, భర్త కాష్ఠముపై ఎక్కి వల్లభ సహగమనముచేసి పుణ్యలోకం చేరింది. ఎగబ్రాకే ఆ జ్వాలారసనలకు ఆమె ఆత్మార్పణము గావించుకొని, మర్త్యులు పొందగలిగిన అమరప్రేమ దివ్యసౌందర్యాల నిగూఢ రహస్యముల వెలిగించి బహిర్గత పరచుటకు నిజహృదయ కరదీపికను ఆ మంటతో వెలిగించుకొన్నది. నేటికిగూడ మహారాష్ట్రము ఆ దివ్య దంపతుల నామోచ్చారణకే విశ్వాసపూర్వ ప్రేమాశ్రువుల కానుక లొసంగుచున్నది. నేటికిగూడ జాతీయ గాయక కవులు "మన జీవనజ్యోతి ఆరిపోయింది. మన హృదయభూషణము గళితమై పోయిందని" అనుకంపాపూర్ణ ఆర్తిగానాన్ని ఆలపిస్తున్నారు.

# 18. అంతః కలహము—ప్రజావిప్లవము

ఒక జాతికంతటికిని మధురతర వాంఛగా వుండిన మాధవరావు చిన్నతనమందే చనిపోయి, ఒకజాతికంతటికిని పీడగా పరిణమించిన రఘోబా, తన తరువాతి పురుషాంతరమువరకు జీవించియుండుట, ఆస్తికులనుగూడ దేవుని సర్వశక్తిత్వాన్ని సంశయింపజేసే సంఘటనలలో ఒకటి.

మాధవరావు మరణము దేశానికి తీరని నష్టము, రఘోబా జీవించి యుండుట యింతకంటె ఘనతర అరిష్టమైంది. నిస్సంతానుడుగా మాధవ రావు చనిపోయినందున, ఆయన కనిష్ఠసోదరుడు—నారాయణరావు, ఆయన—ఆయన జాతి అభిమతంతో పేష్వా అయినాడు. దీనితోగూడ రఘోబా అసూయానలము గుప్పున మండినది. వెంటనే నారాయణరావు, ఆయన సహాయకులమీద దారుణకుతంత్రముల పన్నసాగినాడు. రఘోబా పేష్వాసౌధ రక్షకులను లోగట్టుకొని, చిరుత పేష్వాను పట్టి బంధించ మన్నాడు. కాని, నారీ పిశాచము—రఘోబా భార్య—ఆనందిబాయి, కుట్ర దారులను ప్రేరేపించి నారాయణరావును అసలే చంపివేయమని ఆజ్ఞాపించింది. 1773 ఆగస్టు 30-వ తేది ఉన్నట్లుండి, నిష్కారణంగా నగరు సేవకులు తిరుగబడి, నారాయణరావుకు ఎదురుపడి, మహా పొగరుబోతు తనంగా జీతాలు యిమ్మని గద్దించినారు. విశ్వాసపాత్రుడైన ఒక సేవకుడు నివారించగా, ఆ దుర్మార్గులు కత్తిదూసి ఆచోటనే, ఆ క్షణంలోనే వానిని ఖండించి వేసినారు. భయవిహ్వలుడై ఆ యువకుడు గది గదికి పరుగెత్తి నాడు. హంతకులు కిలారిస్తూ ఆయనను వేటాడినారు. అలసి సొలసి, చివరకు రఘోబా మందిరముచేరి, నారాయణరావు ఆయన నడుమును

కౌగలించుకొని వాలుకరగేవిధంగా ప్రాణదానము చేయమని బ్రతిమాలు కొన్నాడు. "నాయనా, నీ బిడ్డను నన్ను రక్షించు—నీవే పేష్వావు—నా అధికారమును వదలుకొని నీకు దత్తం చేస్తున్నా—ఇక ప్రాణాలు నిలుపుకోని దోసెడు గంజి దప్ప మరి యితరము నిన్ను కోరను" అని ఆక్రందించినాడు. కాని, అప్పటికే హంతకులు ఆయనపై బడినారు. రఘోబా బాలునిపట్టు విడిపించుకొని దూరంగా పోయినాడు. ఆ రాక్షసులు నారాయణరావుపై బడినారు. ఛపాజి తిలేకర్, హంతక నిశిత అసిధార మధ్య—తన యజమానిమధ్య వచ్చి నిలిచి, పేష్వాను తనసందిట జొనుపుకొని దెబ్బకాస్తూ ప్రాణభిక్షపెట్టమని ఆ నిశాటుల ప్రార్థించినాడు. కాని, రక్తదాహకుల యిది మెత్తబరచలేదు. కత్తిపోట్లు గబగబ పడిపోయినవి. విశ్వాసపాత్రుడైన తిలేకర్—అనపరాధి అసహాయి నారాయణరావు తునియలై పోయినారు. తిలేకర్ కళేబరము యజమాని శవాన్ని కప్పియుండినది. వెంటనే ఆ తిరుగుబాటుదార్లు రఘోబాను పేష్వాగా ప్రకటించి, రాజసౌధాన్ని ఆక్రమించు కొన్నారు.

ఈ దారుణ ఉదంతము పట్టణమంతా ప్రాకగానే, ప్రజలు మండిపడి, గుంపులు గుంపులుగా కూడి ప్రియ పేష్వా రక్తమలినహస్తుడైన రఘోబా రాక్షసుని పేష్వాగా అంగీకరించరాదని ప్రమాణాల గైకొన్నారు. ఇంకను మరారి బొందెలలో చాలినంత జాతీయభావము మిగిలియుండుటచే, ఒక క్షుద్ర రాజహర్మ్యకుతంత్రము, హత్య వారిని భయపెట్టి, తాము కోరని యజమానికి లొంగజేయలేక పోయింది. జాతీయనాయకులు, ప్రధాన రాజోద్యోగులు అందరు కలసి ఒక రహస్య సంఘమును ఏర్పాటు చేసినారు. ప్రధానన్యాయమూర్తి—రామశాస్త్రి యీ రాజహత్యను పరిశోధించి, విచారించి, రఘోబాకు దుస్తంత్రనిధి—అతని భార్య ఆనందిబాయికి యీ దారుణంలో పాలున్నదని నిర్ణయించినాడు. వెంటనే భయ

మెరుగని ఆ బ్రాహ్మణ పుంగవుడు పేష్వా నగరుజొచ్చి, రఘోబా యిష్ట జనపరివేష్టితుడై పేష్వాగా కొలువుదీరియుండిన విశాల సభలో ప్రవేశించి, నిర్భీతిగా మేఘసన్నిభ గర్జనంతో, తన అన్నబిడ్డ—ప్రజానురాగము చూరకొన్న అనుగు పేష్వా హంతకుడని రఘోబా ముఖాన అడిగివేసి నాడు. ప్రాయశ్చిత్త ప్రశ్న వచ్చినప్పుడు "యింతటి అమానుష క్రూర చర్యకు ఏమి ప్రాయశ్చిత్త మున్నది ? ఇక దీనికి మిగిలివున్న పరిహారము ఒక్క శిరచ్ఛేదము మాత్రమే" అని ప్రత్యుత్తర మిచ్చినాడు. సభికులలో ఒకడు మందలించగా—"నాకేమి రఘోబా అంటే భయమా ? ప్రజల ప్రధాన న్యాయమూర్తిగా నా ధర్మమును నేను నెరవేర్చినాను. ఇష్టముంటే నన్నుగూడ చంపించి అతని పాపాన్ని పెంచుకోమను. ఇట్టి పైశాచిక ఆతతాయి యున్నచోట ఇక కాలూనను—పట్టెడన్నము పట్టను" అని ధిక్కార ప్రతిజ్ఞబూనినాడు. విస్మయభ్రాంతులైన రఘోబా అనుయాయులు తేరుకొనే లోపలనే ఆ ధీర బ్రాహ్మణోత్తముడు, విజృంభిత హుతాశుని వలె పవిత్రధర్మక్రోధంతో కషాయకాంతుల గ్రక్కుచు ప్రజ్వలించి, సౌధమును—నగరమును వీడినాడు. పుణ్య కృష్ణాస్రోతస్వినీ తటము చేరువరకు ఆ ధర్మపాలకుడు—రామయ్య గంగను ముట్టలేదు, అన్నము తాకలేదు.

ఆ సమయానికి—స్వర్గీయ పేష్వా నారాయణరావు ధర్మపత్ని గంగాబాయి గర్భిణి యనియు, సంతానవతి కానున్నదనియు తెలియ వచ్చింది. ఈవార్త విప్లవకారుల హస్తాలకు బలంకూర్చింది. మోరొబా దాదా - కృష్ణరావుకాళె - హరిపంత్ ఫడకె - త్రియంబకరావు మామ - యంత్ర అంగనాయకుడు రాస్తె - పట్వర్ధనులు - థాయ్‌గుడ్ - నరో అప్పాజి, ఇంకను అనేక సుప్రసిద్ధపౌరులు - ఉద్యోగులు, రాజనీతి విశా రదులు, నానాఫడనీసు - సఖారాం బాపులను నాయకులుగా వరించి కార్యో

మ్ముఖులైనారు. వీరు మొదట రఘోబాను యుద్ధప్రస్థానమిషతో బయటకు కదిలించి తిరుగబడ దలచుకొన్నారు. వెంటనే దక్షిణదేశ దండయాత్రకు రఘోబాను ఒడబరచినారు. రఘోబా మహారాష్ట్రమును వీడగానే, పూనాలో విప్లవ నిగూఢసంఘము తిరుగబడి రాజధానిని - రాజవాసాన్ని ఆక్రమించుకొని, భవిష్యత్పేష్వా జనని_గంగాబాయిని అఖిలదేశ రాజ్యాధికారిణిగా ప్రకటించినారు. ఈ ప్రజావిప్లవము అతి త్వరగా పునహానుండి దేశానికంతటికి ప్రాకిపోయింది. ఒక దుర్గముతర్వాత మరియొకదుర్గము నూతనాధికారమును అంగీకరించి విశ్వాస ప్రమాణమును గైకొన్నది. నూతనాధికారము కార్యరూపేణ 'భార్ భాయి' అనగా—ప్రజాస్వామ్య పాలనమై పోయింది. పిడుగువంటి యీ జాతీయవిప్లవవార్త చేరగానే రఘోబా స్వయముగా తానే సైన్యాలతో పూనాపైకి నడచిపోవాలని మొదట తట్టింది. కాని, విప్లవ సైన్యము అప్పటికే తనమీదికి నడచివచ్చుటను తెలిసికొని, ఇంకను తన్ను అంటిపట్టుకొనియుండిన ఏ కొద్దిమంది సహాయంతోనో తన కూలిసేనల మరలించుకొని ఉత్తరం తిరిగినాడు. ఆ సైన్యం అన్యశత్రుదేశంలో పోవుచుండినట్లు, మార్గాన దేశాన్ని కొల్లగొట్టి, కాల్చివేసి, ప్రజల హింసిస్తూ నడచిపోయింది. గంగాబాయికి మగబిడ్డ జనింపనిచో, ప్రజలు మరల తనవైపు తిరుగుదురని ఆయన యింకను గొంతెమ్మకోరికలలో వుండినాడు. కోరెగావ్ పట్టణం దగ్గర విప్లవ సైన్యాలతో తలపడి ఓడించి, నాయకుడు త్రియంబకరావు మామ ఫెథెను వధించినాడు. ఇది విప్లవోద్యమానికి మంచిపెట్టు. అయినప్పటికిని, నానా ఫడ్నీస్ బాపూలు మహారాష్ట్రుల అమూల్య సహాయంతో నిరంతరాయంగా పోరు సలుపుచునే యుండినారు.

ఇప్పుడు, సర్వమహారాష్ట్రదృష్టులు — కాదు — అఖిలభారతావని దృష్టులు పురందర పట్టణముపై లగ్నమైనవి. అచటనే నిండుచూలాలు

గంగాబాయి భద్రరక్షణలతో కాపాడబడుచుండినది. దినానికి దినానికి ప్రజా ఔత్సుక్యం ఎదిగిపోతుండినది. గర్హిత రఘోబా నీచవాంఛలు భగ్నమయ్యే టట్లు రాజమాతకు పురుష శిశువును ప్రసాదించమని దేశమందంతటను ప్రార్థనలు సలుపబడి, పురందరకు తీర్థాలు పంపబడినవి. గ్రామ రచ్చలు మొదలు రాజహర్మ్యలువరకు వ్యగ్రౌత్సుక్యపుమొనపై నిలుపబడియుండి నవి. ఢిల్లి - ఇందోరు - గ్వాలియర్ - బరోడ - హైదరాబాదు - మైసూరు - కలకత్తాయందలి రాచదేవిడీలు, యితర రాజకీయ కేంద్రాలు పురందరు నుండి వెలువడు వార్తలకై శ్వాసల బిగించి ప్రతీక్షించి యుండినవి. చివరకు 1774 ఏప్రిల్ 18 తేది చిరంతన నిరీక్షిత వార్త వచ్చింది. గంగా బాయి మగశిశువును ప్రసవించినది ! సకల మహారాష్ట్రము యీ జననానికి మోదితయై స్వాగతమిచ్చి, తమ జాతీయనాయకుడుగా, నిర్దిష్టరాష్ట్ర ప్రధానామాత్యుడుగా ఆ నవోదిత శిశువును అంగీకరించింది. అతివ్యాప్త జనసామాన్య ఉత్సాహంఎల్ల చలితులై విదేశ ప్రభుత్వ అస్థానాలుగూడ రాజశిశువుపై అభివాదనాలు గురిపించినవి. విప్లవకారు లనుభవించిన తృప్తి, మానసిక విశ్రాంతులు, దేశారాధక వాంఛలు, అభిమతాలు నాటి వ్రాతల పరికించిన తెలియగలవు. సాబాజి భోంస్లే యిట్లా వ్రాస్తున్నాడు : "జననవార్త మాకు చేరగానే యిక్కడ విడిదిలో ఒక సంతోషసాగరం సృష్టింపబడింది. మన ప్రార్థనలు సర్వేశ్వరుడు ఆలకించినాడు. సైన్యాల సంతోషానికి మేరలేకున్నది. సమర సంగీతం గానంచేయబడుచున్నది. శతఘ్నులు గర్జిస్తూ సార్వభౌమునికి యీ యుద్ధభూమినుండే జోహారు లిస్తున్నవి. భగవానుడు మన ప్రియతమ పేష్వాకు దీర్ఘాయువునిచ్చి బ్రోచు గాత !" ఈ వార్త విప్లవ సంఘాలలోగూడ చెప్పలేనంత సంతోషాన్ని కలిగించినది : "మన సేనాని, హరిపంత్ తాత్య ప్రతిసందు విడిదిలో ఉత్స వాలు చేయమని ఆజ్ఞాపించినాడు. కదనవాయిద్యముల సమరసంగీతము,

ఫిరంగుల కేకలు ప్రజాహ్లాదాన్ని ప్రకటించినవి. ఆ శుభసమయంలో ఏను గులపై. గొనిపోయి చక్కెర పంచిపెట్టినారు. దేవుడు మన పక్షమం దున్నాడనుట నిస్సందేహము. మన ప్రజాయోగక్షేమాలకు, రక్షణకు, మన ఉద్యమ వ్యాప్తికి దేవుడు వరప్రసాదము అనుగ్రహించి యున్నాడు. చిన్నపేష్వా దీర్ఘాయువై మనుగాత! మనప్రజా ప్రేమరూపం చిరాయ వగుగాక."

ఆ బిడ్డకు మాధవరావు అని నామకరణము చేసినారు. ఆ రాజ కిశోరాన్ని ప్రేమించి ఆరాధించిన ప్రజలు, మహాత్ముడు అను అర్థమిచ్చు - పవాయి మాధవరావు అని పిలువసాగినారు. ఈ జననము పూనా విప్లవ సంఘ శక్తిని పోషించి, పెంచి అఖిలభారతీయ రాజకీయాల భవిష్యత్తునే మార్చివేసింది. అప్పుడే యీ విప్లవ నాయకులు రఘోబా బందిపోటు దొంగ అని నిర్భీతిగా, బాహాటముగా ప్రకటించి, కనబడినచోట అతనిని బంధించమని సమస్త మరాఠి సరదారులకు ఉత్తర్వుల పంపినారు. నానా సాహెబు భావుసాహెబులు ప్రతిష్టించిన హిందూ పద్ పాదషాహి సంప్ర దాయములందు పుట్టి పెరిగిన ఆ విప్లవనిర్మాతలు - నీతి విశారదులు - దేశ భక్తులు అఖండ హిందూస్థానంలో ఏకఛత్రాధికారమును బొందిన మహా రాష్ట్రదేశ అత్యున్నతస్థితిని రక్షించి సాగించగలిగిన శక్తి సామర్థ్యములు కలిగియుండినారు. భార్యనే పాలించుకోలేని రఘోబా రాష్ట్రపాలకుడై యుం డినఎట్లుండును ? కాని, యీ శిశుజననము - రాజ్యపాలనాన్ని విప్లవకారుల హస్తగతంచేసి, చాలకాలమువరకు తమదేశ ఉదాత్త ఆదర్శాన్ని పాలింప గలిగిన అవకాశాన్ని కలిగించింది. నారాయణరావు పుత్రజననవార్తగాని— సర్వమహారాష్ట్రము యీ జననముపట్ల చూపిన వెర్రిసంతోషముగాని— ప్రజలు ఆ శిశువునే తమ ప్రధానిగా ఎన్నుకొన్నవార్తగాని—అధికార వ్యామోహ పిశాచము సోకిన ఆ రఘోబాను అణుమాత్రం కదిలించలేదు;

పైపెచ్చు, దురదృష్టచోదితుడై, విప్లవ విజయవాహినులచే వెన్నాడబడిన అతడు, బెదరిన అబోతువలె శివమెక్కి, తన ఆరణ్యక జీవితాన్ని మరీ ఘోరతరముగానడిపినాడు. తుదకు అతడు తన ప్రజలచే ఓడింపబడి, స్వజనులచే పరిత్యజింపబడి, తనజాతి బద్ధవైరుల అండజేరను వెను దీయలేదు.

ఈకాలంలో, ఇంకను హిందూదేశ సార్వభౌమికాధి కారముపట్ల వ్యామోహితములైన ఏ జాతిగాని, ఏ రాజ్యముగాని, మహారాష్ట్ర హిందూ సామ్రాజ్యము ఐకమత్యంతో ఒకటిగా వున్నంతవరకు దాని ఏకచ్ఛత్రాధి కారమును చెనకలేక పోయింది. అట్లు నిరోధించ ప్రయత్నించిన వారిలో కొందరు తల ఎత్తకుండా అణచివేయబడినారు, మరికొందరు మూలకు నొక్కివేయబడి, అదిమిపెట్టబడి, షండక్రోధంతో నురుగులుగ్రక్కు చుండినారు. మహమ్మదీయులు—పరాసులు, పారసీకులు, మొగలులు, తురుష్కులు—స్వదేశస్థులుగాని, విదేశస్థులుగాని, పూర్తిగా రూపుమాపి వేయబడి, ఇక ఎన్నటికిని హిందూ సామ్రాజ్యమును తేరిపార జూడలే కుండా చేయబడినారు. ముస్లింలు, భారతదేశ రాజకీయరంగంలో ఎన్న దగినవ్యక్తులు కాకుండాపోయినారు. ఇక మిగిలినవారిలో, పూర్వం ఒక ప్పుడు సగం ఆసియాను పాలించిన పోర్చుగీసువారు, కొంకణ భూసముద్ర యుద్ధాలలో మహారాష్ట్రులు ప్రయోగించిన బలపత్తరమైన మోదులకు తల దిరిగి, ఇక ఎన్నటికిని తల ఎత్తకుండా అణిగిపోయినారు. ఫ్రెంచి వారుగూడ ముఖాముఖి మహారాష్ట్రులతో ఎదుర్కొన సాహసింపక పోయినను, హైదరాబాదు—ఆర్కాటు నవాబులసహాయంతో పునహాపై అధికారము సాగించ యత్నించినారు. కాని అన్ని యత్నాలలో వీరు విఫలులైనారు. పరాసుల శక్తిని పీల్చివేసిన ఐరోపీయ సంఘర్షణలుగూడ దీనికి కొంతవరకు కారణమైనవి. అందువల్ల వారు హిందూ సామ్రాజ్యా

నికి ఉపద్రవము కాకుండుటేగాక, ఒకవిధముగా వారి ఉనికి యిచట వాంఛితమై సహాయకారిగూడ అయినది. పరాసుప్రత్యర్థులు-ఆంగ్లేయుల తృష్ణాదౌష్ట్యానికి ఎదురొడ్డ అనువైన బలంగా వారు చాలకాలము మహారాష్ట్రులకు ఉపకరించినారు. శివాజీదినాలు మొదలు, యింగ్లీషువారు పరమటితీరంలో మనగలిగియుండినది, మహారాష్ట్రులువారినిసహించి కోరినందువలన కాదనియు, వారి రాజకీయ ఆశయాలు ఆశలు మహారాష్ట్ర రాజనీతజ్ఞుల విచారణకు అందకపోయినందువలననుగూడ కాదనియు వారికి బాగుగ తెలియును. ఇక, యితరత్ర పైకొన్న బలవత్తర శత్రుకోటితో వారు తీవ్రయుద్ధాలలో నిమగ్నులై యుండుటవలనను, అప్పటికి శత్రువులలోకెల్ల తక్కువ అపాయకారులై, అవసరమైనప్పుడు అనాయాసంగా క్షణంలో అణచివేయ గలిగిన విరోధులగుటచే ఆ సమయంలో మహారాష్ట్రులు తమజోలికి రాలేదనిగూడ వారికి తెలుసును. నిశిత రాచకీయ వివేచనా జ్ఞానముగల ఆంగ్లేయులు, బొంబాయిని తాము మహారాష్ట్రులను ఎదిరించి స్వాధీనమందుంచుకొనలేదనియు, యితఃత్రా అన్యకార్యాధీనులై యుండినందును, వారి మన్నెప్పని యియ్యకోలుతో అచట తాము పాలించుచుండుటనుగూడ గుర్తెరింగినారు. కాబట్టి వారుగూడ—దెబ్బగొట్టను ఉవ్విళ్ళూరుచుండినను, చేతిని ఎత్తనుమాత్రం భయపడుచుండినారు. నానాసాహెబు, ఇంగ్లీషువారిచేత అగ్రే బల ముడిగింపజేసినాడు. నానాసాహెబు వూహించుకొనిన విధానమే ఫలప్రదమై యుండిన, యింగ్లీషులను హిందువులపైకి రేగగొట్టడం, మహారాష్ట్రాధికారానికి అపకారియై యుండదు. కాని, వారి ఆనాటి ఆశల నిరాశలజేస్తూ పరిస్థితులు భిన్నమార్గానువర్తులై విషమ ఫలితాన్ని యిచ్చినవి. లేకుండినచో అగ్రేపతనము మహారాష్ట్ర నావికా బలానికి బలాన్ని చేకూర్చి యుండేది. అయినప్పటికిని, పశ్చిమతీరానికి సంబంధించినంత వరకు—యీ కార్యంవల్ల ఇంగ్లీషువారికి విశేషలాభముగాని, కొత్తదేశ

ఆక్రమణగాని జరుగలేదు. శివాజీ దినాలనాటి అసలు పరిమాణంలోనే నిలిచివుండినది ఆంగ్లేయాధీన భూభాగము. కాని, వంగదేశంలోమాత్రం విజయాలు వారి కనుసన్నలలో మెలగినవి. క్లైవు నిదురనుండి మేల్కొనే వరకు విజయలక్ష్మి ద్వారబంధంలో నిలిచి నిరీక్షించుచుండినది. సర్వము ఇంగ్లీషులకు అనాయాసంగా లబ్ధమై పోయింది. ఆసన్న అవకాశాల గ్రహించుటలో నిపుణుడైన క్లయివు—మహారాష్ట్రులే లేకుండిన, అప్పుడే ఢిల్లీపై నడచి ఆ చిరంతన రాజధానీ నగరాన్ని అవలీలగా తన ఏలుబడి లోనికి గొనిపోయియుండును. దీనివల్ల, బెంగాలులో ఆంగ్లేయులు సాధించిన విజయాలు అనుచితాలని మే మనము. తనశక్తి కాంక్షానికంటె ఎక్కువగా, తన విరోధి చేతగానితనము—పిరికితనంవల్ల హఠాత్తుగా విజయం తనపై విసరివేయబడినప్పుడు, దానిని సద్వినియోగ పరచుకో గలిగిన జాతి, నిజంగా, అట్టి అయాచిత అదృష్టాన్ని అనుభవించ దగియున్నది.

ఇంగ్లీషువారు ఫ్రెంచివారిని ఓడించి, మదరాసులో పొందిన విజయం కేవలం వారి చాకశక్యంవలన లభ్యమైంది. ఇట్లా ఇంగ్లీషువారి అదృష్టము—చాకశక్యము బెంగాలు మదరాసు రాష్ట్రాలలో వారి అధికారాన్ని పెంచి పెద్దజేసినవి. కాని, యీ వర్ధమాన బ్రిటీషు అధికారము, మహారాష్ట్ర ఆధిక్యతను ధిక్కరించి, వారితో అప్పుడు కయ్యానికి కాలు దువ్వలేదు. అయినను, యిట్టి మూకీభావం మధ్యగూడ, బెంగాలు మదరాసు రాష్ట్రాలలో ఆంగ్లేయులు సాధించుచుండిన నిగూఢ వంచకలాభాలు మహారాష్ట్రనాయకుల సునిశిత దృష్టికి గోచరము కాకపోలేదు. నానాసాహెబు, బావుసాహెబులు సమయజ్ఞులు—జాగరణపూర్ణులు—దూరదృష్టిగల రాజతంత్ర పండితులు. అందువల్ల హిందూసామ్రాజ్య ప్రత్యర్థులు ఎంతటి హీన అనామకులైనను, వారు తమ కంటిముందు నిర్భీతిగా విహరించుటను

సహింపరు. ఉన్నట్లుండి బెంగాలులో యింగ్లీషు అధికారము విజృంభిం చుటచేతనే 1760-61 లో భావుసాహెబు సంకల్పించిన ప్రచండ దండయాత్రలలో బెంగాలును ప్రత్యేకించి-దాని పనిచూడ నిర్ణయించినాడు. కాబట్టే, బెంగాలు నేలిన మన హిందూ చరమ చక్రవర్తి లక్ష్మణసింగు కాలం మొదలు యింతవరకు మ్లేచ్ఛాధికారం క్రింద మూల్గే బాధిత వంగప్రజను రక్షించను, ఆ రాష్ట్రాన్ని సంపూర్ణముగ దాస్యమునుండి ఎడబాపను, భావు రెండు పెద్దసైన్యాల నిర్ణయించినాడు. 1760 లో ఉత్తరదేశంలో వుండిన మరారిదండు ఒకటి దత్తాజీ సింధె నాయకత్వాన యీ కార్యానికి బయలుదేరనుగూడ బయలుదేరింది. కాని, యింతకుముందే చెప్పినట్లు—అహమ్మద్ షా దండయాత్ర—బెంగాలు యాత్రను మాన్పించి, ఎత్తివచ్చిన ప్రచండ శత్రువుతో మార్కొనజేసింది. ఆతర్వాత నానాసాహెబు మరణ బాష్పాల తడి ఆరీ ఆరకముందే పానిపట్ పరాజయ మాసన్నమైంది. ఒక దాన్ని తరుముకోని మరియొకటి పైబడిన యీ అరిష్టాలు. యింగ్లీషు అధికార జీవితావధిని పొడిగించినవి. ఈ అవకాశాన్ని వారు అతి మెలుకువగా, అతిశ్రద్ధగా వినియోగపరచుకొని, మదరాసు వంగరాష్ట్రాలలో తమస్థితిని బలవత్తరముగ చేసుకొన్నారు. అదిమొదలు, ఢిల్లీ సామ్రాజ్య విషయాలలో ప్రధానపాత్ర వహించాలనే సుస్థిర లక్ష్యంతో, భారతీయ సామ్రాజ్యాధికార ప్రధాన సూత్రాల మహారాష్ట్రుల చేతినుండి ఒడసి లాగుగొనుటకు తగిన అదను—అవకాశాన్ని గవేషిస్తు నిరీక్షిస్తుండినారు. కాని, ఆ అవకాశం వారికి ఇంకను తటస్థపడలేదు. పానిపట్టో—గీనిపట్టో, ఏమైనా కాని, అఖిలహిందూస్థానంలో యింకను ఏకఛత్రాధిపత్యాధికారంగా నిర్నిరోధంగా సాగుచుండిన మహారాష్ట్ర ఐక్యశక్తిని బహిరంగముగా ఎదర్కొనుటకు యింగ్లీషువారు సాహసించలేదు. హిందూదేశపటంలో బ్రిటీషువారి ఏలుబడి సూచకమైన రక్తవర్ణం కలకత్తాలో అణుమాత్రంగా

వుండి, ఎదిగి ఎదిగి, వంగరాష్ట్రాన్ని సగం ఎరుపుజేసివేసింది. ఇట్లే మదరాసులో ఏర్పడ్డ ఎఱ్ఱచుక్క హఠాత్తుగా పొంగి ఒడ్డుతెంచుకొని పొర్లి పారి సగంరాష్ట్రాన్ని శోణిమంతో ముంచివేసింది. కాని శివాజీ దినాలలో బొంబాయిలో ఏర్పడ్డ బ్రిటీషు అధికార కెంపురేఖ, నానాపడనీసు దినాల వరకుగూడ అదే కృశితరేఖగానే నిలిచియుండినది. ఇతరరాష్ట్రాలను బ్రిటీషు అధికారాంకిత అరుణమ మ్రింగివేస్తుండినను, పరమటితీరంలో మాత్రం అంగుష్ఠమాత్ర భూమినైన తన అధికారంక్రిందకు కొత్తగా చేర్చుకోలేక పోయింది. దీనికి కారణము:—ఇచట, సహ్యాద్రి శిఖరాలమీద మరారిజోదు—నిశితభల్లపాణియై నిరంతర జాగరణముతో దుర్గపాలకుడై నిలిచియుండి, కంటికి కనబడిన ఏ విదేశీయునైన పొడిచి పారవేయను కనిపెట్టుకొని యుండినాడు. కాబట్టే, హింద్వితరులు—ఎవరుగాని ఐరోపీయులుగాని, ఆసియావాసులుగాని. మహారాష్ట్ర హిందూ సామ్రాజ్యాధికార ఆధిక్యతను చెనకనుగాని, సంశయించనుగాని ఓపియుండలేదు. మహారాష్ట్రులు ఐకమత్యంతో ఒకటిగా వున్నంతవరకు వారి భారతదేశీయ ఏకైక రాజ్యాధికారాన్నిగూడ తిరస్కరించను క్రైస్తవులకుగాని, మహమ్మదీయులకుగాని గుండెలేకపోయింది.

జాతికి జాతిగా చూచిన, నిస్సంశయంగా మహారాష్ట్రులకంటె ఇంగ్లీషువారే అధికులు. సమష్టి జాతీయశ్రేయానికి, నిజఆశయానికిగా స్వార్థతృష్ణల క్రిందుపరచి ఆత్మార్పణ బుద్ధితో మెలగుట, పట్టెడన్నానికిగా తన సంఘ—పౌర శ్రేయాన్ని విఘాతమొనర్చుట అన్నను – జాతీయ స్వాతంత్ర్యాన్ని అమ్మివేయుట అన్నను కలుగు నిసర్గ హేయభావము వారికి మతధర్మమైపోయింది. ఇట్టి జాతీయ గుణగణ సంపత్తిలోగూడ ఆంగ్లేయులు మరాఠులకు మిన్నలే; అయినప్పటికి—గతాన్ని చేబదులు తెచ్చుకొన్న వర్తమానదృష్టితో చూచు లోపభూయిష్ట విధానాన్ని ఇచట మనము

అవలంబించరాదు. విషయము జరిగిపోయిన తర్వాత వివేకవంతులగుట మానవ స్వభావము. ఇక, అప్పటికి బహిరంగముగ తెలిసిన, వూహించుకో దగిన అంశాల, పరిస్థితులను లెక్కలోకి తీసుకొని, ఆతర్వాత, ఉభయ పక్షాలవారి పౌర—రాజకీయ—యుద్ధ శక్తుల అన్యోన్య తారతమ్యాల పరిశీలించినచో—వారిద్దరిలో ఎవరు గెలుతురని ముందుగా చెప్పుట సామాన్యుల తరముగానిపని. ఇక అది దైవజ్ఞులకు సాధ్యమైనదేమో! ఉన్నదున్నట్లు దానిఫలితాన్ని ఏ రాజకీయవేత్తగాని ముందుగా ఊహించజాలడు. ఇంగ్లండు ఆనాటికి సముపార్జించిన ఆధునికి విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానముగాని, రాజకీయ వికాసముగాని, మహారాష్ట్రులను శాశ్వతంగా, భారత సామ్రాజ్య మకుట గ్రహణోద్యోగంలో అనర్హుల చేయజాలినంత ఘనతరముగలేదు. నాటి మహారాష్ట్రులుగూడ ఆంగ్లేయులకు కుడి ఎడమగ నుండినారు. ఇంతేగాకుండ, ఇంగ్లీషువారికి సహజమైన అవరోధాలు చాల ఎక్కువగ నుండినవి. వారు అపరచిత శత్రుభూమిలో, తమ జన్మభూమి తమ ముఖ్య కార్యస్థానానికి కొన్ని వేలమైళ్ళదూరంలో పోరాడవలసి వచ్చింది. ఆనాటికి ఒక నూరేండ్ల తర్వాత, నడుముబిగించి ప్రపంచరంగంలో ప్రవేశించిన జపానుదేశము, శాస్త్రీయ—రాజకీయ—నాగరక—విజ్ఞాన విషయములందు, ఐరోపీయ ప్రత్యర్థుల దీర్ఘకాల సముపార్జిత విజ్ఞానాన్ని యాభై ఏండ్ల స్వల్పకాలంలో పొందగలిగినది. ఇతర అవకాశాలన్ని సమానంగా ఉండి యుండిన మహారాష్ట్రులుగూడ, జపానువలె యీ కార్యమును నెరవేర్చి యుందురు. ముఖ్యంగా ఇప్పుడు మనము ప్రస్తావించుచున్న ఆ దినాలలో, యీ విషయాలలోగూడ మహారాష్ట్రులకంటె యింగ్లీషువారు ఏమంత అధికులుగాలేరు. అందువలన, కార్యరూపంలో హిందూదేశ ఏకైక సామ్రాజ్యాధికారులై, ఒక్కుమ్మడి విజృంభించిన మొగలు—ఆఫ్ఘను—పారసీక—పరాసు—పోర్చుగీసు—ఇంగ్లీషుల ఒత్తిడిని, బలాన్ని సహించి

విలువగలిగిన మహారాష్ట్రులను రాజ్యాధికారమునుండి భ్రష్టులజేయను ఇంగ్లీషువారే చాలినవారని నిర్ణయము చేయుట తగియుండలేదు.

ఇంగ్లీషువారు యీ విషయాన్ని బాగా గ్రహించినారు. కాబట్టే, మహారాష్ట్రాధికారము, ఐకమత్యంగా అంతఃకలహరహితంగా వున్నంత వరకు దానితో స్పర్ధకు దిగలేదు—దానిని అధఃకరించలేదు. ఇక మహారాష్ట్రము అంతఃకలహాలతో చిందరవందరై—ఒకరికుత్తుక నొకరు కోరికివేసుకొనుచుండిన ఆ వికీర్ణ పరిస్థితులలోగూడ వారితో కలహించుటకు యితరులకు ధైర్యము చాలనప్పుడు, దూరదృష్టి—శక్తిసామర్థ్యాలతో ఇంగ్లీషువారే, మహారాష్ట్ర స్పర్ధను రేగగొట్టను సాహసించి, ఒకపాటి సాఫల్యాన్ని పొందగలిగినారు. మదరాసు—బెంగాలు దేశాల కొల్లతో పోతరించి అరకువజేసిన ఇంగ్లీషులు, తీవ్ర గృహచ్ఛిద్రాల సందుజూచుకొని బొంబాయిరాష్ట్రంలో మహారాష్ట్రులపైకి కాలుదువ్వినారు. ఈ వెలితి రఘోబాగూడ తెలుసుకొన్నాడు. కాబట్టే స్వదేశస్థులచే పరాభూతుడై—పరిత్యక్తుడై—పలాయితుడై రఘోబా, మహారాష్ట్రపాలనా తృష్ణతో దిమ్మెక్కి, ప్రజాతిరస్కృతుడై యింగ్లీషువారి నాశ్రయించినాడు. అచట, నిజజాతి స్వాతంత్ర్యాన్ని నిజజాతి గర్భశత్రువులకు అమ్ముటకు ఒడబడి, పితృహత్యా మలినమైన స్వహస్తాలతో, మహారాష్ట్ర సామ్రాజ్యకుడ్యంలో కొట్టిన గండిగుండా ఆ శత్రువుల నడిపించి మాతృదేశ ద్రోహము గావించినాడు. 25 లక్షల వరుమానం యివ్వగల దేశాన్ని తమకిచ్చే మాటమీద యింగ్లీషువారు రఘోబా చాచిన పితృహంతక హస్తాన్ని ఆతురతతో గ్రహించినారు. ఇంగ్లీషుసేనలు, రఘోబా సహాయార్థమై మహారాష్ట్ర దేశంలో ప్రవేశించగానే, రఘోబాను పేష్వాగా అంగీకరించుటకు సాల్‌సెట్టె, బస్సీన్, భడాక్‌పట్టణాలు యియ్యకొన్నవి. ఇంగ్లీషు—మహారాష్ట్రులమధ్య యుద్ధం చెలరేగిన దన్నవార్త మహారాష్ట్ర విద్వేషులగు

వివిధ సంస్థానాలను రాజులను దేశమందంతట ప్రోద్బలపరచి, తిరుగు బడునట్లు చేసింది. కాని విప్లవప్రభుత్వ సర్వాధికారముల కేంద్రీకరించి, తన చేతబట్టుకొనియుండిన నానాఫడనీసు, చుట్టురేగిన ప్రభిన్న ప్రచండ ప్రభంజనాలతాకుడుకు అభ్రధీరంగా నిలిచినాడు. పునహాలో నూతన స్థాపిత విప్లవ ప్రభుత్వము యింకను కీలాభీలమై అస్థిరముగ నుండినను ఫడనీసు వీలైనంతవరకు సైన్యాల సమీకరించి, కీటింగు సేనానిక్రింద ఉప్పెనవలె ముందుకు సాగివచ్చుచుండిన ఇంగ్లీషు బలాల నిరోధించి చీకాకుపరచమని హరిపంత్ ఫడ్కేని నియమించినాడు. ఈ కార్యాన్ని హరిపంతు, ఆయన సేనలు బాగుగ నెరవేర్చినవి. నపారు మొదలగు స్థలాలలో ఇంగ్లీషులకు తీవ్రనష్టము కలిగించినను విరోధులు జంకలేదు. అదే సమయానికి, 1777 లో భారతదేశస్థ ఆంగ్లేయ ప్రభుత్వ విధానమునందు ఒక మార్పు జరిగి, యీ దేశమందుగల అన్ని భాగాలకు కలకత్తా గవర్నరు సర్వాధి కారిగా చేయబడినాడు. కలకత్తా గవర్నరు వెంటనే, బొంబాయిగవర్నరు సాగించే మహారాష్ట్రి యుద్ధాన్ని ఆపివేసి, మహారాష్ట్రులతో సంధిచేసు కొనను ఒక రాయబారిని పునహాకు పంపినాడు. దేశమందంతటను మహా రాష్ట్రులపై రెగసిన తిరుగుబాట్లను సంపూర్ణముగా అణచివేయుటకు అవ కాశము - బలము కావలసి, ఔత్సుక్యపడుచుండిన నానా వెంటనే సంధిచేసు కొన్నాడు. దీనిప్రకారం ఆంగ్లేయులు రఘోబాను మహారాష్ట్రులకు వశము చేయునట్లును, మహారాష్ట్రులు సాల్‌సెట్టె—బస్సీనులను ఇంగ్లీషువారికి యిచ్చివేయునట్లును ఒడంబరచుకొన్నారు.

ఇంగ్లీషువారితో విరోధం ఉపశమింపగానే, అంతఃకలహాల అణచి వేయుటకు నానా, మాధవజి సింధేని నియమించి, మహారాష్ట్రభూమిలో కాలుబెట్టినందుకు హైదరుకు బుద్ధిజెప్పను ఫడ్కే—పట్వర్ధనులను దక్షిణ దేశం పంపినాడు.

ఇట్లు మహారాష్ట్ర సేనలు నానాముఖాలుగా చెదరిపోయియుండిన ఆ సమయంలో సంధిసూత్రాలప్రకారం ఇంగ్లీషువారు రఘోబాను మహారాష్ట్రులకు అప్పగించను నిరాకరించి, సేనలు తిరిగివచ్చి నానాకు అండ చేరకముందే ఆయనను అణచివేయాలని, ఇంగ్లీషులు మరల మహారాష్ట్రులతో యుద్ధానికి దిగినారు. మహారాష్ట్రులను భయవిహ్వలులను చేయుటకు, ఇగర్టన్ సేనాని క్రింద 1779 లో పునహామీదికే నడువవలెనని ఒక సాహసోపేత యానానికి కడంగినారు. పురందరు సంధితో తృప్తిపడని మహారాష్ట్రులు, మాధవజీ అంతఃకలహాల నిపుణంగా అణచి, శాంతి చేకూర్చిన సదవకాశాన్ని చూచుకొని, ఇంగ్లీషువారిని—ఏమిచేస్తారో చేయమని, ధీకొన్నారు. వెంటనే మహారాష్ట్రులు తమ ఒంట బాగాబట్టిన, పాత మాయ యుద్ధానికి దిగి, మోసగించి, బొంబాయికి దూరమగునట్లు ఆంగ్లేయసేనల లోతుకు లాగి, వస్తువాహకమార్గాల నిరోధించి వేసినారు. భీమరావుపాన్సే సేనాని యీ వంచక గోరిల్లా యుద్ధంతో, ముందుకుసాగే యింగ్లీషుసేనల అందుబాటులోనే తారికాడుచు, దెబ్బగొట్టి — చిక్కకుండా పరుగెత్తిపోతూ, ఇంగ్లీషువారు యిదమిద్ధమని నిర్ణయించుకోను వీలులేకుండా చేసినాడు. తమ పైబడినప్పుడు మరాఠులు నిలిచి యుద్ధంచేయుదురన్న నమ్మకం లేకపోయింది; ఇక నొక్కివేయబడినప్పుడు ఇంగ్లీషులు—తామే యుద్ధానికి నిలబడదామన్నను, వారు ఎదురునిలుస్తారన్న నమ్మకంగూడ లేకపోయింది. పలుమారు ఇంగ్లీషుసేనలు ఖండాలు ఖండాలుగా విభాగింపబడి వేరుచేయబడి, సరఫరాలు అడ్డగింపబడినవి. చివరకు కొండకనుమల మధ్యకు చేరింది ఇగర్టనుసేన. తనకు బొంబాయితో, మిగిలిన ఏకొద్ది రాకపోకల సౌకర్యాలుగూడ నిలిచిపోయినవి; అప్పటికిని ఆయన చలించకుండా ముందుకు సాగిపోతూనేవుండినాడు.

శత్రువు తమ రాజధానినగరం సమీపించేకొంది మహారాష్ట్రుల

సంకల్పంగూడ దృఢమై, వారి భావసరణి కర్కశ మగుచుండినది. తెలెగోవ్ మొదలు పూనానగరం వరకుగల దేశాన్ని సంపూర్ణంగా విజనం చేసి, ధ్వంసంచేసి, త్యజించి, దగ్ధభూవిధానానికి తార్కాన నిర్ణయించుకొన్నారు. అవసరమైనచో ప్రేమపాత్రమైన తమ ముఖ్యపట్టణాన్ని బూడిద జేసివేయాలనుకొన్నారేగాని, హేయశత్రువుచేత బెట్టదలచుకోలేదు. ఈ భయంకర కఠోరజాతీయ నిశ్చయము ఆంగ్లేయులగూడ పులకితుల జేయకపోదు. ఖండళ్ళ దగ్గర, యింగ్లీషుసేనాని బలమైన గాయాలు తిన్నాడు. కడ్కిప్రాంతాన మరియొక ముఖ్యోద్యోగి—కాప్టెన్ స్టీవర్టు హతుడై ఆంగ్లేయులకు తీరని దుఃఖాన్ని కలిగించినాడు. అడుగడుగునకు యింగ్లీషు లిచ్చిన బలి ఎక్కువగుచుండినది. కాని, ప్రశంసాపాత్రమైన కట్టుదిట్టాలకు లోబడిన ఆ సైన్యం యింకా ముందుకు సాగివచ్చుచునే యుండినది. ఇంగ్లీషుదండు తెలెగోవ్ ప్రవేశించింది; కాని, వెనువెంటనే వారు మాధవ్‌జి సింధె, హరిపంత్ ఫడ్కెగారి బలవత్తరసైన్యాలచే చుట్టుముట్టివేయబడినారు. ఇంగ్లీషుసైన్యాలు మహాధైర్యంతో ఎదుర్కొన్నవి. కాని, ఆశ్చర్యమేమంటే—హఠాత్తుగా మహారాష్ట్రసేనలు ఉపసంహరించుకొని పారిపోయినవి. మరుక్షణంలోనే, మరాఠీదండు కమతాలు కమతాలుగా చీలి, విశాలంగా పరచుకొనిపోయి విరోధి దెబ్బకు అందని దూరంలో నిలిచి, అన్నిప్రక్కలా ఇంగ్లీషుసైన్యాన్ని మోదసాగినవి. చుట్టూ కొన్నిమైళ్ళ పర్యంతము, అన్నంగాని గడ్డిగాని కాన్పించలేదు. ముందుకుసాగేకొలది దేశం యింకా వల్లకాడై అడుగుబెట్టరాని పల్లేరు కంపగా వుంటుందని నమ్మదగిన వార్తలు యింగ్లీషు గుడారాలు చేరినవి. ఎన్నో యుద్ధాలలో ఆరితేరిన ఆ తలబిరుసు ఆంగ్లేయసైన్యం ధైర్యంతో ముందుకే నడచిపోదలచుకొన్నది. టక్కరి మరాఠులు బాగా చుట్టుముట్టి, ఒక ఉద్దేశంతో—కావాలనే, మహారాష్ట్రప్రజలు తమపట్టణాన్ని మసిజేసి

పారవేస్తారేగాని, శత్రువుల చేజిక్కనీయరన్న దృఢప్రజా సంకల్పాన్ని ఆంగ్లేయులకు తెలియజేసినారు. అప్పటికే ఇంగ్లీషుసేనాని మహా రాష్ట్రుల సంగతి కావలసినంత చవిచూచినాడు; వెఱ్ఱి పట్టుదలజాడ్యం కుదిరింది; పునహామీదికి నడవటం ప్లాసీపైకి నడవటంగాదని బాగా తలకు తాకింది.

ఇక ఆ విషమస్థితినుండి బయటపడుటకు—బొంబాయికి తిరిగి పోవుటతప్ప వేరొండు గత్యంతరం లేకపోయింది. అది అవమానాస్పద మైనను ఇక పక్షాంతరంలేదు. వెనుకకు మరలదలచుకొన్నను అది విరోధికి తెలిసిన బహిరంగముగా కానిపని. ఇక మహారాష్ట్రుల కనుగప్పి, రహ స్యంగా వుపసంహరించుకో దలచినాడు ఇంగ్లీషు సేనాపతి. ఇది మహా రాష్ట్రులకు యింతకుముందే తెలియవచ్చింది. మహారాష్ట్రులను ఏమర జేయుట అంటే తాతకు దగ్గుల నేర్పడమే! ఇంగ్లీషుసేనలు వెనుకకు మరలగానే, పరచిపెట్టిన సేనలు కుదించుకోని, ఒక్కపెట్టున నిర్నిరోధా ఘాతమును కొట్టినారు. ఇంగ్లీషులు వారిపేరుకు తగినవిధంగా, అచంచ లంగా పోరినారు. కాని మరాఠి పిడికిలిని విడిపించుకోలేక పోయినారు. చివరకు, వడ్గోవ్‌దగ్గర పరాభూతమై—ఛిన్నమై—9000 పరిమితిగలి గిన సేన యావత్తు మహారాష్ట్రుల పాదాక్రాంతమైంది. నానా—భావు— సింధేలు, వెంటనే రఘోబాను తమహస్తగతం చేయమని, పురందరు సంధి ప్రకారం కుంజుకొని స్వాధీనంచేసుకొనివున్న జిల్లాలను తమకు అర్పింపమని ఇంగ్లీషువారిని ఆదేశించినారు. ఈ సంధి నిబంధనల కొన సాగించునంతదాక యిద్దరు ఇంగ్లీషు ఉద్యోగుల హామీగా మహారాష్ట్రులు తమ స్వాధీనమందుంచుకొన్నారు. ఇంగ్లీషు సైన్యమంతా ఒకనెల కాలము బందీలుగావుండి, చివరకు తమ్ము బొంబాయిచేరనిచ్చి నందులకు ప్రతిఫలంగా మహారాష్ట్రులు ఆజ్ఞాపించినదానికెల్ల అంగీకరించినారు.

ఈ మహాద్భుత విజయవార్త దేశాన్నంతా ఆనందపులకితము జేసింది. పెడసరపు బిరుసు యూనియనుజాక్ వంగ, సువర్ణారుణిమ శోభిత మహారాష్ట్ర పతాకానికి జోహారులొసంగినది. దేశం అరాచకమై, ప్రజలు సంక్షోభితులై, ప్రభుత్వం అంతఃకలహారిష్టంవల్ల సడలిపోయినను ఆజాతి మరల సమయోచితంగా తలయెత్తి పరువునిలుపుకొన్నది. ప్రజా ప్రభుత్వము, అంతటి ధీరశత్రువును సంశయములేని పరాభూతానికి పాల్జేసింది. హిందూదేశంలో మహారాష్ట్రాధికార ప్రాబల్యాన్ని సంశయించి వెనకను ఇంతవరకు ధైర్యంలేకపోయినను, యిప్పుడు ప్రయత్నమాత్రము చేతనే సంభవించిన అవమానాన్ని అనుభవించి, మిగిలియున్న ఆ ఒక్క మహారాష్ట్ర ప్రతిపక్షిగూడ అంగీకరించపలసి వచ్చింది. ఆనాటి లేఖలు యిట్లా వాకొంటున్నవి:—"మనజాతి ఇంగ్లీషువారికి నేర్పిన పాఠాన్ని నేర్పను మరియొకరిచేత గానిపని; యిప్పటివలె వారు ఎన్నడుగాని అవమానింపబడి ఎరుగరు."

ప్రజలు, ప్రజోద్యమానికి ఆయువుపట్టయిన బాలపేష్వాను భక్తి విశ్వాసాలతో సేవించినారు. తమ విజయాలు ఆయన అదృష్టంవల్లనే చేకూరినవని అశేషజనం భావించింది. "మన బాలపేష్వా గర్భవాసంవదలినది మొదలు ఆయన జీవితం గోకులబృందావన దివ్యకిశోర జీవితంవలెనే మహాద్భుతంగా వున్నది. మన శత్రుకోటి భంజింపబడింది; యీపవిత్ర యుద్ధంలో మన హిందూమతాన్ని, మన జాతీయాశయాన్ని సర్వేశ్వరుడు ఆశీర్వదించి పోషించినాడు."

# 19. ఆంగ్లేయుల అవమానము

ఒకగొప్ప ఇంగ్లీషుసేన లొంగిపోయిందన్నవార్త కలకత్తా చేరగానే అచటి ఆంగ్లేయులు కోపోద్రేకంతో పొంగిపోయినారు. ఇక వారికి యుక్తాయుక్త వివేచనజ్ఞానంపోయి, ఎంతటికైనా తెగించినారు. తమసైన్యాలు సురక్షితంగా బొంబాయిచేరగానే, తమ సేనాపతి గావించుకొన్న వదగోవ్ సంధిని భగ్నంచేసి, మరీ ఎక్కుడు పట్టుదలతో మహారాష్ట్రులతో యుద్ధాలు ప్రారంభించినారు. ఈ సందడిలో రఘోబాగూడ, తన విద్రోహానికి తగిన మరణశాస్తిని పొందక, చులకన శిక్షతో పోనిచ్చి ఒక రాజవంశీకునివలె ఆదరింపబడుటచే, తన స్వాతంత్ర్యాన్ని, చూపిన చనువును దుర్వినియోగంచేసి తప్పించుకొని, మరల ఇంగ్లీషువారి నాశ్రయించినాడు. ఆతర్వాత యుద్ధం భయదమైపోయింది. గోడార్డు గుజరాతునుండి బయలుదేరి బస్సీన్‌పైకి నడచినాడు. ఈ సైన్యాన్ని రామచంద్రగణేశుడు ప్రతిఘటించి, ప్రశంసాపాత్రమైన దీక్షతో శత్రుపురోగమనాన్ని అడ్డినాడు, అవసరమైన ప్రదేశాలలోనెల్ల యుద్ధంచేస్తూ ఇంగ్లీషుసైన్యాల వేధించినాడు. ముఖ్యంగా ఆయన కడపటి ప్రతిఘటన మహాద్భుత శౌర్యసాహసోపేతమై శత్రువుల ఆశ్చర్యాభినందనాలకుగూడ పాత్రమైంది. కాని, దురదృష్టవశాత్తు, ఘోరు ముస్మరంలో ఒక గుండు తాకి, ఆవీర మరాఠిసేనాపతి స్వర్గస్థుడైనాడు. 1780 లో గొడార్డు బస్సీన్ పట్టణాన్ని స్వాధీనముచేసుకొన్నాడు. ఈ విజయ ప్రోత్సాహంతో, వదగోవ్ పరాజయము తమ శస్త్రనివహాముపై కూర్చిన అపకీర్తి మలినాంకాన్ని తుడిచివేయ దలచుకొని, ఇంతకుముందు దుర్యశములో అంతమొందిన రాజధానీనగర యానాన్ని మరలప్రారంభించి పునహాను మరల స్వాధీనంచేసుకొన నిశ్చయించుకొన్నారు. అందులకే

ఇంగ్లీషుసైన్యం పునహాపైకి నడిచింది. ఏమరుపాటున కొట్టినదెబ్బతో మహా రాష్ట్రిలను, వారి నాయకుడు నానాఫడనీసును, కలవరపెట్టి లొంగగొట్ట దలచుకొన్నారు. కాని, అప్పటికే ఆ మహారాష్ట్రి రాజనీతిపండితుని అసమాన ప్రజ్ఞావిశేషము భయద నిశిత సూక్ష్మతరమైన ఉరులను పన్నిపెట్టి, హిందూదేశమునందున్న బ్రిటీషు అధికారము యావత్తు దానిలో చిక్కుకొనునట్లు జేసినాడు. మదరాసుపై బడుటకు హైదరుదగ్గర వాగ్దానము తీసుకొన్నాడు. భోన్సలే బెంగాల్‌మీదకు నడచునట్లు చేసినాడు. ఇక తాను బొంబాయి యింగ్లీషు అధికారాన్ని నిర్మూలించుటకు పూనుకొన్నాడు. తదనుగుణ్యంగా, పరాసు ప్రభుత్వంచేసిన సహాయంతో హైదరు ఇంగ్లీషు వారిని ఓడించినాడు. పరశురాంభావు 12 వేలమంది సైనికులతో, పునహా పైకి నడచే యింగ్లీషుసైన్యాన్ని కడలకడల కాచిపెట్టివుండి, అనువైన చోట, వీలైన సమయంలో దెబ్బతీస్తూ, చీకాకుపరస్తూ, నలుముఖాల ఢీకొంటూ పునహాయానాన్ని యాతనాపూర్ణముగ జేసినాడు. ఆతర్వాత, నానా-తుకోజి హోల్కార్-హరిపంతు ఫడ్కే, 30 వేల మంది ఏరికూర్చిన బలంతో గొడార్డు సైన్యంతో తలపడినారు. గొడార్డు స్థితిగూడ పూర్వం ఇగర్టను స్థితివలె విషమమైంది. ఇంతకుముందటి వారిగతిని వాంఛిస్తేనే దప్ప ఇకముందుకు సాగిపోలేక పోయినాడు; అంతేకాకుండా గొడార్డు సాగించిన పురోగమనం చాల దీర్ఘమై లోతుకు చొచ్చుకొనివుండినందున—అటు ఉపసంహారానికి అసాధ్యమేకాకుండ అవమానానికి హేతువు గూడ అయింది. కాబట్టి ఉన్నచోటనే నిలిచి, తన ఉనికిని బలపరచుకొన్నాడు; కాని, అదిగూడ ఎంతోకాలము మనలేదు. గోడార్డు సైన్యాలకు సహాయాలు గొనిపోవ యత్నించిన మ్యకె, బ్రౌను సేనానుల సార్థవాహక సైన్యాలను మరాఠులు బెట్టిదమైన దెబ్బలకు పాల్జేసి చీకాకుపరచినందున ఆమీద రాకపోకలు అసాధ్యాలై, సహాయం అందక బొంబాయితో పూర్తిగా

సంబంధం తెగిపోయింది. చివరకు, గొడార్డు సేనాని, దుర్భరమనోవ్యధతో, మహారాష్ట్ర రాజధానిపై నడచు ప్రయత్నము మానుకొని, వెనుకకు మరలిపోవలసివచ్చింది. విరిగిన పరువుతో, మొక్కబోయిన కదనపాండితితో యింగ్లీషులు వీపు మరలించి యింటిముఖంపెట్టగానే, ఖావు—తుకోజీల నాయకత్వాన మరాఠిదండు ముఠాలు నానాముఖాలనుండి ఇంగ్లీషు సైన్యాలపైబడి వారిని తమ శస్త్రపరంపరకు ఆహుతిజేసినవి. ఇంగ్లీషు సైన్యాలు చీకాకుపడక నిలిచి ఎంతధీరముగ పోరినను దుర్గతి తప్పినది గాదు. మహారాష్ట్ర రాజధానిలో విజయసమర్థంతో ప్రవేశించి, కీర్తికిరీటాన్ని ధరించుకొనదలచిన ఇంగ్లీషు సేనాని, పొగరంతా ఉడిగిపోయి, ఎట్లనో చావుదప్పి బొంబాయి చేరినందులకు వేయి దేవుళ్ళకు మ్రొక్కుకొన్నాడు; కాని దీనికి అతడు చాలగొప్ప పరిహారమును చెల్లించినాడు. అసంఖ్యాకముగ యింగ్లీషు సోల్జర్లు మృతులై తమ తిరుగుదలదారికి పీనుగలతో ఆనవాలుంచి పోయినారు. ఉన్న యావత్తు రణసామగ్రి—మందుగుండు, తుపాకులు, గుడారాలు, విడిది వసతులు, వేనకువేలు వస్తువాహక జంతువులు విశేషంగా మహారాష్ట్రుల చేజిక్కినవి. ఈవిధంగా, సిగ్గుమాలిన ధైర్యంలో యింగ్లీషువారు పునహాపైన రెండుమారులు దండెత్తి వచ్చినారు; ఆ రెండుమారులుగూడ పరాభూతులై శృంగభంగమై వెనుదిరిగి పరుగెత్తి అవమానంతో బొంబాయి చేరుకున్నారు. ఎన్నడుగాని, యింత డంబముతో ప్రారంభమైన దిగ్విజయకాంక్షాయానము యింత అవమానంతో యీకలు ముడుచుకొని యిల్లుచేరలేదు.

ఇంగ్లీషు సేనలు, ఉత్తరానగూడ యింతకంటె మెరుగనిపించుకోలేదు. మహారాష్ట్రులపై ద్వేషంతో వారికి అపకారంచేయను తమపక్షం వహించిన గోహద్ రాణా సహాయంతో మొదటమొదట గ్వాలియర్ కోటను పట్టుకొని, ఒక స్వల్పవిజయాన్ని సాధించగలిగినను, కరాక్ సేనాని నడి

పిన యింగ్లీషు సేనలు, మాధవజీ సింధియా కురిపించిన తీవ్రఘాతాసారం మధ్య, బాధలమధ్య సాధించిన ఏ కొద్దినోగూడ చాలకాలం నిలుపుకోలేక పోయినవి. బోనులో యిరుక్కొన్న వారిని విడిపించను సహాయంగా పరుగెత్తిన మూర్ సేనాపతిగూడ పరిస్థితుల బాగుచేయలేక పోయినాడు. ఇట్లు దక్షిణాన హైదరుచేత, బొంబాయిలో తుకోజీహోల్కార్—పట్వర్ధనులచేత, ఉత్తరాన మాధవజీ సింధియాచేత విఫలయత్నులై, ఇంగ్లీషువారు, తమచుట్టు నానాఫడనీసు మేధాసంపత్తి పన్ని బంధించిన పరస్పర సాహాయ్యక దుర్భేద్య నిగళాల ఛేదించను కుతంత్రమార్గాలకు తార్కొన్నారు. మొదట సింధియాను దరిసి, తమతో ఒక ప్రత్యేక సంధికి మహారాష్ట్రులు ఒడబడునట్లు చేయమని రాయబారాల సాగించినారు. కాని నానా హైదరుతో సంప్రదించనిదే ప్రత్యేక సంధిమాటలకు దిగనని తిరస్కరించినాడు.

మహారాష్ట్ర నావికాబలముగూడ నిజోచిత విజయాల సాధించింది. సేనాపతి ఆనందరావు ధులాప్ సాహసోపేతమైన దాడిలో ప్రస్ఫుట విజయాన్ని సమకూర్చి, ఇంగ్లీషు యుద్ధనావ - రేంజర్ అనుదానిని విజయపారితోషికంగా వెంటతీసికొని పోయినాడు. ఆ సమయానికే హైదర్, రాయబారాలమధ్య చనిపోయినాడు; కాబట్టి 1783 లో నానా సంధిపత్రంలో సంతకంచేసినాడు. దీనిప్రకారం:—ప్రధాన వివాదలక్ష్యమైన రఘోబాను యింగ్లీషువారు మహారాష్ట్రులకు అప్పగించి; యుద్ధంలో ఆక్రమించుకొన్నట్టి, పురందర సంధిప్రకారం వశమైనట్టి సర్వభూభాగాల—సాల్సెట్టి తప్ప—మహారాష్ట్రులకు యిచ్చివేసి, మహారాష్ట్రవిరోధులగు ఏ ఆసియా అధికారమునకుగాని, రాజ్యమునకుగాని ఆంగ్లేయులు సహాయపడరాదు. దీనికి ప్రతిగా మహారాష్ట్రులు, యింగ్లీషువారి ప్రత్యర్థులగు ఏ ఐరోపీయ రాజ్యంతోగాని జోక్యంకలిగించుకొనరాదు; వారికి చేయూత ఒసగరాదు.

వీటి అన్నిటికిపైన ఢిల్లీలో, భారతదేశ రాజకీయాలలో యింగ్లీషువారు ఎన్నటికి వ్రేలుపెట్టనట్లు ఒడబడి, స్వదేశ రాజకీయాల తమయిష్టము వచ్చినట్లు, ధారాళముగా, నడిపి పాలించు హక్కును మహారాష్ట్రులకు ఒసంగినారు.

ఈవిధంగా, ఆంగ్ల—మహారాష్ట్ర యుద్ధం ముగిసింది. ఈవిధంగా, వివిధ శత్రువులతోపాటు, యితర యూరపుజాతులతోపాటు, యింతవరకు వారితో కలహింప సాహసింపక, యీ అదనున కలహించి, ధిక్కరించి చివరకు ఓడి, అవమానాలపాలైన యింగ్లీషు బలాల సహితం అణచివేసి; సమరాంగణంలో, భారతదేశ ఏకైక సర్వశక్తియుక్త రాజకీయాధికార బిరుదమును సుస్థిరముగ స్థాపించుకొని, మహారాష్ట్రులు తమ అధికారకీర్తి ప్రతిష్టల నిలుపుకొన్నారు. బెంగాలు—మదరాసు రాష్ట్రాలలోమాత్రం యింగ్లీషువారు రాజ్యాధికారాల సంపాదించుకోగలిగినారు. కాని, ఆరాష్ట్రాల ఊబ తురక నవాబులను భయపెట్టి లోబరచుకొనుటలో సహాయకారియైన బిరుసు గర్వంతో, మహారాష్ట్ర హిందూ సామ్రాజ్య దుర్గభిత్తికలైన సహ్యాద్రి సానుప్రదేశాలను ఢీకొనదలచి, వితరణలేని సాహసానికి దిగినచో పుర్రెలు పగిలి నెత్తురుపారుతుంది అన్న తిక్తగుణపాఠాన్ని మహారాష్ట్రులు ఇంగ్లండుకు నేర్పించినారు.

వెంటనే సాల్‌బాయి రాజీ కుదిరింది. రఘోబాగూడ, తనజాతిపై కుట్రలుపన్ని, తన దేశసౌభాగ్యాన్ని వంచించి, తనజాతి ప్రబలవిరోధులకు కడుపు కక్కుర్తికి దేశసౌభాగ్యశ్రీని అమ్మిన,దుర్యశపూర్ణ జీవితాన్ని సమాప్తి జేసుకొన్నాడు. రఘోబా తన తుచ్ఛ దుష్టస్వార్థచింతతో, నాటి మహారాష్ట్ర పురుషాంతరప్రజ పూజించి సాగించి ప్రాణార్పణము గావించిన ఆ మహత్తర ఉద్యమసాఫల్యానికిగా నెరపవలసిన పరమోత్కృష్ట యత్నాన్ని మహారాష్ట్రమండలి జవసత్వాలను కొంతవరకు మరుభూమిపై పారించి, అంతః

కలహాలు—ఛిద్ర యుద్ధాలు సృష్టించిన దారుణమైన యిసుక ఉబ్బలిలో దేశాన్ని యిరికించినాడు. అతని జీవితము—పానిపట్ దురంతమువలెనే దేశానికి అరిష్టదాయకమైంది. అదృష్టవశాత్తు అతడు సాల్‌బాయిసంధి తర్వాత జీవించియుండలేదు. కాని, ఆ జీవితం ఆరిపోతూ, మహారాష్ట్రానికి తనకంటె తీవ్రమైన ప్రజారిష్టము—అభిశాపము కానున్న, మరియొక వ్యక్తిని పుట్టించి పోయింది. రఘోబా ఇంగ్లీషులతో సాగించుచుండిన కుతంత్రాలు భగ్నమైపోతుండిన ఆ సమయంలో అతనికి ఒక పుత్రోదయమైంది. ఇందు నర్మగర్భ విధిదారుణ అపహాస్యమేమంటే—అవిశ్రుత బాలాజీరావు పేర యీ కొత్త మనుమనికి, రెండవ బాలాజీరావు అని నామకరణము చేసినారు. ఈ బిడ్డ పెరిగి పెద్దవాడై, తనతండ్రి విఫలుడై పరిత్యజించిన దేశద్రోహక పైశాచికోద్యమాన్ని సాగించి, తనతండ్రి చేత గానిపని యితడు నెరవేర్చినాడు. ఈ రెండవ బాలాజీరావు, మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని ముంతెడు పుల్లనీళ్ళకు అమ్మి, ఆచరమ హిందూసామ్రాజ్యం చుట్టు నాశనపు గిరిగీచి తండ్రిని తరింపజేసినాడు.

కాని, ఆ దుర్దినాలు యింకను ఆసన్నముకాలేదు. ఎట్లనైతేనేమి?- నానాఫడనీసు, మాధవజీలు బ్రతికి వున్నంతవరకు 'యీ దుర్మార్గము సాగనేరదు.

# 20. సవాయి మాధవరావు (I)

దైన్య దివస్ ఆజ్ సరలే సవాయీ మాధవరావ్ ప్రతాపి
కలియుగి అవతరలే
సుందరరూప రాయాచే కుణావర్ నాహి రాగే భరణే
కలిగితురా శిరసే చ పాచుచీ పడత్ హోతీ—ముఖావర్ కిరణే—
మహోత్సాహ ఘరోఘర్ లాగలే లోకకీరాయాలా
పరశరాం ప్రత్యక్ష ఆలే జణుం ఛత్రీ భరాయాలా

హిందూత్వానికి తల—కత్తి అయిన నానాఫడనీసు, మాధవజీ సింధేలు తమ విశాలభుజస్కంధాలపై ఆదిశేషునివలె, అఘనతర సామ్రాజ్యభారాన్ని వహించినారు. ఇంగ్లండు—ఫ్రాంసు—హాలెండు—పోర్చుగల్, యీ దేశానికి పంపగలిగిన కదనపండితులు రాజనీతి పండితులు—హేస్టింగ్సు—కారణావాలీసు—వెలెస్లి మొదలగు వారిలో ఎవరుగాని, యీ యిద్దరిని ఎదిరించి, మించి, ప్రకాశించలేకపోయినారు. హిందూ సామ్రాజ్యంలో సిరి పచ్చతోరణాలతో కలకలలాడిన దినాలను వారిద్దరు బాగా చూచినారు. ఘనులు నానాసాహెబు—సదాశివరావుభావుల రాజకీయా శ్రమములో, తమజాతి సందేశమును, తమజాతి ఆదర్శమును, లక్ష్యాన్ని, ధర్మాలను వారిద్దరు బాగుగ అభ్యసించినారు. ఇద్దరూ పానిపట్టునుచూచి, దాని తదనంతరముగూడ జీవించియుండినారు; రణరక్త బంధురారుణమైన ఆ సమరభూమిలో పడి మృతులైన ఆ వీరపురుషాంతర ప్రజల ఉద్యమాన్ని సఫలీకృతము చేయ కృతనిశ్చయులైనారు. తమరాజ్యం స్వజాతి యుద్ధాలతో చీకాకుపడి దుర్బలమై, వినాశ సీమలదరిసి, ఒక దుర్బల అనామికుడు రాజై, ముక్కుపచ్చలారని పసిబిడ్డ ప్రధానియై, దురాశావేశ

శక్తిమయ ఐరోపీయ పరిపంధి ప్రత్యర్థియై యుండుటను వారు గుర్తించి నారు. అయితే ఏం ? వారు పిరికికండలేని ధైర్యంతో, ప్రస్ఫుట మానసిక దృష్టితో, రాజ్యంలో తలచూపిన ఛిద్రాల, కలహాల అణచివేసినారు. భూరిశక్తిపూర్ణ బాహువులతో, ప్రమాదమెరుగని దృష్టితో, వివిధ ఐరోపీయ ఆసియా విరోధుల విరుగగొట్టి, శత్రువులచేత దైన్యావమానా సంపూర్ణ కలశాన్ని ఎత్తి త్రావించినారు.

ప్రజావిప్లవ క్షణికోద్రేకాలను చంచలభావాలను సృష్టించి, వాటిని పాలించు క్లిష్టతర బాధ్యతను వారు తమపై మోపుకొన్నారు. ఈనాటికి విప్లవము వివిధశత్రుకోటిని అణచి విజృంభించింది. సమస్తజాతి వాంఛ అయిన విప్లవ ప్రభుత్వము సుస్థిర పునాదులపై నిర్మింపబడి రణరంగంలో అజేయమని నిరూపించుకొన్నది. కాబట్టి ఇక అట్టి విజయస్మారకంగా ఒక అపరూప మహోత్సవాన్ని జరిపి దేశంయొక్క ఆనందాన్ని ప్రకటించుట సహజమే కాకుండ రాజకీయావసరముగూడ అయింది. అప్పుడు తరుణ పేష్వా—సవాయి మాధవరావు వివాహము, జాతీయోత్సవాలకు ప్రమోదాలకు మంచి అవకాశం కలిగించింది. ఆయన ప్రజలచే ఎన్నుకొనబడిన పేష్వా. ఆయనకొరకే యావత్ మహారాష్ట్రభూమి యుద్ధానికి దిగింది. ఈ రాజకిశోరమును, బహిరంగ యుద్ధాలేగాక, భీరువులైన శత్రుకోటి విషముబెట్టి హత్యగావింపను పన్నిన రహస్యదారుణ కుతంత్రాలుగూడ చంపలేకపోయినవి. అందుచే ప్రజలు, గోవుల బృందావన మందలి ఆదేవ శిశువు—నందగోపాలుని మహిమాపూర్ణ జీవితపు ఒడుదుడుకులతో మాధవరావు శైశవాన్ని పోల్చి ఆనందించినారు. తమ అనుగు రాచబిడ్డ పెరిగి పెద్దయై ఆనందపూర్ణ కౌమారదశకు రావలెనని ఉవ్విళ్లూరుచుండినారు. ఆ రాజోత్సవాలలో పాల్గొనను, దగ్గర దూరము అనక, నానా ముఖాలనుండి ప్రజలువచ్చి పునహాలో మూగినారు. రాజులు—సామం

తులు, కవికుమారులు—విఖ్యాత కవిపుంగవులు, కాగిచల్లారిన సేనాపతులు—ఉదయగిరి, అటకు విజయక్షతాంకితులై అనుభవపరులైన వీరని కాయము, రాయబారులు—రాజనీతి చాణక్యులు, అందురు తమ ప్రియతమ గంభీర రాకొమారుని దర్శనభాగ్యానికి గుమికూడినారు. అఖండ హిందూ సామ్రాజ్య వివిధభాగముల అభేదైక్యతను లోకానికి చాటుటకును, అంతఃకలహాలతో మహారాష్ట్రమండలి ఛిన్నాభిన్నమైపోయి అటు తరువాతఎన్నటికిని తలఎత్తజాలదని గొంతెమ్మ కోరికలతో ఆశల పెంచుకొనుచుండిన శత్రువుల కంటిమబ్బు విప్పను, నానాఫడనీసు ఉద్దేశపూర్వకంగా మహారాష్ట్ర సాతారా ఛత్రపతిని ఆహ్వానించి, ఉచిత రాజలాంఛనాలతో ఉజ్జ్వలస్వాగత మిచ్చినాడు. ఛత్రపతి నిజమహామంత్రి వంశదీపకుని వివాహమునకు పునా విచ్చేసి, ఆ మంగళకార్యంలో పాల్గొని ఆదరించినాడు.

అచట, నిండుపేరోలగంలో—ఛత్రపతి సింహాసనాధిష్ఠుడై, మండనాయమాన రాజప్రతినిధులు, సేనాపతులు, నౌకాపతులు, రాజనీతికోవిదులు, సామంతులు పరివేష్టింప కొలువుదీరినాడు. అచట జేరిన కొందరి రాజ్యాలు, కొన్ని యూరపు ఖండస్థరాజ్యాలకంటె పెద్దవి. పట్వర్ధనులు, రాస్తేలు, ఫడ్కేలు అరుగుదెంచినారు. హోల్కార్, సింధియ, పవార్, గయిక్వాడ్, భోంసలేలు పాల్గొన్నారు. హరిద్వారము మొదలు రామేశ్వరమువరకు గల సమస్త హిందూవిజ్ఞానము అచట ప్రాతినిధ్యము వహించినది. జయపురము, యోధపురము, ఉదయపుర సంస్థానములు తమతమ దూతల నంపినవి. నైజాము, మొగలుపాదుషా, భారతదేశమందలి ఐరోపీయాధికారములు, తమ రాకొమారుల—ప్రతినిధుల బంపి, అర్హపారితోషిక సందేశాలతో బాలపేష్వాను ఆదరించినారు. రాజధానీ నగరంచుట్టు కొన్నిమైళ్ళ పర్యంతము చతురంగబలాలు, శస్త్రాంగముతో

బాటు వచ్చి విడిసి, మహారాష్ట్ర ఖడ్గఖేటక సంపదను ప్రేక్షకులకు ప్రదర్శించినవి. అగ్రే ధులాపులు నావికాబల పక్షమును వహించినారు. వచ్చిన అతిథులకు స్వాగతమిచ్చి అర్ఘ్యమర్యాదల చేయుటకు అగ్రేనియోగింపబడినాడు. ఆయాత ప్రభిన్నశక్తులనెల్ల తన విశాలబాహులక్రింద చేర్చుకొని మహారాష్ట్ర సువర్ణకేతనము విజయగంభీరముగ ఆకాశంలో మెరసిపోతూ, హిందూసామ్రాజ్యముయొక్క స్వధర్మ స్వరాజ్య లక్ష్యాన్ని తన జాతికి స్మృతికి దెచ్చుచుండినది.

సంజ్ఞతోగూడ సర్వాంగయుతసైన్యం జయధ్వానాలతో దిక్కులు తూట్లుపడ జేసింది. నవయౌవన సౌకుమార మన్మథమూర్తి—పేష్వా, అఖండ రాజ్యశ్రీ మండితుడై, వైభవోపేత రాజలాంఛనాలతో, వందిమాగధ పరివృతుడై, వేత్రహస్తులు ముందునడువ, గభీరమందగమనంతో రాజ ఆస్థాన సభను ప్రవేశించినాడు. సభాస్థారులెల్లరు లేచి నిలువబడి అవనతదేహులై వినయపు కానుకను చెల్లించి, జానపదాలకు—పురాణగాథలకు కథానాయకుడై, సమస్త మహారాష్ట్ర కర్ణపుటములందు తాండవించిన ఆ పేష్వాకు స్వయముగ, ఆయన సమస్తజాతి హృదయపూర్వక ప్రేమారాధనను సాగించి, తమ విశ్వాసనిధిని ఆయన అంఘ్రితలమున సమర్పించినారు. సమస్త హిందూస్థానానికి యథార్థపాలకుడైన ఆతరుణ పేష్వా, ముప్పేట పూలసరంతో కట్టివేసిన ముంజేతులతో—రాజాధికారానికి లోబడ్డ గుర్తును తెలియజేస్తూ, ఆరాజ్యలక్ష్మీ శోభిత సభామండప మధ్యభాగంలో సింహాసనాసీనుడై యుండిన సాతారా రాజు—ఛత్రపతిమ్రోలకు నడచుటను చూచి, సభ్యులందరు ఆనందపులకిత గాత్రులైనారు. ప్రధాని మహారాష్ట్ర రాజును దరియునప్పుడు—యిది వారు పాలించవలసిన ఆచారము—ఈ దృశ్యము వీరరసికాయానికి ఆనందబాష్పముల గురిపించి, జాతీయావేశాన్ని కనుకొలకులలో మెరిపించింది. మంత్రి—నానా శిశిర

గంభీరముఖంగూడ ఔత్సుక్యాన్ని ప్రదర్శింపక తప్పిందికాదు. ఒక పెద్ద ఆనందాశ్రుబిందువు ఆయన చెక్కిలిపై ముత్యంమాదిరి క్రిందికి జారింది. నానాసాహెబు ఆదిగాగల మహారాష్ట్ర నాయకుల వ్యూహాలు వృథాకాలేదు. వారు భావించినట్లే, ఈ సామ్రాజ్యోత్సవము సంఘీభావము, ఆదర్శ ఐక్యత లను ప్రకటించింది. మధ్యమధ్య ఎన్ని దెబ్బలు తిన్నను, నాడు ప్రదర్శించిన రాజకీయశక్తి మహారాష్ట్రమందలి సభ్యులకెల్లరికి సత్యాన్ని తెలిపి ఉత్సాహ ఆవేశాల గూర్చినది. అచట మూగిన సమస్తరాజులకు, ఐరోపీయ—భారతీయ అధికారుల హృదయాలకు నచ్చబలికింది. ఇంతేగాకుండ, తామెల్లరు, ఆ మహత్తర కీర్తిదీపిత మహారాష్ట్రమండలి అంగాలన్న భావాన్ని దృఢపరచి, పెంచి, చెదరి ఏకాకులుగా వున్నదానికంటె, ఐక్యత్వలని ప్రతి రాష్ట్రభాగము నిజశక్తిని ప్రతిష్ఠను సౌభాగ్యశోభలను పెంపొందజేసుకొన్నదన్న సత్యాన్ని ప్రస్ఫుటపరచి, తమ్ము కేంద్రసంయుక్తమండలితో కలిపిన బంధాల బలవత్తరముగ జేసినది.

అంతఃకలహ వ్రణాలు క్రమేపి మానేకొంది. మహారాష్ట్రము, పూర్వమువలనే—సంపద్పూర్ణ, కీర్తిపూర్ణ, శాంతిపూర్ణ, భద్ర సత్యపాలనక్రింద చాలకాలము సుఖమనుభవించింది. నానాఫడనీసు, ఆయన సహాయకులు, ప్రభుత్వ ఆర్థిక, పరిపాలక, న్యాయశాఖాయంత్రాన్ని మంచి పునాదులపై నిర్మించివారు. అందువలననే, భారతదేశమందలి రాజ్యాలకంటె, మహారాష్ట్రము, మహారాష్ట్రప్రజలు, మహారాష్ట్ర విశాలసామ్రాజ్యము శాంతి భద్రయుత సమ్యగ్పాలనముల అనుభవించినవి. శిస్తునిర్ణయము, వసూలు ప్రజాశ్రేయానికి హేతుభూతాలుగా వుండినవి. న్యాయ్యపాలనము శక్తివంతమై ప్రజాప్రతినిధుల హస్తగతమై యుండినది. రాజులు మొదలు సేద్యగాంద్రవరకు గల సమస్తప్రజకు, కోరుకొన్న పెద్ద చిన్న—జీవనోద్యోగములు అందుబాటులోవుండి, సర్వజనానికి సమానావకాశాల

గల్పించినది. వీటి అన్నిటికి పైన, తమ పూర్వులు పోరి ప్రాణార్పణము గావించి, తమ దేవగణము, ఋషిసత్తములు ఆశీర్వదించి పవిత్రీకరించిన ఆ మహత్తర ఆదర్శలబ్ధికి తాము కారణభూతులమైతిమన్న జ్ఞానము, హైందవస్వాతంత్ర్య హిందూధర్మవ్యాప్తి రక్షణలకు కంకణముబూనిన హిందూసామ్రాజ్యభారాన్ని తన విశాల మాంసల భుజస్కందాలపై పూనిన జాతికి తాము జెందితిమన్న గర్వము, ప్రజల మానసాల పొంగించి, ఆ దినాలలోపుట్టి, ఆ మహత్తర కార్యాల కనులారచూచి, అందు పాల్గొన్న తాము ధన్యులమను ఉత్కర్షపూర్ణ ఆనందాన్ని కలిగించినవి. నాటి జాతీయ వాతావరణమే ఆనంద ఆశా చకితమై యుండినది. ప్రతివాడు దానినే ఆఘ్రాణించినాడు. ప్రతిక్షణము, ఏదో ఒక విజయవార్తో—మరి యొక వినూత్న జాతీయ జయసంఘటన ఉదంతమో అరుగుతెంచి, దేశాన్ని ఉత్సాహ తరంగితముచేసివేస్తుండినది. తమ ప్రియతమ సవాయి మాధవరావు జన్మలగ్నమును పాలించిన శుభగ్రహప్రాబల్యమువల్లనే ఆ అదృష్టదినాలలో యివన్ని జరుగుచున్నవని నిరక్షరాస్యుడుగూడ భావించి నాడు. కావుననే ఆయన పుట్టువుముందే, ఆయనదేశము ఆయనకు జోహారులిచ్చింది. మొదటి మాధవరావు ముస్లింపాలనను నిర్మూలించి పగ సాధించలేక పోయినందునను, విజాతీయ అవిశ్వాసక మ్లేచ్ఛ నిరంకు శుల మట్టుబెట్టలేక పోయినందునను, త్రిసాగర వేలావలయిత అఖండ భారతావనిలో దైవభక్త్యూర్జిత హిందూసామ్రాజ్యాన్ని స్థాపించలేక పోయి నందునను, వాటిని యీజన్మలోనైన పరిపూర్తిగావించుటకు ఆయన రెండవ మాధవరావుగా అవతరించినాడని ప్రజలు విశ్వసించిన పురాణము. అందువల్లనే భగవానుడు చల్లనిచూపు చూచినాడు. అదృష్టము—ఆ బిడ్డ జననమాది మహారాష్ట్రకేతనముపై చిరునవ్వులతో తాండవించింది. ఇట్టి మూఢ అంధ ప్రజావిశ్వాసాలు, సాధారణముగా జాతీయ హృదయవాం

ఛల స్వప్నప్రలాపాలే అగుచున్నవి. ఇవి, ఆ ఉద్యమ సాఫల్యాల ఆబాల గోపాలము ఏ దృష్టితో చూచుచుండినారో ఆ విషయాన్నిగూడ ప్రక టించు చున్నవి.

సాల్‌బాయి సంధి జరిగిన వెనువెంటనే, నానా, హైదరుతర్వాత రాజ్యానికి వచ్చిన టిప్పూసుల్తానుకు బుద్ధి జెప్పను పరశురామభావు, పట్వ ర్ధనుల నియోగించినాడు. టిప్పు రాజ్యానికి వచ్చీ రాకమునుపే, యితరుల వలెనే మహారాష్ట్రులతో తీరని శత్రుత్వానికి కడంగినాడు. నారగుండు హిందూ సంస్థానాన్ని టిప్పు గారియపరచుటచే వారు మహారాష్ట్రుల సహాయమర్థించినారు. అందుచేత 1784 లో టిప్పూతో,యుద్ధం ప్రారంభ మైంది. పట్వర్ధను—హోల్కారులు, నైజాముతో కలసి టిప్పూను సంధికి వంచినారు. దీనిప్రకారం సుల్తాను మహారాష్ట్రులకు కట్టవలసిన నిలువ కప్పాన్నంతా చెల్లించి, నారగుండు సంస్థానం జోలికి పోనని మాటయిచ్చి నాడు. కాని, వెనుదిరిగి పోయ్యే మహారాష్ట్రవాహినీ పదోద్ధూత పటల పరాగము అణగీ అణగకమునుపే, మాయోపాయ కపటకార్యాలకు అల వాటు పడిన టిప్పు, సంధి పత్రాన్ని చించిపారవేసి నారగుండు దుర్గాన్ని ఆక్రమించుకొని, ఘాతుక విధానంతో ఆ రాజును సకుటుంబముగా బంధించి, ముస్లిం విశ్వాసకుల విశ్రుత సంప్రదాయాలను భక్తిపూర్వకంగా పాలిస్తూ, వారివి క్రూరంగా హింసించి చిత్రవధగావించి, ఆ రాజు పుత్రి కను తన కామోద్రేకానికి బలిజేయను, చెరసాల సదృశమైన తన జనా నాకు అపహరించుకొని పోయినాడు. ఈ చేష్టలు ఆయనకు స్వర్గవిభూతిని గూర్చినవట! మౌల్వీలు—ముస్లిం చరిత్రకారులు టిప్పూను ఏ ఔరంగజేబు, ఏ తైమూరుల వలెనే ఒకగాజీ (దిగ్విజయి)గా, మతరక్షకునిగా జేసినారు. కృష్ణా తుంగభద్ర మధ్యస్థ హిందువులపై టిప్పు పైశాచిక ప్రతీకారమును సాగించుటకు ముస్లిం మతవ్యాపక అనుయాయులైన హృదయవిదారక

అత్యాచారాల నెరపి, ఆ నిస్సహాయ ప్రజల స్వమతంలోకి కలుపుకొన్నాడు. మహారాష్ట్రుల హిందూమత పరిత్రాణ బిరుదమును అపహాస్యముచేసి, ధిక్కరించను, అనేకవేల హిందువులకు బలవంతంగా సుంతీచేయించి, అనూహ్యమైన ఘోరాలకు పాల్జేసినాడు. ఈ అభాగ్య బలిపశువులు, ఒకటిగా తిరుగబడి తమ పరమోత్కృష్ట ధర్మాన్ని పాలించలేకపోయినను, సమర్థ రామదాసు హిందువుల ప్రబోధించి, మహారాష్ట్రులకు నేర్పినట్లు, తమ మతధర్మ హింసకుల చంపి చావమన్న ఆదేశాన్ని నెరవేర్చలేకపోయినను, హింసను హింసతో అణచలేకపోయినను, పర్యంతరంలో—అవమానానికి బదులు చావునే వరించినారనుటలో, నిజముగా వారు ప్రశంసార్హులు. ఏరినట్లు యిక్కడ ఒకడు, అక్కడ ఒకడు గాక, 2000 మంది బ్రాహ్మణులే, టిప్పూ మాంసాశనప్రియ క్రోధానికి బలియైనారు. వీరు, ధర్మభ్రష్ట పరమతానికంటే చావే మేలని స్వమతానికిగా ప్రాణార్పణము గావించినారు. మహారాష్ట్ర ప్రాభవానికిముందు యీ దౌష్ట్యాలు సర్వసాధారణాలు. ఆ దినాలలో పరమతానికంటే చావే మేలనుకొన్నారు. ఆసమయంలో రామదాసు సహ్యాద్రి సానువులపై నిలిచి, చైతన్యకంఠంతో—"మతపరిత్యాగానికంటే ప్రాణత్యాగమే శ్రేష్ఠమన్నమాట నిజమే కాని, దుష్టపిశాచాల హతమార్చి, చావును, మతభ్రష్టతనుగూడ నివారించగలిగిన ప్రయత్నము శ్రేష్ఠతరము. తప్పని సరియైన మరణాన్ని గ్రహించండి. కాని, మతద్రోహిని చంపేయత్నంలోనే మరణాన్ని వరించడం పరమశ్రేష్ఠం. సత్యధర్మములకొరకు జయకాములు కండు" అని ప్రబోధగానము చేసినాడు. ఇంటింట - మఠము మఠమున, ఆయన శిష్యకోటి యీ యుద్ధసందేశాన్ని రహస్యముగా ప్రచారము గావించింది. కంటక కిరీటంతోబాటు, కీర్తిమండిత విజయమకుటాన్నిగూడ వాంఛించునట్లు ఆయన హిందూ ప్రజకు ఆవేశము కలిగించినాడు.

అయితే ఏం ? యీ పరిస్థితులలోగూడ, శివాజీ ఛత్రపతి సంతతి వారు యింకను పునహా నగరంలో ఏలుచుండగానే, టిప్పూ హిందువుల హింసించి, తనమతంలోకి కలుపుకొని, ఔరంగజేబుపాత్ర ధరించదలచుకొన్నాడు. ఈ బ్రాహ్మణుల అనుకంపాపూర్ణ దీనాలాపాలు, టిప్పూ మతావేశానికి గురియైన కర్ణాటక - ఆంధ్ర - తమిళ హిందువుల ఆక్రందన గాథలు పునహా కర్ణపుటాలు సోకి, ముస్లిం పాలనా దాస్యవిమోచనానికి ఎలుగెత్తి ప్రార్థించినవి. ఆ బ్రాహ్మణరాజ్యము యిదివిని వూరకుండగలదా? కృష్ణకు ఆవల, స్వమతస్థులు అనుభవించుచుండిన దారుణ భాగధేయ హృదయ విదారణ గాథల, మహారాష్ట్ర హిందూసామ్రాజ్యమువిని, స్థిమితముగా వూరకుండగలదా ? హిందూ అధికార మనిపించుకొనిన మహారాష్ట్ర ప్రభుత్వానికి అది ఒక అధఃకరణము; దానిని వారు ప్రతిఘటించ దలచుకొన్నారు. ఆ సమయంలో మహారాష్ట్ర సైన్యాలు ఉత్తరాన తీవ్రయుద్ధాలు సాగించు చుండినను, నానా కర్ణాటక హిందువుల సహాయార్థము కొంత సైన్యాన్ని పంపదలచుకొన్నాడు. టిప్పూరాజ్యంలో గెలుచుకొన్నదానిలో మూడవపాలు పంచియిస్తామని నైజామును లోగట్టుకొని, టిప్పును తీవ్రమైన దెబ్బగొట్టను బయలుదేరినారు. పట్వర్ధను - బహొరె నాయకత్వము వహించినారు. మహారాష్ట్ర సైన్యాలు ఒకపరి కలిసి, ఒకపరి విడబడి చెదరినడుస్తూ బాదామిని పట్టుకొన్నవి. దీనితోబాటు మరికొన్ని శత్రుసురక్షిత స్థానాలుగూడ వశమైనవి. టిప్పూ సైన్యాల అమితంగా చీకాకుపరచి, తరిమి, నలకటపరచినందున వారు కొండ ప్రదేశాలలో జొరబడినారు. అక్కడగూడ హిందుధాటికి, ఇస్లాంవీరుడు ఆగలేకపోయినాడు. స్త్రీల పసిబిడ్డల కష్టపెట్టి, ఆసహాయక శాంతిప్రియులైన హిందూ పురోహితుల హింసించి, హిందూకన్యా మానాపహరణములో తిర్యగ్జంతు తృప్తిబొంది, విఖ్యాతిగాంచిన టిప్పూ వీరాగ్రేసరుడు - తన తల చితుకబొడిచివేయను

శక్తి సంపాదించుకొనిన ఆ హిందువులనే ఆశ్రయించి, క్షమాపణవేడి, శాంతికి ఒడబడినాడు. అసంఖ్యాకములైన హిందూ స్త్రీ పురుష బాలబాలికల దీనాలాపాలు బాధలు అతని మతావేశదౌష్ట్యధారను మొద్దుబారించుటకు బదులు నూరి పదను బెట్టినవి. సాత్విక ఆత్మబలిదానము చేయజాలనిపనిని, ధర్మపాలిత నిరోధక శక్తి పూర్తిజేసి, టిప్పూనిరంకుశాధికార వీర్యాన్ని విరుగగొట్టి, దుర్బలముజేసి, అనపాయకరము జేసివేసినది. టిప్పు, నారగుండు - కిట్టూరు - బాదామి రాష్ట్రాల మహారాష్ట్రులకు అప్పగించక తప్పిందిగాదు. నిలువున నిలుచున్నట్లే కప్పపుబాకీ 30 లక్షలు చెల్లించి, సంవత్సరాంతం లోపల మరి 15 లక్షలు చెల్లించేటట్లు ఒడబడినాడు. ఇప్పుడు మహారాష్ట్రులు ముస్లింలవలెనే స్వల్పులుగా ప్రవర్తించదలచుకొని యుండిన టిప్పూ సుల్తాను ఆజ్ఞాపాలనంలో మొన్నమొన్ననే హిందూవులపట్ల ఘోరముగ ప్రవర్తించిన మౌల్వీలను - మౌలానాలను నిరపాయకరమైన హిందు శిఖధారణానికి బలవంతంగా పాల్పడ జేసియుందురు. కానీ మహారాష్ట్రులు మసీదుల ధ్వంసము చేయలేదు. మహమ్మదీయ స్త్రీల చెరబెట్టలేదు. పరమతాన్ని న్యూనపరచలేదు. కత్తులు ఝళిపించి బలవంతంగా హిందూ మతములోకి కలుపుకొనలేదు. వారు కొరానును తైమూరు - ఔరంగజేబు— టిప్పూ సుల్తానులు అర్థముచేసుకొన్న విధమును అంగీకరించలేదు కాబట్టే, యిట్టి "వీరోచిత కార్యాలు" వారిశక్తికి మించినవిగా వుండినవి. విశ్వాసకులు మాత్రమే అట్టి దౌష్ట్యాల దురాకృతాలచేయ అర్హులుగాని, కాఫిరులకు వాటిని నెరప యోగ్యతలేదు.

---

## 21. సవాయి మాధవరావు (II)

దక్షిణాపథంలో, టిప్పూ మతావేశ క్రౌర్యం బారినుండి హిందువుల రక్షించి, ఉత్తరాన - విరోధులు ఏర్పరచుకొనిన బలవత్తర కలయికను భేదించుటకు మరల యిప్పుడు మహారాష్ట్రసైన్యాలు తమశక్తిని కేంద్రీకరించగలిగినవి. ఇంతవరకు మాధవజి సింధియ యీ శత్రుపురోగమనాన్ని ఏకాకిగానే అరికట్టుచుండినాడు. సాల్‌బాయి సంధి తర్వాత సింధియ ఉత్తరం బయలుదేరి పోయినాడు. ఐరోపీయ సేనాపతులు దిద్దితీర్చిన సైన్యాల కట్టుబాట్లు, సమర్థత, నైపుణ్యాలు మాధవజీకి బాగా నచ్చినవి. ఐరోపీయ ఫక్కీలో సైన్యాల క్రమశిక్షణంలోబెట్టి కవాతులునేర్పి తీర్చి, ఒక సక్రమ సైన్యశాఖను విరివిగా ఏర్పరచుటకు భారతీయ సేనాపతులలో, పానిపట్ మహారథి సదాశివరావుభావు మొదటివాడు. ఈ పద్ధతిని విశేష వ్యాప్తికి గొనివచ్చుటే సింధియా తన ప్రథమకర్తవ్యంగా భావించుకొన్నాడు. మాధవజి, ఒకపెద్ద సేనను ఫ్రెంచిసేనాని - దబాయిఞ్ శిక్షణం క్రింద బాగుగ తీర్పించి, మంచి ఆయుధసంపత్తినిగూర్చి, ఏ ఐరోపీయ సైన్యంతోనైన మోటుకొనజాలినదానినిగా సృష్టించినాడు. ఈ అజేయ బల సహాయంతో, సింధియా ఉత్తర హిందూస్థానంలో ఏ బలాన్నిగాని అణచ గలిగి యుండినాడు. ఇంగ్లీషువారు, ఢిల్లీ సామ్రాజ్య రాజకీయ రంగం నుండి నిష్క్రమించి, మహారాష్ట్రుల యిచ్ఛాధీనముచేతుమని వాగ్దానము చేసి యుండినను, విరాగాన్ని పెంపొందజేయుటకును, మాధవజీ కార్యాలకు నిరంతరాయమైన అవరోధాల కల్పించుటకు వారు రహస్యముగ ఓపినంత వరకు ప్రయత్నములు చేస్తూనే వుండినారు. ఢిల్లీ పాదుషా - షా ఆలము మహారాష్ట్రుల చేజిక్కకుండా తమ ఆధీనమునందే నిలిచియుండుటకు విశ్వప్రయత్నాలజేసినారు. చివరకు యీ వక్రమార్గాలన్నీ విఫలమైనవి. సామ్రాజ్య

రాజకీయ సూత్రాల గట్టిగా మాధవజీ తన చేతబట్టుకొన్నాడు. పాదుషాను ఢిల్లీకి తీసుకొనివచ్చి, వజీరు పదవికి కలహించుచుండిన వారసులనందరిని తుదముట్టించి, ఐరోపీయ - ముస్లిం ప్రతిపక్షుల పరితాప - అసూయ కుంభాలు పొంగి పొరలునట్లు, తన్నే మొగలువజీరుగా పాదుషాయే ప్రకటించునట్లు జేసి, ముస్లిం సామ్రాజ్య శవపేటికను కడపటి చీలగొట్టి బిగించి వేసినాడు. షాఆలం పాదుషా, తన సామ్రాజ్య సైనికదళాలకు సింధియాను సర్వసేనాధిపతిగాజేసి, ఢిల్లి - ఆగ్రా రాష్ట్రాలపాలనము ఆయన హస్తగతముచేసినాడు. ఇంతేకాదు, మొగలు పాదుషా, పీష్వాకు వజీర్ - ఇ - ముతాలిక్ అను బిరుదము ప్రసాదించి, పాదుషాపేర ఒక రాజాధిరాజుగ సర్వము వ్యవహరించుటకు పీష్వాకు అధికారమిచ్చినాడు. దీనికి ప్రతిగా పీష్వా పాదుషా సొంతకర్చులకు 65 వేలనిచ్చి, సార్వభౌముడన్న వెలితి సంతోషాన్ని అనుభవింప నిచ్చినాడు.

రాజ్యాంగంలో జరిగిన యీ తీవ్రమైన మార్పు నాటి పరిస్థితులలో కలిగించిన అలజడిని ఒక మరాఠిలేకరి యిట్లా వ్రాస్తున్నాడు :—"సామ్రాజ్యమే మనదైంది. ముసలి మొగలుపాదుషా మన పోషకభృత్తైకజీవి. మనమిచ్చు ప్రసాదాన్ని తానే కోరి తృప్తిపడుచున్నాడు. ఇంకా ఆయన పాదుషా అనే పిలువబడుచున్నాడు - ఆయనకు కావలసింది యింతే! ఈ నాటకాన్ని మనము మరికొంతకాలము సాగించవలెను." ఇంగ్లీషు వారుగూడ యిట్టి పరిస్థితులలో యిట్టి తంతునే 1857 వరకు నడిపినారు. ఈ సంఘటనను పురస్కరించుకొని, మాధవజి సర్వహిందూత్వానికి ఒక ఉదాత్త నైతిక ప్రబోధము గావించి ఘనపరచ సంకల్పించుకొన్నాడు. ఈ హిందూశక ప్రారంభసూచికంగా, భారత సామ్రాజ్యంలో గోహత్య నిషేధింపబడింది. ఈ రాజ్యాధికారాన్ని మాధవజి ఒట్టి నోటిమాటలతో పోనీదలచుకోలేదు. మహారాష్ట్రులు ఒక్కరే ఎంతోకాలము రాజులుగా

వుండలేరు; వెంటనే వివిధ వ్యతిరిక్తశక్తులనెల్ల స్వాంతనపరచి, వాటి నన్నిటిని ఒకటిగాజేసి. మహారాష్ట్రమండలి యాజమాన్యాన నడువగలిగిన ఒక ప్రచండభూరి హిందూసామ్రాజ్యంగా సృష్టించ ప్రయత్నించినారు. మాధవజి మొట్టమొదట, ఇంగ్లీషువారినే పాదుషాకు కొరవబడిన కప్పాన్ని. మహారాష్ట్రుల చౌతు - సరదేశముఖులను చెల్లించమన్నాడు. తర్వాత, తామే స్వతంత్రులమని భావించుకొని ప్రవర్తిల్లుచుండిన ఢిల్లీ ఆగ్రారాష్ట్ర రాజప్రతినిధుల జమీందారుల అధికారం తగ్గించి, వారివద్ద శిస్తువసూలు జేసినాడు. ఇది ఉత్తరాన ఒక పెద్ద సుడిగాలిని రేగగొట్టింది. జాగీరు దార్లు - అమీరులు - ఖానులు అందరూ మహారాష్ట్రాధికారముపై తిరుగ బడినారు. ఇంతేకాదు, భారతదేశంలో హిందూ సామ్రాజ్యాన్ని నెలకొల్పి పోషింపగలిగిన తమ స్వమత మహారాష్ట్రులమీదికి రావులు రాజాలుగూడ రేగినారు. వారందరితో ఆంగ్లేయులు కలిసినారు. ఇది సహజమైనప్పటికిని దురదృష్టము. జయపురము - యోధపురములు రెంటు, యింతవరకు ముస్లింలు - ఇంగ్లీషులకు వ్యతిరేకంగా కూర్చగలిగిన బలానికంటే అధిక తరమైనశక్తితో ఒకటై, ఉత్తరహిందూస్థానమందలి వివిధ ముస్లింరాజ్యాల సహాయంతో సింధియా బలాలతో లాల్‌సోటె దగ్గర పెద్ద యుద్ధంలో తల పడినారు. పోరు ముమ్మరంలో, పాదుషా ముస్లింబలాలు, నిర్దిష్టకాలంలో సింధియాపక్షం పరిత్యజించి; రాజపుత్రుల జేరినవి. ఇట్లు హఠాత్తుగా వంచింపబడిన మహారాష్ట్ర సైన్యం ఓడిపోయింది. అకస్మాత్తుగా పైబడిన యీ పరాజయంవలె మహారాష్ట్ర సత్తాను పరిక్షించినది మరియొకటిలేదు. విరుగని శౌర్యంతో, ఆయన చెదరినబలాల కోల్తలపరచుకొనినాడు. ఆగ్రా దుర్గాధిపతి మహారాష్ట్ర వీరుడు లఖోబా దాదా అచల స్థైర్యంతో ప్రతిఘటించి నిలిచి, శత్రుజృంభణాన్ని అరికట్టి అణచివేసినాడు.

ఆదేసమయంలో, మహారాష్ట్రులు మరువని, మన్నించని నజీబు

ఖానుని మనుమడు, గులాంకాదరు రంగంలో ప్రవేశించినాడు. ఇతడు పఠానులు - రోహిల్లాల సహాయం చేకూర్చుకొని మాధవజి చేతులనుండి ఢిల్లీని లాగుకొనజూచినాడు. అవివేకి ఆ పాదుషా కాదరును ప్రోత్సాహ పరచుటచేతనే అతడు ఢిల్లీప్రవేశించినాడు. ఈసమయంలో అన్నిప్రక్కలా తనపై తిరుగబడిన ముస్లిం రసపుత్రబలాలతో సింధియా ఆగ్రాప్రాంతంలో పెనగులాడుచుండినాడు. ఉత్తరదేశంలో పరిస్థితులెట్లా అపసవ్యంగా తిరిగినవో వాటి సవిస్తారమంతా సింధియా నానాకు ఎరుకపరస్తూ, వీటికంతా ఆంగ్లేయుల హతాశే మూలమని స్పష్టీకరించినాడు. ఆంగ్లేయులు మహారాష్ట్రులతో ముఖాముఖి ఎదుర్కొనలేకపోయినారు; ఢీకొనదలచిన ప్రథమ ప్రయత్నములోనే దంతభగ్నమైంది. ఇక ఏపాటి అయినా సార్వభౌమాధికారమును పాదుషాపేరును మహారాష్ట్రులను ఉపయోగించుకోనిచ్చిన ట్లయిన, ప్రస్తుతం ఆచరణలో నెలకొనియున్న తమ సర్వాధికారాన్ని ఇంతవరకు మరుగుపరచుచుండిన నటన అనే ఆ పలుచని తెరనే పెరికి పారవేసి, బహిరంగంగా తమ అధికారమును ప్రకటింతురని ఇంగ్లీషువారికి బాగా తెలియును. కాబట్టే, ఎట్లనైనా, బచ్చెనబొమ్మ పాదుషా అయిన ఆ వృద్ధమొగలుని సర్వాధికారాల తమహస్తగతం చేసుకోవాలని ఉత్కంఠతో ప్రయత్నిస్తుండినారు. వీరసేనాపతి సింధియా, స్వదేశ మహారాష్ట్రులను ప్రబోధిస్తూ నానాఫడనీసుకు వ్రాసినలేఖలో యిట్లా ఎచ్చరించినాడు :-

"మనము మనేది, యత్నించేది, చివరకు చావనున్నదిగూడ యీ మన అఖండ హిందూసామ్రాజ్యానికేనన్న సంగతి మనము మరచిపోకుందుము గాక! మన సంయుక్త రాజ్యమండలి ఏకైకనాయకుడే మనభక్తి విశ్వాసాల గమ్యమన్న విషయమునుగూడ మరువరాదు. కాబట్టి, స్వార్థచింతల, అసూయభావాలనెల్ల మనము విడనాడవలసివున్నది. మీలో ఎవరైనా నా సదుద్దేశాల సంశయించుచో, అట్టి అపోహల పారద్రోలవలసిందని

మిమ్ము వినయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. మత్సరగ్రస్థులైన నిందావ్యాప కులే మన యథార్థ శత్రువులు. మనమధ్య స్పర్థలరేపి, తమ కులాయాలకు మెత్తని పొత్తికల గూర్చుకోదలచుకొనిన ఆ శత్రువులనుగూడ నేను మహారాష్ట్రమండలికి జేసిన ఊడిగము నోరెత్తనీయకుండ జేయగలదు. సమయోచితంగా మన అర్హతను మనము చూపవలసిన తరుణమిది. లెండు! మన జాతీయ జయపతాకముక్రింద ఏకముకండు. మన పుణ్యపూర్వులు మనచేతులలోబెట్టిన మనజాతి యోగక్షేమాల, మనజాతీయ పరమ లక్ష్యాన్ని అఖండ హిందుస్థానములో మనము పాలింపవలెను. మన మహత్తర సామ్రాజ్యము ఛిన్నాభిన్నమై పతనముకాకుండ మనము కాపాడవలెను."

మన దేశసౌభాగ్యము అపాయస్థితిలో వున్నప్పుడు, యిట్టిమహోదాత్త జాగరణశంఖారావాల, నానా ఉపేక్షాభావంతో పెడచెవిన బెట్టునంతటి కాపురుషుడుగాడు ఇంతకుముందే, నానా టిప్పుతో యుద్ధంసాగిస్తూ, అతడు తగినంతమట్టుకు అణిగిపోగానే, సింధియా సహాయార్థం హోల్కారును, అలిజబహాదరును ఉత్తరం పంపినసంగతి మనకు తెలిసినవిషయమే: తమ పితామహ, ప్రపితామహుల ఘనతర స్వప్నవాంఛలు సారూప్యాన్నిపొంది, ఒక మహత్తర హిందూసామ్రాజ్యము నెలకొల్పబడి, తన విశాలవక్షాన యావద్భారతావని ప్రజలు సుఖంగా విశ్రమింపనుండిన ఆశుభ సమయంలో, మహారాష్ట్రులు - రసపుత్రులు ఒకరిపై నొకరుకవిసి, హిందూత్వ విరోధులు మరల తలలెత్తు అవకాశమును కల్పించినందులకు నానా చాల కష్టపడినాడు. కాబట్టే, ఆయన రసపుత్రులతో - ముఖ్యంగా జయపూరు రాజుతో పేష్వాపేర సఖ్యముచేసుకొన ప్రయత్నించినాడు. హిందుమత విరోధులతో చేతులుగలపవలదనియు, మహారాష్ట్రులు ప్రతిష్ఠించిన హిందూసామ్రాజ్యముతో ఎట్లనైన సయోధ్యపడవలయుననియు

వారిని బ్రతిమాలినాడు. పునహనుండివచ్చిన సేనల సహాయంతో మాధవజీ త్వరలోనే శత్రువులనెల్ల అణచివేసినాడు. పానిపట్ కారకుడు నజీబుఖాను మనుమడు - గులాంకాదరును ఎదుర్కొనను సింధియా, బాజాఖాను, అప్పాఖాండేరావు - మరికొందరు మరాఠి నాయకులను, పరాసు సేనాని తరిఫీదుచేసిన రెండు పెద్ద పటాలాలతో పంపినాడు, మహమ్మదీయులు నిలువబడి యుద్ధంచేయ దలచుకొన్నారు. తీవ్రయుద్ధం జరిగింది; ఫలితం మహమ్మదీయులకు పెడదిరిగింది: వారు యథాప్రకారం విరిగి, ఓడి, పరుగెత్తి నానాముఖాలుగా చెదరిపోయినారు.

ఇస్మాయిల్ బేగ్, గులాంకాదరులు తమ మడిమలద్రొక్కి వెన్నాడే మరాఠిదండుముందు ఢిల్లీవైపు పరుగెత్తినారు. పాదుషా ముచ్చెమటలతో గజగజ వణకిపోయినాడు. గులాంకాదరు ధనాన్ని కోరినాడు; పాదుషా యివ్వలేకపోయినాడు. దీనితో కోపోద్రిక్తుడై ఆ ఆరణ్యకరోహిల్లా లెక్క ప్రకారం దుర్మార్గానికి కడంగి, కొల్లగొట్టి, చంపి, స్త్రీల చెరచి, ఆ నగరాన్ని పాడుబట్టించినాడు. కాదరు పాదుషాను తక్తుమీదనుండి క్రిందకి యీడ్చి పడద్రోసి, వెంటనే మోకాటిదండెతో అతని రొమ్ముమీద కూర్చొని, అక్బరు - ఔరంగజేబుల సంతతివాడైన ఆ వృద్ధ అసహాయ పాదుషా కండ్లను పిడిబాకుతో పొడిచి, కుందివేసినాడు. ఈ హింసతో తనివిదీరక, గులాంకాదరు, పాదుషా శుద్ధాంతమందిరం ప్రవేశించి, రాణివాస స్త్రీలను బయటకుయీడ్చి గుడ్డలు ఒలిచి, చీకాకుపరచి, తన నీచ సేవకులచేత తనకట్టెమటనే తన పాదుషా భార్యల, పుత్రికల మానాపహరణ చేయించి, పైశాచికానందాన్ని అనుభవించినాడు. ఈ అమానుషక్రోధానికి కారణం - గులాంకాదరుకు కౌమారదశలో పాదుషా - షా ఆలం పురుషాంగాల తీయించివేసి, నిర్వీర్య నపుంసకుని జేసివేసినాడు. పట్టణంలో దోపిడి తిరునాళ్ళ అయింది. తమ పవిత్ర ఇస్లాం మతంపేర, అన్యమతస్థులపై

నెరపిన ఘోర అత్యాచారములనే. మహమ్మదీయులు మహమ్మదీయులపై గావించినారు. బయటి దౌష్ట్యానికి అలవాటుపడిన నిరంకుశుడు చేతులనిండా పనిలేనప్పుడు ఇంటనే దౌష్ట్యాన్ని సాగిస్తాడు! ఇప్పుడు ముస్లింపాదుషాను రక్షించువారెవరు? మహమ్మదు ప్రవక్త ఆరాధకులైన యీ హృదయ శూన్య విషాధులు నెరపు క్రూరహింసలనుండి, పశుతుల్య మానాపహరణాల నుండి ముస్లిం బాలికలను, పౌరులను ఎవరు రక్షించగలరు? ఇంకెవరు? కాఫిరులైన మహారాష్ట్రహిందువులే! ఢిల్లీ మొగలు సింహపీఠాన్ని అధిష్ఠించిన యీమహమ్మదీయులు ఆపట్టణంలో ప్రవేశించిన ఆ ప్రధమ తరుణంలో— హిందూ పవిత్రాలయాల నేలమట్టంచేసినారు; ఆత్మనిధులైన దైవవిగ్రహాల చూర్ణముజేసి ధూళిలో గలిపినారు; రాణుల, రాజపుత్రికల బలవంతంగా హరించి వుంపుడుకత్తెలుగా జేసుకొని, జనానాలలో బంధించినారు; కన్యల మానాపహరణము తరుణపురుషుల మతాపహరణాల గావించినారు; ప్రేమ పూర్ణ మాతృవక్షంనుండి బిడ్డను, భ్రాతృ ఆశ్లేషనుండి సోదరుని పెరికి వేరుజేసినారు; ఇహములో గాజీలు (దిగ్విజయులు) మతపరిత్రాణులని కీర్తి ప్రతిష్ఠల సంపాదించుకొని, పరములో అర్హోచిత బహూకరణముల బంగారుపంట పండించుకోను, తమ చేతులను, హృదయాలను హిందూ రక్తసిక్తారుణిమములు జేసుకొన్నారు. ఇట్టి హృదయవిదారణ దురదృష్టానికి పాల్జేయబడిన హిందువులే యిప్పుడు ఆ ఢిల్లీలో ప్రవేశిస్తున్నారు! కాని, వారు మసీదుల ధ్వంసముచేయుటకు వచ్చుటలేదు; చంద్రవంకల తునకలజేసి, సమాధుల పెళ్ళగించను రాలేదు; దరిద్ర ముస్లిం కర్షకకుటిలోని అసహాయ బాలికనుగాని, అధికారమదంతో విర్రవీగిన నవాబు పుత్రికనుగాని చెరచుటకు - కాదు కాదు, తాకుటకుగూడ వారందు ప్రవేశించుట లేదు; బలవంతంగా స్వమతంలోకి కలుపుకొని, బిడ్డనుండి తల్లిని - కొడుకు నుండి తండ్రిని వేరుజేయను దండెత్తలేదు; విధ్వంసక మధుపానగోష్ఠిలో

విచ్చలవిడిగా విహరించనుగాని, రక్తపానంలో మత్తెక్కనుగాని హిందువులు యిప్పుడు తమ యుధిష్ఠిరుని రాజధానిలో ప్రవేశించుటలేదు; రణనిహతులైన శత్రువుల తలలు తరిగి రాసిబోసి, దానిబీభత్స పరిమాణంతో గాని పట్టణాన్నంతా ఆహుతిగొన్న తీవ్రానల జ్వాలా వూర్ధ్వగమనంతో గాని తమ కీర్తిని కొలుచుకోదలచి మహారాష్ట్రులు మొగలురాజధానిలో చొరబడలేదు, హిందువులు అట్లే ప్రవర్తించదలచుకొనియుండిన అడ్డు పెట్టువారులేరు; ఒకవేళ వీరట్లు చేసివుండినప్పటికిని మహమ్మదీయులు మాత్రం వీరిని నిందించియుండలేరు. ఆ సమయంలో ఆ రాజధానినే - ఆ సింహాసనాన్నే - ఆ ముస్లింపాదషానే - తోడిముస్లిం హంతకుల పైశాచిక క్రూరబాహుబంధాలనుండి రక్షించి, ఇస్లాంసింహాలు నెరపుచున్న ఘోరాల అత్యాచారాల తుదముట్టించనే హిందూ సైన్యాలు మహావేగంతో ఢిల్లీకుడ్యాల సమీపిస్తుండినవి. పట్టణ సమస్తజనము మహారాష్ట్రసైన్యాగమనానికి దేవుళ్ళకు మ్రొక్కింది. హిందూ మహమ్మదీయపౌరులు ఏకంగా, హిందూసామ్రాజ్య సైన్యాలు నగరుద్వారాలు ప్రవేశించగానే హృదయపూర్వక స్వాగతమిచ్చినారు.

అలిజ బహదూర్, అప్పా ఖాందేరావు, రణఖాన్, సమరదేశికుడు-పరాసు దబాయిన్ మొదలగువారు నగరాన్ని స్వాధీనపరచుకొన్నారు. కాని, అప్పటికే ఆ సైతాను గులాంకాదరు పట్టణంవదలి పరుగెత్తి పోయినాడు. మహారాష్ట్రులకు వంశానుగతవైరి - నజీబుఖానునికి వీడు మనుమడు. కాని, తన దుర్మార్గానికి తగిన శిక్షను అనుభవించక తప్పించుకోలేడు. మొగలుపాదుషా పూర్వం మేలుజేసిన మహారాష్ట్రులకు వ్యతిరేకంగా నజీబుతో కలిసి వారికి పానిపట్టు ముప్పును దెచ్చిపెట్టినట్లే, యిప్పుడుగూడ మరల మొన్నమొన్ననే మరాఠులపై తంత్రాలుపన్ని ఆ పానిపట్ నజీబు మనుమడు యీపోకిరి గులాం కాదరుతోనే కలిసి, స్నేహితు

లకు ద్రోహచింత దలచియుండినప్పటికిని, హింసాలౌల్యములైన ఆ ముస్లిం కర్కశ హస్తాలనుండి ఔరంగజేబు వంశాంకురమైన ఆ అభాగ్యపాదషాను అతని అంతఃపుర జనాన్ని కాపాడుటకు మహారాష్ట్రులు మానవాధీనమైన సమస్త యత్నాల జేసినారు. మీరటు కోటలో దాగుకొన్న గులామును పట్టుకొనను ఒకదండు పరుగెత్తింది. అక్కడ అతడు తీవ్రంగా ప్రతిఘటించినాడు. కాని, ఎంతోకాలం నిలువలేక, ఒక గుర్రాన్నెక్కి కాలికొంది పరుగెత్తిపోయినాడు. ఆకాతర పలాయనంలో గుర్రంమీదనుండి విరుగబడి, మూర్ఛలో మునిగి పడివుండినాడు. పరిసర గ్రామస్థులుచూచి, గుర్తించి, అతనిని మరాఠిదండు విడిదికి ఎత్తుకొనిపోయినారు. అప్పుడు ఆ దయ్యానికి తగిన క్రూరశిక్షను విధించమని అందరికంటె మహమ్మదీయులే బిగ్గరగా అరచినారు. ఆ దుష్టుని సింధియా మ్రోలనిలిపినారు. మూడు తరాలుగా గులాంవంశము, సింధియాపట్ల తీరని పగబూనియుండింది; వాటి అన్నిటి ఋణాన్ని గులాం చెల్లించవలసివున్నది. కాదరును ఒక్కొక్క అంగముకోసి హింసించినారు; వాడినోరు పొగరుపాటు పడుతూనే దూషిస్తుండింది. నాలుకకోసి, కండ్లు పొడిచివేసినారు. చివరకు ఛేదిత సర్వాంగాలతో వికృతభయంకర రూపుంతో వుండిన నజీబు మనుమడు - గులామును మొగలు సామ్రాట్టు దర్బారుకు పంపినారు. తన్ను ఘోరయాతనకు పాల్జేసిన ఆ మానవ పిశాచానికి తగినట్లే ఘోర దుర్మరణము సంభవించినదో లేదో అను విచికిత్సలోవుండి ఆతురపడుచుండిన ఆ పాదుషా మనసు యిప్పుడు శాంతించింది. ఈవిధంగా, పానిపట్ పొలికలనులో మహారాష్ట్రుల నాశనంచేస్తానని ప్రతిజ్ఞబూనిన నజీబుఖానుని వంశము, చివరకు, ఆ మహారాష్ట్రులచేతులలోనే ఢిల్లీలో తుదముట్టింది. ఆతర్వాత, ఆ కుటుంబపు పొలుకువగాని, వారి రాజ్యపు అలుకుడుగాని లేకుండానే పోయింది.

# 22. సవాయి మాధవరావు (III)

1789 ప్రాంతానికి, మాధవజీ యుతర మహారాష్ట్రసేనాపతుల సహాయంతో ప్రతిపక్షులనెల్ల అణచగలిగినాడు; ముస్లింకుట్రల తుదము ట్టించి, దాని నాయకుల ఓడించి, వారి సహాయకులు - రసపుత్రుల పీచ మణచినాడు. సర్వాంగ సైనిక బలప్రదర్శనంతో ఇంగ్లీషు మొగసాలలో గర్జించి, సమయోచితజ్ఞానమే శౌర్యానికి మెరుగుబెట్టేగుణమని వారికి నేర్పించి, ఆంగ్లేయశక్తిని ఉడిగింప జేసినాడు. తిరిగి ముసలిమొగలు పాదు షాను తమవశము చేసుకొన్నారు. మరల నెనరు అప్పుతీర్చుకోను పాదుషా, వకీల్ - ఇ - ముతాలిక్ అను ఉన్నతోన్నత సామ్రాజ్య బిరుదప్రదానం చేయబోగా, సింధియా తన ప్రభువు బాలపేష్వా గౌరవార్థము అది వలదని నిరాకరించినాడు.

ఇట్లు, మహారాష్ట్రబలాలు ఉత్తర హిందూస్థానంలో చేయితీరని పనిలో వుండగా, దక్కనులో మరల టిప్పు ఒకచెయ్యిచూడదలచుకొ న్నాడు. 1798 లో అతడు ధిక్కారరూపాన్నిదాల్చినాడు. టిపు, మహారా ష్ట్రులతో ప్రత్యక్ష విరోధానికి దిగదలచుకోకుండానే రాజ్యాన్ని విస్తరించుకో దలచినాడు. కృష్ణకావలిగట్టున మహారాష్ట్రులుండుటచే అటు వీలుకాలేదు. అందుచేత, దుర్బలుడై తన రాజ్యాన్ని ఆనుకొనివున్న తిరువాన్కూరు రాజుపై బడినాడు. నానా, ఇంగ్లీషులు నైజాముతో కలిసి, పట్వర్ధను ఆధిపత్యాన ఒక సైన్యాన్ని టిప్పూరాజ్యంపైకి బంపినాడు. ఇందు గమ నించదగిన విషయమేమిటంటే - మహారాష్ట్ర సైన్యాలు ముందుకుసాగి పొయ్యే కొలది స్థానికపౌరులు మైసూరు సుల్తాను, ఆ మతావేశ నిరంకుశ త్వానికి వ్యతిరిక్తంగా హిందూసైన్యాలకు సహాయపడినారు. టిప్పు నియ మించిన ఉద్యోగుల పారద్రోలి, నిలువవుండిన శిస్తువసూలు చేయుటలో

వారు చాల సహకారమును జూపినారు. హుబ్బళ్లి, ఘోన్‌దవాడ్, మిశ్రికోట పట్టణాల స్వాధీనముచేసుకొని, మరాఠిదండు నిర్నిరోధశక్తితో పురోగ మించినది. ఈమధ్యనే టిప్పు స్వాధీనపరచుకొనిన ధార్వాడను ముట్టడించి నారు. దాన్ని పాలిస్తుండిన మహమ్మదీయ దండనాయకుడు లొంగలేదు; మహారాష్ట్రిలు వలదన్నను వినక, ఇంగ్లీషుసైన్యాలు విజృంభించి కోటను పట్టుకోను యత్నించి, అపారనష్టంతో విఫలులైనారు. యుద్ధం వగదెగ లేదు; యిరువాగులవారు చాలా పట్టుదలతో సాగించినారు. చివరకు మహా రాష్ట్రిలు ప్రజ్ఞాశోభితమైన క్షాత్రంతో దెబ్బమీద దెబ్బగొట్టి దుర్గాన్ని పట్టు కొన్నారు. పాన్సె - రాస్తె మొదలగు మరాఠి మొనగాళ్లు తుంగభద్రను దాటి, శాంతి, బదనూరు, మెయికొండ, హపెనూరు, చెన్నగిరి మొదలగు - శత్రు ఆక్రమిత ప్రదేశాల తిరిగి పట్టుకొన్నారు. మహారాష్ట్రి నావికాబలము వూరకుండలేదు: అది పరమటి తీరానికంతా కాపుండి, జయయానంలో కార్వారు హన్నసారు ప్రాంతాలనుండి అనేకమంది ముస్లిం అధికారులను పారద్రోలింది. నరసింగరావు దియోజి, గణపతిరావు మహెందాలె ఆదిగా గల మహారాష్ట్రాధికారులు ఛందవర్, హోనవర్, గిరిసప్ప, ధారేశ్వర్, ఉదజని పట్టణాల స్వాధీనము చేసుకొన్నారు. ఆ తర్వాత సర్వమహారాష్ట్రి సేనలు శ్రీరంగపట్టణంమీదికే నడిచిపోయినవి. అదేసమయంలో మరి యొక వైపునుండి కార్న్‌వాలిస్ నడిపిన ఇంగ్లీషుసేనలు పైబడుచుండినవి. కాని, టిప్పు ఆ సైన్యాల ముప్పతిప్పలుబెట్టి కూడునీళ్ళు లేకుండామాడ్చి, ఎండబెట్టి అలయింపజేసినాడు. పాపం! వాళ్ళకు దినానికి ఒకపూట తిండే కరవైంది. అశ్వదళం - గడ్డిలేక, తిప్పలు తిప్పలుగా చచ్చిపడి, అశ్వకుల నందరిని పదాతుల జేసింది. ఆకటమాడిన అనిస్సహాయక స్థితిలో, సర్వ అవసరాలతో భోగాలతో కలకలలాడుచుండిన అంగడివీథివలె బయలుదేరి వస్తుండిన సర్వసాంబారయుత మహారాష్ట్రి సైనికావళిని చూడగానే

ఆంగ్లేయసేనకు గలిగిని సంతోషాన్ని ఏమనిచెప్పుదుము! హరిపంతు ఫడ్కె కృశించిన మిత్రశిబిరాన్ని సేదదీర్చను మానవోచిత ఔత్యుక్యాన్ని ప్రదర్శించినాడు. ఆ సంయుక్తసైన్యాలు పదిదినాలు ఒకటిగానే వుండినవి. కావాలని అనుకోని వుండినట్లయిన మహారాష్ట్రిలు టిప్పూ రాజ్యాన్ని ఆనవాలులేకుండానే ఆణచివేసివుందురు. కాని, నానా రాజ్యతంత్రము టిప్పూ సుల్తాను సంపూర్ణ వినాశనానికి అనుమతించలేదు. మదరాసు ఆంగ్లేయుల ఆశాతంత్రాలకు ఒక అనువైన నిరోధకశక్తిగా టిప్పూను మరికొంతకాలము సాగనీయదలచుకొన్నాడు. మరికొంత ఘర్షణ తర్వాత మరాఠులు - ఆంగ్లేయులు రెండుప్రక్కలా బాగా వుతికినతర్వాత, టిప్పు హీనాతి హీనమైన సంధికి ప్రాధేయపడినాడు. మహారాష్ట్రినాయకులు ఇంగ్లీషువారిని ఒప్పించి సంధికి ఒడబరచినారు. దీనిప్రకారం టిప్పు - తనరాజ్యంలో సగం మహారాష్ట్రిలకు అప్పజెప్పి, నష్టపరిహారానికి 3 కోట్లు చెల్లించినాడు. తిరువాన్కూరు హిందూసంస్థానం జోలికిపోనని బాసజేసినాడు. సత్ప్రవర్తనకు పూచీగా అతని పుత్రులను యిద్దరిని మిత్రసైన్యాలు తమ ఆధీనమందుంచుకొన్నవి. విజయఫలాన్ని - మహారాష్ట్రిలు, నైజాము, ఇంగ్లీషులు సమానంగా పంచుకొన్నారు. తదనుగుణ్యంగా మహారాష్ట్రిలకు 90 లక్షల రాబడినిచ్చే విశాలరాజ్యభాగము, ఒక కోటి నష్టపరిహారము లభించింది. ఇట్లా టిప్పూతోడి మూడవయుద్ధం జయప్రదంగా ముగిసింది. 1792 లో మహారాష్ట్రిబలాలు జయగౌరవంతో, ప్రశంసాపాత్రమైన రణకౌశలంతో తమరాజధానీ నగరాన్ని చేరుకొన్నారు.

ఇట్లే, ఉత్తరదిశా దిగ్విజయానికి పోయిన మహారాష్ట్రి సేనాపతి గూడ, అద్భుత గౌరవాలతో ధగద్ధగాయమాన యుద్ధ విజయాలతో, మహారాష్ట్రిరాజధానీ నగరోన్ముఖుడై బయలుదేరినాడు. దక్షిణంలో, టిప్పు మతావేశ దౌష్ట్యంనుండి హిందూత్వాన్ని ఉద్ధరించి, శాంతిభద్రతల

నెలకొల్పిన ఫడ్కే - రాస్తేలు; ఉత్తరాన శాంతి నెలకొల్పి, నామమాత్రక సామ్రాజ్యాధికారాలైన, ఇంగ్లీషు - ఫ్రెంచి - పఠాను - రోహిల్లాల తీవ్ర విరోధాల ప్రతిఘటించి, వంచి, చివరకు ముస్లిం మొగలు సామ్రాట్టునే హిందూసామ్రాజ్యమిచ్చు పోషక భృతిమీద ఆధారపడునట్లు జేసిన మాధ వజి సింధియా, యీ వీరసింహాలు పునహాలో జయధ్వాన ముఖరిత వాతావ రణంలో సమావేశంకాగానే, వివిధ రాజ ఆస్థానాలలో అలజడిరేగి, దాని భవిష్యత్తునుగూర్చి నిశ్చేష్ట - భయోత్పాదాల గలిగించింది. ఈ సమావేశ కారణోద్దేశాలేమి ? అజేయ మహారాష్ట్ర హిందూరాజ్యమండలి మానసము ఏ లక్ష్య లగ్నమైంది ? ఏ రాజ్యాన్ని కబళింపనున్నది ? అందరిచూపులు పునహాపై ప్రసరించినవి. ప్రస్తుతం ఢిల్లీకి ఎట్టి విలువగాని లేకపోయింది. ఢిల్లీ యిప్పుడు పూనాకు కేవలం ఒకవాడ అయిపోయింది. కాని, మహా రాష్ట్రమే భిన్నదుఃశకునాలవల్ల వ్యాకులపడింది. మహాశక్తులు - నానా, సింధియాలే ఒకరినొకరు ఎదుర్కొన్నారు. ఇది అందరు గమనించిన విషయమే. తిన్నగా సూటిగా వారిద్దరిమధ్య ఒకరుద్ధ పరస్పర ప్రతిపక్ష భావము ఎదుగుచూ, ఆ అకళంక దేశారాధకులకు అన్యోన్యము భయస్వభా వాన్ని కలిగించింది. కాని, ఏ సంస్థ కొన్ని పురుషాంతర మహారాష్ట్ర ప్రజల రక్తస్వేదాలతో నిర్మింపబడినదో - అనన్య సామ్యముగ, యీ యిద్దరు మహాపురుషుల హృదయపూర్వక కృషిచే ఏ రాజ్యాధికార ప్రాభవ ప్రతిష్ఠలు పెంపొందినవో, దేని రక్షణవ్యాప్తులకొరకు యీ రాజనీతి శుక్రుడు, యీ రణరంగ మహారథుడు పాటుబడినాడో అట్టి సంయుక్త హిందూరాజ్యమండలిపట్ల ఆ యిద్దరికి సమానముగ గల మహోన్నతభక్తి విశ్వాసాలే యింతవరకు యీర్ష్యా ఘర్షణము జరుగనీయకుండా ఆపుచుండి నవి. ఆ అణచిపెట్టబడియుండిన ప్రతిపక్షభావం యిప్పుడు బహిర్గతమై ప్రత్యక్ష పోరాటమునకు దిగునా ? ఈ ఘర్షణే జరిగియుండిన హిందూ

సామ్రాజ్యము అభాగ్యము! సర్వమహారాష్ట్రము యీ విషయం భావించు కొని వణకిపోయింది. తమవీరులలో తలమానికము, తమ రాజనీతికోవిద లలో అవతంసము అయిన ఆ రెండు మహాశక్తుల స్పర్థను వూపిరాడని ఉత్కలికతో ప్రతీక్షించుచుండినది దేశము.

ఇంకను, మహారాష్ట్రుల దయాదాక్షిణ్యాలవల్ల సార్వభౌమ బిరుద మును వహించియుండిన ముసలిమొగలు, మాధవజీకి వకీల్-ఇ-ముతా లిక్, మహారాజాధిరాజ బిరుదముల నివ్వబోతే, తనకువలదని, తనప్రభువు పేష్వాకు ఒసంగజేసిన విషయం యింతకుముందే చెప్పియున్నాము. ఇది బూటకపు నాటకముగాదు. ఈ బిరుదాలు అనామక దుర్బల రాజాశ్రితునిచేతు లలో తృణప్రాయాలైనను, బలయుతునిచేత అవి కేవలము శూన్యశబ్దాన్ని కలిగించే మాటలే కాజాలవు; ఇవి సార్వభౌముని పేర రాజ్యాధికారమును సాగించు సర్వాధికారమును ఆ బిరుద గ్రాహకునికి ఒసంగుచున్నవి; యథార్థముగా యివి సార్వభౌముని, తన అధికారమును పరిత్యజింపజేస్తు న్నవి. ఇంగ్లీషువారిమధ్య - మహారాష్ట్రులమధ్య - హింద్వి ఏతరులమధ్య రేగిన హైందవ సామ్రాజ్య కాంక్షాజన్యమైన పరస్పర స్పర్థవలన, ప్రతివా రును, యీ అధికారము - యీ బిరుదావళి నామమాత్రాలైనను మొగలు పాదుషా హస్తగతములుగానే యుండునట్లు చూచుకొన్నారు. నోటితో చెప్పకుండానే అతనిని ఆ పదవీభ్రష్టునిగ జేయుటమేలు. కాని, ఒకసారి అతనిని మహారాష్ట్రులచేతులలోనికి పోనిచ్చిన ఎడల క్రమేపి వారు అతనిని తమ కందనీయకుండా జేతురని ఇంగ్లీషులకు ముస్లింలకు బాగా తెలియుటచే, వృద్ధపాదుషాపట్ల అంధవిశ్వాసాన్ని చూపుటకో అనునట్లు ధూపదీప నైవేద్యాలతో ఆ మొగలును ఆరాధించుటలో పట్టుదలనుచూపి, మహారాష్ట్రులపై పగసాధించనుమాత్రమే అతనిని పాదుషాగా అంగీక రించినట్లు ఒక నాటకాన్ని ఆడినారు. ఉత్తర సర్కారులు ఆంగ్లేయుల

భుజబలభోగ్యాలై తమ పాలనలో వుండినప్పటికిని, షా ఆలంపాదుషా అనుమతితో పాలించుచున్నామని అనిపించుకోను వీరుపడిన తాపత్రయమే నాటి వారి దృక్పథాన్ని విశదీకరిస్తున్నది. ఇక యీ నాటకంలో మహా రాష్ట్రీలుగూడ తమ విరోధులకంటె ఒకవీసంగూడ తగ్గలేదు. కాబట్టే, మొగలు పాదుషా యథార్థ అధికారాన్ని తమపిడికిట బట్టుకొనియుండినప్ప టికిని మహారాష్ట్రీలు యితర ప్రతిపక్షులవలెనే, ఇక మిగిలి పాదుషాచుట్టు వ్రేలాడుచుండిన ఆ సామ్రాజ్య రాచరికాల ఛాయాగ్రహణానికై కొండంత తతంగం చేసినారు. ఆ కారణంచేతనే, మాధవ్‌జి పాదుషా ప్రసాదించిన బిరుదాల మహారాష్ట్రమండలి మహానాయకునికే ప్రసాదించునట్లు జేసినాడు. ఇప్పుడు, చాలాకాలం తదనంతం-ఉత్తరదేశ విజయభూషిత ఫాలతలంతో, స్వజనదర్శనానికై పువ్విళ్ళూరుచుండిన హృదయంతో, ఎదిగి దేవకల్పుడై వెలిగిపోతుండిన తన బాల ప్రభువును కండ్లార చూచుకోర్కెతో మాధవజి సింధియా అంతదూరం నడచి, తమ రాజధాని - పునహా చేరినాడు. అప్పుడు మొగలుపాదుషా యిచ్చిన బిరుదాల ఒక మహోత్సవంమధ్య తరుణపేష్వామూర్ధంపై అభిషేకింప దలచుకొన్నాడు.

ఇట్లు మహాసేనాపతి - సింధియా, పేష్వాకు మహారాజాధిరాజ బిరు దాభిషేకంచేయ యత్నించుచుండగా, బ్రాహ్మణమంత్రి - నానాఫడనీసు నాయకత్వాన ఒకపక్షమువారు, ఇది మహారాష్ట్రఛత్రపతి సాతారాసంస్థానా ధీశునకు కళంకదాయకమని నిరోధించినారు. తమ రాజునకు - రాజ్యానికి ఎట్టి కీడునుగాని కలిగించకయే, ఒక్కొక్కప్పుడు వాటి శ్రేయానికే యిట్టి బిరుదముల గ్రహించిన సందర్భాలు ఎన్నో గలవు. సింధియా, ఎవరిమన స్సునుగూడ నొప్పించగుండా వుండను, యీ బిరుద ప్రదానోత్సవానికి సాతారా ఛత్రపతి అనుజ్ఞనుగూడ బొందినాడు. ఈ రాజనీతిక్లిష్టాన్ని యీవిధంగా తరించగానే, ఒక పెద్ద ఉత్సవంలో వకీలు - ఇ - ముతాలిక్

బిరుదము, ఇనాము, అవిచ్ఛిన్నంగా వంశానుగతంగా సంక్రమించునట్లు పేష్వాకు ఒసంగబడినవి. ఇప్పుడు పేష్వా మొగలుపాదుషా పేర సర్వము సాగించగలిగియుండినాడు. ఇంతేకాదు - ముస్లింసామ్రాట్టు పుత్రులలో ఒకనిని ఆ పాదుషాహీకి వారసుగా నిర్ణయించుటకుకూడ మాధవజీకి అధికార మొసంగబడింది. ఆ బిరుద ప్రదాన మహోత్సవ సందర్భంలో గోవధనిషేధాజ్ఞ మరల బహిరంగ పరచబడింది. సింధియా - నానా తక్కుంగల సర్వమహారాష్ట్రాధికారవర్గము పేష్వాకు కానుకల చదివించినారు, అభినందనాల కురిపించినారు. సర్వ ప్రతిపక్షశ్రేణియొక్క అసూయను ఛేదించగలిగిన అధికారఖడ్గం యిప్పుడు యీ బిరుదగ్రహణంవల్ల మహారాష్ట్రుల హస్తగతమైంది. ఇంతవరకు మొగలుపాదుషాయే సర్వాధికారాలకు కేంద్రమని, మహారాష్ట్రులను న్యూనపరచుటకుమాత్రమే అంగీకరించినట్లు నటించుచుండిన ఆసియా - ఐరోపీయ ప్రతిపక్షులకు యిది పెద్ద పెట్టు. ఇంతవరకు ఆచరణలో సాగుచుండినట్లే - యిప్పుడు శాస్త్రరీత్యా, భారత సామ్రాట్టు - మొదలు పాదుషా పేర, సర్వాధికారాల పాలించి, పాదుషాగానే వర్తించు అధికారము తమకున్నదని నేడు మహారాష్ట్రులు బాహాటముగ సాటినారు. వారు యిప్పుడు సర్వసామ్రాజ్య సేనలకు సర్వసేనాపతులైనారు, సామ్రాజ్య ప్రధానామాత్యులైనారు, సామ్రాజ్య పీఠానికే పాలకుని నిర్ణయించ గలిగియుండినారు; వీటి అన్నిటికిపైన అవిచ్ఛిన్న - వంశానుగతమైన మహారాజాధిరాజులు, వకీలు-ఇ-ముతాలికులు అయినారు.

బిరుదప్రదానోత్సవం కాగానే, పేష్వా పెద్ద వూరేగింపుతో రాజమందిరానికి బయలుదేరినాడు. ప్రజలు వుత్సవాన్ని చూడను మూగిపోయినారు. ప్రజల హర్షధ్వానాలతో, శతఘ్ని గర్జనలతో, యితర యుద్ధయంత్ర రొదలతో రోదసి అదిరిపోయింది. ఉత్సవం రాజసభామందిరం చేరింది. పేష్వా, భారత సర్వసేనాని - మాధవజీని ఉచితరీతి గౌరవించినాడు.

వెంటనే యీ మహారథి సైనికలాంఛనాల తీసివేసి, శీవినివోనాడి ముందుకు నడచి, పేష్వా పాదరక్షల చేతులతో గ్రహించి, "మహాప్రభో! రాజ కుమారులు - రాజశ్రేష్ఠులు - రాణాలు - మొగలులు - తురుష్కులు - రోహిల్లాలు ఆదిగాగల ముస్లింలు, ఫరంగీలు అందరు జయింపబడి మీ దాసులుగ చేయబడినారు. మీరే అఖండ హిందూసామ్రాజ్యానికి ప్రభువులు. ఈ భృత్యుడు తమ జననమాది చేతబట్టిన ఖడ్గంతో దూరదేశాలలో మహారాష్ట్రమండలి సేవలోనే రణరంగంలో నిలిచియుండినాడు. జయింపబడిన దేశా లొసంగిన ప్రతిష్ఠ - పారితోషికాలు - ప్రాభవాలు అన్నిగూడ, తమ పాదసన్నిధిని సేవించ పొడమిన ఆశాదాహాన్నిగాని, మా పూర్వుల ధర్మాన్ని మరల గ్రహించి, తమ సన్నిధానంలో యీ రాజపాదుకల రక్షించి పూజించు కోర్కెనుగాని ఉపశమింపజేయలేక పోయినవి. ప్రభో! మొగలు సామ్రాజ్యవజీరన్న బిరుదానికంటె, మహారాష్ట్రివాణిలో తరతరాలుగా దిగివచ్చిన పటేలు అన్న సామాన్య నామంతో పిలువబడుటే నాకు ఆత్మతృప్తికరము. కాబట్టి దూరభూములలో ప్రయాసపూర్ణమైన చింతలనుండి నన్ను విడిపించి, శాంతిపూర్ణమైన తమసేవకు అనుజ్ఞ నొసంగుడు. మా పూర్వులవలెనే తమకృపాపాంగావలోకానికి పాత్రమైన ఒక అస్థాన సేవకునిగా నన్ను అనుగ్రహింపుడు" అని మంద మధుర గభీరధ్వనితో ప్రార్థించినాడు.

మాధవజి మాటల సమ్మోహనాస్త్ర ప్రయోగ సిద్ధుడు. సవాయి మాధవరావు, సస్స్వభావుడు - మహోదాత్త ఆశయుడు - నిర్దాక్షిణ్యుడు - రాజకీయాలలో లోతుపాతులు దెలిసిన బాలపేష్వా. సింధియా నిజంగా పేష్వాయందు అనురక్తుడే! ఈ మాటలతో పేష్వా తనవైపు ఆకర్షింపబడినాడు. ఈ పరిస్థితుల పట్టుకొమ్మగా జేసుకొని, నానాఫడనీసు స్థానే ప్రధానామాత్యుడై సర్వాధికారాన్ని పాలింప దలచుకొని, తత్ఫలసిద్ధికి

ప్రయత్నాల సాగించినాడు. కొంతకాలం జరిగేకొలది, కొన్ని సంధర్భాలలో మహామంత్రి ఆజ్ఞలకు వ్యతిరేకంగా జోక్యం కలిగించుకొన్నాడు. సింధియా చనవుతో తరుణపేష్వా తనతో సాగించిన ఒక విరామ వ్యాహ్యాళిసమయంలో యీ విషయాన్ని ప్రస్తావనకు దెచ్చినాడు. కాని, పేష్వా వెంటనే - "ఇదిగో చూడు! నానా - మాధవజీలు నారాజ్యానికి రెండు బాహువులు. ఒకరు కుడి, మరియొకరు ఎడమ. వాటివాటి పనికి అవి అత్యంతము తగియున్నవి. ఆ రెంటి వుమ్మడి వుత్సాహం - కార్యదీక్ష వల్లనే సామ్రాజ్యం వర్ధిల్లుచున్నది. వాటి స్థానాల మార్చలేము - ఒకదానిని నరికివేస్తే నాకు అపాయం జరుగకమానదు" అని కఠోరంగా ప్రత్యుత్తర మిచ్చుటచే సింధియా చీకాకుపడినాడు.

ఈ సంభాషణము బయటకుపోకుండా మాధవజి ఎంత ప్రయత్నించినను, చారకర్ణి - నానా నిర్మించిన నిగూఢ చారకోటి జాగరణపూర్ణ ప్రజ్ఞాపూర్ణ శక్తిని ఇది తప్పించుకోలేక పోయింది. ఈవార్త నానా - హరి పంతుఫడ్కె మొదలగు మంత్రివర్గవారికి ఆయాసము కలిగించింది. మహారాష్ట్ర హిందూసామ్రాజ్య కేతనముక్రింద సర్వభారతావనిని కొనివచ్చి, పేష్వా నాయకత్వాన వివిధ రాజ్యభాగాలు విడిపోకుండా సంయుక్త హిందూ ప్రభుత్వంక్రింద సుదృఢముగా సాగునట్లు చేయదలచుకొనిన నానాప్రభృతుల జీవిత పరమగమ్యము యిప్పుడు దెబ్బదినబోతున్నదని తెలుసుకొన్నారు. వారి బొందిలో కొనవూపిరి వున్నంతవరకు వారు దీనిని సాగనీయరు - ఇక వారి ప్రతిపక్షులకు కావలసినది తమపదచ్యుతే అయినచో వాటిని త్యజించుటకు వారు సంసిద్ధులు; తాము అట్లు చేయుట రాజ్యక్షేమానికి భంగకరమైనను, అంతఃకలహాన్ని తలచూపకుండా జేయును యిదే ఉత్తమమార్గము. నానా త్వరలో అవకాశాన్ని కల్పించుకొని, పేష్వాకు సర్వమూ విశదపరచినాడు. పేష్వా జననమాది తాను రాజ్యానికి, పేష్వాకు

చేసిన సేవల వర్ణించి, పేరాసలచే ప్రేరేపించిన సింధియా మార్గాల, ఆయన వహించిన సంభవింపనున్న ఘోరవిపత్తును వగచినాడు. సింధియా యిష్టము సాగుచో మొగలు పాదుషావలెనే పేష్వాగూడ సింధియాచేతి కీలుబొమ్మ అగునని మనసుకు తాకునట్లు వివరించి చెప్పినాడు. మహారాష్ట్రరాజ్య మండలి నిర్మాణక్రమంలో అంతటి గొప్పమార్పును ఎకాయెకి చేయదల చిన ఒక ప్రచండ అంతఃకలహము రేగి, తాము అత్యంత ప్రయాసతో నిర్మించిన హిందూసామ్రాజ్యానికి వినాశహేతు వగుననియు, హిందూ రాజ్యాన్ని కూలద్రోయను హైదరాబాదులో విశ్వప్రయత్నాలు చేస్తుండిన ముస్లింలకు, మహారాష్ట్ర హిందూసామ్రాజ్యాన్ని కబళింప ఆతురపడుచు, ఆ కార్యానికి సమర్థులైన ఆంగ్లేయులకును యీ ఛిద్రము సదవకాశము గలిగించును. ఇక యిట్టి పరిస్థితులలో కావలసినదే నానా పదభ్రష్టతే అయిన, పేష్వా దీనినే అభిలషించిన "ఇదిగో! నా మంత్రిపదవీ పరిత్యాగ పత్రము. ఇదే రాజ్యాన్ని రక్షించగలిగినచో అంతఃకలహాన్ని అపనయింప జేయండి. ప్రభో! యిదే మీకు వాంఛనీయ మగుచో, నా బాధ్యతలనుండి నాకు విముక్తినొసగి, ఐహిక పరిత్యాగబుద్ధితో పుణ్యవారణాసియందు నా జీవిత శేషాన్ని దైవచింతతో గడపనిండు" అని అశ్రుపూర్ణ నయనాలతో గద్గదితస్వరంతో ఆ వృద్ధప్రధాని పలికినాడు.

యువక మాధవరావు చకితుడై పోయినాడు. ఆ సామ్రాజ్యనిర్మాత - ఆ మాననీయ మహామంత్రి అనుకంపాపూర్ణ ప్రార్థనము ఆ బాలపీష్వా హృదయానికి బాగా తాకి, విచారపడ జేసింది. వెంటనే మాధవరావు, "యీ విపరీతబుద్ధికి కారణమేమి? మీరు మాకు కేవలము మంత్రేగాదే? - హితుడవు - మార్గదర్శకుడవు - ఉపదేష్టవు. ఈ అఖండరాజ్యము నీ భుజాలపై నిలిచివున్నది. నీవు లేకున్న ఇది కూలి వ్రయ్యలై పోతుంది" అని పలికినాడు, నానా ఆవేశచలిత కంఠంతో, "ప్రభో, తమ జననమాదిగ -

కాదు, తమ జననానికి ముందునుండే, తమ యోగక్షేమాలకుగా విశ్వాసంతో పాటుబడినందులకు, తమ రాజ్యంపట్ల భక్తిశ్రద్ధలతో సేవ సాగించినందులకు అసంఖ్యాకులకు నేను పగవాడనై పోయినా. కాని, నేడు నావూడిగము విస్మృతిలో జీర్ణమైపోయి, నా శత్రువులుమాత్రం మిగిలివున్నారు" అని పలికినాడు. ఉదారాశయుడైన ఆ యువకుడు, దుఃఖసాగరంలో మునిగి, తాను ప్రభువు - అతడు భృత్యుడన్న విషయం మరచిపోయి, వెల్లివిరిసిన సామాన్య మానవాభిమానప్రేమలతో నానా మెడ కౌగలించుకొని వెక్కి-వెక్కి- ఏడుస్తూ: "నన్ను విడిచిపెట్టకు. దుఃఖం మానండి. మీరు నామం త్రికాదు - శైశవమాదిగ మాకు తండ్రియై కాపాడినారు. పెడత్రోవలోపడియుండిన మమ్ము క్షమించండి. మీ పదవీ పరిత్యాగానికి గాని. ఐహిక త్యాగానికి గాని మేము సమ్మతింపము. మేము మిమ్ము వదలము'' అని బ్రతిమాలినాడు.

ఈ దృశ్యము నానా పక్షంవారికి మహోత్సాహాన్ని కలిగించింది. మాధవజి స్వార్థచింత ఎట్లుండినను, తాము - తమజాతి నిర్మించిన మహత్తర హిందూసామ్రాజ్యముపట్ల మాత్రం ఆయన విశ్వాసము యితరుల నెనరుకు తీసిపోలేదు. ఏమ్లేచ్ఛాధికారమే గాని ఆ సామ్రాజ్యపునాదుల గెలువదలచిన, ఆ సామ్రాజ్యాధికారాన్ని గ్రహింప యత్నించిన అట్టి దురంతాన్ని అరికట్టుటకు ప్రాణార్పణము చేయవలసివచ్చినచో మాధవజీయే మొదటివాడై యుండును. మాధవజీ సింధియా రఘోబాదాదా కాదు. మహారాష్ట్రాధికారమునకు సంపూర్ణముగ తానే కర్ణధారి కావలయునని అభిలషించినను, దేశాన్ని అంతఃకలహాలలో దించాలనిమాత్రం ఆయన అనుకోలేదు; కాబట్టే మంత్రిపక్షంవారితో సఖ్యంచేసుకోను సులభంగా యియ్యకొని, పేష్వా యిష్టానుసారంగా నడచుకోను అంగీకరించినాడు. ఒకనాడు ఉన్నట్లుండి హరిపంతు - మరికొందరు ఎదురుపడి, మాధవజీతో యిట్ల

న్నారు: "నీవు సమస్త అమాత్యాధికారాల నీ పిడికిట బట్టుకొనదలచినం దున మనమధ్య స్పర్థలు చెలరేగితీరును. ఇది, మనమందరము ప్రేమించి, ఘనపరచి, పెంచిన హిందూ సామ్రాజ్యానికి మంచిదెబ్బే కాకుండా హిందూత్వ విరోధులకు విశేషబలం చేకూరుస్తుంది. కాబట్టి - దేశాన్ని వినాశకర అంతఃకలహ అగ్నిగుండంలో ద్రోసేదానికి బదులు ఒకపరి రాజులజేసి, మరియొకపరి రాజుల దిగద్రోసిన వీర్యవంతమైన నిజలేఖనిని నానా సన్న్యసించి, తన అధికారాలన్ని త్యజించి, దేశానికి శాంతిని, నీకు వూరటను కలిగింప నున్నాడు." సింధియా మానసం చలితమైపోయింది. ఇకమీదట నానాతో పంతంబూననని వాగ్దానముజేసి, మిత్రహస్తాన్ని చాచి నాడు. ఇంతకుముందు అనేకపర్యాయాలు జరిగినట్లే, యీ అదనులోగూడ మహారాష్ట్రజాతి మహోదాత్త జాతీయ నిసర్గభావము, మాతృదేశారాధన ప్రీతి స్వార్థహీన చింతల అణగద్రొక్కినవి. మరల ఆ మహారాష్ట్ర మహ త్తర శక్తులు రెండు మిత్రములైనవి. ఆ యిద్దరు పేష్వాపాదపంకజాల మ్రోల - తమ స్పర్థల మరచి, తమ ఏకైక నాయకుని సేవలో తమతమ నిర్దిష్ట ధర్మాల నెరవేర్తుమనియు, హిందూ సామ్రాజ్యస్థాపనకు, హిందూ ధర్మానికి, హిందూమతవ్యాప్తి రక్షణల పవిత్ర ఆదర్శానికి నిలిచి పోరిన అఖండ మహారాష్ట్రమండలిని భక్తిపూర్ణముగ శక్తిపూర్ణముగ సేవింతు మని ధర్మకార్య కంకణాన్ని ధరించి ప్రమాణంజేసినారు.

ఈ అజేయశక్తులు రెండు సౌహార్దోపగూహనంతో మనసుల ఏకం జేసుకొన్నారన్న శుభవార్త, సామ్రాజ్య మహానాయకులమధ్య అపోహలు సమసిపోయినవన్న సంతోషవార్త, మహారాష్ట్రదేశాన్ని ఒకమూలనుండి ఇంకొకమూలకు హర్షరోమాంచలముగ జేసింది. హిందూత్వ ఆరాధకు లెల్లరు యీ విషయంలో ఎంత మనశ్శాంతిని బొందినారో గోవిందరావు కాళె వ్రాసిన లేఖవల్ల విశదముగాగలదు. ఇతడు మహారాష్ట్ర రాజనీతి

చతురలలో ప్రజ్ఞాశాలి, దేశారాధనప్రియుడు. దూతకార్యంలో ఆరితేరిన యోధ. నైజాం దర్బారులో మహారాష్ట్ర సామ్రాజ్య ప్రతినిధి. ఈ కాళె గారు యీ సంతోషవార్త వినగానే హైదరాబాదునుండి నానాఫడ్నీసుకు యిట్లా వ్రాసినాడు :—

"మీ జాబు నన్ను ఆనందవిహ్వాలుణ్ణి జేసింది. నాసంతోషాన్ని వర్ణించను నాకు మాటలు చాలకున్నవి. ఈ శుభవార్తకు వ్యాఖ్యానం అనేక సహస్రగ్రంథమౌతుంది. ఇది నామనస్సులో ఒకభావప్రవాహాన్ని కలిగించింది. అటకు మొదలు కన్యాకుమారి అగ్రాన్ని కడిగే హిందూ మహాసముద్రమువరకుగల అఖండ భూభాగము హిందువులది; ఇది హిందూస్థానము. కాని, తురకల తురుష్కస్థానముకాదు. మన పవిత్ర పితృభూమికి యీ పొలిమేరలే పాండవులు మొదలు సామ్రాట్టు విక్రమాదిత్యుని వరకు నిలిచియుండినవి. వారు సర్వవిదేశ శత్రుకోటిని జయించి, యీ అఖండ హిందూస్థానాన్ని కాపాడి పాలించినారు. కాని, వారితర్వాత రాజ్యానికి వచ్చినవారు అశక్తులై రాజదండాన్ని ధరింపలేక పోవుటచే మ్లేచ్ఛులైన యవనులు మనదేశాన్ని జయించి మనరాజకీయ స్వాతంత్ర్యాన్ని హరించినారు. బాబరు వంశీకులు హస్తినాపుర రాజ్యాన్ని ఆక్రమించుకొన్నారు; చివరకు ఔరంగజేబుకాలంలో, ఎంతటి నికృష్టస్థితిలోనికి త్రోయబడినామంటే - మన మతస్వాతంత్ర్యమే పోయింది. పవిత్ర యజ్ఞోపవీతధారి తలపన్ను కట్టవలసివచ్చింది. అశుచి అహారాన్ని కొని, తినక తప్పిందిగాదు.

"మన చరిత్రలో యిట్టి క్లిష్టసమయంలో, శకపురుషుడు - హిందూధర్మ రక్షకుడు - మహత్తరుడు శ్రీ శివాజీ జన్మించినాడు. ఆయన మన మహారాష్ట్రదేశపు యీమారు మూలను మొదట విముక్తిజేయగా ఆ ప్రదేశమే మన మతానికి ఆశ్రయమిచ్చింది. ఆతర్వాత, అపూర్వశక్తిధనులు

మహావీరులు నానాసాహెబు - భావుసాహెబులు కార్యరంగంలో ప్రవేశించి నారు; వారి గొప్పతనపు తేజము మధ్యాహ్నిన మార్తాండప్రభవలె తోడిమానవుల మధ్యనుండి మెరసింది. ఇక యిప్పుడు - మంగళకరమైన గౌరవనీయులు పేష్వావారి సత్వాలనక్రింద, మన పటేలు మాధవజి సింధియా నిశిత ప్రజ్ఞ - అజేయ ఖడ్గాలవల్ల మనము పోగొట్టుకొనినదెల్ల మనకు చేకూరింది. కాని, యివన్నీ ఎట్లా సంభవించినవి? అనేదే ఆశ్చర్యాంశము. జయము సుదృఢము కాగానే, అది సాధించిన మహత్కార్యాలే కనుమరగై పోతవి. మహమ్మదీయులేగాన యింతటి విజయాన్ని పొందివుంటే గ్రంథాలు తరబడి గ్రంథాలు వారి కీర్తిగానము చేసివుండేవి; మహమ్మదీయులు చేసిన ఏ స్వల్పతమకార్యంగూడ కొండంతలుచేసి ఆకాశం తూట్లుపడేటట్లు స్తోత్రంచేయబడుతుంది. కాని, హిందువులు ఎంతటి ఘనతమ కార్యాన్ని నెరవేర్చినా మనలో దానినిగూర్చి వూరకైనా ప్రస్తావించే వ్యక్తే వుండడు. ఏమైతేనేం? జరిగింది ఒక మహాద్భుతమే! అసాధ్యము సాధ్యమైంది. ముస్లింరాజ్యం కాఫిరుల హస్తగతమైందని, కాఫిర్ షాహి వచ్చిందని మ్లేచ్ఛులు బహిరంగంగా ప్రలాపిస్తున్నారు.

"హిందూస్థానంలో మనపై తలయెత్తినవానినెల్లా మాధవ్‌జి చిదుగగొట్టివేసినాడు. మన పూర్వమహారాజాధి రాజులు, సార్వభౌములవలె సామ్రాజ్యాన్ని కుదుటబెట్టి అధికారాన్ని నిలువబెట్టి పాలనా సౌభాగ్య ఫలితాలు అనుభవించుట మానవశక్తికి అతీతమని తోపింపజేసిన మహత్కార్యాల మనము యిప్పుడు సాధించగలిగినాము. ఇంకా మనము చేయవలసినది ఎంతో మిగిలివున్నది. ఎప్పుడు మనశక్తి ఉడిగిపోనున్నదో - దుష్టుల దృష్టిదోషం మనకు ఎప్పుడు సోకనున్నదో ఎవరు చెప్పగలరు? మన విజయము కేవలము ఐహికపాలనము - రాజ్యవిస్తరణాలనే అంటిపెట్టుకుని యుండరాదు. అది హిందూసంస్కృతి - నాగరకతలకు ప్రాణ

వాయువులైన వేద వేదాంగాల - స్మృతి పురాణేతిహాసల రక్షించాల, నీతి సద్ధర్మాల వ్యాపింపజేయాల, గోబ్రాహ్మణుల రక్షించాల, సాధుజనుల దీన జనుల కాపాడాల, జాతీయాధికారమును, సామ్రాజ్యాన్ని సముపార్జించాల, శాశ్వతకీర్తి సితచ్ఛాయలతో ఆశాంతాల తులకింపజేయాల. ఇట్టి మహాద్భుతాల సమకూర్చగలిగిన రసవాద విగూఢ రహస్యాలు మీకు, మాధవజీకి కరతలామలకాలు. మీ మధ్యరేగిన ఎంతస్వల్ప విరాగమైనా మనప్రతిరోధులకు బలాన్ని కూర్చుతుంది. మత్సరపూర్ణులైన రహస్యబహిశ్శత్రువులు మనలను వలగొనియున్న యీ తరుణంలో మీ అన్యోన్య సుహృద్భావం నా సంశయాల పారద్రోలి మనశ్శాంతిని గూర్చింది. ఇక మనపైనిక నివహాలు లాహోరు పరిసర పులుమిట్టలలో విశ్రాంతిదీసికొని స్వరాష్ట్రసీమల దాటునుగాక! అంతఃకలహాలతో వినాశముబొందుదుమని ఆశలుగొన్న ప్రతిపక్షులు నిస్పృహోపహతులగుదురుగాక! ఇంతవరకు యివన్నీ నాకు వితాకును కలిగించినవి; ఇప్పుడు మీ ఉత్తరం ఆ మంచును పటాపంచలుజేసివేసింది. మీ చర్యలు మహాద్భుతాలు. ఇప్పుడు నా మనసు శాంతించింది."

ఆ మహానాటక భూమికలలో ఒకరైన గోవిందరావుకాశె వ్రాసిన యీ సరిశ విన్నాణపూర్వకలేఖ - ఎన్నో నిర్జీవగ్రంథ సంపుటాల కంటె, నాటిచారిత్రక శక్తిని సజీవంగా, యధామాతృకంగా వర్ణిస్తున్నది.



# సవాయి మాధవరావు (IV)

ఈతీవ్ర భయోత్సాహ సమర్ద కోలాహలాలమధ్య, మాధవజీ సింధియా ఒక తీవ్రజ్వరంపోకి, పునహాసమీపంలో, వనావడి బసలో 24 ఫిబ్రవరి 1794 నాడు స్వర్గస్థుడైనాడు. మహారాష్ట్రమంతా నితాంత దుఃఖసాగరంలో మునిగిపోయింది.

మహారాష్ట్ర సరదారులలో బలవత్తరుడైన యీ సేనాపతి అకస్మాత్మరణం దేశద్రోహులకు, విరోధులకు ఆశల ననలెత్తింపజేసింది. ఈమరణము పెద్దదెబ్బకొట్టిందని ఆత్మప్రీతికరంగా భావించుకొన్న విరోధులు, యీ దెబ్బనుండి తేరుకొనేలోపలనే మహారాష్ట్రాన్ని మరల ఒకమారు కొట్టదలచుకొన్నారు. ఇట్టి శత్రువులలో నైజాము ముఖ్యంగా చాలకాలంగా, హిందూరాజ్యంపై తన పగనంతా తీర్చుకోవాలని తీవ్రప్రయత్నాల, సన్నాహాల సాగిస్తుండినాడు. ఈ నైజామును కొన్ని తరాలనుండి మహారాష్ట్రీలు తమ బొటనవ్రేలిక్రింద అణచిపెట్టివుండి, ఒకక్షుద్రసామంతునిగా జేసివేసియుండినారు. నైజాము రెండుపటాలాలలో వుండిన తన సైన్యాన్ని 23 దళాలుగా పెంచినాడు. వాటికి అనుభవపరుడైన ఒకఫ్రెంచి సేనానిని నాయకుడుగా జేసినాడు. నైజాము మంత్రి - ముష్రుల్‌ముల్కు- అత్యాశాపరుడైన ముస్లిం ; మాధవజి అధ్వర్యాన మహారాష్ట్రీలు సామ్రాజ్యాధికారమును పొందుట యితడు సహించలేక పోయినాడు. కాఫిర్‌షాహి తుదముట్టి, మరల పునహాశిఖరాలపై బాలేందురేఖా మండిత విశ్వాసక కేతనము ఎగురగలిగిన శుభదినము ఆసన్నమైనదన్న ప్రబోధారావాలు దేశమందంతటా మారుమోగిపోయి, మహమ్మదీయ పౌరులందరికి ఆవేశాన్ని రేపి యుద్ధజ్వరాన్ని కలిగించినవి. ముఖ్యంగా నైజాంమంత్రి ప్రతిక్షణమూ

కయ్యానికి కాలుదువ్వుచుండినాడు. ఇతడు ఎంత తెంపరి అయిపోయినా డంటే - హైదరాబాదులో మారాఠి రాయబారి చౌతును వాడుక ప్రకారం అడుగగా, నానాసాహెబే హైదరాబాదుకువచ్చి, లెక్కచూచుకొని రావలసి వుంటే తీసికొని పొమ్మన్నాడు. "నానాగాన రాకపోతే, త్వరలో రప్పి స్తాను చూడు" అని పంతంవేసుకొన్నాడు. యుద్ధానికి యీ తృణీకరణమే చాలదన్నట్లు నైజాము ఒక పెద్ద ప్రదర్శనానికి కావాలనే సమస్త రాజ దూతల ఆహ్వానించి, తన సేవకులచేత నానా, పేష్వా సవాయిమాధవ రావుల వేషాలువేయించి సభ్యులకు వినోదం గూర్చినాడు. దీనికి మొగలు దర్బారు అత్యంతంగా హర్షించింది. అప్పుడు రాయబారులు గోవిందరావు పింగళె, గోవిందరావుకాళె యిద్దరూ సభలోలేచి, తమకు జరిగిన అవమా నాన్ని తీవ్రంగా అధిక్షేపించి, చివరకు పొంగిపొయ్యే మహారాష్ట్రాధీనుడు - "ఓముష్రుల్‌ముల్క్ ! విను. మహారాష్ట్ర సచివోత్తముడు నానాసాహె బును నీ ఆస్థానానికి రప్పించగలిగిన శక్తివున్నదని పలుమారు బింకాలు పలికినావు. ఇంతేగాదు - మా ప్రభువువేషాల వేయించి ఆడించినావు. సరే ! ఇదిగో ! దానికి ప్రతివచనం - నిన్నేగాన బంధించి ప్రాణాలతో తీసుకొనిపోయి, హిందూసామ్రాజ్య రాజధాని వీధులలో వూరేగింపు చేయించలేకపోతే నేను గోవిందరావుకాళేను గాను" అనే దుశ్శకునసూచిక వీరవచనాలతో మరాఠిరాయబారి నైజాం దర్బారువీడి, సత్వరంగా పునహా చేరి, యుద్ధం తప్పదని వివరించినాడు. ఇద్దరిమధ్యసఖ్యం కుదిర్చేపని తమకుతామే ఇంగ్లీషువారు సగర్వంగా ఆరోపించుకొన్నారు. దీనికిగా బాగా తలవాచేటట్లు చీవాట్లు దిని, మహారాష్ట్ర వ్యవహారాలలో జోక్యం కలిపించుకోవడం మాని, అభిమానం నైజాంప్రక్క మొగ్గుగావుండిగూడ- అతడు అర్థించినప్పటికిని పుల్లెత్తు సహాయంచేయలేక పోయినారు. నైజాము పెద్ద యుద్ధసన్నాహం చేసినాడు. సంస్థానంలోగల ముస్లిం

పౌరులభావం ఉత్సాహోన్మాది అయిపోయింది. అది కాఫిరులపై ధర్మ యుద్ధమనిచాటి, నికట దూరస్థ స్వమతస్థుల సహానుభూతి - సహాయా న్నంతా సేకరించినారు. పునహా నగరాన్ని విశ్వాసకసైన్యాలు దోచి బూడిదచేసి వేయాలట! ముష్‌రుల్‌ముల్కు డంబాలలో యిది ఒకలెక్క లోనిదిగాదు. ఆ మంత్రి - మరల మొగలులకు శాశ్వతంగా మహారాష్ట్ర నిరంకుశ దాస్యవిముక్తినొసంగి, మహారాష్ట్ర బ్రాహ్మణనాయకుడు, పేష్వాను సన్న్యసినిజేసి గోచిపాతతో యింటింట తిరిపమెత్తుకొంటూ కాశీ చేరేటట్లు చేస్తానని బహిరంగంగా చాటుచుండినాడు.

అచట, హైదరాబాదులో ఆ వజీరు డంబాలు కొట్టుకొంటూ కోతలు కోస్తూ వాగుచుండగా, యిచట పునహాలో యీ మంత్రి తనబలాన్ని తుల దూచుకొంటూ, ప్రశాంతస్థయిర్యంతో తన భవిష్యత్ప్రణాళికను నిర్ణయించు కొంటుండినాడు. తమ మహాయుద్ధనాయకుడు, అనేక యుద్ధవిజయశ్రీ శోభితవక్షుడు మాధవ్‌జీ సింధియాను గోల్పోయినప్పటికిని, మహారాష్ట్రులు సమయోచిత ప్రజ్ఞనుజూపి, అదనుకు ఉపకరించినారు. ఈ సమయంలో వలె నానా ప్రతిభ ఎన్నడును యింత తీక్షణంగా ప్రకాశించలేదు; ఆయన పలుకుబడి ఎన్నడును యింత గట్టిగా ప్రజానీకాన్ని బంధించలేదు. నానా మాటతోగూడ మహారాష్ట్ర సామ్రాజ్యం మారుమూలనుండి - దూరాబారం అనకుండా దండువెల్లువ పునహా నగరంవైపు పారి ముంచివేసింది. ఆయన ప్రజ్ఞావిశేషం భిన్న ప్రత్యర్థులనందరిని సౌహార్దబద్ధ మిత్రబృం దంగా అతికివేసింది. పునహాలో విజయ సమరధ్వజారోహణం జరిపించ బడి, రణభేరి కొట్టబడింది. హిందూ పద్ పాదషాహి ఆశారేఖయైన ఆకే తనంచుట్టు సర్వమహారాష్ట్రసేనలు మూగినవి. మాధవ్‌జీ సింధియా స్థానా నికి వచ్చిన దౌలతరావుసింధియా, ఆగ్రానంరక్షకుడు - జీవబదాదాబక్షి, మ్లేచ్ఛనిర్మథన మొనర్చిన యితర సేనాపతులు చాలమంది ఆహ్వానితులై

విచ్చేసినారు. తుకోజీ హోల్కార్ తన సర్వసైన్య సన్నాహంతో అప్ప టికే చేరుకొన్నాడు. రఘోజీ భోస్లే నాగపురమునుండి మంచి దండుతో చేరినాడు. బరోడానుండి, గాయక్వాడ్ హిందూత్వవిరోధితో పోట్లాడను ఏరిన వీరులతో బయలుదేరినాడు. పట్వర్ధనులు. రాస్తేలు, రాజెబహదూర్, వించుర్‌కర్, ఘార్గె, ఛవాణ, దాఫ్లె, పవార్, తోరాత్, పతంకర్ ఆదిగా గల విశ్రుతనాయకులు, ఇంకను తక్కంగల యితర చమూపతులందరు నానా ఆజ్ఞల బొదల దాల్చినారు. పేష్వా స్వయంగా స్వసైన్యాల నడిపి నాడు. ఆయన వెనువెంట అమాత్యశేఖరుడు - నానా ఫడనీసు నడచినాడు. ఆ బాల పేష్వాకు యిది కన్నెకయ్యము. ప్రజారంజకుడైన తమపేష్వా సాన్నిధ్యము ప్రతి పిరికికండకుగూడ మగటిమిమందుబోసింది. ఆ దండ యాత్రలో ఆయనే ప్రధాన ఆకర్షణమైనాడు.

సమరభూమిలో నైజామే మొదట ప్రవేశించినాడు. తురగ పదాతి సైన్యం ఆయనది లక్షపదివేలకు మించివుండింది. సరికొత్తగా తీర్చి దిద్దిన ప్రచండమారణయంత్రబలము దీనికి అండగా నిలిచింది. ఆ మ్లేచ్ఛ వరూథిని గంభీరదృశ్యము - భుజశక్తి - మతావేశము సైన్యాలకు ఉత్సాహ విశ్వాసాల గూర్చినవి; మొగలులు తమకు జయము తప్పదనుకొన్నారు. మహారాష్ట్ర అనుభవపూర్ణమైన సైన్యాలు హిందూసామ్రాజ్య సీమాంతాల రక్షింపను దేశమందంతటా పరచి పెట్టి యుంచబడినను, లక్ష ముప్పైవేల దండును పొలికలనులో నిలువబెట్టగలిగినారు. ఆ రెండు ప్రచండసై న్యాలు, మరాఠిసీమ పొలిమేరదాపున పరండగ్రామ పరిసరంలో నడకొం డలమాదిరి ఢీకొన్నవి. యుద్ధవ్యూహ విధానాన్నిగూర్చి, నానా వివిధచమూ పతుల అభిప్రాయాన్ని వ్రాతమూలకంగా తీసుకొని, అందు తన మనసుకు నచ్చినదానిని ఏరుకొన్నాడు. పరశురామభావు పట్వర్ధనుడు సర్వసేనాధి పతిగా అభిషేకింపబడినాడు. పురోగమించిన ఉభయధ్వజినీముఖాలు

తుపాకి గుండుమేరలోకి రాగానే యుద్ధం ప్రారంభమైంది. మొదటితాకు డులో పఠానులు మహారాష్ట్రుల వెనుకకు నెట్టివేసినారు. పురోగాములైన శత్రువ్యూహ పరిశోధక వర్గాలలో ఒకదానియందు పరశురామభావుగూడ ఉండి, వెనుకకు మరల్చబడుటచే, యీ నెట్టుడునే మొగలులు మహా విజయంగాచాటి ఒక అభినందన దర్బారును జరిపి ఉత్సవాల జరిపినారు. కాని, అసలు మహారాష్ట్ర సైన్యాల మూలబలం తలపడగానే నైజాం అసలుసంగతి తెలుసుకొన్నాడు. అహమ్మదల్లీఖాను, పోటరులైన 50,000 సైన్యంతో ఒకదారుణాఘాతంతో మరాఠిదండుపై బడినాడు. భోస్లేనడిపిన మహారాష్ట్రసైన్యం అగ్నివర్షంతో ఎదుర్కొన్నది. మరుక్షణంలో పార్శ్వ భాగమందుండిన సింధియాసైన్యం అగ్నిపర్వతముఖాన్ని తెరచివేసింది. యుద్ధం బీభత్సమైంది. రెండు ప్రళయాగ్నులమధ్య జిక్కిన ముస్లిం సేనలు, అల్లాహో అక్బర్ నినాదాలు ఎంత ప్రోత్సాహపరచుచుండినను ఆగలేకపోయినవి. ముస్లిం ఫౌజు విరిగి చీకాకుతో చెదరిపోయింది; అశ్వ దళము నాశనమైపోయింది. మహారాష్ట్రులు ముందుకుసాగి, అవశిష్టమ్లేచ్ఛ సైన్యాల వలగొని పరాజయాన్ని పరిపూర్తిగావించినారు. నైజాము కాత రుడై మతిబోగొట్టుకొన్నాడు. వెంటనే పరుగెత్తిపోయి, ఆసన్న తమి స్రాంధకారపు మడుపులలో మాత్రమే దాగుకోగలిగినాడు. అక్కడక్కడా, గూళ్ళుగూళ్ళుగా ఆ రాత్రంతా యుద్ధం జరుగుచునే యుండింది. మొగ లాయి దండుకు చాలానష్టం జరిగింది. వాచాలురైన మౌల్వీల ఆడంబర క్రియాశూన్యవాక్యాలు దీన్ని మతయుద్ధమని ఎంత ప్రేరేపించినను, యీ విశ్వాసక మొగలుసైన్యం సొంతవిడిదినే దోపిడిజేయకుండా నిలుప లేకపోయింది; పిక్కబలంచూపి పరుగెత్తేవారిని వారింపలేకపోయింది. కాని, మహారాష్ట్ర స్కంధావార పరిరక్షకులు పరుగెత్తుచుండిన తురకల వెన్నంటి కొల్లగొట్టిన ధనాన్ని లాగుకొన్నారు. తెల్లవారేవరకి, మిగిలిన

పదివేలసైన్యాన్ని మరల నైజాము యుద్ధానికి కో_త్తలపరచి నిలిపినాడు. వెంటనే మహారాష్ట్ర శతఘ్నులు ప్రతిగుట్టనుండి, గుహనుండి, చరియ నుండీ వలయంగా యవనసైన్యాలపై ప్రేలినవి. ఆ ప్రదేశమంతా దారుణ దవానలం అలముకొన్నట్లయింది. ఈ అనల ఆసారాన్ని మొగలుసేనలు రెండుదినాలు ఓర్చుకొన్నవి. నైజాం గడ్డమేకాదు - మగసిరిగూడ కమిలిపోయింది; ఇది అలంకారో_క్తికాదు - యథార్థమే। చివరకు, మూడవ నాడు, దగతో గొంతు ఎండిపోయి, పూసరి ఆడక శత్రువు యుద్ధవిరామానికి ప్రార్థించినాడు. "మొదట ముష్రుల్ ముల్కును మాస్వాధీనం చేసి ఆతర్వాత యితర విషయాలు మాట్లాడండి" అని మహారాష్ట్రీయు ప్రత్యు_త్తరమిచ్చినారు. "మహారాష్ట్రరాజమాతకు, కాదు మరాఠి ప్రెగ్గడకు గావించిన అపచారానికి ప్రాయశ్చి_త్త పరిహారాల ఆతడు అనుభవించి తీరాల" అని పట్టుబట్టినారు. శృంగభంగమై ముస్లింలు, తమ స్వామితపరిత్రాణ దక్షుడైన మహామంత్రి - ముష్రుల్ ముల్కును కాఫీరులచేతబెట్టి. వారి యిష్టానుసారము సంధిజేసుకోను యిష్టపడినారు. పరండ - తపతీ మధ్యస్థ సర్వభూభాగము మహారాష్ట్రుల కొసంగబడినది. చౌతుకుగా, యుద్ధనష్టపరిహారానికిగా 3 కోట్లను ముస్లింలు చెల్లించి, భోసలేకి ప్రత్యేకంగా మరి 29 లక్షల ధనమర్పించినారు. పూనానగరాన్ని కాల్చి గంపలకె_త్తి, దోపిడితో బొజ్జనింపుకొని, పేష్వాను మాధుకరవృ_త్తితో కాశికి తరిమివేయ దలచుకొని, గర్వంతో యానానికి కడంగిన నైజాం, చివరకు, ఇట్టి షరతులతోనే ప్రాణాలదక్కించుకొని స్వస్థానం చేరుకొన్నాడు.

విజయకాఫిరుసేన బారులమధ్య ముష్రుల్ముల్కు మహారాష్ట్రీటికి గొనిపోబడినాడు, ఖయిదీగా అతడు తలవంచుకొని నడుస్తుంటే. సైనికులు ఆనందావేశంతో, కారుమబ్బు ఉరుములవంటి—"హరహర మహాదేవ" ధ్వానాలతో దిక్కులు తూట్లుపడజేసినారు. నానాఫడనీసును

బంధించదలచుకొనిన అతడే కడకిట్లు బంధింపబడినాడు - తమరాయబారి మాటను నెగ్గించినారు ! ఇవిజేసి, ఉదత్తుడు, సౌజన్యుడు - మహారాష్ట్ర ప్రధాని, పతితపరిపంధిని హర్షరీతిని గౌరవించి, పూనావీధులలో గంధం పూసి వూరేగించ గలిగియుండిగూడ, ఆ నీచావమానాన్ని అతనికి తప్పించినాడు. శిక్షించగలిగిన శక్తిని ప్రదర్శించగానే రక్షించుటకు అలవాటుపడిన మహారాష్ట్రులు, వానిని మన్నించినారు.

దిగ్విజయోత్సాహంతో, వీరశోభతో నానా సాహెబు, నానా వీరవికాయకంతో మహారాష్ట్రరాజధాని ప్రవేశించినాడు. తమ వీరపురుషులకు, తమ అనుగు పేష్వాకు జాతీయ సన్మానమునొసంగి, అర్ఘ్యస్వాగతము నొసంగుటకు దేశప్రజ అసంఖ్యాకముగ పునహా చేరింది. నగరము విజయతోరణమండితమై కనుపండువైంది ఆనందమును హృదయపూర్వక సుస్వాగతము ఒసంగబడింది ! పౌర పురంధ్రీ గణము వితర్దులనెక్కి, హర్మ్య పరిభాగాలనెక్కి, చంద్రసాలల నెక్కి ఆ వీరోత్సవముపై పుష్ప - పుణ్యాక్షతల వర్షం కురిపించినారు. నగరస్త్రీ జనము తమతమ గృహాంగణాలలో నిలిచి, ఆ వీరపురుషులకు హారతులు ఎత్తినారు. ఆజయోత్సాహ దివ్యవాతావరణంలో తరుణ పేష్వా తన ప్రజల అభినందనాల ఆశీర్వచనాల గ్రహిస్తూ రాచనగరు చేరినాడు. పట్టణంచుట్టూ కొన్ని క్రోసులు పర్యంతము, వివిధసామంత, సేనానాయక గణము తమతమ సైన్యాలతో విడిదిచేసి యుండినారు. ఈ దృశ్యము అఖండ దుర్భేద్య మహారాష్ట్ర విజయశక్తిని ప్రదర్శించి, నానాసాహెబు ఏలిన శుభదినాలతో, భావుసాహెబు సేనాపతి నెరపిన విజయపరంపరలతో రాణించిన ఆ హిందూ సామ్రాజ్య మహోజ్జ్వల రూపాన్ని మరల జ్ఞప్తికిదెచ్చింది.

ఇక మన కథను యింతటితో ముగిస్తాం ! నాటి హిందూసామ్రాజ్య రూపాన్నిచూచి ఆనందిస్తాం ! నాడు - అదృష్టవంతుడైన ఆ తరుణ పేష్వా

విశ్వాసపూర్ణులైన తన ప్రజామోదంతో సుఖశ్రీలాలనల బొందుచుండి నాడు; సర్వశక్తియుత మహామంత్రి దిగ్విజయయాత్రాలబ్ధ సంపత్తును మహారాష్ట్రమిండలి వివిధనాయకులకు ఉచితరీతిని పంచిపెట్టుచుండినాడు. వివిధ ప్రతిపక్షులమధ్య సయ్యోధ్ధత చేకూర్చి వివాదాల పరిష్కరిస్తుండి నాడు; భవిష్యద్రాజ్యతంత్ర సమస్యలగూర్చి రాజదూతలు - రాజప్రతినిధులు - చమూపతులతో సమాలోచిస్తూ, తాము నిర్మించిన హిందూసామ్రాజ్య రక్షణవ్యాప్తులకుగా మహారాష్ట్రమండలి అవలంబించవలసిన కార్యానుక్రమణికను నిర్ణయిస్తుండినాడు; భుజబలలబ్ధమై, వీరోచితమైన జాతీయ విజయలక్ష్మీసౌభాగ్యాన్ని మహారాష్ట్రీలు తనివితీర అనుభవిస్తుండినారు; కవులు, గాయకులు, ఆ వీరపురషాంతర పురుషసింహాల శౌర్యోపేత చర్యల కవితతో కైసేసి, గానామృత సంసేవనంచేత ప్రజలకు ఆనంద బాష్పాల ఒలికించి, రక్తాన్ని శౌర్యభావప్రేరణచే అగ్నితరంగితము జేస్తుండినారు; గ్రామచావడిలో, మహారాష్ట్ర విజయగాధలను జానపదాలలో, భిక్షుకగాయకుడు పాడుచుండ, వీరావేశంతో వుర్రూతలూగుచుండిన శ్రోతలమ్రోల, అభివర్ణిత ఘట్టంలో పాల్గొన్న వ్రణమండిత గాత్రుడైన ఒక వృద్ధవీరుడు, గుంపుమధ్యనిలిచి మగమీసము మెలిబెట్టుచు శౌర్య విస్ఫులింగాలతో ఆ గ్రామ్యవాతావరణాన్ని వెలిగింపచేస్తుండినాడు. నానా పూనాలో రాజ్యంచేస్తున్నంతవరకు, తనభూమికిగాని, తనపంటకుగాని ఏబాధా జరుగదన్న విశ్వాసంతో, కర్షకుడు హృదయానందాన్ని వెలువరించే యాలపాటలతో తన పొలాన్ని దున్నుకొనుచుండినాడు; అనంత కోటి.భక్తబృందము నిజసంప్రదాయానుగుణ్యంగా యిష్టదేవతారాధనల జరిపి మ్రొక్కులు చెల్లించుకొనుచుండ, దేవాలయాలు నిర్భీతిగా - సగర్వంగా తమ గోపురశిఖరాలెత్తి ఆత్మప్రీతికరంగా గంటలమ్రోగించి ఆనందిస్తుండినవి. యాత్రికుడు - సంచారప్రియుడైన సన్యాసి - యోగి -

వేదాంతి, హరిద్వారమునుండి రామేశ్వరమువరకు అభిమత స్వేచ్ఛావిహారంచేస్తూ, యిష్టదేవతారాధనల సాగిస్తూ, దేశమందంతటా పవిత్రవేదోక్త ధర్మాన్ని - హిందూ సంస్కృతిని వెదజల్లుచూ ప్రచారంచేస్తూ విచ్చలవిడిగా తిరుగుచుండినారు. పునీత పురాణవిజ్ఞానాన్ని - శాస్త్రాల పెంపొందజేయుటకు జ్ఞానప్రియులైన భాగ్యవంతులు చేసిన దానధర్మాలవల్ల జీవనభరణ ప్రయాస దూరకృతమానసులై పండితుడు - స్నాతకుడు, ప్రవర్థమాన వివిధ కళాశాలలలో, విశ్వకళాపరిషత్తులో, మఠాలలో విద్యావ్యాసంగాల సాగిస్తుండినారు; నావికుడు - సైనికుడు తమతమ వీరవిహారాన్ని తనహృదయపు పట్టపుదేవికో - అనుంగుతల్లికో మోడులు చిగుర్ప, వర్ణిస్తూ, తన మాటలకు సాక్ష్యాలుగా తాము సంపాదించికొని తెచ్చినవిరోధి బంగారమునో, ఆణిముత్యాలనో ప్రదర్శింపుచుండినారు; ప్రతి పల్లీపట్టణము, దేశంలో ఆబాలవృద్ధము, తమపూర్వులు కండలగోసి - నెత్తురుపారించి సంపాదించుకొనిన జాతీయ ప్రతిష్ఠను, వారు సముపార్జించిన స్వాతంత్ర్యము ప్రసాదించిన తియ్యటి ఫలాలను అనుభవిస్తుండినారు. ఈమధుర దృశ్యము క్షణికమని తెలిసిగూడ. త్వరలో యీ ఘనతర హిందూ సామ్రాజ్యం హఠాత్తుగా కూలి, శిథిలమై పోవనున్నదని తెలిసిగూడ, భావసంచమాత్రం ఉన్నతోన్నతకీర్తి శిఖరంమీదనే విహరించాలని ఉవ్విళ్ళూరుచున్నది. ఉన్నంతవరకుచూచి, దక్కినంతవరకు అనుభవించి ఆనందిస్తాం! ఇదీ! నాటి హిందూజాతి మహోన్నతగాథ!

ఇక, యీ నూతన చరిత్రాంశాల గ్రహించి, హిందూస్థాన ఉజ్జ్వల దీర్ఘ చరిత్రతో సమన్వయపరచి, తదనుగుణ్యంగా దానితో ఐక్యతపొందునట్లును, ఇది దానికి ఒక చైతన్యపూర్ణ ప్రధానాంగంగా పొసగునట్లును సమీక్షించి అభివర్ణిస్తాం!

(ప్రథమ ఖండము సంపూర్ణం)

# శుద్ధపత్రం

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 18 | పున్నంతవరకు | వున్నంతవరకు |
| 10 | 3 | దీపుల | దీవుల |
| 12 | 8, 10 | ఖాద్యత | బాధ్యత |
| 15 | 6 | కార్యక్షేత్రాని | కార్యక్షేత్రాన |
| 19 | 17 | ఆదర్శ | ఆదర్శ |
| 20 | 2 | పాడలిగిన | పాడగలిగిన |
| 21 | 19 | ఖండదేవుని | ఖాండదేవుని |
| 23 | 12 | శివాజి | శివాజీ |
| ,, | 14 | జేత్సుక్య | ఔత్సుక్య |
| 24 | 17 | బహిరంగమున | బహిరంగముగ |
| ,, | 22 | కృత్రిమోపాయాలకి | కృత్రిమోపాయాలకు |
| 25 | 9 | ఖిన్నము | ఛిన్నము |
| 26 | 13 | శివాజి | శివాజీ |
| ,, | 20 | ప్రభోదించి | ప్రబోధించి |
| 27 | 16 | సాధింపవలసివున్నది | సాధింపవలసినది వున్నది |
| 29 | 1 | నిష్టుర | నిష్ఠుర |
| ,, | 5 | జన్మమైన | జన్యమైన |
| ,, | 15 | బాపు | భావు |
| 32 | 4 | అన్యధా | అన్యథా |
| ,, | 6 | రాజవాసాలు | రాజావాసాలు |
| ,, | 16 | యుగమున | రంగమున |
| ,, | 19 | ద్వితీయి | ద్వితీయ |
| 34 | 18 | సింహాస్ని | సింహాస్ని |
| 36 | 16 | హిందేతర | హింద్వేతర |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 37 | 16 | అపార్ధాన్ని | అపార్థాన్ని |
| 42 | 21 | శిధిలాల | శిథిలాల |
| 45 | 15 | దేవారాధవ | దేశారాధన |
| 53 | 6 | మర్ధిం | మర్థిం |
| 54 | 2 | అవివేక | అవివేకి |
| 62 | 23 | విప్ర | విప్రా |
| 69 | 16 | ఫిరంగి | ఫిరంగి |
| 70 | 23 | ఓపిక | ఓపి |
| 74 | 24 | పొలుసులే | పొలుకువే |
| 75 | 7 | ధాని | ధానీ |
| 77 | 10 | ధురంధర | దురంధర |
| ,, | 17 | రావు | రాష్ట్రి |
| 78 | 17 | కాట్టి | కొట్టి |
| 79 | 9 | వృదా | వృథా |
| ,, | 13 | దకిణా | దక్షిణా |
| 80 | 4 | భోపాల్ | భోపాల్ |
| 85 | 3 | ప్రవేచించి | ప్రవేశించి |
| 96 | 4 | పర్వత | పర్వత |
| ,, | 18 | అశక్తి | అశక్త |
| 99 | 8 | భీభత్స | బీభత్స |
| 101 | 1 | అగ్రా | ఆగ్రా |
| ,, | 9 | సారహాంద్ | సారహింద్ |
| 103 | 15 | జయోత్సా | జయోత్సా |
| 106 | 6 | 1837 | 1857 |
| 111 | 13 | సైనం | సైన్యం |
| 120 | 16 | వెరసిన | వెరపిన |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 132 | 21 | ప్రతారణాలు | ప్రతిఘటనలు |
| 144 | 4 | అతః | అంతః |
| ,, | 9 | ఇవాన్యు | ఇవాన్ను |
| 148 | 20 | పస్తు | వస్తు |
| 158 | 17 | దీనుకోనుండిన | దీనుకొనుచుండిన |
| 159 | 19 | సంతోన్మత్తు | సంతోషోన్మత్తు |
| 162 | 2 | గాయకుని | నాయకుని |
| ,, | 8 | మొక్క | మ్రొక్కి |
| 169 | 2 | శివమెక్క | నివమెక్క |
| 191 | 11 | వలని | వలన |
| 192 | 5 | స్కందాలపై | స్కంధాలపై |
| 193 | 1 | అగు | అగు |
| ,, | 23 | మద్యస్థ | మధ్యస్థ |
| 194 | 19 | శ్రేష్టం | శ్రేష్ఠం |
| 198 | 8, 10, 11 | పీష్వా | పేష్వా |
| 210 | 14 | హింద్వ ఏతర | హింద్వేతర |
| 212 | 24 | మాధనజీవి | మాధవజీవి |
| 216 | 16 | గెలువ | గెలుక |
| 221 | 7 | అకస్మాత్మరణం | అకస్మాన్మరణం |

ఇవే మరికొన్ని చోట్ల పడినవి. పాఠకుడు వూహించుకో దగినవి వదలి వేయబడినవి.

# మా ఏజన్సీ షరతులు



(1) అవసరమైనప్పుడల్లా మా ప్రచురణలను మొత్తంగా తెప్పించుకొని అమ్మే వారే మా ఏజంట్లు. ఏజంట్లు డిపాజిట్ కట్టనవసరంలేదు.

(2) ప్రతి ఆర్డరుకు 25% కమీషనుయివ్వగలం. రైలుపార్సెలుద్వారా మాత్రమే పుస్తకములంపబడును. పార్సెలు ఖర్చులు ఏజంట్లే భరించాలి. పాకింగ్, తపాలా ఖర్చులు గ్రంధమండలివే.

(3) కమీషను పోగా తడవకు కనీసం రూ. 10 విలువగల మా సొంత ప్రచురణలను తెప్పించుకోవాలి. అనగా రూ. 13-5-0 ఖరీదుచేసే పుస్తకాలకు ఆర్డరు పంపాలి.

(4) మా సొంత ప్రచురణలను ఒక్కమారు రూ. 150/- కి తెప్పించుకునేవారికి $33\frac{1}{3}$% కమీషను యివ్వగలము. అనగా రూ. 100/- లకు పంపబడును.

(5) ప్రతి ఆర్డరులోను ఏ రకానికి ఎన్ని కాపీలు కావాలన్నా పంపగలము. కాని ఒక రకంలో 25 ప్రతులకు మించి పంపము.

(6) మా ఏజంట్లకు మా నూతన ప్రచురణలగురించి ముందుగా తెలియజేస్తాం. ఏజంట్ల పేర్లు మా ప్రచురణలలో అప్పుడప్పుడు ప్రచురిస్తాం. ఇతరులు రిప్లయికార్డు వ్రాసినగాని ప్రత్యుత్తరమివ్వలేము.

(7) చెక్కులు పంపేవారు క్రాస్ చెక్కులు పంపాలి. మద్రాసులోని బాంకులలో రొఖ్ఖం చేసుకోను వీలులేని చెక్కులకు కమీషను ఏజంట్లే భరించాలి.

(8) మా ప్రచురణలుగాక యీ దిగువ పుస్తకములు మావద్ద దొరకును. ఏజంట్లకు యిచ్చే ధరలు బ్రాకెట్లలో యివ్వబడినవి—(a) వాత్స్యాయన కామసూత్రములు. రూ. 9-0-0 (8-0-0) (b) గౌతమ ధర్మసూత్రములు రూ. 4-8-0 (3-8-0) (c) రాజశేఖర కావ్య మీమాంస రూ. 2-8-0 (2-0-0) (d) మన ఇండియా 1-8-0 (1-5-0)

(9) నవ్యసాహిత్యమాల, అనంతపురంవారి ప్రచురణలకు మేము సోల్ ఏజంట్లము.

# మా ఏజంట్లు

1. వెంకట్రామా అండ్ కో. అండర్సన్ వీధి. మద్రాస్
2. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ ,,
3. ఆర్యభవన్ కిళ్ళీ దుకాణం, గోవిందప్పనాయకన్ వీధి ,,
4. వి. వి. నాయుడు అండు సన్స్, నెల్లూరు
5. శ్రీ ఇనికెళ్ళ ఆంజనేయులుగారు, ఒంగోలు
6. శ్రీరంగా అండు కో., బాపట్ల
7. కామ్రేడ్ యస్. యన్. రాయ్‌గారు, తెనాలి
8. ది న్యూ వెరైటీ ఏజన్సీస్. ,,
9. ది ఆంధ్ర పబ్లిషింగ్‌హౌస్, ,,
10. షేక్ చాంద్. మారిస్‌పేట, ,,
11. జాకోబిన్ పబ్లిషర్స్. ,,
12. పీపిల్స్ బుక్‌హౌస్, గుంటూరు
13. యూనివర్సల్ బుక్ డిపో. ,,
14. శ్రీ యెనిబల్లి నూకరాజుగారు, నరసరావుపేట
15. శ్రీ కుందా రామచంద్రరావుగారు ,,
16. ది వెరైటీ ఏజన్సీస్. గవర్నర్‌పేట, బెజవాడ
17. పిపిల్స్ బుక్ డిపో, ,,
18. శ్రీ దుర్గా మాడరన్ బుక్ డిపో, ,,
19. ది మాడరన్ న్యూస్ ఏజన్సీ ,,
20. సెంట్రల్ బుక్‌షాప్, పెద్ద బజారు ,,
21. సరస్వతి బుక్ డిపో, ,,
22. ప్రభాత్ బుక్ డిపో, గుడివాడ
23. మినర్వా బుక్‌డిపో, మచిలీపట్నం (బందరు)
24 ప్రజాశక్తి బుక్ డిపో, ఏలూరు.
25. సింహా అండు కో ,,

26 నేషనల్ బుక్ డిపో, ఏలూరు
27. శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావుగారు, విడదవోలు.
28. ఈశ్వర బుక్ డిపో, రాజమండ్రి
29. రౌతు బుక్ డిపో, ,,
30. ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెని, ,,
31. శ్రీ చందా నారాయణ శెట్టిగారు, ఒరంగల్
32. సుభాను నేషనల్ బుక్ డిపో, ,,
33. భారతీ సదనం, ఖమ్మంమెట్టు
34. శ్రీ చందా నారాయణశెట్టిగారు, సికందరాబాద్.
35. శ్రీ కొండా వీరయ్యగారు, ,,
36. శ్రీరామా బుక్ డిపో, ,,
37. ప్రొగ్రెసివ్ బుక్ స్టాల్ ,,
38. శ్రీ చందా నారాయణశెట్టిగారు, హైదారాబాద్
39. ది ఆంధ్రా బుక్ హౌస్, ,,
40. మాడరన్ బుక్ డిపో, ,,
41. ఆంధ్ర పబ్లిషింగ్ కంపెని, ,,
42. బాల సరస్వతి బుక్ డిపో, కర్నూలు
43. డి. యస్. నరసింగరావు, అనంతపూర్
44. శ్రీ నకలా కిష్టప్పగారు, మదనపల్లి.

వెంకట్రామా అండు కో వారి శాఖ లన్నిటిలోనూ, హిగిన్‌బాథమ్స్ వారి రైల్వే పుస్తకశాల లన్నిటిలోనూ మా ప్రచురణలు దొరకును.

# సోవియట్ రష్యా

సంస్కృతి ప్రచురణ—4 వెల 0—12—0

రచన : జవహర్‌లాల్ నెహ్రూ

అనువాదం : పండితారాధ్యుల నాగేశ్వరరావు.

"ఇందలి గ్రంథం బహు పురాతనం. పండిత జవహర్‌లాల్‌నెహ్రూ ప్రప్ర థమ రచనలలో ఇది మొదటిది.

అయినప్పటికీ నేటికీ పాతబడని "లెనిన్—స్త్రీలు—వివాహం—విద్య కారాగృహం" వంటి అధ్యాయాలున్నవి గనక ఇదివరకు ఈ పుస్తకం చదవని వారు, ఇప్పుడు దీనిని చదివి లాభంపొందగలరని మా విశ్వాసం.

సోషలిస్టు ఉద్యమంలో ప్రాగ్గానే నవయువకులందరు "లెనిన్" అధ్యా యాన్ని చక్కగా పఠించిన పక్షంలో, ఉద్యమంలో తమ్ము ఎదుర్కొనే అనేక క్లిష్టప్రశ్నలకు సమాధానాలు లభ్యంకాగలవు.

రష్యా చరిత్రను అప్పటికీ, ఇప్పటికీ పోల్చుకోగలుగడానికి ఈ గ్రంథం ఉపకరిస్తుందని పీఠికలో అన్నారు. అందుకు ఈ పుస్తకం ఎంతమాత్రం సహాయ పడుతుందో చెప్పలేము. కాని పండిట్ నెహ్రూ అప్పటి భావాలను, ఇప్పటి ఆయన భావాలను పోల్చుకొని పరిచూచుకోడానికిమాత్రం ఇది తప్పక సరి పోతుంది.

మొత్తాన, పాతపుస్తకమైనా, ఇది పదుగురికి ఉపకరించే పుస్తకమే. నెహ్రూ రచనలు ఎప్పటివైనా అతి హృదయంగమంగా ఉంటవిగదా!"

ఆంధ్రప్రభ. 17—5—43

"శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు, శ్రీ కొత్తపల్లి సుబ్బరామయ్యగారల అధ్వ ర్యాన నడుస్తున్న సంస్కృతి మండలివారిదివరలో "సోవియట్లదేశం", "ఫ్రాన్సు పతనం", "నేటి జపాన్" అనే చక్కని గ్రంథాలు ప్రచురించారు.

ఈ "సోవియట్‌రష్యా" వారి నాలుగోప్రచురణ. ఇది జవహర్‌లాల్‌గారు పది, పన్నెండు వత్సరాలక్రింద రష్యాకు వెళ్ళివచ్చి వ్రాసిన గ్రంథం—గ్రంథం

చాలాకాలంనాటిది అయినా రష్యానుగురించి దీనిలోగల వర్ణనలలో, విశేషాలలో చాలా గంభీరత, సుందరత ఉన్నాయి.

నాగేశ్వరరావుగారీ గ్రంథాన్ని చక్కటి తెలుగులో అనువదించి ఆంధ్రలోకానికి అందించారు. ఈ రచయిత, ఈ మండలివారూ—ఇంకా ఇలాటి గ్రంథాలే రచించి, ప్రకటించి తెలుగు కన్నెకు మేలిముసుగులు అమర్చుతారని ఆశించుతున్నాం."

కృష్ణాపత్రిక. 28-8-43

# ప్రపంచ ఆర్థికదుస్థితి

సంస్కృతి ప్రచురణ—9 వెల 0—4—0

అనువాదం : యరబర్ల శ్రీరామమూర్తి.

"ప్రపంచ ఆర్థికదుస్థితి" అనేది మరి ఒక సంస్కృతి గ్రంథమండలి ప్రచురణ. దీన్ని శ్రీ యరబర్ల శ్రీరామమూర్తిగారు అనువదించారు. "Features of Capitalism" అనేది దీనికి మాతృక.

యుద్ధ ప్రపంచం తనతోపాటు ఈనాడు సాంఘిక, ఆర్థిక ప్రపంచాలను కూడా ఊదరపెట్టి కూర్చున్నది. ఈ రెండు ప్రపంచాలుకూడా—ఒక క్రొత్తరూపం కోసం, ఒక కొత్తవెలుగుకోసం తహతహలాడుతున్నాయి.

ఈ "ఆర్థిక దుస్థితి" అనే గ్రంథం—మనల్ని తారుమారవుతున్న ఆర్థిక ప్రపంచ వీధులలో పచార్లుచేయిస్తుంది. చక్కని అనువాదం. అందమైన పుస్తకం. వెల పావలామాత్రమే అయినా—చేతికి వందరూపాయల చెక్కు అందినట్లుంది"

కృష్ణాపత్రిక. 8—1—44

"జనుల పేదరికానికి సామ్రాజ్యతత్వ భూయిష్టమైన ధనికవర్గము ఏవిధముగా కారణమౌతున్నదీ చక్కగా వివరించారు గ్రంథకర్తగారీ గ్రంథంలో.

ప్రపంచ ఆర్థిక పరిస్థితిని ఇంత చక్కగా యీ చిన్న పొత్తములో వివరించిన గ్రంథకర్తగారు శ్లాఘనీయులు. భాషవిషయంలో మరికొంచెం శ్రద్ధచూపవలసినదిగా సంపాదకులకు మా మనవి."

ప్రజామిత్ర 13—2—44

# సోవియట్లు దేశం

## (రెండవభాగం)

సంస్కృతి ప్రచురణ-10 అనువాదం: శశి. వెల 0—10—0

"ఈ పుస్తకంలో కళలు, వాఙ్మయం, విప్లవం, అంతర్యుద్ధం, నూతన ప్రేరకములు, సోవియట్‌మధ్య ఆసియా అనే శీర్షికలకింద సోవియట్లదేశం ఏవిధంగా అభివృద్ధిగాంచిందో. వివరించారు. మానవుని ప్రోత్సహించే శక్తి ధన సంపాదన తప్ప మరొకటికాదనే వాదనకు యిది చక్కని జవాబిస్తోంది, సోషలిజం వస్తే వ్యక్తిత్వం నాశనమౌతుంఏనే తప్పుడు ప్రచారానికికూడా యీ పుస్తకం గట్టి చెంపపెట్టు యిచ్చింది.

సోవియట్ మధ్య ఆసియాలో ఉజ్బేక్‌స్థాన్, తుర్కొమనియన్ యూనియన్, తాజిక్‌స్థాన్, కిర్‌ఘీజ్ యూనియన్ అనే రిపబ్లిక్కులు నాలుగూ మనదేశానికి సరిహద్దులోనే హిమాలయ పర్వతాలకు అనుకొనివున్నాయి. ఇక్కడ సోవియట్ ప్రభుత్వం స్థాపించబడ్డాక మానవజీవితం యెలా సర్వతోముఖమైన అభివృద్ధి గాంచినదీ యీ పుస్తకంలో తెలియజేశారు.

మొత్తంమీద, సోవియట్ ప్రజాస్వామ్యమే నిసలైన ప్రజాస్వామ్యమని యీ పుస్తకం రుజువుచేస్తూంది."

ప్రజాశక్తి, 29—3—44

"ఇందలి విషయాలను సులభంగా తెలుసుకొనదగిన భాషలో వ్రాసినారు. కళ, వాఙ్మయం, విప్లవవిజయం, నూతన ప్రభుత్వ పద్ధతి, వివిధ మండలాలలోని ప్రస్తుతస్థితి మున్నగు విషయాలు వివిధ రచయితలచే వ్రాసినవాటిని తెనుగులోనికి తెచ్చినారు. రష్యాదేశమునుగూర్చి అందలి నూతన సిద్ధాంతమునుగూర్చి అభిమానించి తెలుసుకొన గోరువారు దీనిని తప్పకుండా చదువవలెను."

గోలకొండ పత్రిక, 17—4—44

# కృతజ్ఞత

## శ్రీ గునుపాటి పేనాది రెడ్డిగారికి

క్రొత్తూరు గ్రామం

ఇందుకూరుపేట పోస్టు (నెల్లూరుజిల్లా)

ఆర్యా,

నమస్కారాలు. మీరు మిత్రులద్వారా మా గ్రంథమండలికి 8-6-44 న బహూకరించిన 25 పుస్తకము లందినవి. కృతజ్ఞులం. మీవద్ద ఇంకనూ శిధిలమగుచూ, జీర్ణించిపోవుచూ ఉన్న గ్రంధరాజములెన్నో కలవు. వాటినికూడ మాకుగాని, మరియే యితర భాషాసేవక సంస్థకుగాని బహూకరించి కృతార్థులు కమ్మని మా వినయపూర్వక ప్రార్థన.

సంస్కృతి గ్రంథమండలి, | మిత్రులు,
పెరంబూర్ | సంపాదకులు
16—5—45

*Printed by Vinodan Press, 33, Jones Street, MADRAS. G. T.*
*for Cultural Book Club, Vangal Buildings, PERAMBUR. Madras.*

HINDU—PAD—PADSHAHI 2—8—0